# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 4 హైదరాబాద్ 129 ఏప్రిల్ 2012 పేజీలు : 68 రు. 15

* ఎన్నికలు - ప్రజాభిప్రాయ ప్రకటన
* విధ్వంసానికి దారితీసే పోలవరం
* కూడంకుళం ఎవరి కుట్ర?
* సోనీ సోడిపై కత్తికట్టిన రాజ్యం
* యాన్ మిర్డాల్‌తో ఇష్టాగోష్ఠి
* వ్యవసాయంపై పెట్టుబడి దాడి
* రష్యాలో అక్టోబర్ విప్లవం



# కాకతీయ విశ్వవిద్యాలయం

www.sdlceku.co.in

## స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ లర్నింగ్ అండ్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్

విద్యారణ్యపురి, వరంగల్ 506 009 ఫోన్: 0870 2438877, 2438899

## దూరవిద్య బి.ఏ. / బి.కాం./బి.బి.యం. కోర్సు ప్రవేశార్హత పరీక్ష - 2012

**ప్రవేశార్హత పరీక్ష తేది: 22-04-2012 (ఆదివారం);** ఏ విద్యార్హతలు లేకున్నను, ఉన్నను (ఇంటర్మీడియేట్ ఉత్తీర్ణత కానివారు) 30-06-2012 నాటికి 18 సం॥రాలు నిండినచో ప్రవేశార్హత పరీక్షలో ఉత్తీర్ణులై బి.ఏ./బి.కాం./బి.బి.యం. ప్రథమ సంవత్సరం 2012-13లో ప్రవేశం పొందవచ్చును. 2008 నుండి 2011 వరకు గతంలో నిర్వహించిన అర్హత పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు లేదా ఇంటర్మీడియేట్, తత్సమాన కోర్సు పాసైనవారు పరీక్ష వ్రాయకుండానే నేరుగా ప్రవేశం పొందవచ్చును.

### దరఖాస్తు ఫారములు లభించు కేంద్రాలు

**వరంగల్:**
1. ఎస్.డి.ఎల్.సి.ఇ., కె.యు, వరంగల్
2. ప్రభుత్వ జూనియర్ కళాశాల, హన్మకొండ
3. SVSA కళాశాల, స్టేషన్‌రోడ్, వరంగల్
4. ASM మహిళా డిగ్రీ కళాశాల, ఫోర్ట్ రోడ్, వరంగల్
5. ఎ.వి.వి. డిగ్రీ కళాశాల, వరంగల్
6. ఎస్.ఎస్. డిగ్రీ కళాశాల, ధర్మారం
7. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, మహబూబాబాద్
8. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నర్సంపేట
9. మోరల్ బేసిక్ జూనియర్ కాలేజ్, నల్లబెల్లి
10. కాకతీయ డిగ్రీ కళాశాల, తొర్రూరు
11. Dr.MR రెడ్డి డిగ్రీ కళాశాల, పరకాల
12. తేజస్విని (గాంధీ) జూనియర్ కాలేజీ, భూపాలపల్లి
13. మహర్షి డిగ్రీ కాలేజ్, ములుగు
14. నలంద జూనియర్ కాలేజ్, పస్రా
15. ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఎటూరునాగారం
16. ప్రభుత్వ జూనియర్ కాలేజ్, స్టేషన్ ఘనపూర్
17. ప్రతిభ ఎడ్యుకేషనల్ అకాడమీ, జనగాం
18. వివేకానంద జూనియర్ కాలేజ్, పాలకుర్తి
19. ప్రభుత్వ జూనియర్ కాలేజ్, నెల్లికుదురు

**ఖమ్మం:**
20. SSR&J ఆర్ట్స్&సైన్స్ డిగ్రీ కళాశాల, ఖమ్మం
21. JVR డిగ్రీ కళాశాల, సత్తుపల్లి
22. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, భద్రాచలం
23. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఇల్లందు
24. సీలం పుల్లారెడ్డి మెమోరియల్ డిగ్రీ కాలేజ్, మధిర
25. జె.ఎస్.యన్.ఆర్. సమతా జూనియర్ కాలేజ్, గార్ల
26. రామ్స్ డిగ్రీ కళాశాల, భద్రాచలం

**కరీంనగర్:**
27. ప్రభుత్వ బాలుర జూనియర్ కాలేజ్, కరీంనగర్
28. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గోదావరిఖని
29. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జమ్మికుంట
30. ప్రభుత్వ జూనియర్ కళాశాల, హుజురాబాద్
31. శాతవాహన జూనియర్ కళాశాల, హుస్నాబాద్
32. ప్రభుత్వ జూనియర్ కళాశాల, సిరిసిల్ల
33. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కోరుట్ల
34. SKNR ప్రభుత్వ జూ॥ కాలేజ్(బాలుర), జగిత్యాల
35. గాయత్రి డిగ్రీ కాలేజ్, పెద్దపల్లి
36. ప్రగతి జూ॥ కాలేజ్,గోపాల్‌రావుపేట,మం॥ రామడుగు
37. శ్రీవివేకానంద జూ॥కళాశాల, గారెపల్లి, మ॥కాటారం
38. రోషిణి డిగ్రీ కాలేజ్, మంథని
39. వికాస్ డిగ్రీ కాలేజ్, సిద్ధాలవాడ, సిరిసిల్ల
40. శ్రీనిధి డిగ్రీ కాలేజ్, కురిక్యాల, గంగాధర మండలం
41. ప్రగతి డిగ్రీ కాలేజ్, కల్వచెర్ల, కమాన్‌పూర్ మండలం
42. శ్రీవాణి డిగ్రీ కాలేజ్, సుల్తానాబాద్

**ఆదిలాబాద్ :**
43. MAM & MVN డిగ్రీ కళాశాల, మంచిర్యాల
44. దీక్ష డిగ్రీ కాలేజీ, ఈద్గమ్, నిర్మల్
45. ప్రభుత్వ జూనియర్ కళాశాల, ఉట్నూరు
46. నలందా డిగ్రీ & పి.జి. కళాశాల, ఆదిలాబాద్
47. శివాణి ఆర్ట్స్ & సైన్స్ డిగ్రీ కాలేజ్, మందమర్రి
48. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, చెన్నూరు
49. ప్రభుత్వ జూనియర్ కళాశాల, దండేపల్లి
50. ప్రభుత్వ జూ॥ (బాలికల) కళాశాల, బెల్లంపలి
51. వికాస్ డిగ్రీ కాలేజ్, జన్నారం
52. వశిష్ట జూనియర్ కాలేజ్, భైంసా
53. APOSS (శ్రీనివాస్) హైస్కూల్& జూనియర్ కాలేజ్, శ్రీరాంపూర్
54. ప్రభుత్వ జూనియర్ కాలేజ్, ఇచ్చోడ
55. వాగ్దేవి డిగ్రీ కళాశాల, ఖానాపూర్

**నిజామాబాద్ :**
56. ప్రభుత్వ బాలుర జూ॥ కళాశాల, నిజామాబాద్
57. కర్షక్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కామారెడ్డి
58. ప్రభుత్వ జూనియర్ కళాశాల, బోధన్
59. నరేంద్ర ఉమెన్స్ డిగ్రీ కాలేజ్, పెర్కిట్, ఆర్మూర్

**నల్గొండ :**
60. విజయ లా కాలేజ్, నల్గొండ
61. మాతృశ్రీ జూనియర్ కాలేజ్, చౌటుప్పల్
62. చాణక్య డిగ్రీ కాలేజ్, చౌటుప్పల్
63. శ్రీసాయి డిగ్రీ కాలేజ్, తిరుమలగిరి
64. AVM డిగ్రీ కాలేజ్, నకిరేకల్
65. గౌతమి డిగ్రీ కాలేజ్, సూర్యాపేట
66. వసుందర జూనియర్ కాలేజ్, మిర్యాలగూడ
67. గీతాంజలి జూనియర్ కాలేజ్, భువనగిరి
68. జె.బి.యన్. డిగ్రీ కాలేజ్, సస్థాన్‌నారాయణపూర్
69. శ్రీసత్యసాయి డిగ్రీ కాలేజ్, దేవరకొండ
70. వికాస్ జూనియర్ కాలేజ్. నేరెడ్‌చర్ల
71. ప్రగతి ఆర్ట్స్ & సైన్స్ డిగ్రీ కాలేజ్, తిరుమలగిరి
72. సాయిరాం డిగ్రీ కాలేజ్. మోతుకూర్ (మండలం)

**మహబూబ్‌నగర్ :**
73. స్వామి వివేకానంద డిగ్రీ కాలేజ్, మహబూబ్‌నగర్
74. గాయత్రి డిగ్రీ కాలేజ్, వనపర్తి
75. జాగృతి డిగ్రీ కాలేజ్, షాద్‌నగర్, మహబూబ్‌నగర్
76. శ్రీకృష్ణవేణి డిగ్రీ కాలేజ్, కల్వకుర్తి
77. సాహితి వొకేషనల్ జూనియర్ కాలేజ్, అచ్చంపేట్
78. జ్యోతి వొకేషనల్ జూనియర్ కాలేజ్, అమ్మన్‌గల్
79. ఎస్.ఆర్.వి. డిగ్రీ కాలేజ్, కోస్గి

**హైద్రాబాద్ & సికింద్రాబాద్:**
80. జాగృతి పి.జి అండ్ డిగ్రీ కాలేజ్, నారాయణగూడ
81. సర్‌న్యూటన్స్ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమన్, మలక్‌పేట
82. సింధూ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమెన్, మెహదీపట్నం
83. మేఘన డిగ్రీ కాలేజ్, మూసారమ్‌బాగ్
84. సాయి శివాని జూ॥ కాలేజ్, కాచీగూడ 'X' రోడ్
85. రిలయన్స్ జూనియర్ కాలేజ్, దుర్గానగర్, మహ్మదీయలైన్స్, 2nd Lancer, Hyd
86. ప్రిస్టన్ వొకేషనల్ జూ॥ కాలేజ్, సంతోష్‌నగర్ దగ్గర, పిసల్‌బండా
87. ఉషోదయ డిగ్రీ కాలేజ్ ఫర్ ఉమెన్, వనస్థలిపురం
88. St. Marys కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ECIL
89. ప్రతిభ జూనియర్ కాలేజ్, నల్లకుంట
90. ఆర్.కె. డిగ్రీ కాలేజ్, గొల్కొండ 'X' రోడ్
91. గండికోట వొకేషనల్ జూ॥ కాలేజ్, ఎస్.ఆర్.నగర్
92. శ్రీరామచంద్ర ఆర్ట్స్& సైన్స్ కళాశాల, తిలక్‌నగర్
93. SRM వొకేషనల్ జూనియర్ కాలేజ్, ఎస్.ఆర్. నగర్
94. మదీన వొకేషనల్ జూనియర్ కాలేజ్, చార్‌మినార్
95. సిద్దార్థ డిగ్రీ కాలేజ్, అమీర్‌పేట్
96. కవిత జూనియర్ కాలేజ్ ఫర్ గర్ల్స్, సుర్యోదయ కాలెనీ, ఎల్.బి.నగర్
97. జహ్నవి డిగ్రీ పి.జి. కాలేజ్, సూర్యహౌజ్, నారాయణగూడ
98. జహ్నవి డిగ్రీ కాలేజ్, హోర్డి కాంప్లెక్స్, యం.జి. రోడ్
99. St. జోసఫ్ జూనియర్ కాలేజ్, సంతోష్‌నగర్
100. ఎస్.వి. డిగ్రీ కాలేజ్, రామాంతపూర్
101. సాధన వొకేషనల్ జూనియర్ కాలేజ్, రాంనగర్
102. శ్రీరాం డిగ్రీ కాలేజ్, ఆర్.కె. పురం, దిల్‌సుక్‌నగర్
103. న్యూ సిల్వర్‌జూబ్లీ డిగ్రీ కాలేజ్, కుషాయిగూడ

**రంగారెడ్డి:**
104. శ్రీచైతన్య భారతి జూ॥కాలేజ్,BHEL మేన్‌గేట్ ఎదురుగా, చందానగర్
105. శ్రీత్రివేణి బాలికల జూ॥కళాశాల, కొత్తపేట, దిల్‌సుక్‌నగర్
106. శ్రీసాయి డిగ్రీ కాలేజ్, తాండూరు
107. శాంతి డిగ్రీ కాలేజ్, KPHB, Hyd
108. ఎస్.వి. డిగ్రీ కాలేజ్, పరిగి
109. పాషా నోబల్ డిగ్రీ/పిజి కాలేజ్,గడ్డిఅన్నారం క్రాస్ రోడ్
110. జాగృతి డిగ్రీ కాలేజ్, చెవెళ్ళ
111. శ్రీ సత్య వొకేషనల్ జూనియర్ కాలేజ్, మల్కాజీగిరి
112. డా॥ లక్ష్మినారాయణ మెమోరియల్ జూ॥ కాలేజ్,ఉప్పల్ డిపో

**మెదక్ :**
113. బి.యం.ఆర్. డిగ్రీ & పి.జి. కాలేజ్, గజ్వేల్
114. ఆచార్య డిగ్రీ కాలేజ్, జహీరాబాద్
115. మంజీర డిగ్రీ కాలేజ్, రామాయంపేట్
116. విజయసాయి డిగ్రీ కాలేజ్, విక్టరీటాకీస్‌రోడ్, సిద్దిపేట్

పైన పేర్కొన్న ఏ కేంద్రంలో పరీక్ష వ్రాసినప్పటికీ SDLCEలోని అన్ని విద్యా కేంద్రాలలో ఎక్కడైనా అడ్మిషన్ పొందవచ్చును.

**దరఖాస్తు ఫారాల విక్రయం : 29-02-2012 నుండి 31-03-2012 వరకు**

**పూర్తి చేసిన దరఖాస్తుల స్వీకరణ చివరి తేది : 03-04-2012**

దరఖాస్తు ఫారమును రూ॥ 200/-లు చెల్లించి పై కేంద్రాల నుండి గానీ లేదా కేంద్ర కార్యాలయం నుండి గానీ స్వయంగా పొందవచ్చును. లేదా రిజిష్టర్ పోస్టు ద్వారా రూ॥ 250/- 'రిజిస్ట్రార్, ఎస్.డి.ఎల్.సి.ఇ., కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ పేరిట వరంగల్‌లో చెల్లింపు పద్ధతిపై SBH/SBI/Andhra Bank లలో తీసిన డి.డి. పంపించి కేంద్ర కార్యాలయం నుండి పొందవచ్చును. **కేంద్ర కార్యాలయానికి ప్రతి ఆదివారం మరియు ప్రతినెల రెండవ శనివారం సెలవు దినములు.**

**ఆచార్య యం. విద్యాసాగర్ రెడ్డి**
**సంచాలకులు**

No. 94/DP/SDLCE/KU/2012, Dt. 22-02-2012

129

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఏప్రిల్ 2012
సంపుటి : 10
సంచిక : 4




## లోపలి పేజీల్లో...






ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191



'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ కృతజ్ఞతలు**

వీక్షణం ఆర్థిక స్థితి గురించి విజ్ఞప్తికి ప్రతిస్పందనగా
మార్చ్ 2012లో అందిన విరాళాలు, సహాయాలు

*ఆర్.ఎస్. చౌహాన్ (కర్నూల్) రు. 500; జి. సాంబశివరెడ్డి (కడప) రు. 8,800; భైరవ్ (హైదరాబాద్) రు. 20,000, మార్గదర్శి విద్యానికేతన్ పాఠశాల (మంథని) రు. 1000*

ఈనాటి సామాజిక పరిస్థితుల అదును – పదును కనిపెట్టి, మీరు చారిత్రక బాధ్యతగా గుర్తించినందునే వీక్షణం ఫిబ్రవరి 2012లో 'గ్రామీణ ప్రాంతాల అధ్యయనం – ఈనాటి అవసరం' అన్న వ్యాసంగా ప్రవహించిందని నేను భావిస్తున్నాను. ఈ విషయాన్ని సి.ఎస్.ఆర్. ప్రసాద్ మార్చ్ 2012 'పాఠకుల వీక్షణం'లో సరిగానే పసిగట్టారు. గ్రామీణ ప్రాంతాల అధ్యయనం వీక్షణం చారిత్రక బాధ్యతగా గుర్తించాలని ఆకాంక్షించారు. ఈ అభిప్రాయంతో నేను నూటికి నూరుపాళ్లూ ఏకీభవిస్తున్నాను. ఈ అధ్యయనాన్ని త్వరితగతిన ప్రారంభించి పురోగమించాలని కోరుకుంటున్నాను. సీనియర్ వ్యాసకర్తలు సరేసరి, కొద్ది సంవత్సరాలుగా రాస్తున్న యువ వ్యాసకర్తలు కూడా ఎన్నో విషయాల మీద మార్క్సిజం – మావో ఆలోచనా తాత్వికతతో పరిశీలించి, విశ్లేషించి చక్కటి వ్యాసాలు రాస్తున్నారు. వీక్షణాన్ని పరిపుష్టం చేస్తున్నారు. హేట్సాఫ్ టు దెమ్!

**– జి. సూరి**
హైదరాబాద్

భాషారాష్ట్రాలపై 'వీక్షణం'లో ఆరోగ్యకరమైన చర్చ జరుగుతున్నది. చక్కని చర్చకు అవకాశం ఇస్తున్న సంపాదకులు అభినందనీయులు. లోకే రాజ్‌పవన్ తెలంగాణపై మార్క్సిజం కోణంతో రాస్తున్న మంచి వ్యాసకర్త. చర్చ విషయానికి వస్తే అంబేద్కర్ రాసిన 1953 వ్యాసం విషయంలో గతంలోనే చాలా చర్చ జరిగింది. అయితే ప్రత్యేక తెలంగాణవాదులు 1955 వ్యాసాన్ని ప్రామాణికంగా చేసుకొని అంబేద్కర్ చిన్న రాష్ట్రాలకు అనుకూలమేనని చెప్తూ వచ్చారు. తెలంగాణ విషయంలో ఇంత సీరియస్ వాతావరణం నెలకొని ఉన్నపుడు కృష్ణ ఆదిత్య కేవలం 1953 వ్యాసాన్నే నొక్కి చెప్పడం సహజంగానే తెలంగాణ వ్యతిరేక సందేశాన్నిచ్చింది. రాజ్‌పవన్ అంత సెన్సిటివ్‌గా స్పందించడంలో ఆయన బాధ వ్యక్తమైంది. అయినా అంబేద్కర్ భావాలను చాలా స్పష్టంగా, వివరంగానే తెలియజెప్పారు. కృష్ణ ఆదిత్య 1953 వ్యాసాన్నే తన రెండో వ్యాసంలోనూ ప్రస్తావించడం బదులు రాజ్‌పవన్ ప్రస్తావించిన 1955 వ్యాసంలోని విషయాలను కూడా ఒప్పుకుని ఉంటే హుందాగా ఉండేది. ఏమైనా అంబేద్కర్ చిన్న రాష్ట్రాలకు అనుకూలమేనని రాజవ్‌పవన్ వివరంగా నిరూపించారు. ఆయన అన్నట్లు 1953 వ్యాసం తరువాత రాసిన 1955 వ్యాసంలో తన అభిప్రాయాలను అంబేద్కర్ మార్చుకున్నప్పుడు 1955 వ్యాసాన్ని ప్రామాణికంగా అంగీకరించడమే సబబుగా ఉంటుంది. తెలంగాణ వాదులను కృష్ణ ఆదిత్య కొంచెం సరళంగా సంబోధిస్తే బాగుంటుంది. భాష విషయంలో జాగ్రత్తలు పాటించాలి.

**– ప్రపుల్ల రాధిక**
వరంగల్

అణుశక్తి గురించి నేను రాస్తున్న విజ్ఞాన వ్యాసాలు అనేక విషయాలను వివరించే ప్రయత్నం చేస్తాయి. అణు రియాక్టర్ల కష్టనష్టాల ప్రస్తావన తరవాతి వ్యాసాల్లో వస్తుంది. సైన్స్, టెక్నాలజీ విషయాలను పట్టించుకోకుండా ప్రతిదాన్నీ కట్టె, కొట్టె, తెచ్చె అనే పద్ధతిలో నిర్ణయాలు చెయ్యడం సరైన పద్ధతి కాదు. మరొక విషయమేమిటంటే అణు భౌతిక శాస్త్రానికీ, రియాక్టర్ల రూపకల్పనకూ, అణ్వస్త్రాల తయారీకీ ఎంత సంబంధం ఉందో సామాన్యులకు అంతగా తెలియదు. అణ్వస్త్ర సామర్థ్యం కోసం సామాన్య ప్రజల జీవితాలకు కాలుష్య ముప్పు కలగజెయ్యడం సబబేనని ఎవరూ అనరుగానీ, ప్రపంచంలోకెల్లా పెద్ద తీవ్రవాదులైన అమెరికన్లు అణ్వస్త్రాలు లేని ఇరాక్‌తోనూ, ఒకటో అరో ఉన్న ఉత్తర కొరియాతోనూ వ్యవహరించిన తీరులో తేడాలను గమనించినవారు ప్రతి దేశానికీ అణ్వస్త్రపాటవం ఉంటే తప్ప లాభం లేదని అర్థం చేసుకుంటారు. అప్పట్లో ప్రపంచ శాంతి వచనాలు పలికిన నెహ్రూ, భాభా వంటి వారు సైతం అవసరమైతే మన దేశం అణ్వస్త్రాల తయారీకి ఏం చెయ్యాలో ప్రణాళికలు సిద్ధం చేశారు. అందుకని అణు రియాక్టర్లనేవి మన దేశంలో కేవలం విద్యుదుత్పాదనకో, ప్రైవేట్ కంపెనీల లాభార్జనకో మాత్రమే పనికొస్తాయని అనుకోనక్కర్లేదు. కాలుష్యానికీ, అణు ప్రమాదాలకూ దీనికీ సంబంధం లేదనేది వేరే సంగతి

**– కొడవటిగంటి రోహిణీప్రసాద్**
ఇమెయిల్ ద్వారా

మార్చి 2012 సంచికలో 'భూగోళం' శీర్షికన ప్రచురించిన వార్తా విశేషాలలో (పే. 64) అమర్త్యసేన్‌కు హ్యూమానిటీస్ అవార్డు దక్కిందన్న వార్తాంశంలో సహ సంపాదక మిత్రులు అలవోకగా 'ఒబామా చేతుల మీదుగా' అవార్డు అందుకున్నట్లు రాశారు. వ్యక్తి కృషికి గుర్తింపుగా అవార్డులు వచ్చినా, మరింత ప్రోత్సాహకంగా ఉంటుందని రివార్డులిచ్చినా 'చేతుల మీదుగా' అందుకోవడం పురాతన భాష. 'వీక్షణం'కు అమరని భాషలా నాకనిపించింది. 'గ్రామాల అధ్యయన చరిత్ర' వ్యాసాలు మళ్లీ మళ్లీ చదవుతున్నాను. ఈ మధ్యకాలంలో ఇంత అపురూపమైన వ్యాసాలు నేను చదవలేదు. చరిత్రలో రాజులు మారినా, రాజ్యాలు మారినా భారతదేశం ఆర్థికంగా చెక్కు చెదరకుండా నిలబడ డానికి కారణం పటిష్టమైన స్వయం సమృద్ధ యూనిట్‌గా గ్రామాలు నిలబడడమే. కాని బ్రిటిష్‌వారు గ్రామాలను విచ్ఛిన్నం చేశాక, మనపాలకులు దానిని ధ్వంసం చేసేసి, ఈరోజు పట్టణాలను నిలబెట్టి దేశాన్ని కాపాడాలని చూస్తున్నారు. మనమంతా మనసు పెట్టి ఆలోచించి, ఆచరణకు దిగాల్సిన యోచనా పరంపరను అందిస్తున్న 'వీక్షణం'కు ధన్యవాదాలు.

**– దుప్పల రవికుమార్**
టెక్కలి, శ్రీకాకుళం

అంబేద్కర్ 1953, 1955లో రాసిన వ్యాసాలపై ఇటీవల వీక్షణం సంచికలలో రచయితలు ఎం. కృష్ణ ఆదిత్య, ఎల్. రాజ్‌పవన్ తమ వాదనలు, రచనలు చేశారు. ఇటువంటి చర్చ కొనసాగడం, ఇటువంటి చర్చలను వీక్షణం పత్రిక అచ్చువేయడం చర్చలో పాల్గొనాలనుకునేవారికి మంచి ప్రోత్సాహాన్నిచ్చేదిగా ఉంది. రచయితలు ఒకరు అంబేద్కర్ 1953లో రాసిన వ్యాసాన్ని ప్రామాణికంగా తీసుకుంటే, మరొకరు 1955లో రాసిన వ్యాసాన్ని ప్రామాణికంగా తీసుకొని చర్చిస్తున్నారు. అంబేద్కర్ రాసిన ఆ రెండు రచనలు రాసి యాభై సంవత్సరాలు దాటాయి. ఈ మధ్యకాలంలో జనాభా రీత్యా కావచ్చు, అవసరాలరీత్యా కావచ్చు చాలా మార్పులు చోటుచేసుకున్నాయి. తెలంగాణ సగటు మనిషి తన అవసరాల కోసం నడిచి వచ్చిన కాలమంతా చాలా ఘర్షణ పడ్డాడు. భౌగోళికంగా విడిపోతేనన్నా ఏమైన ప్రయోజనం చేకూరుతుందేమోనని ఒక ప్రజాస్వామిక ఆకాంక్షను వ్యక్తం చేస్తున్నాడు. చరిత్రలో విశ్లేషణలు కొన్ని విషయాలను అర్థం చేసుకోవడానికి దోహదపడొచ్చు గాని, ఈరోజు అట్టడుగున ఉన్న ప్రజలు ఏమి కోరుకుంటున్నారనేది చర్చకు కేంద్రమయితే బాగుంటుంది.

**– వై. దుర్గయ్య**
కరీంనగర్

మార్చ్ 2012 సంచికలో కె.వి. కూర్మనాథ్ వ్యాసం '2జి కుంభకోణం–మీడియా ద్రోహం' చాలా బాగుంది. ఆయన ఈ వ్యాసంలో 2జి స్పెక్ట్రం ద్వారా జరిగిన కుంభకోణాలలో రెండు లక్షల కోట్ల రూపాయల మేర జరిగిన అవినీతి గురించి చెప్పారు. వీటన్నిటినీ తలదన్నేలా ఇటీవల బయటపడిన బొగ్గు కుంభకోణంలో పది లక్షల కోట్ల రూపాయలకు పైగా కుంభకోణం జరిగిందని కాగ్ నివేదిక ఇచ్చింది. ఈ కుంభకోణాల వల్ల నష్టపోతున్నది సామాన్య ప్రజలే. కుంభకోణాల సొమ్ము, విదేశీ బ్యాంకులలో ఉన్న అవినీతి సొమ్ము అంతా భారత దేశ ప్రజల కోసం ఉపయోగిస్తే దేశానికి ఏ అప్పు ఉండదు. పైగా ప్రతి పౌరుడికీ అన్ని మౌలిక సౌకర్యాలూ కల్పించవచ్చు.

**– టి. రాములు**
మిర్యాలగూడ, నల్లగొండ

**పాఠకులలో రచయితలకు విజ్ఞప్తి**

*ప్రతి నెలా వీక్షణం స్పందించవలసిన రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక అంశాలు ఎన్నో తగిన రచనలు, రచయితలు లేక ప్రతిస్పందించకుండా ఉండిపోతున్నాయి. ఉదాహరణకు ఈ సంచికలో దారిద్ర్యరేఖ, ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్ నిధుల మళ్లింపు, కేంద్ర బడ్జెట్, బొగ్గు కుంభకోణం వంటి అత్యవసరమైన అంశాల మీద కూడా రచనలు వేయలేకపోయాం. ఈ విషయాల మీద మాత్రమే కాదు, వీక్షణంలో మీరు ఉండాలని కోరుకునే ఏ అంశం మీదనైనా పూర్తిస్థాయి వ్యాసం కాకపోయినా మీ ఆలోచనలైనా పంచుకుంటే వీక్షణం మరింత సమగ్రంగా తయారవుతుంది. మీలో ప్రతి ఒక్కరిలోనూ రచయితలున్నారు. వారిని బయటికి తీసుకురండి – సం.*

# బడ్జెట్లు, ఎన్నికల మాయాజాలం ఇంకెంతకాలం?

పూర్తిగా ఆర్థిక వ్యవహారంగా కనబడే బడ్జెట్ గురించీ, పూర్తిగా రాజకీయ వ్యవహారంగా కనబడే ఎన్నికల గురించీ ఒకేచోట విశ్లేషించడం ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని, వర్తమాన భారత రాజకీయార్థిక చిత్రపటంలో అసహజం మాత్రం కాదు. బడ్జెట్లు, ఎన్నికలు రెండూ పరస్పర ప్రభావం వేసుకోవడం మాత్రమే కాదు, ఇవాళ భారత పాలకవర్గాల చేతిలో అవి రెండూ ప్రజలను భ్రమల్లో ముంచగల ప్రధాన మాయాజాల సాధనాలుగా మారిపోయి ఉన్నాయి. రెండూ వాటి సహజమైన అర్థాలను, లక్ష్యాలను కోల్పోయాయి. బడ్జెట్ ఇప్పుడెంత మాత్రమూ వనరుల పంపిణీలో విభిన్నవర్గాల మధ్య సమన్వయం సాధించే సాధనంగా లేదు. ఎన్నికలు ఇప్పుడెంత మాత్రమూ ప్రజాభిప్రాయానికి, ప్రజాజీవన అభ్యున్నతిని సాధించే అవకాశానికి సూచికలుగా లేవు. అలా పేరు మారకుండానే దిశ మారిన, అర్థం మారిన ఎన్నికల గురించీ, బడ్జెట్ గురించీ ఒక్కమాటలో ప్రజావ్యతిరేకమైనవనో, ప్రజలను మాయచేసే పాలకవర్గ ఎత్తుగడలనో అనవచ్చు. ప్రత్యేకంగా జనవరి 28 నుంచి మార్చ్ 3 వరకు జరిగిన ఐదు రాష్ట్రాల శాసనసభల ఎన్నికలు, మార్చ్ 5న వెలువడిన ఫలితాలు, మార్చ్ 16న రాష్ట్రంలో ఏడు శాసనసభ స్థానాలకు జరిగిన ఉప ఎన్నికలు, మార్చ్ 18న వెలువడిన ఫలితాలు ఈ దేశపు పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికలు ఎంత బూటకపు తతంగంగా మారిపోయాయో చూపుతున్నాయి. ఇవి ప్రజల మౌలిక ఆకాంక్షలను ఎంతమాత్రం పట్టించుకోకుండా, ఆ ఆకాంక్షలు తీర్చడానికే జరుగుతున్న ప్రయత్నంగా భ్రమ కల్పిస్తున్నాయి. ఆయా పార్టీలు ప్రకటించే విధానాలు ఏమైనప్పటికీ, నాయకులు ఏ సామాజిక వర్గం నుంచి వచ్చినప్పటికీ, వారి జెండాలు, నినాదాలు ఏమైనప్పటికీ ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మౌలిక సమస్యలు పరిష్కరించడంలో ఏ ఒక్కరికీ ఆసక్తి లేదు. ఈ వాస్తవాన్ని దేశంలో అరవై సంవత్సరాల ఎన్నికల తతంగం రుజువు చేస్తూనే ఉంది. స్పష్టంగా కనబడే అగ్రవర్ణ, మతవాద, సంపన్నవర్గాల పార్టీలకు ప్రత్యామ్నాయాన్ని అందిస్తామని వచ్చిన వెనుకబడిన కులాల, దళిత, ప్రాంతీయ, 'వామపక్ష' పార్టీలు కూడ పార్లమెంటరీ రాజకీయాలలో మూడు దశాబ్దాలకు పైగా రాష్ట్రాలలోనో, కేంద్రంలోనో అధికారం చేపట్టాయి. అవేవీ కూడ తమ పరిమితులలోనైనా, కనీస రాజ్యాంగ ఆదర్శాలను కూడ అమలు చేయలేదు. ఈ దేశంలో తప్పనిసరిగా జరగవలసిన భూసంస్కరణలను అమలు చేయలేదు. కోట్లాది ప్రజల కూడు, గూడు, గుడ్డ అవసరాలను కూడ తీర్చలేదు. అవి కూడ పాలకవర్గ పార్టీలేనని, ఈ దోపిడీ వ్యవస్థ తానులో ముక్కలేనని రుజువు చేసుకున్నాయి. దోపిడీవర్గాలకు, అగ్రవర్ణాలకు ప్రత్యామ్నాయం అందించడం అలా ఉంచి, కనీస భిన్నత్వాన్ని కూడ చూపలేకపోయాయి. అవినీతిలో, దుష్పరిపాలనలో, ఆశ్రిత పక్షపాతంలో, అక్రమ వ్యవహారాలలో పోటీపడ్డాయి. ఈ స్థితిలో ఎన్నికలనే ప్రజాస్వామ్యానికి చిహ్నంగా పాలకవర్గాలు చూపుకోవచ్చు గాని ప్రజలు మాత్రం దాన్ని ప్రజాస్వామ్యం అనుకోవడం లేదు. 'ముందు నుయ్యి వెనుక గొయ్యి' అని, 'దొందూ దొందే' అని, 'అందరూ దొంగలే' అని అనుకుంటున్నారు. ఎవరికీ విశ్వసనీయత లేని స్థితిలో 'ఉన్న దొంగ ఓడిపోతే చాలు'నని అనుకుంటున్నారు. అట్లా పాత దొంగలకే మళ్లీ అవకాశం వస్తున్నది. ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు రుజువు చేస్తున్నది ఇదే. ఇక రాష్ట్రంలో జరిగిన ఉపఎన్నికల విషయానికి వస్తే, విస్తృత ప్రజా ఆకాంక్ష అయిన ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు రాజ్యాంగ బద్ధమైన పార్లమెంటరీ ప్రక్రియ ద్వారా జరగవలసి ఉందన్నది వాస్తవమే గాని దానికీ ఎన్నికలకూ ఉన్న సంబంధం బీరకాయ పీచు బంధమే. ఎన్నికలలో అన్నిటికి అన్ని స్థానాలూ తెలంగాణవాదులకే వచ్చినా ఆ ప్రక్రియ జరగకపోవచ్చు. ఏ ఒక్క స్థానమూ తెలంగాణవాదులకు రాకపోయినా ఆ ప్రక్రియ జరగవచ్చు. కాని తెలంగాణ ఏర్పాటును ఎన్నికలకు ముడివేసి అన్ని రాజకీయ పక్షాలూ ప్రజలను వంచించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ వంచనలో భాగంగా కుల, మత రాజకీయాలు, డబ్బు, మద్యం ఏరులై ప్రవహిస్తున్నాయి. ప్రజా ఆకాంక్షలకూ ఎన్నికలకూ సంబంధం లేదని రుజువు చేస్తున్నాయి. పాలకులు ఎన్నికలను చూపి ప్రజలను ఎలా మభ్యపెడుతున్నారో, అలాగే బడ్జెట్ ను, ప్రభుత్వ రంగాన్ని, ప్రణాళికలను చూపి ఇది సంక్షేమ రాజ్యమని భ్రమ కల్పిస్తున్నారు. నూతన ఆర్థిక విధానాల తర్వాత, ప్రపంచీకరణ శక్తుల ఒత్తిడి వల్ల ప్రభుత్వాలు, పాలకవర్గాలు ఈ భ్రమల కల్పనను కూడ వదిలేసి నిర్లజ్జగా తమ దోపిడీ పీడనల స్వభావాన్ని బహిర్గతం చేసుకునే స్థితి వచ్చింది. ఆ స్థితికి మరొక నిదర్శనమే 2012-13 బడ్జెట్. షేక్స్పియర్‌ను ఉటంకించి మరీ 'క్రూరంగా ఉంటాను' అని స్పష్టంగా ప్రకటించిన ఆర్థిక మంత్రి పేద, మధ్యతరగతి వర్గాల పట్ల, దేశ భవిష్యత్తు పట్ల, దేశ వనరుల పట్ల క్రూరంగానే ప్రవర్తించాడు. సంక్షేమ విధానాలలో భాగమైన సబ్సిడీలను కత్తిరించాడు. ప్రభుత్వ రంగ పెట్టుబడులను ఉపసంహరించాడు. ప్రైవేటు రంగానికీ, బహుళజాతిసంస్థలకూ, దేశదేశాల సంపన్నులకూ దేశ వనరులను దోచిపెట్టాడు. పరోక్ష పన్నుల రూపంలో బడుగు వర్గాల మీద దాడి చేశాడు. నామమాత్రపు సంక్షేమ కేటాయింపులు కూడ తగ్గించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజాధనాన్ని ప్రజాశత్రువులకు అందించడానికి జరుగుతున్న కుట్రలో మరొక అధ్యాయం ఈ బడ్జెట్. ఇలా దేశ పాలకుల వంచనాశిల్పంతో అటు ఎన్నికలు, ఇటు బడ్జెట్లు తమ స్వరూపాలు మార్చుకుని, అసలు స్వభావం వదుల్చుకున్నాయి. ప్రజల ప్రాతినిధ్య ప్రజాస్వామ్యానికి చిహ్నంగా ఉండవలసిన పార్లమెంటరీ వ్యవస్థ దివాళాకోరు దళారీ వ్యవస్థ అయింది. దాన్ని తొలగించి, నిజమైన ప్రజల ప్రజాస్వామ్యాన్ని ఏర్పరచుకోవడానికి ప్రయత్నించడం ఇవాళ ప్రజల ముందర ఉన్న తక్షణ కర్తవ్యం. దేశ ఆర్థిక వ్యవస్థనూ, ప్రజల దైనందిన ఆర్థిక జీవనాన్నీ, భవిష్యత్తు పురోగతినీ కాపాడవలసిన, ప్రణాళికాబద్ధ అభివృద్ధికీ, రాజ్యాంగ ఆదర్శమైన సామ్యవాదానికీ చిహ్నంగా ఉండవలసిన బడ్జెట్ దిగజారి అంకెల గారడీ అయిపోయింది. దాన్ని ప్రజాప్రయోజనకర ఆర్థిక విధానపత్రంగా మార్చడానికి కృషి చేయడం ఇవాళ దేశ ప్రజల ముందున్న కర్తవ్యం. మోసపోవడానికీ, వంచనకు గురి కావడానికీ కూడ ఒక పరిమితి ఉండాలి. ఆరు దశాబ్దాల పాటు అనేక రూపాలలో, అనేక రకాలుగా జరిగిన మోసం, వంచన తర్వాత ఇప్పటికైనా ప్రజలు మేల్కొనవలసి ఉంది. మహత్తర చారిత్రక వారసత్వం, అపారమైన సహజ సంపదలు ఉన్న ఈ దేశం మాదేనని, మేమే ఏలుకుంటామని, మా ఆర్థిక విధాన పత్రాలనూ మా అభివృద్ధి నమూనానూ మేమే రచించుకుంటామని ప్రకటించవలసి ఉంది. వీ

# దళారీ పాలకులకు కూడంకుళం సవాల్

ఇవాళ సామ్రాజ్యవాద విషకౌగిలికి కొత్తపేరు అణువిద్యుత్తు. అణు విద్యుత్ కర్మాగారాలు ఏర్పాటు చేసే సాంకేతిక పరిజ్ఞానం, ఆ కర్మాగారాల భారీ యంత్ర పరికరాలు అమ్ముకొని వేల కోట్ల డాలర్ల లాభాలు దండుకోవడానికైనా, ఆ కర్మాగారాల వ్యర్థ పదార్థాలతో అణ్వాయుధాలు తయారు చేయించి ప్రపంచాన్ని యుద్ధభూమిగా మార్చడానికైనా, ప్రజలను అణు కాలుష్యం బారిన పడవేసి నిస్సహాయులను చేయడానికైనా, పాలకులకు ఎంగిలి మెతుకుల ఆశచూపి తమ బానిసలుగా, దళారులుగా మార్చుకోవడానికైనా – ఎటువైపు నుంచి చూసినా సామ్రాజ్యవాద బహుళజాతిసంస్థల కొత్త వల అణువిద్యుత్ కర్మాగారాలు. దీనికి 'పెరిగిపోతున్న విద్యుత్తు అవసరాలు' అనే ఆకర్షణీయమైన మేలి ముసుగు కూడ ఉంది. నిజంగా అంచనా వేస్తున్న విద్యుత్తు అవసరాలు ఉన్నాయా, ఆ అవసరాలు ప్రజలవా, బహుళజాతి సంస్థలవా, ఉన్న విద్యుత్తు సక్రమంగా వినియోగిస్తే సరిపోదా, ప్రత్యామ్నాయ ఇంధన వనరులు లేవా వంటి మామూలు ప్రశ్నలు కూడ వేయకుండా మధ్యతరగతి విద్యుత్తు అవసరం అనే మాట వినగానే గంగిగోవులాగ తల ఊపుతుంది. ఇలా అబద్ధాల మీద నిర్మించిన మద్దతుతో సామ్రాజ్యవాద దళారీ పాలకవర్గాలు అణువిద్యుత్తు మీద పగటికలలు కంటున్నాయి. ఆ పగటికలల్లో ఒకటి కూడంకుళం అణువిద్యుత్ కర్మాగారం. స్వయంగా సామ్రాజ్యవాద దేశాలు అణువిద్యుత్ కర్మాగారాలను మూసివేస్తున్నా, మొన్నటికి మొన్న జపాన్ లో ఫుకుషిమా అణువిద్యుత్ కర్మాగారంలో ప్రమాదం భయంకరమైన మృత్యు ఘంటలు మోగిస్తున్నా, మన పాలకులకు కనబడడం, వినబడడం లేదనడానికి కూడంకుళం పెద్ద ఉదాహరణ. తమ బతుకులను ఇలా దుర్మార్గంగా బుగ్గి చేయగూడదని అక్కడి ప్రజలు ఎన్నో సంవత్సరాలుగా ఆందోళన చేస్తుంటే అణచివేత తప్ప ప్రభుత్వం దగ్గర మరొక మాట లేదు. ప్రజలమీద దమనకాండ జరపడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పోలీసు, అర్ధ సైనిక బలగాలను దింపి భయోత్పాతం సృష్టిస్తున్నాయి. ఆ ప్రాంతానికి పాలు, నీళ్లు, విద్యుచ్ఛక్తి ఆపివేశాయి. ప్రజలను విచ్చలవిడిగా అరెస్టుచేసి తప్పుడు కేసులలో ఇరికిస్తున్నాయి. స్వయంగా మేధావి, శాస్త్రవేత్త అని పేరున్న మాజీ రాష్ట్రపతి తన ప్రతిష్టను తాకట్టుపెట్టి అయినా సరే ఈ మృత్యు యజ్ఞానికి రుత్విక్కుగా మారదలచుకున్నాడు. అమెరికా, రష్యా, ఫ్రాన్స్, ఆస్ట్రేలియాల నుంచీ, బహుళజాతి సంస్థల నుంచీ అప్పులూ, సాంకేతిక పరిజ్ఞానమూ, అణు ఇంధనాలూ తెచ్చుకున్నప్పుడు గుర్తుకురాని 'విదేశీ జోక్యం' దేశ ప్రధానికి హఠాత్తుగా ఇప్పుడే కనబడుతోంది. కూడంకుళం ప్రజలకు మాటసాయం చేసిన స్వచ్ఛంద సంస్థల వెనుక అమెరికా కుట్ర ఉందని, తానే అమెరికన్ బంటయినవాడు అంటున్నాడు. ఇంత దుర్మార్గమైన, అనైతికమైన, అప్రజాస్వామికమైన, అబద్ధాలకోరు ప్రభుత్వాన్ని ఎదిరించి నిలుస్తున్న, ప్రజాస్వామికంగా పోరాడుతున్న కూడంకుళం ప్రాంత ప్రజానీకానికి దేశ ప్రజలందరూ అండగా నిలవవలసి ఉంది. ఇది కేవలం కూడంకుళం ప్రాంత ప్రజల జీవన్మరణ సమస్య కాదు. అది ఈ దేశం జరపవలసిన, జరుపుతున్న విశాల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో భాగం. అందువల్ల ఈ దేశాన్ని, దేశ ప్రజలను ప్రేమించే ప్రతిఒక్కరూ కూడంకుళం అణువిద్యుత్ కర్మాగార వ్యతిరేక పోరాటాన్ని బలపరచవలసి ఉంది. వీ

# శ్రీలంక ప్రభుత్వ హత్యాకాండపై ఐరాస తీర్మానం

శ్రీలంక అంతర్యుద్ధంలో ప్రభుత్వ బలగాలు ఎల్‌టిటిఇ సైనికుల మీద, తమిళ ప్రజానీకం మీద జరిపిన హత్యాకాండపైన, అత్యాచారాలపైన విచారణ జరిపి నేరస్తులను శిక్షించాలని ఐక్యరాజ్యసమితి మానవహక్కుల మండలి ఎట్టకేలకు తీర్మానించింది. గత సంవత్సరం ఐక్యరాజ్యసమితి విడుదల చేసిన నివేదిక కొనసాగింపుగా జరిగిన చర్చ ఈ తీర్మానానికి దారి తీసింది. తమిళజాతి పోరాటం మీద శ్రీలంక ప్రభుత్వం జరిపిన దుర్మార్గాలను, యుద్ధనేరాలను విచారణ జరిపి శిక్షించాలని ఎప్పటినుంచో, ఎందరో చేస్తున్న డిమాండ్‌ను ఇప్పుడు ఐరాస కూడ సమర్థించినట్టయింది. ఇది పూర్తిగా న్యాయమైనదే అయినా ఈ తీర్మానం ఇవాళ్టి సామ్రాజ్యవాద ద్వంద్వ వైఖరికి, అవకాశవాదానికి అద్దం పడుతున్నది. శ్రీలంక ప్రభుత్వం చేసిన దుర్మార్గాలకు వందల రెట్లు ఎక్కువ దుర్మార్గాలు చేసిన అమెరికా ప్రభుత్వం ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. కాశ్మీర్ లోను, ఈశాన్య భారతంలోను జాతి విముక్తి పోరాటాలమీద, దేశవ్యాప్తంగా విప్లవోద్యమం మీద అంతకన్న ఎక్కువ దుర్మార్గాలు చేసిన భారత ప్రభుత్వం ఈ తీర్మానాన్ని బలపరచింది. మరొకవైపు తనను తాను ఇంకా కమ్యూనిస్టు గానే చెప్పుకునే చైనా, కమ్యూనిజం నుంచి మితవాద జాతీయవాదంలోకి ప్రయాణించిన రష్యా నరహంతక శ్రీలంక ప్రభుత్వాన్ని సమర్థిస్తూ, ఈ తీర్మానాన్ని వ్యతిరేకించాయి. ఈ సమర్థకుల, వ్యతిరేకుల యోగ్యతాయోగ్యతలను పక్కనపెట్టి అసలు విషయం చూస్తే మహింద రాజపక్షె సాగించిన నరమేధం పైన రెండో ప్రపంచ యుద్ధానంతరం నాజీల మీద జరిగిన న్యూరెంబర్గ్ విచారణ లాంటిది జరగవలసిందే. ఇవాళ ఐరాస గాని, అమెరికా, భారత్ ప్రభుత్వాలు గాని అలా మహింద రాజపక్షెను బాధ్యుడిని చేయడం లేదు. పాలకవిధానంగా సాగిన హత్యాకాండకు అది అమలు చేసిన సైనికాధికారులను మాత్రమే బాధ్యులను చేసి వారిని విచారణ జరపాలని అంటున్నాయి. అది కూడ కేవలం శ్రీలంక ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టడానికి, పాలకవర్గాల ముఠాల కుమ్ములాటలలో, బేరసారాలలో భాగంగా జరుగుతున్న తంతు తప్ప, నిజంగా ప్రజల ఆకాంక్షల వైపు నుంచి వస్తున్న డిమాండ్ కాదు. ప్రజల వైపు నుంచి చూసినప్పుడు కేవలం అంతర్యుద్ధం చివరి రోజులలోనో, తమిళుల హక్కులను కాపాడడానికి, స్వతంత్ర తమిళ ఈలం ఏర్పరచడానికి ఎల్‌టిటిఇ అనే సాయుధ బృందం ఏర్పడిన తర్వాతనో జరిగిన విషయాలు మాత్రమే కాదు, అసలు బ్రిటిష్ వలస వాదం నుంచి శ్రీలంక (సిలోన్) సింహళ పాలకవర్గాలకు అధికారమార్పిడి జరిగిననాటినుంచీ ఆ దేశంలో తమిళ జాతి మీద జరిగిన అత్యాచారాలను, దోపిడీ పీడనలను, తమిళ భాషా సంస్కృతి చరిత్రల మీద జరిగిన దమనకాండను విచారణ జరపవలసి ఉంది. అప్పుడు ఎవరిది హింసో, ఎవరిని శిక్షించవలసి ఉందో తెలుతుంది. ఇవాళ్టికీ లిబరేషన్ టైగర్ల హింస గురించి మాట్లాడేవాళ్లు, దాన్ని రాజపక్ష హింసకు పోటీ పెట్టేవాళ్లు ఉన్నారు. చివరికి ఐక్యరాజ్యసమితి నివేదిక కూడ అటూ హింస జరిగింది, ఇటూ హింస జరిగింది అనే వైఖరి తీసుకుంది. కాని చరిత్రను నిష్పాక్షికంగా చూస్తే ఆధిపత్యం, దోపిడీ పీడనలు కొనసాగడమే హింస. ఆ ఆధిపత్య శక్తుల చేతులలోనే సకల హింసాసాధనాలూ ఉన్నాయి. ఆ వ్యవస్థీకృత హింస మౌనంగా, నిశ్శబ్దంగా, నెత్తురు కారకుండా జరగవచ్చు. దానికి చెయ్యి అడ్డం పెట్టినప్పుడు, ప్రతిహింసకు పూనుకున్నప్పుడు మాత్రమే మధ్యతరగతికి హఠాత్తుగా హింస కనబడుతుంది. ఈ తలకిందుల దృక్పథాన్ని వదులుకున్నప్పుడే హింసాహింసల పట్ల సరైన వైఖరి తీసుకోగలం. ఆ వైఖరితోనే రాజపక్షను శిక్షించాలని అడగాలి గాని అమెరికా నోటితో కాదు. వీ












- **ప్రపంచ రచయిత్రుల కథలు** – ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్, 144 పేజీలు, 1/8 డెమీ, రు : 90, ప్రతులకు : ఎం. పార్థసారథి, 411, ప్రభాత్కర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ – 500 057. ఫోన్ : 040–23345091 అన్ని పుస్తక షాపుల్లో
- **నేను భంగీని** – భగవాన్‌దాస్, అనువాదం: డా.జి.వి. రత్నాకర్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 128 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067. ఫోన్ : 23521849, www.hyderabadbooktrust.blogspot.com
- **ఎల్లమ్మ రంగాపురం గ్రామ చరిత్ర** – జి. యాదగిరి–స్వేచ్ఛా ప్రచురణలు, 174 పేజీలు, 1/8 డెమీ, రు:100, ప్రతులకు : గున్న మల్లికార్జున్ రెడ్డి, మాజీ సర్పంచ్, రంగాపురం (గ్రా), వంగూరు (మం), మహబూబ్‌నగర్, తెలంగాణ – 509349, సెల్ : 9347307694
- **శిల్పి** (ఖండకావ్యం) – జి. యాదగిరి – స్వేచ్ఛా ప్రచురణలు, 44 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : టి. రంగాచారి, విశ్రాంత తెలుగు పండితులు, ఇ.నెం. 15–10, గ్రామర్ స్కూల్ పక్కన, వెంకటేశ్వరకాలనీ, ఆమనగల్లు, సెల్ : 9492353878; జి. యాదగిరి, ఇ.నెం. 1–5–980, ఫ్లాట్ నెం. 102, శాంతి రెసిడెన్సీ, ప్రభాత్‌నగర్, చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 500060, సెల్ : 9440339917
- **పురి విప్పిన నెమలి** – నవల – ఎస్.ఎం. ప్రాణ్‌రావ్, పాలపిట్ట బుక్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, రు : 40, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. ఫోన్ : 040 – 27678430, 9848787284, ఇమెయిల్: palapittabooks@gmail.com
- **అమరవీరుల సాక్షిగా... తెలంగాణలో ఏం జరుగుతోంది...** – డా. జి. లచ్చయ్య – సామాజిక అధ్యయన సంస్థ – 98 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : ప్రజాశక్తి, విశాలాంధ్ర, దిశ, నవోదయ, సహచర బుక్‌హౌస్, హైదరాబాద్; కీర్తి బుక్‌స్టాల్, నిజామాబాద్
- **నల్లగొండ కథలు** – ఎలికట్టె శంకర్‌రావు – నోముల సాహిత్య సమితి – 528 పేజీలు, 1/8 డెమీ, రు : 300, ప్రతులకు : ఎన్.ఎస్. అరుణ, 206, సాయి టవర్స్, నాగార్జునకాలనీ, నల్లగొండ, సెల్: 9346359268
- **అధ్యాపకుడి ఆత్మకథ** – డాక్టర్ కండ్లకుంట అళహ సింగరాచార్యులు – ఎమెస్కో – 232 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు : ఎమెస్కో బుక్స్, 1–2–7, బానూ కాలనీ, గగన్‌మహల్ రోడ్, దోమలగూడ, హైదరాబాద్–29, ఫోన్ & ఫ్యాక్స్: 040–23264028, ఇమెయిల్: emescobooks@gmail.com, www.emescobooks.com; సాహితి ప్రచురణలు, 29–13–53, కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావు పేట, విజయవాడ–2, ఫోన్ : 0866–2436643, 6460633, ఇమెయిల్: sahithi.vja@gmail.com
- **నాగర్‌కర్నూలు తాలూకా గ్రామాలు – చరిత్ర** – కపిలవాయి కిశోర్‌బాబు – జాతీయ సాహిత్య పరిషత్, భాగ్యనగర్ – 336 పేజీలు, 1/8 డెమీ, రు : 300, ప్రతులకు : కపిలవాయి రాధ, 10–117, వాణీ సదనం, విద్యానగర్, నాగరకర్నూల్, మహబూబ్‌నగర్
- **ఒక దేశం రెండు పద ప్రయోగాలు** – వంశీకృష్ణ – పాలపిట్ట బుక్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. ఫోన్ : 040 – 27678430, palapittabooks@gmail.com









## జూనియర్ డాక్టర్లపై ఎస్మా

ఇటీవల జూనియర్ డాక్టర్ల నలభై రోజుల సమ్మె నేపథ్యంలో రాష్ట్ర వైద్య, ఆరోగ్య శాఖ ప్రత్యేక కార్యదర్శి జి. సుధీర్ ఫిబ్రవరి 22న జిఒ నెం. 295ను జారీ చేశారు. ఈ ఉత్తర్వుల ప్రకారం ఆరు నెలలపాటు ఎలాంటి సమ్మెలూ చేయకూడదు. జూనియర్ వైద్యుల సేవలను 'ఎస్మా' పరిధిలోకి తెస్తున్నట్లు ఆయన ప్రకటించారు. ఈ నిర్ణయం పట్ల సర్వత్రా నిరసనలు వ్యక్తమవుతున్నాయి.

## మార్లవాయి - హైమన్‌డార్ఫ్

మానవ శాస్త్రాల శాస్త్రవేత్త ప్రొ. హైమన్‌డార్ఫ్ చితాభస్మాన్ని ఆదిలాబాద్ జిల్లా జైనూర్ మండలం మార్లవాయి గ్రామంలో నిర్మించిన ఆయన సమాధిలో ఫిబ్రవరి 26న నిక్షిప్తం చేశారు. హైమన్‌డార్ఫ్ దంపతులు ఆదిలాబాద్ ఏజెన్సీలో చాలాకాలం పాటు నివసించి ఇక్కడి ఆదివాసుల సంస్కృతి పట్ల ఆకర్షితులయ్యారు. తమ అంత్యక్రియలు ఇక్కడే జరగాలని కోరుకున్నారు. వారి కోరిక మేరకు వారి కుమారుడు నికోలస్ తన తండ్రి చితాభస్మాన్ని తల్లి సమాధి పక్కనే ఏర్పాటు చేసిన తండ్రి సమాధిలో నిక్షిప్తం చేశారు.

## ఇంటర్ పరీక్షలు

మార్చ్ 2 నుంచి ఇంటర్ మొదటి సంవత్సరం పరీక్షలు, మార్చ్ 3 నుంచి ఇంటర్ రెండో సంవత్సరం పరీక్షలు ప్రారంభమై మార్చ్ 21తో ముగిసాయి. మొత్తంగా 8,50,610 మంది మొదటి సంవత్సరం రెగ్యులర్ విద్యార్థులు, 82,471 మంది వొకేషనల్ విద్యార్థులు, రెండో సంవత్సరం 7,56,407 మంది రెగ్యులర్ విద్యార్థులు, 1,89,066 మంది ప్రైవేట్ విద్యార్థులు, 64,549 వొకేషనల్ రెగ్యులర్ విద్యార్థులు, 15,062 మంది రెండో సంవత్సరం వొకేషనల్ ప్రైవేట్ విద్యార్థులు పరీక్షలకు హాజరయ్యారు.

## 16 మంది ఎం.ఎల్.ఎ.లపై అనర్హత వేటు

దేశ చరిత్రలోనే తొలిసారిగా అధికార పార్టీకి చెందిన పదహారు మంది ఎం.ఎల్.ఎ.లపై మూకుమ్మడి అనర్హత వేటు పడింది. మార్చ్ 2న రాత్రి పొద్దుపోయాక స్పీకర్ నాదేండ్ల మనోహర్ ఈ నిర్ణయం ప్రకటించారు. అలాగే ఎం.ఎల్.ఎ. శోభానాగిరెడ్డి రాజీనామాను ఆమోదించారు. కాంగ్రెస్ పార్టీ ఎం.ఎల్.ఎ.లు వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ కోసం పనిచేస్తున్నందుకు, పదవ షెడ్యూల్‌లోని 21 ఎ(బి) సెక్షన్ ప్రకారం, మరికొద్ది మందిని 21 బి సెక్షన్ ప్రకారం ఈ అనర్హత వేటు పడింది. అనర్హత వేటుకు గురైన ఎం.ఎల్.ఎ.లు – ధర్మాన కృష్ణదాసు (నరసన్నపేట), గొల్ల బాబూరావు (పాయకరావుపేట), పిల్లి సుభాష్‌చంద్రబోస్ (రామచంద్రాపురం), ముదునూరు ప్రసాదరాజు (నర్సాపురం), టి. బాలరాజు (పోలవరం), పిన్నెల్లి రామకృష్ణారెడ్డి (మాచర్ల), ఎం. సుచరిత (ప్రత్తిపాడు), బాలినేని శ్రీనివాసరెడ్డి (ఒంగోలు), గుర్నాథరెడ్డి (అనంతపురం–అర్బన్), కాపు రామచంద్రారెడ్డి (రాయదుర్గం), కె. చెన్నకేశవ రెడ్డి (ఎమ్మిగనూరు), మేకపాటి చంద్రశేఖరరెడ్డి (ఉదయగిరి), శ్రీకాంత్‌రెడ్డి (రాయచోటి), కొండా సురేఖ (పరకాల), అమర్నాథరెడ్డి (రాజంపేట), కె. శ్రీనివాసులు (రైల్వే కోడూరు).

## ఎస్.సి., ఎస్.టి. కమిషన్ పనిచేయదా?

ఎస్.సి., ఎస్.టి. కమిషన్‌కు మూడేళ్లుగా చైర్మన్, సభ్యుల నియామకం జరగడం లేదు. ఈ కమిషన్‌కు సివిల్ కోర్టు అధికారాలు ఉన్నాయి. ఎక్కడైనా దళితులూ, ఆదివాసులపై దాడులూ, మహిళలపై అత్యాచారాలూ జరిగితే కమిషన్ సుమోటోగా స్పందించగలదు. చైర్మన్ తన అధికారాలతో కోర్టును నిర్వహించగలరు. కేసును విచారించి బాధ్యులపై చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి సిఫారసు చేయగలరు. జస్టిస్ పున్నయ్య సిఫారసు మేరకు 2003లో ప్రభుత్వం ఈ కమిషన్‌ను ఏర్పాటు చేసింది. చైర్మన్ నియామకం కోసం వచ్చిన ప్రజా ప్రయోజన వ్యాజ్యంపై హైకోర్టు ప్రభుత్వాన్ని అడిగినా ప్రభుత్వం పట్టించుకోలేదు.

## టెన్త్ పరీక్షలు

మార్చ్ 26 నుంచి పదవ తరగతి పరీక్షలు జరుగనున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా 12.78 లక్షల మంది విద్యార్థులు పరీక్షలకు హాజరు కానున్నారు. వీరిలో 10.58 లక్షల మంది రెగ్యులర్ విద్యార్థులు కాగా, 2.20 లక్షల మంది ప్రైవేట్ విద్యార్థులు.

## దొడ్డా జగ్గయ్య మృతి

వరంగల్ జిల్లా మహబూబాబాద్ మండలం కంబాలపల్లి గ్రామానికి చెందిన సిపిఐ సీనియర్ నాయకుడు, తెలంగాణ సాయుధ పోరాట యోధుడు దొడ్డా జగ్గయ్య (85) మార్చ్ 8న మరణించారు. జగ్గయ్య పాత మానుకోట తాలూకా కేంద్రంగా చేసుకుని నిజాం, భూస్వామ్య శక్తుల దురహంకార విధానాలకు వ్యతిరేకంగా పోరాడారు.

## గ్రామీణ జనాభా తగ్గుతోంది

రాష్ట్రంలో 2001తో పోలిస్తే 2011 నాటికి గ్రామీణ ప్రజల జనాభా 72.7 శాతం నుంచి 66.51 శాతానికి తగ్గింది. అదే సమయంలో పట్టణ ప్రాంతాలలో నివసించే వారి సంఖ్య 27.3 శాతం నుంచి 33.49 శాతానికి పెరిగింది. గత పదేళ్ల కాలంలో పట్టణాల సంఖ్య 210 నుంచి 353కు పెరిగింది. గ్రామాల సంఖ్య 28,123 నుంచి 27,800కి తగ్గింది. ఉపాధి అవకాశాల కొరత, సౌకర్యాల లేమి, మారుతున్న ఆకాంక్షలు ఇలా కారణాలేమైనప్పటికీ వలసలు పెరుగుతున్నాయి.

## రాజ్యసభకు ఏకగ్రీవం

రాష్ట్రం నుంచి రాజ్యసభకు కాంగ్రెస్ పార్టీ తరపున చిరంజీవి, రేణుకా చౌదరి, పాల్వాయి గోవర్ధన్‌రెడ్డి, రాపోలు ఆనందభాస్కర్‌లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. తెలుగుదేశం నుంచి సిఎం రమేష్, టి.దేవేందర్ గౌడ్‌లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

## విరసం 23వ రాష్ట్ర మహాసభలు

విప్లవ రచయితల సంఘం (విరసం) 23వ రాష్ట్ర మహాసభలు మార్చ్ 10,11 తేదీలలో కర్నూలులో జరిగాయి. అంతకు ముందురోజు జరిగిన విరసం సర్వసభ్య సమావేశం నూతన కార్యవర్గాన్ని ఎన్నుకుంది. ఆ రెండు రోజుల సభలలో ఆదివాసీ ప్రాంతాల్లో వనరుల దోపిడీ, దండకారణ్య అభివృద్ధి నమూనా–ప్రగతి భావన, సామ్రాజ్యవాదం–ప్రపంచవ్యాప్త నిరసనలు, దండకారణ్యంలో విప్లవ కళాసాహిత్య సృజన, గ్రీన్‌హంట్ విధ్వంసరూపాలు, యుద్ధ సమయంలో బుద్ధిజీవుల పాత్ర అనే అంశాలపై ప్రసంగాలూ, ఇరవైకి పైగా పుస్తకావిష్కరణలూ జరిగాయి. బహిరంగ సభతో సభలు ముగిసాయి.

## కాళోజి సాహిత్య సమాలోచన

తాను నమ్మిన విలువల కోసం చివరి వరకూ పోరాడిన కాళోజి గొప్ప మానవతావాది అని తెలంగాణ రాజకీయ జె.ఎ.సి. చైర్మన్ కోదండరాం అన్నారు. హైదరాబాద్‌లోని ఎ.వి. కళాశాల తెలుగుశాఖ, తెలంగాణ భాషా సంస్కృతి మండలిల ఆధ్వర్యంలో సంయుక్తంగా నిర్వహించిన 'ప్రజాకవి కాళోజి సాహిత్య సమాలోచన జాతీయ సదస్సు' ముగింపు సమావేశంలో మార్చ్ 17న ఆయన ముఖ్య అతిథిగా ప్రసంగించారు. కళాశాల తెలుగుశాఖ అధ్యక్షుడు డా. గంటా జలంధర్‌రెడ్డి సేకరించి, ముద్రించిన 'ప్రజాకవి కాళోజి సాహిత్య సమాలోచన' పుస్తకాన్ని ఈ సదస్సులో ఆవిష్కరించారు. వీ

## మిలియన్ మార్చ్‌కు ఏడాది

**తె**లంగాణ కోసం మిలియన్ మార్చ్ జరిగి ఈ మార్చ్ 10కి ఏడాది పూర్తయిన సందర్భాన్ని పురస్కరించుకొని ఆనాటి ప్రత్యక్షసాక్షుల కథనాలతో రూపొందించిన పుస్తకావిష్కరణ పోలీసు నిర్బంధం, అరెస్టుల మధ్య విజయవంతమైంది. గత ఏడాది అంటే 10 మార్చ్ 2011న తెలంగాణ రాజకీయ జెఏసి పిలుపు మేరకు తలపెట్టిన మిలియన్ మార్చ్‌ను పోలీసులు అడ్డుకోవడం, బలప్రయోగంతో అణచివేయాలని చూడడం, అడుగడుగునా అడ్డంకులు సృష్టించి, వేలాది మందిని ఎక్కడికక్కడ అరెస్టులు చేయడం వల్లనే తెలంగాణ ఉద్యమకారుల్లో, ప్రజల్లో ఆనాడు ఆగ్రహం పెల్లుబికింది. సంవత్సరం గడిచాక పాలకులు మళ్లీ అదే వైఖరితో వ్యవహరించారు. 'మిలియన్ మార్చ్ – ప్రత్యక్ష సాక్షుల కథనాలు' అన్న పుస్తకాన్ని ట్యాంక్‌బండ్‌పై ఉన్న సురవరం ప్రతాపరెడ్డి విగ్రహం ఎదుట ఆవిష్కరించాలని తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ జర్నలిస్టుల ఫోరంలు కార్యక్రమం రూపొందించుకున్నాయి. ఈ విషయం తెలుసుకున్న పోలీసు ఉన్నతాధికారులు హుస్సేన్‌సాగర్, ట్యాంక్‌బండ్ పరిసరాల్లో నిషేధాజ్ఞలు విధించారు. ముప్పై ప్లాటూన్‌ల బలగాలను మోహరించారు. మీడియాను అనుమతించలేదు. ముళ్ల కంచెలను పరిచారు. అయినా సరే పోలీసుల వలయాన్ని ఛేదించుకుంటూ ప్రొ. హరగోపాల్, మల్లేపల్లి లక్ష్మయ్య, పిట్టల రవీందర్‌లతో సహా అనేక మంది జర్నలిస్టులు, విద్యావంతుల వేదిక ప్రతినిధులు, ప్రజాసంఘాల కార్యకర్తలు ట్యాంక్‌బండ్‌పైకి చేరుకున్నారు. వారిని పోలీసులు అరెస్ట్ చేసి కొందరిని గాంధీనగర్, మరికొందరిని నాంపల్లి పోలీస్‌స్టేషన్‌లకు తరలించి కొన్ని గంటలు నిర్బంధించారు. అయినప్పటికీ ఈ ఘర్షణల నడుమనే పుస్తకాన్ని ఆవిష్కరించారు. అదే రోజు సాయంత్రం బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో జరిగిన సభలో వారంతా మాట్లాడారు. పోలీసుల అణచివేత చర్యలను ఖండించారు. శాంతి యుతంగా చేస్తున్న పోరాటానికి పరిష్కారాలు చూపలేనప్పుడు ప్రజలు మిలియన్ మార్చ్‌లు చేసి తెలంగాణను సాధించుకుంటారని హరగోపాల్ అన్నారు. సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ సుదర్శన్‌రెడ్డి మాట్లాడుతూ తెలంగాణ ఆకాంక్ష రాజ్యాంగ సమ్మతమైన, చాలా న్యాయమైన కోర్కె అని అన్నారు.

## ఆ విషాదానికి బాధ్యులెవరు?

**చ**దువుకోసం పోయిన ఆ పసిపిల్లలు మళ్లీ ఇంటికి తిరిగి రాలేదు. ఖమ్మం జిల్లా చంద్రుగొండ మండలం, తుంగారం గ్రామానికి సమీపంలో మార్చ్ 20న డా. ఎల్.వి. రెడ్డి మెమోరియల్ స్కూల్ బస్సు వాగులో పడి ఎనిమిది మంది విద్యార్థులు –ధర్మావతు గణేష్ (6), గుగులోతు మణికంఠ (6) – టేకుల బాదర; రాజబోయిన సౌజన్య (6), బూడిద సంతోష (5) – శ్రీరాంపురం; నవ్య (5) – వెంకటాపురం; ఎనమల ప్రదీప్ (6), వేముల సంతోష్ (6) – రేపల్లెవాడ; అజ్మీర శివవరప్రసాద్ (కొండయ్య) (6) – దుర్మరణం పాలయ్యారు. 25 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఆ బస్సులోని విద్యార్థులంతా పదకొండేళ్ల లోపు వారు. మద్యం మత్తులో ఉన్న డ్రైవర్ నిర్లక్ష్యం, మద్యం సేవించిన డ్రైవింగ్ అనుభవం లేని క్లీనర్ వాహనాన్ని నడిపించడం ప్రమాదానికి కారణమయ్యాయి. ఖమ్మం, కొత్తగూడెం ప్రధాన రహదారి నుంచి గ్రామాలకు వెళ్లేందుకు సుజాతనగర్ వద్ద గ్రామీణ రోడ్డులోకి బస్సు మళ్లింది. అక్కడ నుంచి రాఘవపురం, తుంగారం మధ్యలో పెద్దవాగు దాటుతుండగా అదుపు తప్పి బస్సు వాగులోకి దూసుకెళ్లింది. డ్రైవర్ ముందే పారిపోగా ధర్మావత్‌సీత్యా అనే గొర్రెల కాపరికి బస్సు క్లీనర్ కొద్దిసేపు సహకారం అందించగా ఇరవై మంది విద్యార్థులను కాపాడగలిగారు. అప్పటికే ఒక చనిపోయిన విద్యార్థి శవం తేలేసరికి భయంతో క్లీనర్ కూడా పారిపోయాడు. ఇరవై మందిని కాపాడిన సీత్యా తన మనవడిని మాత్రం కాపాడుకోలేకపోయాడు. ఈ ప్రమాదం మొదటిదీ కాదు, బహుశా చివరిదీ కాకపోవచ్చు. ఇలాంటి వాటి వెనుక అసలు దోషి ఎప్పుడూ ప్రభుత్వమే, ప్రభుత్వ విధానాలే. లక్ష్యాలను నిర్దేశించి మరీ జనం చేత మద్యం తాగిస్తున్న ప్రభుత్వానిదే పూర్తి బాధ్యత. చదువుకునే విద్యార్థులకు సరియైన రవాణా సౌకర్యాలు కూడా కల్పించడంలో విఫలమైన ప్రభుత్వానిదే బాధ్యత. వాగులో బస్సులు మునిగిపోయే లోతు ఇసుక తవ్వకుపోయిన ఇసుక మాఫియాలదీ బాధ్యత. పనిచేసే సమయంలో తాగడం, వ్యక్తిగత స్థాయిలో డ్రైవర్ బాధ్యత. లాభాపేక్షతో సక్రమంగా లేని వాహనాలను నడపడం, మద్యం మత్తులో ఉన్న డ్రైవర్‌ను పరిశీలించకుండా, పనికి అనుమతించడం పాఠశాల యాజమాన్య నిర్లక్ష్యం. ఈ నిర్లక్ష్యాలకు ఖరీదు చెల్లిస్తున్నది ఎప్పుడూ సామాన్య ప్రజలే. ఈ పరిస్థితిని మార్చడానికి పూనుకోవాల్సిందీ వాళ్లే.

## అంతా ప్రజా సేవకే?

**వై.** ఎస్. జగన్మోహన్ రెడ్డి అక్రమ ఆస్తుల కేసుల నేపథ్యంలో సుప్రీంకోర్టు ఆరుగురు సీనియర్ మంత్రులకు, ఎనిమిది మంది ఐ.ఎ.ఎస్.లకు నోటీసులు జారీచేసింది. నెల్లూరు జిల్లాకు చెందిన న్యాయవాది పొన్నవోలు సుధాకర్ రెడ్డి – '26 ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారా 72 కంపెనీలకు ప్రభుత్వ సంపదను దోచిపెట్టడంలో మంత్రులూ, ఐ.ఎ.ఎస్. అధికారులదే ప్రధాన బాధ్యత, వారి పేర్లను కూడా సిబిఐ చార్జిషీట్‌లో చేర్చి, వారిపైనా విచారణ జరపాలి' అని కోరుతూ సుప్రీం కోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. ఆ పిటిషన్‌పై మార్చ్ 12న జస్టిస్ దల్వీర్ భండారీ, జస్టిస్ దీపక్ మిశ్రాలతో కూడిన ధర్మాసనం విచారణ జరిపింది. ప్రతివాదులుగా ఉన్న మంత్రులు (అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి హయాంలో మంత్రులూ, అధికారులూ, వారు నిర్వహించిన శాఖలతో) – గీతారెడ్డి (పరిశ్రమలు, వాణిజ్యం); ధర్మాన ప్రసాదరావు (రెవెన్యూ); సబితా ఇంద్రారెడ్డి (గనుల); పొన్నాల లక్ష్మయ్య (భారీ నీటిపారుదల); కన్నా లక్ష్మీనారాయణ (పరిశ్రమలు); మోపిదేవి వెంకటరమణ (మౌలిక వసతులు, పెట్టుబడులు); ఐ.ఎ.ఎస్. అధికారులు – సి.వి.ఎస్.కె. శర్మ (పట్టణాభివృద్ధి); ఎస్.వి. ప్రసాద్ (రెవెన్యూ); ఎం. శామ్యూల్ (రెవెన్యూ); మన్మోహన్ సింగ్ (పెట్టుబడులు); బి. శ్యాంబాబు (పరిశ్రమలు); ఆదిత్యనాథ్ దాస్ (సాగునీటి); వై. శ్రీలక్ష్మి (పరిశ్రమలు); కె. రత్నప్రభ (రెవెన్యూ)–లకు నోటీసులు జారీ చేసింది. అలాగే వీరిని కూడా జగన్ కేసులో ఎందుకు విచారించకూడదో వివరణ ఇవ్వాలంటూ సిబిఐకి కూడా నోటీసులు జారీచేసింది. నోటీసులు జారీచేసినంత మాత్రాన మంత్రులు రాజీనామాలు చేయాల్సిన అవసరం లేదని ఈ పరిణామాలపై స్పందిస్తూ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి అన్నారు. ఇవన్నీ ఇలా ఉండగా ఎమ్మార్ కేసులో అరెస్టయి జైలులో ఉన్న ఐ.ఎ.ఎస్. అధికారి బి.పి. ఆచార్య భార్య, సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారిణి రంజీవ్ ఆచార్య – 'తన భర్త ప్రభుత్వ సర్వీసులో ఉంటూ, ప్రభుత్వ నిర్ణయాలనే అమలు చేశారనీ, ఇలాంటి సందర్భాలలో కేసులు వస్తే ప్రభుత్వమే కోర్టు ఖర్చులు భరించాలనీ, ప్రభుత్వం కూడా అతను తప్పు చేసినట్లు నిర్ధారించలేదని, ఇప్పటికే తనకు రెండు లక్షల రూపాయలు ఖర్చయ్యాయనీ' ప్రభుత్వానికి లేఖ రాశారు. ఈ నాటకాలు ఇంకా ఎంతకాలం సాగిద్దామంటారు?

**వార్త – వ్యాఖ్య : డి.వి. రామకృష్ణారావు** వీ

రాజధాని హైదరాబాద్‌లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపన హైదరాబాద్ సంస్థానంలో, విశేషించి తెలుగు ప్రజలు నివసిస్తున్న తెలంగాణ ప్రాంతంలో అపూర్వ సామాజిక చైతన్యానికి దోహదపడింది. మాతృభాష తెలుగు పట్ల మమకారం, తెలుగు సాహిత్య పిపాస, తెలుగు సాహిత్య సృష్టిలో శ్రద్ధాసక్తులు ఇనుమడించడంతో పాటు తెలంగాణ అంతటా గ్రంథాలయోద్యమం విస్తరించింది. నిజాం ప్రభుత్వ అధికారులు కొందరు నిర్హేతుకంగా అడ్డంకులు కల్పిస్తున్నప్పటికీ తెలంగాణ అంతటా ఊరూరా గ్రంథాలయాలను స్థాపించి, సారస్వత, సాంస్కృతిక కార్యకలాపాలను నిర్వహించే కార్యక్రమం ఊపందుకున్నది. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం కలిగించిన స్ఫూర్తితో 1904లో హనుమకొండలో శ్రీ రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయం, 1905లో సికిందరాబాద్‌లో ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయం, 1908లో వరంగల్లులో శబ్దానుశాసన ఆంధ్ర భాషా నిలయం, 1911 ఖమ్మం జిల్లా ఎర్రుపాలెంలో మహబూబియా ఆంధ్రభాషా నిలయం, 1917లో సూర్యాపేటలో ఆంధ్ర విజ్ఞాన ప్రకాశనీ గ్రంథాలయం, 1918లో నల్లగొండలో ఆంధ్ర సరస్వతీ గ్రంథాలయం, హైదరాబాద్ నాంపల్లిలో వేమనాంధ్ర భాషా నిలయం, గౌలీగూడలో బాలసర్వతీ గ్రంథాలయం స్థాపితమయ్యాయి.

**దేవులపల్లి ప్రభాకరరావు – శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం**
సాంస్కృతిక చైతన్య మహోదయం – నూట పది సంవత్సరాల చరిత్ర

భారతీయ గ్రామాల్లో స్పృశ్యులూ, అస్పృశ్యులూ అనే వర్గాల జీవిత విధానం ఎలా ఉంటోంది? ప్రతి గ్రామంలోనూ స్పృశ్యులైన వాళ్లు విధి విధానాలను రూపొందించే వాళ్లుగానూ, అంటరానివాళ్లు వాటిని అనుసరించాల్సిన వాళ్లుగానూ ఉంటున్నారు. స్పృశ్యులు వేటినయితే నేరాలుగా చూస్తారో అవన్నీ ఈ విధివిధానాల కిందికే వస్తాయి. ఈ నేరాలను ఈ కింది జాబితాగా చెప్పుకోవచ్చు –

1) అంటరాని వాళ్లెప్పుడూ హిందువుల నివాస స్థలాలకు దూరంగా ఉండే ప్రాంతంలోనే నివసించాలి. ఆ విభజన రేఖను అతిక్రమించిన అస్పృశ్యులు నేరస్తులుగా పరిగణించబడతారు. 2) అంటరానివాళ్ల గుడిసెలు ఊరికి దక్షిణాన ఉండాల్సిందే. దక్షిణ దిక్కున నివసించడాన్ని హిందువులు అశుభంగా భావిస్తారు కాబట్టి ఈ నిబంధన విధించారు. దీన్ని అతిక్రమించడం అపరాధమవుతుంది. 3) అంటరాని వాళ్లు హిందువులకు సమీపంగా వెళ్లకూడదు. వాళ్ల నీడనైనా ముట్టుకుని అపవిత్రం చెయ్యకూడదు. దీన్ని పాటించకపోతే నేరమవుతుంది. 4) అంటరాని కులాలకు చెందిన వ్యక్తులు భూమీ, పశువులూ లాంటి ఆస్తులను కలిగి ఉండరాదు. 5) అంటరానివాళ్లు పెంకుటిళ్లు కట్టుకున్నా అపరాధమే అవుతుంది. 6) అంటరాని కులాల మనుషులు శుభ్రమైన బట్టలూ, చెప్పులూ, బంగారు ఆభరణాలూ ధరించడం తప్పు. 7) అంటరాని వాళ్లు తమ పిల్లలకెప్పుడూ హీనస్థాయిని సూచించే పేర్లను పెట్టుకోవాలే తప్ప ఔన్నత్యాన్ని ధ్వనించే పేర్లు పెట్టడానికి వీల్లేదు. 8) హిందువుల సమక్షంలో అస్పృశ్యులు కుర్చీ మీద కూర్చోకూడదు. 9) గ్రామంలో గుండా గుర్రం మీదనో, పల్లకిలోనో ప్రయాణించే అంటరానివాళ్లు నేరస్తులు. 10) అస్పృశ్యులకు చెందిన ఊరేగింపులు గ్రామంలో గుండా వెళ్లడానికి వీల్లేదు. 11) హిందువు ఎదురయినప్పుడు అంటరానివాళ్లు తప్పనిసరిగా నమస్కారం చెయ్యాలి. 12) స్పష్టంగా, సంస్కారవంతంగా ఉండే భాషలో అస్పృశ్యులు మాట్లాడకూడదు. 13) హిందువులు ఉపవాసాలు చేసే పర్వదినాల్లో అంటరానివాళ్లు గ్రామంలోకి వెళ్లకూడదు. హిందువులు భోజనం చెయ్యబోతూ ఉండగా వాళ్లతో మాట్లాడబోవడం అపచారం. అంటరానివాళ్ల ఊపిరిసోకితేనే హిందువుల పరిసరాల్లో గాలీ, ఆహారమూ మలినమైపోతాయి. 14) హిందువులు ధరించే చిహ్నాలను అస్పృశ్యులు ధరించడమూ, హిందువుల్లాగా కనబడాలనుకోవడమూ అపరాధాలు. 15) అస్పృశ్యులు నిర్దిష్టమైన చిహ్నాల ద్వారా తాము అంటరాని వాళ్లమని లోకానికి తెలియజేస్తూ ఉండాలి. అవేమిటంటే – హీనస్థాయికి చెందిన పేర్లుండడం; అశుభ్రమైన బట్టలు ధరించడం; పై కప్పు ఉన్న ఇళ్లలో నివసించకపోవడం; వెండి, బంగారు ఆభరణాలు పెట్టుకోకుండా ఉండడం.

హిందువులకు అంటరానివాళ్లు చెయ్యాల్సిన సేవలను గురించి కూడా కచ్చితమైన నిబంధనలున్నాయి. అవి ఇలా ఉంటాయి –

ఎ. గ్రామంలోని హిందువుల ఇళ్లలో జరిగే పెళ్లిళ్లూ, చావులూ వంటి అన్ని కార్యాలను గురించీ, ఇతర గ్రామాల్లో ఉండే వాళ్ల చుట్టపక్కాలకు వర్తమానాన్ని అందించాల్సింది అంటరానివాళ్లే. ఆ గ్రామాలు ఎంత దూరంలో ఉన్నా వెళ్లి రావాల్సిందే.

బి. హిందువుల ఇళ్లలో పెళ్లిళ్లు జరిగినప్పుడు కట్టెలు కొట్టడం లాంటి పనులన్నిటినీ చెయ్యడం అంటవానివాళ్ల బాధ్యత.

సి. హిందువుల ఇంటి పెళ్లికూతురు అత్తవారింటికి వెళ్లేటప్పుడు ఒక అస్పృశ్యుడు ఆమె వెంట వెళ్లాలనేది గ్రామ నిబంధన. ఎంత దూరాన ఉన్న గ్రామానికయినా సరే అతడు నడిచివెళ్లక తప్పదు.

డి. గ్రామంలో హోలీ, దసరా లాంటి పండగల సందర్భంగా ఉత్సవాలు జరిగినప్పుడు, అందుకు అవసరమైన ఏర్పాట్ల శ్రమంతా అంటరాని వాళ్లే భరించాలి.

ఇ. గ్రామ జాతరల సమయంలో జరిగే అసభ్యమైన వినోద కార్యక్రమాల్లో పాల్గొనడానికి అస్పృశ్య కుటుంబాల స్త్రీలను పంపి తీరాలి.

పైన పేర్కొన్న చాకిరీకి గానూ అంటరానివాళ్లకు ఎలాంటి ప్రతిఫలమూ ఇవ్వనక్కర్లేదు.

**డా.బి.ఆర్. అంబేద్కర్ – 'ఆధునిక' భారతంలో అంటరానితనం**
తెలుగుసేత – కాత్యాయని

వ్యాయామ విద్య విజ్ఞానం, సౌశీల్యాలకు సంబంధించిన విద్యను పరిపుష్టం చేస్తుంది. అంతేకాదు, విజ్ఞానం, సౌశీల్యం, ఇవీ దేహంలోనే ఉంటాయి. దేహం లేకుండా సౌశీల్యం ఉండదు, విజ్ఞానం ఉండదు. దీన్ని అర్థం చేసుకున్నవారు చాలా అరుదు. విజ్ఞానం, నైతిక వర్తన, ఈ రెంటిలో ఏదో ఒకదాన్ని గురించి నొక్కి చెప్పడం జరుగుతోంది. విజ్ఞానాన్ని కలిగి ఉండేది, సౌశీల్యానికి ఆశ్రయాన్నిచ్చేదీ దేహమే. ఒక రథంలా అది విజ్ఞానాన్ని ఇముడ్చుకొంటుంది. ఒక గదిలాగా అది సౌశీల్యానికి ఆలవాలమవుతుంది. దేహం, విజ్ఞానాన్ని కలిగి ఉండే ఒక రథం. ప్రాథమిక పాఠశాలలో శరీరాభివృద్ధి పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి. విజ్ఞానాభివృద్ధి, నైతిక ప్రవర్తన అటు తర్వాత వచ్చే విషయాలు. పోషణ, పెంపకం – ఇవి ప్రధాన విషయాలుగానూ, బోధన, క్రమశిక్షణ వాటికి దోహదం చేసేవిగానూ ఉండాలి. ప్రస్తుతంలో, అత్యధికులకు ఈ విషయం తెలియదు. దాని ఫలితంగా, చదువుల మూలంగా పిల్లలు జబ్బుపడిపోవడం, చిన్నతనంలోనే చనిపోవడం కూడా జరుగుతోంది. మాధ్యమిక, ఉన్నత పాఠశాలల్లో విద్య తాలూకు మూడు పార్శ్వాలకూ సమాన ప్రాధాన్యతనివ్వాలి. ప్రస్తుతం చాలామంది విజ్ఞానానికే అతిగా ప్రాధాన్యత నిస్తున్నారు. మాధ్యమిక పాఠశాల దశలో శారీకాభివృద్ధి ఇంకా పరిపూర్ణం కాదు. నేడు శారీరకాభివృద్ధికి అనుకూలమైన అంశాలు తక్కువగా ఉండి, దానికి అవరోధాలు కోకొల్లలుగా ఉన్నాయి. దేహమొకటి లేకపోవడం అనేదే మానవుడికి రాగల ఘోర విపత్తు. ఇంతకంటే చింతించాల్సిన విషయమేమిటుంది? శరీరాన్ని అభివృద్ధి చేసుకోవాలని నిశ్చయించుకుంటే, మిగతా విషయాలు వాటంతటకవిగానే సమకూరుతాయి. శరీరాభివృద్ధికి, వ్యాయామ విద్య కంటే ప్రయోజనకరమైనదేదీలేదు. వ్యాయామ విద్య నిజంగానే మన జీవితంలో ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది. దేహం బలంగా ఉంటే విజ్ఞానంలోనూ నైతిక వర్తనలోనూ వేగంగా పురోగతిని సాధించవచ్చు. బహుముఖ ప్రయోజనాలను పొందవచ్చు. దాన్ని మన అధ్యయనంలో ఒక ముఖ్యంగా పరిగణించాలి.

**మావో సేటుంగ్ – వ్యాయామ విద్య – ఒక అధ్యయనం**

# ప్రజాభిప్రాయాన్ని పాలకులు గౌరవిస్తారా?

***ప్రజలు తెలంగాణతో సహా తమ అన్ని ప్రజాస్వామిక ఆకాంక్షలను పోరాటాలతో మాత్రమే సాధించుకుంటారనీ, ఇది కేవలం ఓట్లు, సీట్ల ఎన్నికల రాజకీయాల వ్యవహారం కాదనీ అంటున్నారు*** **డి.వి. రామకృష్ణారావు**

రాష్ట్రంలో ఏడు శాసనసభ స్థానాలకు మార్చ్ 18న ఉపఎన్నికలు జరిగాయి. ఫలితాలు మార్చ్ 21న వెలువడ్డాయి. వీటిలో ఆరు శాసనసభ స్థానాలు తెలంగాణ ప్రాంతానికి చెందినవి కాగా, ఒక శాసనసభ స్థానం కోస్తా ఆంధ్ర ప్రాంతానికి చెందినది. అవి - ఆదిలాబాద్, కామారెడ్డి, మహబూబ్‌నగర్, నాగర్‌కర్నూల్, స్టేషన్ ఘన్‌పూర్, కొల్లాపూర్, కోవూరు.

తెలంగాణలో ఉపఎన్నికలు జరిగిన ఆరు స్థానాలు తెలంగాణ ఆకాంక్షను వెల్లడిస్తే, కోవూరు నియోజకవర్గం పాలక, ప్రతిపక్ష పార్టీలకు అందకుండా భిన్నమైన ఫలితాన్ని నమోదు చేసింది. మొత్తంగా ఎన్నికలలో ఓటర్లు కాంగ్రెస్, టిడిపిలపై తమ అసంతృప్తిని వ్యక్తం చేశారు.

ఉపఎన్నికల బరిలో నామినేషన్ల ఉపసంహరణ తర్వాత ఈ ఏడు స్థానాలలో 67 మంది అభ్యర్థులు మిగిలారు. ఈ ఏడు శాసనసభ నియోజకవర్గాల పరిధిలో 13,81,443 మంది ఓటర్లు ఉన్నారు. వీరిలో 6,89,245 మంది పురుషులు కాగా, 6,92,197 మంది మహిళలు ఉన్నారు. కాంగ్రెస్, టిడిపిలు ఏడు స్థానాల్లోనూ పోటీ చేయగా, టిఆర్ఎస్ ఐదు స్థానాల్లోనూ, బిజెపి రెండు స్థానాల్లోనూ, సిపిఎం రెండు స్థానాల్లోనూ పోటీ చేశాయి.

నియోజకవర్గాల వారీగా పోలింగ్ శాతం చూస్తే - ఆదిలాబాద్‌లో 61 శాతం, కామారెడ్డిలో 68 శాతం, మహబూబ్‌నగర్‌లో 70 శాతం, నాగర్‌కర్నూల్‌లో 70 శాతం, కొల్లాపూర్‌లో 75 శాతం, స్టేషన్ ఘనపూర్ (ఎస్‌సి)లో 64 శాతం, కోవూరులో అత్యధికంగా 84 శాతంగా నమోదు అయ్యాయి. నియోజకవర్గాల వారీగా ఫలితాలను చూస్తే -

ఆదిలాబాద్ శాసనసభ నియోజకవర్గం నుంచి టిఆర్ఎస్ అభ్యర్థి జోగు రామన్న 59,452 ఓట్లతో (49.33 శాతం) తన సమీప ప్రత్యర్థి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి సి. రామచంద్రారెడ్డి (28,056 ఓట్లు - 23.28 శాతం ఓట్లు) పై 31,396 ఓట్ల మెజారిటీతో గెలిచారు. ఈ నియోజకవర్గంలో మొత్తం 1,72,131 మంది ఓటర్లుండగా, పోలైన ఓట్లు 1,20,502. గత (2009) ఎన్నికలలో జోగు రామన్న తెలుగుదేశం అభ్యర్థిగా ఈ నియోజకవర్గం నుంచే గెలిచారు.

కామారెడ్డి శాసనసభ నియోజకవర్గంలో 2,03,143 మంది ఓటర్లు ఉండగా, 1,37,051 ఓట్లు ఈ ఉపఎన్నికలలో పోలయ్యాయి. తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) అభ్యర్థి గంప గోవర్ధన్ 75,699 ఓట్లతో (55.23 శాతం) సమీప కాంగ్రెస్ ప్రత్యర్థి ఎడ్ల రాజిరెడ్డి (31,234-22.79 శాతం)పై 44,765 ఓట్ల ఆధిక్యంతో నెగ్గారు. 2009లో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా ఈ నియోజకవర్గం నుంచి గంప గోవర్ధన్ గెలిచారు. 2011 సెప్టెంబర్‌లో తన ఎం.ఎల్.ఎ. పదవికీ, తెలుగుదేశం పార్టీకీ రాజీనామా చేసి టిఆర్ఎస్‌లో చేరారు.

మహబూబ్‌నగర్ నియోజకవర్గంలో 1,88,225 మంది ఓటర్లు ఉండగా, 1,25,002 ఓట్లు పోలయ్యాయి. భారతీయ జనతా పార్టీ అభ్యర్థి యెన్నం శ్రీనివాసరెడ్డి 39,385 ఓట్లతో (31.5 శాతం) తన సమీప ప్రత్యర్థి టిఆర్ఎస్ పార్టీ అభ్యర్థి సయ్యద్ ఇబ్రహీం (37,506-30 శాతం) పై 1879 ఓట్ల ఆధిక్యంతో నెగ్గారు. 2009 ఎన్నికలలో ఈ నియోజకవర్గం నుంచి స్వతంత్ర అభ్యర్థిగా పులి వీరన్న గెలిచారు. ఆయన చనిపోయాక ఎన్. జగదీశ్వర్ రెడ్డి స్వతంత్ర అభ్యర్థిగా ఆ స్థానాన్ని కైవసం చేసుకున్నారు. ఇటీవల ఆయన గుండెపోటుతో చనిపోయారు. దీంతో మళ్లీ ఉపఎన్నికలు జరిగాయి.

నాగర్‌కర్నూల్ నియోజకవర్గంలో 1,91,484 మంది ఓటర్లు ఉన్నారు. ఈ ఉపఎన్నికల్లో 1,40,554 ఓట్లు పోలయ్యాయి. స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసిన నాగం జనార్ధనరెడ్డికి 71,001 ఓట్లతో (50.51 శాతం) తన సమీప కాంగ్రెస్ ప్రత్యర్థి కె. దామోదర్ రెడ్డి (43,676 ఓట్లు - 31.07 శాతం)పై 27,325 ఓట్ల ఆధిక్యంతో నెగ్గారు. నాగం జనార్ధనరెడ్డి 2009లో ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ తరఫున ఈ నియోజకవర్గం నుంచి గెలిచారు. గత ఏడాది తెలంగాణ ఉద్యమ క్రమంలో తెలుగుదేశం పార్టీకి, ఎం.ఎల్.ఎ. పదవికి రాజీనామా చేశారు.

స్టేషన్ ఘనపూర్ (ఎస్.సి.) నియోజకవర్గంలో మొత్తం 2,21,499 మంది ఓటర్లుండగా, ఉప ఎన్నికలలో 1,69,908 ఓట్లు పోలయ్యాయి. టిఆర్ఎస్ అభ్యర్థి తాటికొండ రాజయ్య 81,279 (47.83 శాతం) ఓట్లతో తన సమీప తెలుగుదేశం అభ్యర్థి కడియం శ్రీహరి (48,641 - 28.62 శాతం)పై 32,638 ఓట్ల ఆధిక్యంతో గెలిచారు. 2009 ఎన్నికలలో ఇదే నియోజకవర్గం నుంచి తాటికొండ రాజయ్య కాంగ్రెస్ అభ్యర్థిగా గెలిచారు. తెలంగాణ ప్రజల ఆకాంక్ష మేరకు ఆయన 2011 జూలై 3న, సెప్టెంబర్ 24న, అక్టోబర్ 27న తన ఎం.ఎల్.ఎ. పదవికి రాజీనామా చేశారు.

కొల్లాపూర్ శాసనసభ నియోజకవర్గంలో మొత్తం 1,95,865 మంది ఓటర్లు ఉన్నారు. ఈ ఉపఎన్నికలో 1,51,030 ఓట్లు పోలయ్యాయి. టిఆర్ఎస్ అభ్యర్థి జూపల్లి కృష్ణారావు 58,107 ఓట్లతో (38.47 శాతం) తన సమీప ప్రత్యర్థి కాంగ్రెస్ అభ్యర్థి మావిళ్లపల్లి విష్ణువర్ధన్‌రెడ్డి (43,083 ఓట్లు - 28.52 శాతం) పై 15,024 ఓట్ల ఆధిక్యంతో గెలిచారు. జూపల్లి కృష్ణారావు 1999లో కాంగ్రెస్ అభ్యర్థిగా, 2004లో స్వతంత్ర అభ్యర్థిగా, 2009లో మళ్లీ కాంగ్రెస్ అభ్యర్థిగా ఈ నియోజకవర్గం నుంచి గెలిచారు. 30 అక్టోబర్ 2011న ఎం.ఎల్.ఎ. పదవికి, కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేసి టిఆర్ఎస్‌లో చేరారు.

కోవూరు శాసనసభ నియోజకవర్గ పరిధిలో 2,09,739 మంది ఓటర్లు ఉన్నారు. ఈ ఉప ఎన్నికలో 1,75,913 ఓట్లు పోలయ్యాయి. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ తరఫున పోటీ చేసిన ఎన్. ప్రసన్నకుమార్ రెడ్డి 73,876 ఓట్లతో (41.99 శాతం) తన సమీప ప్రత్యర్థి తెలుగుదేశం పార్టీ అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిపై (50,382 ఓట్లు – 28.64 శాతం) 23,494 ఓట్ల ఆధిక్యంతో గెలుపొందారు. 2009 ఎన్నికలలో తెలుగుదేశం అభ్యర్థిగా ప్రసన్నకుమార్ రెడ్డే ఆ నియోజకవర్గం నుంచి గెలిచారు.

ఉప ఎన్నికలు జరిగిన ఏడు శాసనసభ స్థానాలలో తెలుగుదేశం పార్టీకి చెందినవి నాలుగు కాగా, కాంగ్రెస్‌కు చెందినవి రెండు, ఒకటి స్వతంత్ర అభ్యర్థిది. ఉప ఎన్నికల తరువాత ఆ స్థానాలలో నాలుగింటిని టిఆర్ఎస్, ఒక స్థానాన్ని బిజెపి, ఒక స్థానాన్ని స్వతంత్ర అభ్యర్థి, ఒక స్థానాన్ని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సాధించుకున్నాయి. తెలుగుదేశం పార్టీ తెలంగాణ ప్రాంతంలో మూడు స్థానాలను, కోస్తా ఆంధ్రలోని కోవూరు నియోజకవర్గాన్ని కోల్పోయింది. కాంగ్రెస్ కోల్పోయిన రెండు శాసనసభ స్థానాలు తెలంగాణ ప్రాంతంలోనివే. ఈ ఉపఎన్నికల్లో అధికార కాంగ్రెస్ పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీలు ఏ ఒక్క స్థానాన్ని గెలుచుకోకపోవడం, గతంలో తాము గెలిచిన స్థానాలని కూడా నిలుపుకోలేకపోవడం తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో వాటి అవకాశ వాద స్వభావాన్ని ప్రజలు తిరస్కరించడం వల్లనే. తెలంగాణ ప్రాంతంలో తెలుగుదేశం పార్టీ దాదాపు రెండు లక్షల మంది ఓటర్లను, కాంగ్రెస్ పార్టీ ఒక లక్ష మంది ఓటర్లను ఈ ఆరు నియోజకవర్గాల్లో కోల్పోయాయి. ఆ మూడు లక్షల మంది ఓటర్లు తెలంగాణ ఆకాంక్షనే బలపరిచారు. అయితే తెలంగాణ ఆకాంక్ష కేవలం ఓట్లు, ఓటర్లు, సీట్ల వ్యవహారం ఎంత మాత్రం కాదు. ఇది నాలుగు దశాబ్దాల ప్రజా ఆకాంక్ష. తెలంగాణ ఆకాంక్ష 1969 నుంచి నిన్నటి ఉప ఎన్నికల దాకా రకరకాల రూపాలలో, వేర్వేరు తీవ్రతలతో వ్యక్తమవుతూనే ఉంది. ఈసారి ఉప ఎన్నికల నాటికి తెలంగాణ ప్రాంతంలోని ప్రధానపార్టీల కోటలు పూర్తిగా బీటలువారాయి. ఉపఎన్నికల ఫలితాలపై ముఖ్యమంత్రి వ్యాఖ్యానిస్తూ 'ఈసారి ఆటలో ఓడిపోయాం' అని అన్నారు. వచ్చిన ఫలితాలను ప్రజాభిప్రాయంగా కాక ఒక ఆటగా, జూదంగా, పందెంగా చూసే వైఖరి వ్యక్తమయింది. ఇది ప్రజాభిప్రాయాన్ని పలుచన చేయడమే.

ఈసారి కూడా 'ఓటుకు నోటు' కార్యక్రమం స్వేచ్ఛగా, సజావుగా సాగింది. ఏడు నియోజకవర్గాలలో కలిపి మొత్తం రెండు వందల కోట్ల రూపాయల వరకు అభ్యర్థులు ఖర్చు చేసినట్టు తెలుస్తోంది. ఓటర్లను ప్రలోభ పెట్టేందుకు చేసే మద్యం సరఫరాలో ఈసారి కొత్త పద్ధతులు వచ్చాయి. ఓటర్లకు ఇళ్ల వద్ద స్లిప్పులు ఇచ్చి, వాటిని మద్యం దూకాణాలలో చూపిస్తే ఉచితంగా సీసాలు ఇచ్చే ఏర్పాట్లు చేసుకున్నారు. డబ్బు, మద్యం పంపిణీల్లో ఏ ఒక్క పార్టీ వెనుకపడలేదు.

ఇక మహిళా ఓటర్లు ఎక్కువ సంఖ్యలో ఉన్న కోవూరు నియోజకవర్గంలో అదనంగా ముక్కు పుడకలు, కమ్మలు, వెండి ప్రమిదలు, వాచీలు, చీరలు ఇలా రకరకాల వస్తువుల పంపకాలు జరిగాయి. కుల సంఘాలకు అదనపు చెల్లింపులు జరిగాయి. కమ్యూనిటీ హాళ్లు నిర్మిస్తామనే హామీలు నడిచాయి.

ఉపఎన్నికలు జరిగిన ఏడు నియోజకవర్గాల పరిధిలో 17 మార్చ్ నాటికి 9.09 కోట్ల రూపాయల నగదు, 90,566 లీటర్ల మద్యం స్వాధీనం చేసుకున్నట్లు రాష్ట్ర ఎన్నికల ప్రధానాధికారి భన్వర్‌లాల్ తెలిపారు. 577 లైసెన్స్ కలిగిన ఆయుధాలను డిపాజిట్ చేయించు కున్నట్లు, 4230 మందిని బైండోవర్ చేసినట్లు తెలిపారు. ఎన్నికల సంబంధిత ఘర్షణలలో భాగంగా 1607 కేసులు నమోదైనట్లు, 604 మందిని అరెస్టు చేసినట్లు తెలిపారు.

ఉపఎన్నికలకు పదివేల మంది ఎన్నికల సిబ్బందిని, పదివేల మంది పోలీసులను వినియోగించినట్లు తెలిపారు. అయితే పట్టుబడిన సొమ్ములు, మద్యం వాస్తవంగా పంపకం జరిగిన దానిలో ఐదు శాతం కూడా కాదని తెలుస్తోంది. కోవూరు నియోజకవర్గం నుంచి ఎవరు గెలుస్తారో, ఎంత మెజారిటీతో గెలుస్తారో అనే అంశాలపై ఐదు వందల కోట్ల రూపాయల వరకు బెట్టింగ్ జరిగినట్లు తెలుస్తోంది.

ఇవన్నీ ఈ ఎన్నికల రాజకీయాల్లో అన్ని పార్టీలకు 'కామన్ ఫ్యాక్టర్'గా చూసినప్పటికీ వీటన్నిటి అడుగున మరుగున పడిపోకుండా వ్యక్తమయిన ప్రజాకాంక్ష ఉంది. తెలంగాణ ప్రాంత ఆరు శాసనసభ స్థానాలు ఆ విషయాన్నే తేటతెల్లం చేశాయి.

2009 సాధారణ ఎన్నికల నుంచి 2012 ఉప ఎన్నికల ఫలితాల వరకు వచ్చేసరికి శాసనసభలో పార్టీల బలాబలాలు మారిపోయాయి. 2009 ఎన్నికలలో 157 సీట్లు సాధించిన కాంగ్రెస్ పార్టీ ప్రస్తుతం 154 సీట్లకు (విలీనమైన ప్రజారాజ్యం పార్టీ శాసనసభ్యులతో కలుపుకొని, అనర్హత వేటుపడిన జగన్ వర్గ 16 మంది ఎం.ఎల్.ఎ.లను తీసివేసి) పడిపోయింది. తెలుగుదేశం పార్టీ 91 సీట్ల నుంచి 86 సీట్లకు పడిపోయింది. టిఆర్ఎస్ బలం 10 స్థానాల నుంచి 17కు పెరిగింది. ఈ పరిణామాలన్నీ ప్రజలలో రోజురోజుకూ బలంగా వ్యక్తమవుతున్న తెలంగాణ ఆకాంక్షకు ప్రతీకలు. తెలంగాణ ప్రాంత ప్రజల ఆకాంక్షలను ఇంకెంత మాత్రం నిర్లక్ష్యం చేయకూడదని సూచిస్తున్నాయి.

ఇవ్వాళ ప్రత్యేక తెలంగాణపై వైఖరి చెప్పకుండా మనుగడ సాధించలేని స్థితికి అన్ని రాజకీయపార్టీలు వచ్చాయి. ఈ ఉప ఎన్నికలు ఆ పరిస్థితిని మరింత బలపరిచాయి. అయితే స్నేహపూర్వక పోటీలోనూ, తన ఆధిపత్యమే ఉంటుందనుకున్న టిఆర్ఎస్, స్వయంగా కె. చంద్రశేఖరరావు ప్రాతినిధ్యం వహిస్తున్న లోక్‌సభ పరిధిలోని మహబూబ్‌నగర్ నియోజకవర్గంలో ఊహించని రీతిలో బిజెపి చేతిలో ఓడిపోవడం ఆ పార్టీ ఆధిపత్యానికి ఒక సవాలు అయింది.

తెలంగాణ సాధించేలోపు తెలంగాణ అంశంతో పాటు వివిధ ప్రజాస్వామిక ఆకాంక్షల విషయంలో పాలకవర్గాలను ఉక్కిరిబిక్కిరి చేయాల్సిన అంశాలు అనేకం ఉన్నాయి. తెలంగాణ తప్ప వేరే ఏం మాట్లాడినా తెలంగాణ అంశం పలుచబడుతుందనే పద్ధతిలో రాజకీయ పార్టీలు లాబీయింగ్ చేస్తున్నాయి. అయితే పోరాడే ప్రజలకు ప్రతి చిన్న లక్ష్యం, ప్రతి చిన్న విజయం విశాల లక్ష్యాలకు సాగాల్సినవే.

పోలవరం ప్రాజెక్టుకు వ్యతిరేకంగా, సెజ్‌లకు వ్యతిరేకంగా, ఓపెన్ కాస్ట్‌లకు వ్యతిరేకంగా, సింగరేణి ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా, ఉద్యమకారులపై కేసులకు వ్యతిరేకంగా ఇలా పోరాడి సాధించుకోవాల్సిన, భవిష్యత్తుకు ప్రజాస్వామిక పునాదిని నిర్మించు కోవాల్సిన అనేక అంశాలు ఉన్నాయి. 610 జిఒ అమలు కోసం, మొత్తంగా తెలంగాణ రైతాంగం, కార్మికులు, సామాన్య ప్రజానీకం వైద్య సేవలు పొందే గాంధీ, ఉస్మానియా ఆస్పత్రుల్లో కనీస సౌకర్యాల కోసం,

# ప్రత్యామ్నాయ వేటలో సామాన్యుడు

***పాలకుల అవినీతితో సహా మొత్తంగా పాలకులు అమలు చేస్తున్న ప్రజా వ్యతిరేక విధానాల పట్ల ప్రజల అసంతృప్తికి ప్రతీకగానే ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు ఉన్నాయని అంటున్నారు*** **విద్యాభూషణ్**

**2014**లో రాబోయే జనరల్ ఎన్నికలకు ఇటీవల ఐదు రాష్ట్రాల్లో జరిగిన శాసనసభ ఎన్నికలు రిహార్సల్ ల రిఫరెండంగా నిలిచాయి. ఐదింటిలో నాలుగు రాష్ట్రాల్లో కాంగ్రెస్ పార్టీకి తీవ్ర ఆశాభంగమే ఎదురైంది. అత్యంత కీలకమైన ఉత్తరప్రదేశ్‌లో అటు కాంగ్రెస్‌ను (అవినీతిమయ ప్రాభవానికి నిరసనగా), ఇటు భారతీయ జనతా పార్టీని (మతతత్వానికి నిరసనగా) సామాన్యుడు సమాన దూరంలోనే ఉంచాడు. విధాన ప్రాముఖ్యత లేని రాజకీయాలు - అధికారమే పరమావధిగా వ్యవహరిస్తూ ఉంటే, తనకు ఏ పార్టీ ప్రధానం కాదనీ, సామాన్యుని మనుగడకు ఊతం ఇచ్చే దిశగా, అవినీతిని ఎండగడుతూ, వ్యక్తి ప్రతిష్ఠకు పాకులాడే విధానాలను బహిరంగంగా తిరస్కరిస్తూ తనదైన తీర్పునివ్వడం గమనించదగ్గది. పార్టీల హామీలను ఇతర ప్రలోభాలను సైతం లెక్కచేయని వైనం స్పష్టం అవుతోంది. వెరసి సామాన్యుని మనోగతాన్ని మరోసారి అధ్యయనం చేసి, పునాదిని విధానపరంగా పటిష్టం చేసుకోవాలన్న గుణపాఠాన్ని పాలకవర్గ పార్టీలకు చెప్పినట్టయింది.

ఫలితాల్లోకి వెళ్తే - ఉత్తరప్రదేశ్‌లో మొత్తం 403 శాసనసభ స్థానాలకు 225 స్థానాలను సమాజ్‌వాది పార్టీకి అందించి ఓటర్లు అనూహ్య విజయాన్ని కట్టబెట్టడం జరిగింది. జనాభా పరంగా యువతదే పైచేయిగా ఉన్న నేపథ్యంలో కాంగ్రెస్ పార్టీ రాహుల్‌ను, ఆయనకు తోడుగా ప్రియాంకను ప్రచారంలో పెట్టినా ఫలితం లేకుండా పోయింది. వ్రతం చెడ్డా ఫలం దక్కలేదన్నట్టు, జాతీయ కాంగ్రెస్‌కు అమేథి-రాయబరేలీలలోనూ తిరుగులేని పరాభావం ఎదురైంది. ఏకంగా అధికారాన్ని కాంగ్రెస్ పార్టీ ఆశించినప్పటికీ సంకీర్ణ ప్రభుత్వ ఏర్పాటుకు సైతం అవకాశం లేకుండా, సమాజ్‌వాది ప్రాంతీయ పార్టీకి ఓటరు పట్టం కట్టడం, సంకీర్ణ ప్రభుత్వ ధోరణి పట్ల నిరసనగానే భావించాల్సి ఉంది. మాజీ ముఖ్యమంత్రి మాయావతి పట్ల కాంగ్రెస్ వహించిన ఉదాసీనతను సంకీర్ణ ఏర్పాటు అవకాశం కోసమేనని గ్రహించాడు సామాన్యుడు. మాయావతి వ్యక్తి ప్రతిష్ఠా ధోరణికి, అవినీతి విధానాలకు తనదైన రీతిలో ఓటరు బదులిచ్చాడు. రాహుల్ కాంగ్రెస్ తరపున

---

మంచినీళ్ల నుంచి స్కాలర్‌షిప్‌ల వరకు అనేక విషయాలలో పోరాటాలు తీవ్రం చేయాల్సిన అవసరం ఉంది. ప్రజాభిప్రాయాన్ని మరింత పదునెక్కించాల్సిన అవసరం ఉంది. ఉపఎన్నికల్లో గెలుపు సరే, విద్యార్థులపైన, ఉద్యోగులపైన, ఉద్యమకారులపైన పెట్టిన కేసులు ఎత్తివేత గురించి తేల్చుకోవాల్సి ఉంది.

ఈ ఉప ఎన్నికల ఫలితాల వెనుక సాగిన విద్యార్థి గర్జనలు, పోరు గర్జనలు, వివిధ పార్టీల, ప్రజా సంఘాల జనగర్జనలు, వివిధ జెఎసిల బహిరంగ సభలు, మిలియన్ మార్చ్‌లు, 42 రోజుల పాటు సాగిన సకల జనుల సమ్మెలు ఉన్నాయి. ఎనిమిది వందల మందికిపైగా విద్యార్థుల ఆత్మబలిదానాలు ఉన్నాయి. పార్లమెంటరీ రాజకీయాలకు ప్రజల ఆకాంక్షలు పట్టవని చెప్పడానికి అనేక ఉదంతాలు చెప్పుకోవచ్చు. అయితే వారి మెడలు వంచి సాధించుకోవాల్సిన బాధ్యత ప్రజలపైనే ఉంది.

చరిత్రలోకి పోయి చూస్తే 1990 మే 5,6 తేదీలలో అప్పటి పీపుల్స్‌వార్ నాయకత్వాన జరిగిన రైతు కూలీ మహాసభలకు పన్నెండు లక్షల మందికి పైగా ప్రజలు తరలి రావడానికి వరంగల్ సాక్ష్యంగా నిలిస్తే, సరిగ్గా రెండు దశాబ్దాల తరువాత 16 డిసెంబర్ 2010న తెలంగాణ రాష్ట్ర సమితి ఆధ్వర్యాన జరిగిన మహాగర్జనకు ఇరవై ఐదు లక్షల మంది ప్రజలు తరలి రావడానికి అదే వరంగల్ వేదిక అయింది. అప్పటి నూతన ప్రజాస్వామిక విప్లవ ఆకాంక్షకు, నేటి భౌగోళిక తెలంగాణ ఆకాంక్షకు మధ్య ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షల ఆరాటముంది. పోరాటముంది. పార్లమెంటరీ పంథాను కాదని ప్రత్యామ్నాయ లక్ష్యంతో సాగుతున్న విప్లవోద్యమ లక్ష్యానికీ, పార్లమెంటరీ పరిధిలో సాకారం కావాల్సిన భౌగోళిక తెలంగాణ లక్ష్యానికీ మధ్య ప్రజల యాతన ఉంది.

అవకాశవాద నాయకత్వాలు, ప్రలోభాలకు లొంగే నాయకత్వాలు తెలంగాణ ప్రజా ఆకాంక్షను ఎత్తిపట్టడంలో ఏదో ఒక స్థాయిలో విఫలమైన, విఫలమవుతున్న చరిత్ర తెలిసిందే. ఆధిపత్యాలతోనూ, అహంకారం తోనూ, ముఠాతత్వాలతోనూ, అవకాశవాదాలతోనూ, ఆశ్రిత పక్షపాతాల తోనూ అసలు లక్ష్యాన్ని దెబ్బతీయడం తెలిసిందే. పీడిత ప్రజలంతా తమకు తామే ఒక వర్గం అయినప్పటికీ, తమ కోసం తాము ఒక వర్గంగా ఐక్యత సాధించాల్సిన, నాయకత్వం వహించాల్సిన సందర్భం ఇదే. మరింత చొరవ, మరింత చైతన్య పూర్వకమైన పూనిక, ప్రజల విశాల ఐక్యతలతోనే ఇది సాధ్యం. వారే చరిత్ర నిర్మాతలు. తెలంగాణ ఆకాంక్షతో సహా అన్ని ప్రజాస్వామిక ఆకాంక్షలను తమ పోరాటాలతో సాకారం చేసుకుంటారు.

తెలుగు సమాజం ముందు ఒక ప్రశ్న ఉంది. తెలంగాణ ఆకాంక్షను గెలిపించడం ద్వారా, మొత్తంగానే ప్రజాస్వామిక పోరాట సాంప్రదాయానికి బాసటగా నిలుస్తుందా, లేదా అని. అలాంటి ప్రజాస్వామిక సంప్రదాయం ఉన్న తెలుగు నేల తప్పకుండా ఆ స్ఫూర్తిని వ్యక్తం చేస్తుందని ఆశించడంలో దురాశ ఏమీలేదు.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)*

వీ

భావిభారత నేతగా ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో బాధ్యతలు చేపట్టగా, సమాజ్‌వాది తరపున అఖిలేష్ యాదవ్ తెరపైకి వచ్చాడు. ఇద్దరి రాజకీయ పరిణతులను తూకం వేసి – అఖిలేష్‌కు పట్టం కట్టారు. ఎప్పటిలాగే ఈసారి సైతం కులం, మతం, ప్రాంతం, వర్గం వంటి ప్రయోగాలు జరిగాయి. ముస్లింల ఓటు బ్యాంకు కోసం కాంగ్రెస్ రిజర్వేషన్ల మంత్రం పఠించినా, అతిపెద్ద రాష్ట్రమైన యు.పి.ని నాలుగు రాష్ట్రాలుగా విభజించాలన్న ప్రతిపాదనను మాయావతి చేసినా సామాన్యుడు చలించలేదు. మతం పేరుతో మంటపెట్టే అవకాశం లేక కులాన్ని ఆశ్రయించిన భారతీయ జనతా పార్టీ కుత్సితాన్నీ పసిగట్టి – అంతర్గత కుమ్ములాటలతో తలమునకలవుతున్న భాజపాకు రేపటి ప్రత్యామ్నాయం మాత్రం నీవు కావన్న ధీటైన సమాధానాన్ని ఇచ్చినట్టయింది. సమాజ్‌వాదీ పార్టీ నుంచి బైటకు వచ్చిన అమర్‌సింగ్ – జయప్రద ద్వయానికి వారి అవకాశ వాద రాజకీయాన్ని ఈసారి ఎన్నికల్లో తూర్పార బట్టినట్టయింది.

యువత లక్ష్యంగా అటు కాంగ్రెస్ – ఇటు సమాజ్‌వాదీ పార్టీలు ప్రచారాన్ని చేపట్టగా రాజకీయ పరిణతిని అంచనా వేయడంలో సామాన్యుడు ఉన్నతంగా నిలిచాడు. విధానపర విమర్శలతో, ఉపాధి కల్పన – అవినీతి అంతం, విద్యుచ్ఛక్తి వంటి మౌలిక అంశాలను ప్రస్తావిస్తూ నిరుద్యోగ భృతి వంటి హామీలను ప్రస్తావిస్తూ అఖిలేష్ ప్రచారం చేపట్టగా, రాహుల్ గాంధీ ప్రవర్తించిన తీరు ఆక్షేపించేదిలా ఉంది. విపక్ష మానిఫెస్టోలను చించేయడం, చౌకబారు వ్యాఖ్యలు చేస్తూ సాదాసీదాగా వ్యవహరించడం సామాన్యుడికి నచ్చలేదు. ముస్లిం సోదరులకు ప్రత్యేక రిజర్వేషన్‌లను కల్పిస్తామనడం ఎన్నికల సందర్భంగా నిబంధనలను ఉల్లంఘించడమే. అదీ వెనుకబడిన తరగతుల రిజర్వేషన్‌లలో కోతపెట్టి, ఒకవర్గాన్ని వేరే వర్గంపై ఉసిగొల్పే ఈ ధోరణిని సామాన్యులు అర్థం చేసుకున్నారు. సెక్యులరిజంకు కాంగ్రెస్ పార్టీ ఇస్తున్న ప్రాధాన్యతనూ గమనించగలిగారు. ఎందుకంటే, రాజ్యాంగ పరంగా మత ప్రాతిపదికన రిజర్వేషన్లను ప్రకటించడం నేరం. అయినా అదే ధోరణిని కాంగ్రెస్ పదే పదే పునరావృతం చేయడం, అధికార లక్ష్యానికి తప్ప మరొకటి కాదు.

ఇక మాయావతి బిఎస్‌పి పార్టీ విషయానికొస్తే ప్రజాధనం అంటే లెక్కలేనితనం, సర్వం నేనే అన్న అధికారదర్పం, అంతులేని అవినీతి. మాయావతి ఎన్నికలకు ముందు దళిత – ముస్లిం సామాజిక అనుసంధాన సూత్రాన్ని వల్లెవేసినా దాన్ని ఎత్తుగడగానే సామాన్యులు గుర్తించగలిగారు. వేలకోట్ల రూపాయల కుంభకోణాలతో కాంగ్రెస్ పార్టీకి ధీటుగా నిలిచారు. సంక్షేమ పథకాలకు నిధుల్లేవంటూ, సొంత విగ్రహాలకు వేలకోట్లు వెచ్చించారు. కాన్షీరాంతో ముడిపెట్టిన భవిష్యత్ పథకాలు కాన్షీరాం మెమోరియల్ ఆస్పత్రి – కాన్షీరాం మెమోరియల్ మ్యూజియం వంటి ప్రకటనలతో అగ్రవర్ణాలు దూరమయినాయి. ఐదేళ్ల కాలంలో జాతీయ గ్రామీణ ఆరోగ్య కార్యక్రమంలో రు. 3700 కోట్ల అక్రమాలు, రు. 1000 కోట్ల చక్కెర మిల్లుల కుంభకోణాలు, రు. 2000 కోట్ల వృద్ధాప్య పింఛను అవినీతి ఉదంతాలు రాష్ట్రాన్ని కుదిపేసాయి. అలాగే దేశంలో అతి సంపన్న ముఖ్యమంత్రిగా మాయవతి ఘనతకెక్కారు. విలాసవంతమైన జీవితానికి తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితను మించిపోయారు. ఆమె చెప్పుల జతల సేకరణకే పరిమితమైతే, ఈమె చెప్పుల్ని విమానంలో తెప్పించుకుని తన ప్రత్యేకత నిలుపుకున్నారు. ఈ విధానాలను వ్యతిరేకిస్తున్న స్వపక్ష నేతలు వంద మందిపై ఒక్కసారి వేటు వేశారు. వీరిలో 25 మంది మంత్రివర్యులు సైతం ఉన్నారు. ఇవన్నీ ఆమె ఒంటెద్దు పోకడని తేటతెల్లం చేస్తాయి. వీటన్నింటికీ ప్రత్యామ్నాయంగా సామాన్యులు సమాజ్‌వాది పార్టీకి పట్టం కట్టారు. ములాయం సింగ్ మాజీ సోషలిస్ట్ నేతగా, ప్రపంచీకరణ విధి విధానాల జోరును పునరాలోచించగలరన్న విశ్వాసం సైతం ఇందులో ఇమిడి ఉంది. గూండాలు, మాఫియాలను ఎన్నికల్లో దూరంగా ఉంచడం, ఉచిత నీటి పారుదల, పంటల బీమా, వ్యవసాయ రుణాల రద్దు, వ్యవసాయానికి 20 గంటలు విద్యుత్ సరఫరా, గ్రామీణాభివృద్ధి, ఉచిత వైద్యం వంటి హామీలతో ఆకట్టుకోగలిగారు. ఎన్నికల నాటికి కాబోయే ముఖ్యమంత్రి అఖిలేష్ యాదవ్ అని ప్రకటించకపోయినా, ఎన్నికల ప్రచార నిర్వహణలో ఆయన సమర్థతను గుర్తెరిగి ఎన్నికలనంతరం ఆయనే రాష్ట్ర ముఖ్యమంత్రి అని ప్రకటించడం ముదావహం.

ఇక పంజాబ్‌లో గెలుపు తథ్యమనుకున్న కాంగ్రెస్‌ను అకాలీదళ్ ఊహించని విధంగా మట్టికరిపించింది. మొత్తం 117 స్థానాల్లో 46 స్థానాలకే కాంగ్రెస్ పరిమితం కాగా, 12 స్థానాలతో భారతీయ జనతా పార్టీ సరిపెట్టుకోవాల్సి వచ్చింది. శిరోమణి అకాలీదళ్ 56 స్థానాలు గెల్చుకుని, ఇక్కడ ప్రభుత్వ వ్యతిరేకతను అధిగమించి అకాలిదళ్ మళ్లీ అధికారంలోకి రాగలిగింది. ప్రభుత్వ వ్యతిరేకతను తమకు అనుకూలంగా మల్చుకోగలమనుకున్న కాంగ్రెస్ ఆశలు గల్లంతయ్యాయి. గతంలో నాలుగు సార్లు ముఖ్యమంత్రిగా పనిచేసిన అనుభవంతో ప్రకాశ్‌సింగ్ బాదల్ తనదైన ప్రత్యేక శైలితో తిరిగి అధికారంలోకి రాగలిగారు. అధికారంలో ఉన్నా లేకపోయినా ముక్కుసూటిగా వ్యవహరించడమే ఆయన నైజం. 85 ఏళ్ల వయస్సు మీద పడుతున్నా అందరితో కలివిడిగా వ్యవహరించడం, నిరాడంబరత, ప్రశాంతత, సమయానుకూల నిర్ణయాలు తీసుకోవడం ఆయన ప్రత్యేకతలు. రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో నిల్పాలన్న లక్ష్య దృష్టే ఆయనది. నేటికీ ఉచిత విద్యుత్ వంటి రైతాంగ అనుకూల విధి విధానాలతో, సంక్షేమానికి పెద్దపీట వేస్తున్నారు. ఆయన కొడుకునే తమ పార్టీకి అధ్యక్షుడిగా చేసి, ఉపముఖ్యమంత్రి పదవి కట్టబెట్టినా అక్కడి ఓటర్లు తప్పుపట్టలేదు. ఆయన చేపట్టిన అభివృద్ధి పథకాలు, సంక్షేమ పథకాలు పేదవాడి లక్ష్యంగానే చేపట్టడంతో కాంగ్రెస్ విమర్శలను ఓటర్లు పట్టించుకోలేదు. కాంగ్రెస్ అధికారాన్ని చేపట్టలేక పోయినా ఓట్ల శాతాన్ని మెరుగు పర్చుకోగలిగింది. గత ఎన్నికల్లో 40.11 శాతం సాధించిన కాంగ్రెస్ ఈసారి 40.90 శాతానికి పెంచుకుంది. బిఎస్‌పి సైతం తన ఓట్ల శాతాన్ని స్వల్పంగా పెంచుకోగలిగింది. ఉభయ కమ్యూనిస్టులూ తమ ప్రాభవాన్ని తీవ్రంగా నష్టపోయారు. సిపిఎం 3.31 ఓట్ల శాతం నుంచి 0.82 శాతానికి, సిపిఐ 2.25 ఓట్ల శాతం నుంచి 0.16 శాతానికి దిగజారిపోయాయి. అకాలీదళ్ ఓట్ల శాతం గతంలో 37.09 శాతం ఉండగా, నేటి ఎన్నికల్లో 34.75 శాతానికి తగ్గిపోయాయి. రైతు పక్షపాతిగా ప్రకాశ్‌సింగ్ బాదల్ వ్యవహరించి నందునే మళ్లీ పీఠాన్ని అధిష్టించగలిగారు. ప్రతిపక్ష కాంగ్రెస్ అంతర్గత కుమ్ములాటలు, 40 స్థానాల్లో పార్టీ తిరుగుబాటు అభ్యర్థుల పోటీ, పార్టీ

పిసిపి అధ్యక్షుడు అమరీందర్ సింగ్ బంధుప్రీతి – దురహంకార ధోరణులను కేంద్ర మంత్రులే వ్యతిరేంచినా తిరిగి ఆయన్నే ముఖ్యమంత్రి అభ్యర్థి అని రాహుల్ ప్రకటించడం పార్టీ శ్రేణులకు మింగుడు పడలేదు. రైతన్నలకు అనుకూలంగా శిస్తుల రద్దు, ఉచిత విద్యుత్, థెయిన్ ప్రాజెక్టును యుద్ధ ప్రాతిపదికన పూర్తి చేయడం వంటి లక్ష్యశుద్ధే ప్రకాశ్ సింగ్ విజయానికి కారణాలు. ఆరునూరైనా నూరు ఆరైనా సంస్కరణల అమలును వేగవంతం చేయాలన్న మన్మోహన్ లక్ష్యాలకు భిన్నంగా రైతు సంక్షేమానికి పెద్దపీట వేయడమే అకాలీదళ్ ప్రాభవానికి దర్పణం.

గోవాలో అవినీతే కాంగ్రెస్‌ను నట్టేట ముంచేసింది. అక్రమాలు – అవకతవకలను తలకెత్తుకుని నేషనల్ కాంగ్రెస్ పార్టీతో కలిసి పోటీ చేసిన అధికార కాంగ్రెస్‌కు 9 స్థానాలు మాత్రమే వచ్చాయి. నేషనల్ కాంగ్రెస్ సోదిలోనే లేదు. శాసనసభ మొత్తం 40 స్థానాల్లో 21 స్థానాలను గెల్చుకుని భారతీయ జనతా పార్టీ స్వంతంగా అధికారాన్ని చేపట్టే స్థితిని సాధించింది. కాంగ్రెస్ హయాంలో నడిచిన అక్రమ మైనింగ్‌ను విపక్షం పెద్ద ఎత్తున ప్రచారం చేసి ప్రజా వ్యతిరేకతను తమకనుకూలంగా మలుచుకోగలిగింది. వేల కోట్లకు ఎగబాకిన గనుల కుంభకోణాలపై లోకాయుక్తను ఏర్పాటు చేసి, ప్రజా పద్దుల సంఘం ఇచ్చిన నివేదికపై విచారణ జరిపిస్తామన్న హామీయే ప్రధానంగా పనిచేసింది. అవినీతిని పచ్చగా పెంచిపోషిస్తూ, ఉపాధి అవకాశాలను మెరుగుపర్చకుండా, ఇచ్చిన హామీలకు తిలోదకాలు ఇచ్చిన కాంగ్రెస్‌ను గోవా ఓటర్లు ఓడించారు. ప్రధానంగా ప్రముఖ పర్యాటక కేంద్రంగా విలసిల్లుతున్న గోవాలో – పారిశుద్ధ్య నిర్వహణా లోపం, తాగునీటి సరఫరాలో వైఫల్యం – కాంగ్రెస్‌ను సాగనంపేందుకు ప్రధాన కారణాలయ్యాయి. ఇక బంధుప్రీతి ఎలానూ ఉంది. దీనిపట్ల సైతం గోవాలో నిరసన వెల్లడైంది. భాజపా కాస్త సెక్యులర్ ధోరణిలో కేథలిక్స్‌ను ఎన్నికల్లో ప్రోత్సహించడం సైతం గెలుపుకు అనుకూలమైంది. ప్రధానంగా కాంగ్రెస్ అవినీతిపై గోవా ఓటర్లు ధ్వజమెత్తడం భాజపా గెలుపుకు కారణం.

ఉత్తరాఖండ్‌లో ఓట్లు అన్ని పక్షాల మధ్య చీలకుండా కాంగ్రెస్ – బిజెపి పంచుకున్నాయి. 70 స్థానాల్లో 32 స్థానాలు కాంగ్రెస్‌కు, 31 భాజపాకు వచ్చాయి. మిగతా ఏడింటిలో బిఎస్‌పి మూడు, స్వతంత్రులు మూడు, ఉత్తరాఖండ్ క్రాంతిదళ్ పన్వర్‌కు ఒక్కసీటు వచ్చాయి. ఒక్క స్థానం ఆధిక్యతలో కాంగ్రెస్ ఉంది. స్వతంత్రులు ఉత్తరాఖండ్ క్రాంతిదళ్ సహకారంతో కాంగ్రెస్ మంత్రివర్గ ఏర్పాటుకు ముందుకొచ్చింది. అధికారాన్ని కోల్పోయిన భాజపా నేత ఖండూరి తన స్వంత నియోజకవర్గంలో ఓడిపోయారు. ఇక్కడ సైతం అధికారంలోని భారతీయ జనతా పార్టీ పై అవినీతి ఆరోపణలు మిన్నంటాయి. వాటిని సరైన విధంగా మల్చుకోలేకపోయింది కాంగ్రెస్. కేంద్రంలో కాంగ్రెస్‌పై అవినీతి ఆరోపణలు మిన్నంటుతున్నందున గ్రామీణ ప్రచారానికే కాంగ్రెస్ పరిమితమయింది. చావు తప్పి కన్నులొట్టపోయిన తీరుగా కాంగ్రెస్ గెల్చింది. రెండు అవినీతిమయ పార్టీల పోటీలో సమాన ప్రాతినిధ్యాన్నివ్వడం మరో ప్రత్యామ్నాయం లేకనే.

మణిపూర్‌కొచ్చేసరికి కాంగ్రెస్ మూడోసారి అధికారంలోకి రాగలిగింది. 60 అసెంబ్లీ స్థానాల్లో 42 స్థానాలను కాంగ్రెస్ గెల్చుకుంది. తృణమూల్ కాంగ్రెస్‌కు 7 స్థానాలు, నాగా పీపుల్స్ ఫ్రంట్‌కు 4, నేషనల్ కాంగ్రెస్ పార్టీకి 1, లోక్ జనశక్తి పార్టీకి 1, మణిపూర్ స్టేట్ కాంగ్రెస్‌కు ఐదు స్థానాలు రాగా, భాజపా, సిపిఐ, సిపిఎంలు తుడిచిపెట్టుకు పోయాయి. ముఖ్యమంత్రి ఇబోబి సింగ్ వ్యక్తిగత ప్రాభవం వల్లనే కాంగ్రెస్ గెలవగలిగిందని అందరి అభిప్రాయం.

ఈ ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలను ఓసారి సమీక్షించుకుంటే కాంగ్రెస్ ఉత్తరప్రదేశ్‌లో తన ప్రాభవాన్ని మరింతగా కోల్పోయి అమేథి, రాయ్‌బరేలీ వంటి కంచుకోటల్లో సైతం తమ పునాదులను కోల్పోయి తలెత్తుకోలేని పరిస్థితిలో పడింది. అవినీతి, వ్యక్తి ప్రతిష్ఠలకు సామాన్యులు తీవ్ర నిరసనను వ్యక్తం చేస్తూ ప్రత్యామ్నాయానికి అధికారాన్ని అందించారు. పంజాబ్‌లో సంకీర్ణ ప్రభుత్వమే అయినా ప్రకాశ్ సింగ్ రైతు అనుకూల విధానాలతో అధికారాన్ని కాపాడుకున్నారు. అధికార వ్యతిరేకత – సంక్షేమ విధానాల ముందు దిగదుడుపయింది. గోవాలో కాంగ్రెస్‌కు అవినీతి ఆరోపణలే ఘోరీ కట్టేశాయి. పారిశుధ్య లోపం, తాగునీటి కొరత యమపాశాలైనాయి. అధికార వ్యతిరేకత భాజపాకు పట్టంకట్టింది. ఉత్తరాఖండ్‌లో అధికారం – ప్రతిపక్షం రెండూ అవినీతి ముద్రతో పోటీపడగా వేరే ప్రత్యామ్నాయం లేక ఇద్దర్నీ సరిసమానంగా ఆదరించారు ఓటర్లు. మణిపూర్‌లో చావు తప్పి కన్ను లొట్టపోయిన రీతిన కాంగ్రెస్ అధికారాన్ని నిల్పుకుంది. కేవలం ఓ వ్యక్తి ప్రతిష్ట మీద తృణమూల్ కాస్త ప్రభావాన్ని పెంచుకుంది. బిజెపిని సైతం అవినీతి, అంతర్గత కుమ్ములాటలు, మతతత్వ విధానాల మాటున కాంగ్రెస్‌కు సరిసమాన దూరంలోనే ఉంచాయి. అలా అని ప్రాంతీయ పార్టీల ప్రభావమనడానికీ కారణాల్లేవు.

ఈ నేపథ్యంలో సామాన్య ఓటర్లు ప్రత్యామ్నాయ పార్టీలను, అందలం ఎక్కించే లక్ష్య దిశలో ఉన్నట్టు అవగతమవుతుంది. సిపిఐ, సిపిఎంలు ధర్నాలు, మైక్ బైట్‌లను పక్కనపెట్టి, చిన్న నాడు నేర్చుకున్న 'గ్రామాలకు తరలండి' పాఠాలను దులిపి వల్లె వేస్తే క్షేత్రస్థాయిలో బలపడి భవిష్యత్‌లో తృతీయ ఫ్రంట్‌కు పునాదులు పడతాయి. గ్రామస్థాయిలో, పార్టీల కుల రాజకీయాలు ఇంకా విస్తరించనందున ఇదొక్కటే ప్రత్యామ్నాయం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

***మనం వాడే మాటలనూ, నుడికారాలనూ ఎవరు శాసిస్తారో, ఎవరు రూపొందిస్తారో, వారే పత్రికలకూ, రేడియోలకూ యజమానులు. వారే మన మనసులకు యజమానులు. మీ అభిప్రాయాలనూ, సూచనలనూ యాంత్రికంగా పదే పదే వినిపిస్తూ వెళ్లండి. అసమ్మతినీ, భిన్నాభిప్రాయాన్నీ వినిపించే అవకాశాలను తగ్గించండి. ప్రజలను రాజకీయంగా కట్టిపడేయడానికి సూత్రం ఇదే.***

**– జూస్ట్ మీర్లూ,** *(1903–1976) డచ్ వైద్యుదు, మనోవైజ్ఞానిక శాస్త్రవేత్త*

# సోనీ సోడిపై రాజ్యం కత్తి గట్టిందెందుకు?

*చత్తీస్‌గఢ్‌లో రాజ్యాంగ విరుద్ధంగా ప్రజల పట్ల అమలవుతున్న దుర్మార్గమైన హింసనూ, జరుగుతున్న హక్కుల ఉల్లంఘనలనూ సోనీ సోడి ఉదంతంతో వివరిస్తున్నారు* **అమన్**

**2011** అక్టోబర్‌లో సోనీ సోడి అనే ఆదివాసీ మహిళ చత్తీస్‌గఢ్ పోలీసుల కస్టడీలో గురైన అమానవీయమైన చిత్రహింసల గురించి వింటే చత్తీస్‌గఢ్‌లో, మొత్తంగా భారతదేశంలో ఆదివాసులపైన, అందు లోనూ మహిళలపైన రాజ్యహింస ఎంత తీవ్ర స్థాయిలో సాగుతున్నదో మరోసారి స్పష్టమవుతుంది. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు గత కొంత కాలంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో సాగిస్తున్న 'ప్రజలపై యుద్ధాని'కి ముఖ్య కేంద్రాలుగా ఉన్నది ఆదివాసీ ప్రాంతాలేనని, ప్రధానంగా బలవుతున్నది ఆదివాసీలేనని అందరికీ తెలిసిందే.

36 సంవత్సరాల సోనీ దంతెవాడ జిల్లా కువకొండ బ్లాక్‌లోని జబేలి గ్రామంలో బాలికల ఆశ్రమ పాఠశాలలో వార్డెన్‌గా పని చేస్తుండేది. గీదం పట్టణానికి చెందిన ఆదివాసీయేతరుడు అనిల్ ఫుటానీని ప్రేమించి పెళ్లాడిన సోనీ తన కుటుంబంతో కొంత కాలంగా సమేలి గ్రామంలో ఉంటున్నది. ఈ రెండు గ్రామాలు పక్కపక్కనే ఉంటాయి. ఈమెకు ఇద్దరు ఆడపిల్లలు, ఒక బాబు. గత ఐదారేళ్లుగా మావోయిస్టు ఉద్యమ కార్యకలాపాలు విస్తరిస్తున్న ప్రాంతమిది. కనుక గ్రామాల్లోకి దాడులకు, వచ్చే పోయే పోలీసులకు ఈమె టార్గెట్ అయ్యింది. పోలీసులు సోనీని, సోని భర్తను ఇద్దరినీ తమకు ఇన్‌ఫార్మర్లుగా పని చేయాలని ఒత్తిడి చేసారు. మావోయిస్టు నేతలను పట్టుకొని హత్య చేయడంలో సహకరిం చాలని, అందుకు బహుమతిగా లక్షలాది రూపాయలు ఇస్తామని ప్రలోభ పెట్టారు. కానీ వీళ్లిద్దరూ అందుకు నిరాకరించారు. అదే ఈ జంట చేసిన నేరం!

2010లో మావోయిస్టు గెరిల్లాలు కువకొండ పట్టణంలో మహేంద్ర కర్మకు ముఖ్య అనుచరుడు, బడా వ్యాపారి, కాంగ్రెస్ నేత అయిన అవధేశ్ గౌతం ఇంటిపై దాడి చేసి హత్యా ప్రయత్నం చేశారు. సల్వాజుడుం కీలక నేతల్లో ఈయన ఒకడు. ఈ దాడిలో పాల్గొన్నాడనే నేరం మోపుతూ పోలీసులు అనిల్ ఫుటానీని అరెస్టు చేసి పలు తప్పుడు కేసులతో జైల్లో వేశారు. అప్పటి నుండి ఇతను ఎలాంటి జమానత్ లేకుండా దంతెవాడ జైలులో మగ్గుతున్నాడు. సోనీపై కూడా ఈ కేసును మోపారు కానీ అరెస్టు చేయలేదు. అర్ధరాత్రి చీకట్లో జరిగిన ఈ దాడిని మావోయిస్టులతో కలిసి వీడియోగ్రఫీ చేశాడని ఆరోపిస్తూ 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో పని చేసే జావేద్ ఇక్బాల్ అనే జర్నలిస్టుపై కూడా అప్పటి దంతెవాడ ఎస్ఎస్‌పి కల్లూరి తప్పుడు కేసు మోపడానికి ప్రయత్నం చేశాడనే విషయం గుర్తు చేసుకోవడం అసందర్భం కాదు.

ఇదే కేసును లింగారాం కొడొపి అనే పాతికేళ్ల యువకుడిపై కూడా మోపారు. (ఇంకా పలువురు సిపిఐ నాయకులపై కూడా ఈ కేసు నడుస్తున్నది.) ఆయన సోనీకి స్వయంగా మేనల్లుడు. లింగారాం పోలీసులకు కంట్లో నలుసుగా మారిన తీరు కూడా సోనీ, అనిల్‌ల జంటకు ఎదురైన అనుభవాన్నే పోలి ఉంటుంది. కొన్నేళ్ల కింద పోలీసులు లింగారాంను ఏదో కేసుపై అరెస్టు చేసి ఎస్‌పిఓగా మారమని ఒత్తిడి చేయగా ఆయన అందుకు నిరాకరించాడు. పోలీసులు ఆయనను వారాల తరబడి అక్రమ కస్టడీలో ఉంచుకొని పలు విధాలుగా హింసించారు. అతని ఆచూకీ తెలుసుకోవడానికి కుటుంబ సభ్యులు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవడంతో చివరకు వాళ్లు హిమాంశు కుమార్ తదితర ప్రజాస్వామికవాదుల మద్దతుతో బిలాస్‌పూర్ హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ వేశారు. దాంతో పోలీసులకు ఆయనను విడిచిపెట్టక తప్పలేదు. విడుదలైన లింగారాం తన మిత్రుల మద్దతుతో ఢిల్లీలో ఉంటూ జర్నలిజం కోర్సులో చేరాడు. ఆయన బస్తర్ ప్రాంతంలో పోలీసులు ఆదివాసులపై పాల్పడుతున్న హింసాదౌర్జన్యాలను రిపోర్ట్ చేస్తూ క్రమంగా ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా స్థిరపడ్డాడు. దీన్ని సహించలేని పోలీసులు ఆయనను 'మావోయిస్టు'గా ప్రకటించారు. 2010 జూలైలో పోలీసుల 'ఎన్‌కౌంటర్'లో మృతి చెందిన మావోయిస్టు నేత ఆజాద్ స్థానంలో పార్టీ లింగారాం కొడొపిని అధికార ప్రతినిధిగా నియమించిందనే ఒక హాస్యాస్పదమైన కట్టుకథను పోలీసులు ప్రసారం చేశారు. పైగా ఢిల్లీలో ఆయన అత్యాధునిక పేలుడు పదార్థాల శిక్షణ పొందుతున్నాడని కూడా ఆరోపించడమే కాకుండా, కువకొండలో అవధేశ్ గౌతంపై జరిగిన దాడిలో నిందితుడిగా ప్రకటించి అరెస్టు చేయడానికి ప్రయత్నించారు. కానీ ఢిల్లీలో పలువురు ప్రజాస్వామికవాదులు దీనిపై నిరసన తెలిపి, పత్రికల్లో వార్తా కథనాలు రాసి లింగారాంకు అండగా నిలవడంతో తమ ప్రయత్నాన్ని విరమించుకున్నారు. అయితే లింగారాంను ఎలాగైనా సరే జైల్లోకి తోయాలన్న పంతాన్ని మాత్రం వీడలేదు.

సోనీ సోడి స్వగ్రామం దంతెవాడ జిల్లాలోని బెడమ. ఆర్థికంగా, రాజకీయంగా పలుకుబడి గల కుటుంబంలో ఆమె పుట్టింది. ఆమె తండ్రి ముంద్రారాం సోడి ఒక పేరుమోసిన భూస్వామి. చిన్నాన్న నందారాం సోడి గతంలో సిపిఐ తరపున ఎం.ఎల్.ఎ.గా గెలిచిన వ్యక్తి. ముంద్రారాం ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా పని చేస్తున్నాడని మావోయిస్టు పార్టీ అనేకసార్లు హెచ్చరించింది. కానీ ముంద్రారాం దీన్ని లెక్కచేయకుండా వ్యవహరిస్తుండడంతో ఆయన ఇంటిపై మావోయిస్టు పార్టీ నాయకత్వంలో స్థానిక ప్రజలు 2011 జూన్ 14 రాత్రి దాడి చేసి ఆస్తులను స్వాధీనం చేసుకొన్నారు. ఆ సమయంలో ముంద్రారాం తన దగ్గరున్న తుపాకీ తీసి ఎదిరించబోగా ప్రజా మిలిషియా సభ్యులు అతని కాళ్లపై కాల్పులు జరిపి గాయపర్చారు. బస్తర్ ప్రాంతంలో సిపిఐకి, మావోయిస్టు పార్టీకి మధ్య ఘర్షణలకు కూడా చెప్పుకోదగిన చరిత్ర ఉన్నది. కుటుంబ, రాజకీయ, సామాజిక నేపథ్యాన్ని గమనించినపుడు సోనీకి మావోయిస్టు పార్టీతో సత్సంబంధాలు గానీ, పోలీసులు ఆరోపిస్తున్నట్టుగా 'మధ్యవర్తి'గా పని చేయగల అర్హతలు గానీ ఉండడానికి అవకాశం లేదని ఎవరైనా అర్థం చేసుకోవచ్చు.

కానీ ఈరోజు చత్తీస్‌గఢ్‌లో, ప్రత్యేకించి బస్తర్‌లో అమలవుతున్న పచ్చి ఫాసిస్టు అణచివేత విధానాలలో భాగంగా రాజ్యం తమకు సహకరించని, తమ మాట వినని వాళ్లందరినీ శత్రువులుగానే పరిగణిస్తున్నది. గతంలో హిమాంశు కుమార్ వంటి గాంధేయులను కూడా

వేధించి వెంటాడి తరిమేయడం కూడా ఇందులో భాగమే. ఆదివాసులపై ప్రభుత్వ సాయుధ బలగాలు చేస్తున్న హత్యాకాండల్ని, హింసాదౌర్జన్యాల్ని ప్రశ్నించడంతో ఆయన రాజ్యానికి కంటగింపయ్యాడు. అంతకన్నా ముందు కమలేష్ పైక్రా, అఫ్జల్ ఖాన్ వంటి జర్నలిస్టులు కూడా ప్రభుత్వ దాడులకు, వేధింపులకు గురయ్యారు. వివిధ సంఘటనలపై నిజనిర్ధారణల కోసం వచ్చిన ప్రజాస్వామికవాదులను, మహిళా సంఘాల కార్యకర్తలను బస్తర్‌లో అడుగుపెట్టనివ్వకుండా రాజ్యం, రాజ్యప్రాయోజిత గూండా ముఠాలు తరిమి కొట్టిన సంఘటనలు ఎన్నెన్నో. నిరుడు చింతల్‌నార్ ప్రాంతంలో ప్రభుత్వ సాయుధ బలగాలు సాగించిన బీభత్సకాండ గురించి నిజానిజాలు తెలుసుకోవడానికి వచ్చిన స్వామి అగ్నివేష్, తదితరులు కూడా దాడికి గురై వెనుదిరగాల్సి వచ్చిన విషయం విదితమే. బస్తర్ ప్రాంతంలో జరుగుతున్న రాజ్యహింస గురించి మాట్లాడే వాళ్లందరూ – ఎక్కడి వాళ్లయినా సరే – 'మావోయిస్టు'లే. రాజ్యం దృష్టిలోనైనా, 'ప్రధాన స్రవంతి'గా చెప్పుకునే మీడియా దృష్టిలోనైనా మావోయిస్టులంటే నేరస్తులూ, శిక్షార్హులే.

మావోయిస్టు ఉద్యమంతో ఎలాంటి ప్రత్యక్ష సంబంధం లేని లింగారాం కొడొపి చత్తీస్‌గడ్‌లో రాజ్యహింస గురించి రిపోర్టు చేసే జర్నలిస్టుగా ఎదిగిన క్రమానికి కారణం నిజానికి ప్రభుత్వ/పోలీసు ఒత్తిళ్లే తప్ప మరేమీ కాదు. అయితే సోనీ మాత్రం ఈ కోవకు కూడా చెందదు. కానీ వీళ్లిద్దరినీ రాజ్యం శత్రువులుగానే పరిగణించింది. వీళ్లు పోలీసుల ఒత్తిళ్లను, బెదిరింపులను లెక్కచేయక ఆత్మగౌరవాన్ని ప్రదర్శించడం రాజ్యానికి భరింపరానిదయ్యింది. అందుకే వీళ్లను నైతికంగా, మానసికంగా, శారీరకంగా, అన్ని విధాలుగా దెబ్బతీయడంతో పాటు మావోయిస్టు ఉద్యమాన్ని కూడా అపఖ్యాతి పాలు చేసే కుట్రకు కూడా అది పాల్పడింది. ఈ క్రమంలో అది తన ప్రజావ్యతిరేక ముఖాన్ని మరింత నగ్నంగా బైటపెట్టుకుంది. దాని పూర్వాపరాలను కూడా చూద్దాం.

ఎస్సార్ కంపెనీ నుండి మావోయిస్టు పార్టీకి డబ్బులు అందుతున్నాయి అనే వార్త 2011 ఆగస్టులో 'వికీలీక్స్' వెలువరించిన రహస్య పత్రాలలో వెల్లడైనట్టుగా ప్రచారమైంది. ముంబాయిలోని అమెరికన్ కాన్సులేట్ అధికారులు వాషింగ్టన్‌లోని తమ బాస్‌లకు పంపించిన కేబుల్స్‌లో ఈ విషయం ఉందని పత్రికలు రాశాయి. దానికి కొద్దిగా ముందు ఎస్సార్ కంపెనీ మావోయిస్టు పార్టీకి డబ్బులు ముట్టచెబుతున్నదనే కట్టుకథ ఒకటి చత్తీస్‌గడ్ మీడియాలో ప్రచారంలో ఉండింది. తర్వాత 'వికీలీక్స్' పత్రాలలో ఈ విషయాన్ని పేర్కొనడంతో ఈ కట్టుకథకు 'సాధికారత' దొరికినట్టుగా మీడియా భావించింది. అమెరికన్ అధికారులు చెప్పేవన్నీ నిజాలేనని దానికి ఎంత నమ్మకం! ఇలా మన దేశ అంతర్గత వ్యవహారాలలో అమెరికా జోక్యం చేసుకోవడంపై మన దేశ మీడియాకు చీమ కుట్టినట్టయినా అనిపించక పోవడంలో ఎటువంటి ఆశ్చర్యంలేదు.

బస్తర్ ప్రాంతంలో 2005లో సల్వాజుడుంను ప్రారంభించిన సమయంలోనే రమణ్‌సింగ్ ప్రభుత్వం టాటా, ఎస్సార్ కంపెనీలతో రెండు చోట్ల స్టీలు ప్లాంట్ల కోసం ఎంఒయూలు కూడా కుదుర్చుకున్నది. ఇది కాకతాళీయంగా జరిగింది కాదనీ, ఈ అణచివేత క్యాంపెయిన్‌కు ఈ రెండు కంపెనీలు నిధులు కూడా సమకూర్చాయనీ మావోయిస్టులే కాదు, అనేక మంది మేధావులు, విలేకరులు కూడా ఆధారాలతో ప్రకటించారు. నిజానికి ఈ రెండు చోట్ల కూడా ఈ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించారు. దాని ఫలితంగా ఇప్పటికీ ఈ రెండు కంపెనీలు నిర్మించ తలపెట్టిన ప్లాంట్ల కోసం భూములను స్వాధీనం చేసుకోలేకపోయాయి. మావోయిస్టు పార్టీ తన మద్దతును ప్రకటించి ప్రజలకు అండగా నిలిచిన సంగతి బస్తర్ రాజకీయాలను పరిశీలిస్తున్న వాళ్లందరికీ తెలిసిన విషయమే.

2002లో బైలడిల్లా గనుల నుండి ఇనుప ఖనిజ చూర్ణాన్ని తరలించడం కోసం ఎస్సార్ కంపెనీ విశాఖపట్నం వరకు 267 కి.మీ.ల పైప్‌లైన్‌ను నిర్మించింది. ఇది బస్తర్ ఇనుప ఖనిజాన్ని అడ్డగోలుగా దోచుకుపోవడమే కాక, పెద్ద ఎత్తున నదీజలాలను దుర్వినియోగం చేస్తుంది. కనుక మావోయిస్టు పార్టీ దీనిని ప్రజావ్యతిరేక ప్రాజెక్టు అని ప్రకటించి తొలి నుండి నిరసన తెలుపుతూ వచ్చింది. ఈ ప్రాజెక్టును అడ్డుకోవడం కోసం మావోయిస్టు గెరిల్లాలు, ప్రజా మిలిషియా సభ్యులు కొన్ని సార్లు దాడులు చేసి ఈ పైప్‌లైన్‌ను ధ్వంసం చేశారు. ఈ కంపెనీకి చెందిన డజన్ల కొద్ది వాహనాల్ని కాలబెట్టారు. అయితే ఈ కంపెనీ ప్రభుత్వ, పోలీసు మద్దతుతో పైప్‌లైన్‌ను రిపేరు చేసుకుంటూ ఖనిజాన్ని కొల్లగొడుతూనే ఉన్నది. అందుకే ఈ కంపెనీకి వ్యతిరేకంగా ప్రజల పోరాటం ఆగలేదు. పైప్‌లైన్‌ను పూర్తిగా ఆపేసే దాకా అది కొనసాగుతూనే ఉంటుంది.

దళారీ పెట్టుబడిదారీ సంస్థల, బహుళజాతి కంపెనీల దోపిడీ విధానాల పట్ల మావోయిస్టు పార్టీ వైఖరి, 'అభివృద్ధి' పేరుతో పాలకులు ప్రజలపై రుద్దుతున్న వినాశకర విధానాలకు వ్యతిరేకంగా అది చేపడుతున్న పోరాటాల గురించి ప్రజలకు తేటతెల్లమే. మావోయిస్టు పార్టీ నాయకత్వంలో బస్తర్ ప్రజలు ఎస్సార్‌పై కూడా రాజీలేని పోరాటం చేస్తున్నారు. బస్తర్ ప్రాంతంలో సాగుతున్న ప్రతిఘటనలో భాగంగా ధ్వంసమైన దళారీ పెట్టుబడిదారీ కంపెనీల ఆస్తులలో అన్నిటికన్నా ఎక్కువగానూ, తరచుగానూ టార్గెట్ అయ్యింది ఎస్సార్‌వే కావడం దీనికి నిదర్శనం. ఒకవేళ ఎస్సార్ వంటి కంపెనీల నుండి డబ్బులు తీసుకుని వాళ్ల నిలువుదోపిడీ విధానాలకు మావోయిస్టు పార్టీ మద్దతు తెలిపి ఉంటే గనుక, బహుశా ప్రభుత్వాలకు సల్వాజుడుం, గ్రీన్‌హంట్ వంటి అణచివేత క్యాంపెయిన్లు అమలుచేసే అవసరమే రాకపోయేది. అదే నిజమైతే సల్వాజుడుంకు టాటాలు, రూయియాలు సహప్రాయోజకుల లాగా వ్యవహరించాల్సిన అవసరమే రాకపోవు. ఈ ఆరోపణ పచ్చి అబద్ధమని, నిరాధారమైందని పార్టీ స్పష్టమైన ప్రకటన చేసింది.

ఒకవేళ ఎస్సార్ నుండి మావోయిస్టు పార్టీకి డబ్బులు అందుతున్నాయనే ఆరోపణ నిజమే అనుకున్నా అసలు అరెస్టు చేయాల్సింది ఎవరిని? అరెస్టు చేసి అమానుష చిత్రహింసలకు గురి చేస్తున్నది ఎవరిని? తప్పుడు కేసుల్లో ఇరికించి యుఎపిఎ, సిఎస్‌పిఎస్ఎ (చత్తీస్‌గడ్ ప్రజారక్షణా చట్టం) వగైరా క్రూర చట్టాల కింద నిర్బంధించింది ఎలాంటి వాళ్లను? లక్ష కోట్ల రూపాయల టర్నోవర్‌తో అంతులేని ఐశ్వర్యాలతో తులతూగే ఎస్సార్ యజమానులైన రూయియాలను వాళ్లు ముట్టుకోగలరా? బి.కె. లాలా వంటి ఒక దిక్కూమొక్కూ లేని చిన్నపాటి కాంట్రాక్టర్‌ను మాత్రం పట్టుకొని జైల్లో పడేయగలరు! రాజ్యంచే గత కొంత కాలంగా వేధించబడుతూ, వెంటాడబడుతున్న లింగారాం కొడొపి, సోనీ సోడి వంటి సాధారణ ప్రజలను చిత్రహింసలకు గురి చెయ్యగలరు!

లింగారాం కొడొపిని సెప్టెంబర్ 7న పాల్‌నార్‌లో పోలీసులు అరెస్టు చేశారు. ఎస్సార్‌కు చెందిన కాంట్రాక్టర్ లాలా నుండి డబ్బులు తీసుకుంటుండగా రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నామని ఆరోపించారు. ఆయనను పోలీసులు తీవ్రమైన చిత్రహింసలకు గురి చేసి ఉంటారని అందరూ భావిస్తున్నారు. అదే సమయంలో సోనీ సోడి అక్కడి నుండి పారిపోయిందనే వార్తను ప్రచారం చేశారు. ఇంకా అనేక కేసుల్లో ఆమె నిందితురాలనే ప్రచారాన్ని కూడా సాగిస్తూ వచ్చారు. ఆమె మాత్రం స్కూలుకు రెగ్యులర్‌గా పోతూ విధులు నిర్వహిస్తూ వేతనం కూడా తీసుకుంటూ ఉండింది. నిన్నటి దాకా బడిలో పాఠాలు చెప్పే ఒక ఉపాధ్యాయిని అకస్మాత్తుగా 'తప్పించుకు తిరుగుతున్న మావోయిస్టు'గా మారిపోయింది.

ఆమెను కుట్రపూరితంగా ఈ కేసులో ఇరికించడం కోసం కిరందుల్ పోలీసు స్టేషన్‌కు చెందిన మాన్‌కర్ అనే ఒక కానిస్టేబుల్ ఆమె ఫోన్‌ను గుంజుకొని కాంట్రాక్టర్‌కు కాల్ చేసి తనను తాను మావోయిస్టుగా చెప్పుకుంటూ ఫలానా చోటికి డబ్బులు తీసుకొని రమ్మని ఆదేశించాడు. ఈ ఫోన్ సంభాషణను రికార్డు చేసిన పోలీసులు తమ వద్ద సోనీకి వ్యతిరేకంగా సాక్ష్యం ఉందని చెబుతున్నారు. ఈ విషయాన్ని సోనీ స్వయంగా మీడియా వాళ్లకు చెప్పింది కూడా. అయినా పోలీసులు ఆమె వెంటబడ్డారు. ఇక తనను పోలీసులు ఎలాగూ అరెస్టు చేస్తారని అర్థమై భయంతో అటు ఇటు తిరుగుతూ ఆఖరుకు ఆమె ఢిల్లీ చేరుకుంది. అక్కడ లాయర్ల మద్దతుతో యాంటిసిపేటరీ బెయిల్ తీసుకోవడానికి ఆమె చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆమెకు ఆశ్రయం ఇచ్చారన్న పేరుతో చత్తీస్‌గడ్ పోలీసులు జైపూర్‌లో ప్రముఖ పౌరహక్కుల కార్యకర్త కవితా శ్రీవాస్తవ్ ఇంటి పై దాడి చేసి సోదా చేసి కుటుంబ సభ్యులను భయభ్రాంతులకు గురిచేశారు. స్వాతంత్ర్య సమరయోధుడైన ఆమె తండ్రితో దురుసుగా, అవమానకరంగా వ్యవహరించారు. నిజానికి సోనీ ఆ సమయంలో అక్కడ లేదని పోలీసులకు స్పష్టంగానే తెలుసు. గత సంవత్సరం చింతల్‌నార్ ప్రాంతంలో రాజ్యం సృష్టించిన బీభత్సకాండపై నిజనిర్ధారణ కోసం వచ్చి, దోషుల్ని శిక్షించాలని డిమాండ్ చేసిన ప్రముఖులలో కవితా శ్రీవాస్తవ్ కూడా ఒకరనేది గమనార్హం.

చివరకు అక్టోబర్ 4న సోనీ సోడిని ఢిల్లీలోనే అరెస్టు చేసి కోర్టులో హాజరుపర్చారు. దేశ రాజధానిలోని కింది కోర్టు, హైకోర్టు ఆమెకు బెయిల్ ఇవ్వకుండా, మూడు రోజుల ట్రాన్సిట్ రిమాండ్‌పై చత్తీస్‌గడ్ పోలీసులకు అప్పజెప్పాయి. చత్తీస్‌గడ్ పోలీసులు తనను చిత్రహింసలు పెడతారని, తన ప్రాణాలు తీసే ప్రమాదం ఉందని, తనను చత్తీస్‌గడ్‌కు పంపవద్దని ఆమె చేసిన అభ్యర్థనలను పెడచెవిన పెడుతూ మెజిస్ట్రేట్ 'పోలీసులందరూ చెడ్డవాళ్లు కారు' అని 'హితబోధ' చేసి మరీ అప్పగించాడు. అయితే ఢిల్లీ హైకోర్టు సోనీ పరిస్థితి ఎలా ఉందో కొద్ది రోజుల తర్వాత కోర్టుకు చెప్పాలని, ఆమెకు రక్షణ కల్పించాలని చత్తీస్‌గడ్ పోలీసులను ఆదేశించింది.

కోర్టు ఆదేశాలను ఖాతరు చేసే అలవాటు లేని చత్తీస్‌గడ్ పోలీసులు ఆమెను అక్టోబర్ 8-9 తేదీలలో చెప్పనలవి గాని అమానుష రీతుల్లో చిత్రహింసలకు గురి చేశారు. ఆమె సుప్రీం కోర్టుకు స్వయంగా రాసిన లేఖలో పేర్కొన్న విధంగా ఆమెను అర్ధరాత్రి దంతెవాడ పోలీసుస్టేషన్ లాకప్ నుండి జిల్లా ఎస్.పి. అంకిత్‌గర్గ్ రూంలోకి తీసుకెళ్లి తీవ్రంగా కొట్టారు. ఒంటి పై బట్టలు లేకుండా చేసి గోళ్లపై ఎలక్ట్రిక్ షాక్‌లు ఇచ్చారు. క్రూరమైన లైంగిక హింసలకు గురి చేశారు. దాంతో ఆమె అనేక గంటల పాటు స్పృహ లేకుండా ఉండిపోయింది. తెల్లవారే సరికి ఒళ్లంతా తీవ్రమైన నొప్పులతో, మెడపై, వెన్నెముకపై గాయాలతో, పొత్తికడుపులో నొప్పితో తీవ్రంగా బాధపడసాగింది. 10వ తేదీన ఆమెను దంతెవాడ కోర్టులో ప్రవేశపెట్టే సమయానికి ఆమె నడవలేని స్థితిలో ఉండింది. వ్యాన్‌లో బెడ్‌పై పడుకోబెట్టి కోర్టుకు తీసుకెళ్లాల్సి వచ్చింది. కోర్టు హాల్లోకి వెళ్లలేని స్థితిలో ఆమెను వ్యాన్‌లోనే ఉంచారు. బాత్‌రూంలో పడిపోతే ఆమెకు దెబ్బలు తగిలాయని పోలీసులు కోర్టులో ఇచ్చిన వివరణను నమ్మే ముందు బైటికొచ్చి ఆమెను స్వయంగా చూడాలన్న ఇంగితం కూడా ఫస్ట్ క్లాస్ మెజిస్ట్రేట్ యోగితా వాస్నిక్‌కు లేకుండా పోయింది. తన చట్టపరమైన బాధ్యతల్ని కూడా విస్మరిస్తూ ఆమె తన కింది ఉద్యోగిని బైటికి పంపించి సోనీ స్టేట్‌మెంట్‌ను రికార్డ్ చేయమని పురమాయించింది. చట్టాన్ని, న్యాయాన్ని కాపాడుతామని చెప్పుకునే న్యాయాధిపతులు కూడా వాటిని ఎంత ఘోరంగా ఉల్లంఘిస్తున్నారో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

ఈ క్రమంలో సోనీ నిజాలు వెల్లడించకుండా పోలీసు అధికారులు ఆమెను అనేక విధాలుగా బెదిరించారు. ఆఖరుకు అనేక ప్రయత్నాల తర్వాత సుప్రీంకోర్టు ఆదేశం మేరకు ఆమెకు కోల్‌కతలోని ఎన్.ఆర్.ఎస్. మెడికల్ కాలేజ్ ఆసుపత్రిలో స్వతంత్ర వైద్య పరీక్షలు జరిపారు. ఆ సందర్భంగా కూడా సుప్రీంకోర్టు సూచనలకు భిన్నంగా 24 గంటల పాటు పోలీసు లాకప్‌లో నిర్బంధించారు. నవంబర్ 25న సుప్రీం కోర్టులో ప్రవేశపెట్టిన వైద్య పరీక్షల రిపోర్టు పోలీసులు ఆమెపై జరిపిన అత్యంత క్రూరమైన చిత్రహింసలకు సాక్ష్యంగా నిలుస్తుంది. ఆమె మలద్వారంలో ఒకటి, జననేంద్రియాల్లో రెండు రాళ్లను చొప్పించినట్టుగా కనుగొన్నట్టు రిపోర్టు పేర్కొంది. వెన్నెముకపై పగుళ్లున్నట్టుగా ఎంఆర్ఐ స్కానింగ్‌లో బైటపడింది. ఇంత హీనాతిహీనమైన నేరానికి పాల్పడ్డ పోలీసు అధికారులపై ఇది రాస్తున్న సమయానికి ఎలాంటి కేసు నమోదు చేయడం గానీ, ఎవరినీ అరెస్టు చేయడం గానీ జరగలేదు. దేశవ్యాప్తంగా పలు ప్రజాసంఘాలు, పౌరహక్కుల సంఘాలు సోనీ సోడిని హింసించిన పోలీసు అధికారులను శిక్షించాలని, ఆమెపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తివేయాలని డిమాండ్ చేశాయి. ఢిల్లీ పర్యటనకు వచ్చిన రమణ్‌సింగ్‌ను ఈ విషయమై నిలదీయడానికి ప్రయత్నించిన ప్రదర్శనకారుల్ని పోలీసులు చెదరకొట్టారు. మహిళా సంఘాల కార్యకర్తలు రాయపూర్ జైల్లో ఉన్న సోనీ సోడిని కలవడానికి ప్రయత్నిస్తే అధికారులు 'భద్రతా' కారణాలతో అనుమతిని నిరాకరించి తిప్పి పంపారు.

ఇక ఎప్పటి లాగానే సోనీ సోడిపై జరిగిన అమానుష చిత్రహింసల గురించి 'ప్రజాస్వామ్యానికి నాలుగో స్తంభం'గా చెప్పుకునే మీడియా తీసుకున్న వైఖరి కూడా దాని వర్గ స్వభావానికి అనుగుణంగా ఉండిందని చెప్పక తప్పదు. ముఖ్యంగా 'ఇండియా టుడే' వంటి మీడియా సంస్థలు తీసుకున్న వైఖరి దేశంలో జడలు విప్పుకుంటున్న ఫాసిస్టు పోకడలకు స్పష్టమైన సూచికగా నిలుస్తాయి. మచ్చుకు 'ఇండియా టుడే' హిందీ వీక్లీ 2011 అక్టోబర్ 26 సంచికలో సోనీ సోడి గురించి రాసిన రిపోర్టు చదివితే మనకు ఆందోళన కలుగకమానదు. ఇంకా కోర్టులో విచారణ కూడా మొదలవక ముందే ఒక ఉపాధ్యాయినిని ఏకపక్షంగా నేరస్తురాలిగా, దుశ్చరిత్రురాలిగా నిర్ధారిస్తూ రాసే రాతలు ప్రజాస్వామ్య విలువలకే గొడ్డలిపెట్టు. కొన్ని మినహాయింపులతో మొత్తంగా 'ప్రధాన స్రవంతి'కి చెందిన ప్రింట్/ఎలక్ట్రానిక్ మీడియాది ఇదే వైఖరి.

ఇదంతా ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో సాగుతున్న 'ప్రజలపై యుద్ధం'లో భాగమేనని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. రాజ్యం కేవలం మావోయిస్టులపైన, మావోయిస్టు ఉద్యమ ప్రాంతాల ప్రజల పైననే కాకుండా సాధారణ ప్రజలపై కూడా విచ్చలవిడి హింసకు పాల్పడుతున్నది. ప్రజా ఉద్యమాలకు అండగా నిలుస్తున్న వాళ్లపైనే కాకుండా వాటితో ఎలాంటి సంబంధం లేని వాళ్లపై కూడా పంజా విసురుతున్నది. ఆర్థికంగా, సామాజికంగా పలుకుబడి గల కుటుంబంలో పుట్టి ప్రభుత్వ ఉపాధ్యాయినిగా పని చేస్తున్న సోనీ సోడి వంటి మహిళ జ్యుడీషియల్ కస్టడీలోనే పోలీసుల చేతిలో ఇంత క్రూరమైన చిత్రహింసలను ఎదుర్కోవల్సి వచ్చిందంటే గ్రామీణ ప్రాంతంలోని వందల, వేల మంది మహిళల పరిస్థితి ఎలా ఉండి ఉంటుందో ఊహించడం కష్టం కాదు. తాను రాసుకున్న చట్టాల్ని, రాజ్యాంగాన్ని తానే బాహాటంగా ఉల్లంఘిస్తూ, తాను వల్లించే 'ప్రజాస్వామ్యం' ఎంత బూటకమో చెప్పకనే చెబుతున్నది. ఈ దాడికి కార్పొరేట్ మీడియా నిర్లజ్జగా మద్దతు తెలపడం ద్వారా ఇందులో తన క్రియాశీల భాగస్వామ్యాన్ని నిరూపించుకుంటున్నది. ఈ క్రమంలో జర్నలిస్టు నైతికతను కూడా అది తోసిరాజంటున్నది. ఈ యుద్ధానికి వ్యతిరేకంగా గొంతు విప్పకుండా మౌనం వహిస్తే, దీన్ని ఆపకపోతే అది మానవ సమాజ మనుగడకే ప్రమాదంగా పరిణమించగలదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ఆదివాసులను నిర్వాసితులను చేస్తున్న ప్రభుత్వం

***ఓపెన్ కాస్ట్‌లూ, అభయారణ్యాలూ, పవర్ ప్రాజెక్ట్‌లూ ఇలా ఇంకా అనేక 'అభివృద్ధి' ప్రాజెక్ట్‌ల పేరిట జరుగుతున్న విధ్వంసానికి ఆదివాసులు బలవుతున్నారని అంటున్నారు* షంషేర్**

ఆదిలాబాద్ ఆదివాసుల జిల్లా. ఇక్కడ విస్తారమైన అడవులు ఉన్నాయి. విస్తారమైన బొగ్గు, సిమెంట్, సున్నపురాయి, పుష్కలమైన నీటి వసతులు, ఇతర ఖనిజాలు, అపారమైన అటవీ సంపదలున్నాయి. ప్రకృతి వనరులున్నాయి. వీటిపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సామ్రాజ్య వాదులతో, బహుళజాతి సంస్థలతో, కార్పొరేట్ శక్తులతో మిలాఖత్ అయి 'అభివృద్ధి' పేరుతో కుట్రపూరిత పథకాలు అమలు చేస్తున్నాయి. తరతరాలుగా జిల్లాలో జీవిస్తున్న ఆదివాసులను నిర్వాసితులను చేసే పథకాలు అమలు జరుగుతున్నాయి.

దేశంలో రెండు దశాబ్దాలుగా నూతన ఆర్థిక విధానాలు అమలవు తున్నాయి. ఈ ఆర్థిక విధానాలు అమల్లోకి వచ్చిన తర్వాత ప్రతి దాన్ని మార్కెట్ శక్తులకు అనుకూలంగా వదలివేయాలన్న ధోరణి బలపడింది. ఇదే అభివృద్ధి నమూనాగా విస్తృతంగా ప్రచారం చేయబడు తోంది. దీనికి అనుగుణంగా అణచివేత రాజ్యమేలుతోంది. దాంతో సగటు మనిషి జీవితం పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్టు అయింది. భూమిలాంటి ప్రాకృతిక వనరులపై, ప్రకృతిపై ఆధారపడి జీవించే ఆదివాసీ ప్రజలు తమ జీవనాధారాన్ని కోల్పోతున్నారు.

కోసం, అటవీ రక్షణ కోసమని వివిధ చట్టాలు చేసాయి. సామ్రాజ్యవాదు లతో, బహుళజాతి కంపెనీలతో పీటముడి వేసుకున్న భారత పాలక వర్గాలు ఇవ్వాళ ఆదివాసుల రక్షణ చట్టాలు తుంగలో తొక్కి ఆదివాసీ ప్రాంతాలలో గల విశాలమైన అడవులను, ఖనిజ సంపదలను దోచుకెళ్లడానికి ఎర్ర తివాచీలు పరుస్తున్నాయి.

ఆదిలాబాద్ జిల్లా అటవీ ప్రాంతాలు భావితరాలకు మిగలకుండా దళారీ పాలకులు అమలు జరుపుతున్న కుట్రలు వేగవంతం అవుతున్నాయి. ఓపెన్ కాస్ట్ ప్రాజెక్ట్‌ల, అభయారణ్యాల పేరుతో వారి సంస్కృతి, సాంప్రదాయాలు నామ రూపాలు లేకుండా పోయే ప్రక్రియ వేగవంతంగా కొనసాగుతోంది. ఇదంతా 'అభివృద్ధి' పేరుతో జరుగుతున్న విధ్వంసం. జిల్లాలో నిర్వాసితుల సమస్యలు నానాటికీ తీవ్రరూపం దాలుస్తున్నాయి. సమస్యలన్నీ నేడు అస్తిత్వాల సమస్యలుగా మారాయి.

అటవీ ప్రాంతాల్లోని ఖనిజ సంపదను విక్రయిస్తే ఆయా ప్రాంతాలను, ఆదివాసులను ప్రగతి పథంలోకి తీసుకుపస్తామనే భారత దళారీ పాలకుల, వారి తాబేదార్ల వాదన ప్రజలను మభ్యపెట్టడానికే. నిరుడు వచ్చిన (2010) కొత్త ఖనిజ విధానం ప్రకారం బొగ్గు గనుల

***ఈ రచన మాకు అందిన కొద్ది రోజులకే 'షంషేర్' అనే కలం పేరుతో ఈ వ్యాసం రాసిన రచయిత ప్రమాదవశాత్తూ మరణించినట్లు తెలుస్తున్నది. విచారం వ్యక్తం చేస్తున్నాం.***

యాజమాన్యాలు కంపెనీ లాభాల్లో 26 శాతం ప్రాజెక్ట్ కారణంగా దెబ్బతిన్న ప్రజల కోసం వెచ్చించాలి. కానీ దీనివల్ల బాధిత ప్రాంతానికి న్యాయం జరుగుతుందనుకోవడం ఒక భ్రమ మాత్రమే.

భారత పాలకవర్గాలు, సామ్రాజ్యవాదులతో మిలాఖత్ అయి ప్రపంచబ్యాంక్ అభివృద్ధి నమూనాతో ముందుకు వచ్చాయి. అనేక తిరుగుబాట్ల ద్వారా ఆదివాసులు సాధించుకున్న చట్టాలు నేడు ఎందుకూ పనికిరాకుండా పోయాయి. 1917 ఏజెన్సీ ట్రాక్ ఇంటరెస్ట్ అండ్ ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ ఆక్ట్, 1959 ఎ.పి. షెడ్యూల్డ్ ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ రెగ్యులేషన్ ఆక్ట్, నక్సల్బరీ, శ్రీకాకుళం విప్లవోద్యమాల ఫలితంగా వచ్చిన 1/70 ఆక్ట్, 1980 అడవీ రక్షణ చట్టం, 1986 పర్యావరణ చట్టం, 1/70 రెగ్యులేషన్లను, జి.ఒ. 64 కింద మార్గదర్శకత్వాలన్నింటినీ తుంగలో తొక్కారు. 1996లో వచ్చిన పంచాయితీ గిరిజన ప్రాంతాల విస్తరణ చట్టం (పెసా) ప్రకారం 73వ రాజ్యాంగ సవరణలతో సంక్రమించిన ఆదివాసుల స్వయం నిర్ణయాధికార గ్రామాలను జి.ఒ. 68తో నీట ముంచజూస్తున్నారు. 2006 షెడ్యూల్డ్ తెగలు, ఇతర సాంప్రదాయక అటవీ హక్కుల గుర్తింపు చట్టం లాంటి అనేక చట్టాలను తుంగలో తొక్కి ఆదివాసీ గుండెలపై తుపాకులను గురిపెట్టారు.

భారత పాలకవర్గాలు పార్లమెంటరీ వ్యవస్థ ద్వారా ఆదివాసుల

దేశంలోనూ, రాష్ట్రంలోనూ విద్యుత్ అవసరాలకు బొగ్గుతో ఉత్పత్తి అయ్యే థర్మల్ విద్యుత్ పైనే ఎక్కువగా ఆధారపడుతున్నారు. గడిచిన రెండు దశాబ్దాల కాలంలో విద్యుత్ అవసరాల అంచనాలు విపరీతంగా పెరిగాయి. ఫలితంగా బొగ్గు డిమాండ్ పెరిగింది. భూగర్భ గనుల ద్వారా అవసరమైన మేరకు బొగ్గు ఉత్పత్తి సాధ్యం కాదనీ, సింగరేణిలో ఆధునిక యంత్రాలు ప్రవేశపెట్టి, వివిధ పేర్లతో, వివిధ రకాలుగా కార్మికులను తగ్గించి, ప్రభుత్వాలు ఓపెన్ కాస్ట్ గనుల తవ్వకానికి మొగ్గు చూపాయి. 1991 నుండి రాష్ట్రంలో ప్రారంభమైన నూతన ఆర్థిక విధానాలు, నూతన బొగ్గు విధానాల పేరుతో పాలకవర్గాలు దూకుడుగా అమలు చేస్తున్న సామ్రాజ్యవాద, ప్రపంచీకరణ విధానాలు దీనికి ఊతమిచ్చాయి.

గోదావరి పరీవాహక ప్రాంతంలో 36 ఏళ్ల (1975) క్రితం

నుండి ఓపెన్‌కాస్ట్ బొగ్గు తవ్వకాలు ప్రారంభమైనాయి. ఓపెన్‌కాస్ట్‌ల తవ్వకాలు వేలాది కార్మికులను రోడ్డుమీద పడేస్తుంటే, భూములు కోల్పోయిన అక్కడి ప్రజల బతుకులు ముందు నుయ్యి, వెనక గొయ్యి లా తయారయ్యాయి. ఊళ్లకు ఊళ్లను శ్మశానాలుగా, బొందల గడ్డలుగా మారుస్తున్నారు. ఓపెన్‌కాస్ట్ గనులవల్ల ఎక్కువగా నష్టపోతున్నది ఆదివాసులే. జీవించే హక్కుతో సహా వాళ్ల సంస్కృతీ, సాంప్రదాయాలూ అంతరించిపోతున్నాయి. వలస కూలీలుగా పట్టణ ప్రాంతాలలో దుర్భర జీవితం గడపవలసి వస్తోంది.

ఓపెన్‌కాస్ట్‌లంటే పెద్ద పర్యావరణ విధ్వంసకాలనీ, సుమారుగా వెయ్యి అణుబాంబులు సృష్టించలేని పర్యావరణ విధ్వంసాన్ని ఒక్క ఓపెన్‌కాస్ట్ సృష్టిస్తుందని పర్యావరణ శాస్త్రవేత్తలు ఏనాడో తేల్చారు. దీనివల్ల జీవ, వృక్ష, జంతువులకు నివాసయోగ్యమైన నేల పొరలు తలకిందులవుతున్నాయని నిపుణులు పేర్కొంటున్నారు. సంబంధిత ప్రాంతాల్లోని వాగులు, కుంటలు, భూగర్భ జలాలు అడుగంటి పోతాయి. అడవులు, వన్యజీవులు, పశు పక్ష్యాదులు, అరుదైన వృక్షజాతులు పెద్ద ఎత్తున నశిస్తాయి. భవిష్యత్తులో ఆ ప్రాంతం మానవ నివాస యోగ్యం కాని మరుభూమిగా మారుతుంది.

పూర్తి యాంత్రీకరణ ద్వారా నడిచే ఓపెన్‌కాస్ట్ గనులలో బొగ్గు తవ్వకాలు ఎంత వేగంగా జరుగుతున్నాయో అర్థం చేసుకోవాలంటే, ఉదాహరణ – ఒక సంవత్సరం (2010–11) లోనే సింగరేణి సంస్థ వార్షిక ఉత్పత్తి 53 మిలియన్ టన్నులకు చేరుకుంది. 1956 నాటి ఉత్పత్తి కంటే ఇది చాలా ఎక్కువ. దీన్ని బట్టి ఇక్కడ యాంత్రీకరణ పేరుతో, ఓపెన్‌కాస్ట్‌తో బొగ్గు తవ్వకాలు ఏ స్థాయిలో, ఎంత పెద్ద ఎత్తున జరుగుతున్నాయో అర్థం చేసుకోవచ్చు. 1956కు ముందు జరిగిన పర్యావరణ, గ్రామీణ జీవన విధ్వంసానికి ఎన్నో రెట్లు అధిక విధ్వంసం ఈ ఒక్క సంవత్సరంలోనే, ఓపెన్‌కాస్ట్‌ల వల్ల జరిగిందన్నది సుస్పష్టం. ఇదొక ఉదాహరణ మాత్రమే. ఇందులో కేవలం అధికోత్పత్తే లక్ష్యంగా, బొగ్గు నిల్వలను సాధ్యమైనంత తొందరగా తవ్వేసుకోవాలని సింగరేణి యాజమాన్యం యాంత్రీకరణ వైపు మొగ్గు చూపింది. ఫలితం ఇవ్వాళ్టి భయానక జీవన విధ్వంసం. ఈ పరిస్థితులు ఇలాగే కొనసాగితే – మరో పద్నాలుగేళ్ల లోపల (2025 నాటికి) సింగరేణి ఒక ప్రాణంలేని అస్తిపంజరం అయ్యేలా ఉందని విశ్లేషకుల అంచనా. ఇక్కడి సహజ వనరులను, మానవ వనరులను పాలక వర్గాలు బందిపోటుల్లా దోచుకుంటున్నాయి. మానవ జాతికి నష్టం కలిగిస్తూ, పిడికెడు మంది సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కోసం ప్రజల సంపదనూ, జీవితాలనూ విధ్వంసం చేస్తున్నారు.

ఆదిలాబాద్ తూర్పు ప్రాంతంలో విస్తారమైన బొగ్గు నిక్షేపాలు ఉన్నట్టుగా సింగరేణి సంస్థ నిర్వహిస్తున్న సర్వేలలో తేలుతున్నది. 1996 నాటికే కోడపల్లి, చెన్నూర్, జైపూర్, నెన్నెల మండలాల అటవీ ప్రాంతాలలో బొగ్గు నిక్షేపాలు ఉన్నట్లు సర్వేలలో తేలిపోయింది. శివలింగాపురం, కిష్టంపేట, చెన్నూర్‌ల వద్ద భూగర్భ గనులు పనిచేస్తున్నాయి. 2010లో తిర్యానీ, అసిఫాబాద్, కేరమెరీ, వాంకిడి మండలాల్లో సింగరేణి సంస్థ నిర్వహించిన సర్వేలలో బొగ్గు నిల్వలు ఉన్నట్టుగా బయటపడింది. పంగిడి – మధుర, గొనెన, వావుదం (ముప్వాడ దగ్గర ఉంటుంది)లో ఓపెన్ కాస్టులు తవ్వడానికి రంగం సిద్ధమైంది. ఈ గ్రామాల చుట్టూ ఉన్న ఆదివాసీ ప్రజానీకం ఓపెన్‌కాస్టులను వ్యతిరేకిస్తున్నారు. ఈ ప్రాంతాల ప్రజలకు డొర్లీ–దంతన్‌పల్లిలలో ఆదివాసులు అనుభవిస్తున్న కష్టాలు కండ్లముందర కనిపిస్తున్నాయి. భూములు పోయి, ఇళ్లు సైతం పోగొట్టుకొని, పొట్ట చేతపట్టుకొని వలసపోవడం తప్ప మరో గత్యంతరం కనిపించడం లేదు.

ఓపెన్ కాస్టుల కింద ఇప్పటికే వందలాది గ్రామాలు ధ్వంసమై పోయాయి. ఈ ఆకృత్యాలకు పరాకాష్టగా ఆదిలాబాద్ జిల్లాలోని డొర్లీ ప్రాంతాన్ని పేర్కొనాలి. ఇది ఏర్పడి ఆరు ఏళ్లు దాటినా సమస్యలు పరిష్కారం కాలేదు. ఒ.సి.పి. డొర్లీకి సంబంధించి ఇటీవల విస్తరణలో భాగంగా 200 ఎకరాలు తీసుకున్నారు. ఈ ఓపన్‌కాస్ట్ కింద దంతన్‌పల్లి, డొర్లీ, జెండగూడెం, గుమ్మలొద్ది, ఉప్పల్‌గూడ, పాత దంతన్‌పల్లి, అన్ని గ్రామాలు పోయాయి. పంటలు లేక ఆరేండ్లయ్యింది. మిగులు భూములు పునరావాసం కింద ఇస్తామన్నారు. ఏదీలేదు. దంతన్‌పల్లి ఒ.సి.పి.–2, డొర్లీ–1లో మొత్తం 600 ఎకరాల భూములు పోయాయి. చాలా మందికి నష్టపరిహారాలు అందలేదు. ఇక్కడ బాధితుల కన్నీటి గాథలు ఎన్నో.

ఒక్కో ఓపెన్‌కాస్ట్ గని సుమారు 1200 ఎకరాలలో విస్తరించి ఉంటుంది. 400 నుండి 500 మీటర్ల లోతు తవ్వుతారు. బొగ్గు పొరల పై నున్న మట్టిని తవ్వి మరో చోట గుట్టలుగా పోస్తారు. ఇందుకోసం మరో 2000 ఎకరాల భూమి ప్రత్యక్షంగా అవసరం అవుతుంది. ఈ గనుల చుట్టుపక్కల సుమారు 20 కిలోమీటర్ల పరిధిలో భూగర్భ జలాలు అడుగంటిపోతాయని, ఈ గనుల చుట్టు 10 కిలోమీటర్ల పరిధిలో వ్యవసాయం దెబ్బతింటుందని అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. చెట్లు పెరిగే అనుకూల పరిస్థితి దెబ్బతిని అడవులు అంతరిస్తున్నాయి. పర్యావరణం దెబ్బతింటున్నది. ఓపెన్‌కాస్ట్ గనుల్లో జరిగే పేలుళ్ల కారణంగా చుట్టుపక్కల పది కిలోమీటర్ల పరిధిలోని గ్రామాలల్లో ఉన్న ఇళ్లు బీటలు వారుతున్నాయి. పేలుళ్లు జరిగే సమయాలలో, తమను తాము కాపాడుకొనేందుకు, ఇండ్లనుండి బయటకు రావడం ఈ గ్రామాల లోని ప్రజల దినచర్యలో భాగం చేసుకున్నారంటే అతిశయోక్తి కాదు.

బొగ్గు తీయడం పూర్తయిన తరువాత ఓపెన్ కాస్ట్ గనులను తిరిగి పూడ్చి యథాపూర్వక స్థితికి తీసుకొని రావాల్సిన చట్టపరమైన బాధ్యతను అలవాటుగా సింగరేణి యాజమాన్యం విస్మరిస్తున్నది. కనీసం వాటి చుట్టూ సరైన రక్షణ కూడా ఏర్పాటు చేయడం లేదు. ఇలాంటి గోతుల్లో పడి భారీ సంఖ్యలో పశువులు మరణిస్తున్నాయి. వాటిపై ఆధారపడిన జీవితాలు దుర్భరమవుతున్నాయి.

ఓపెన్ కాస్ట్ గనులలో నిర్వాసితులకు ఉద్యోగాలు కూడా దక్కడం లేదు. జీవనాధారం కోల్పోయిన, కోల్పోతున్న ఆదివాసులు గత్యంతరం లేక ఆత్మహత్యలకు పాల్పడడమో, బిచ్చగాళ్లుగా మారడమో జరుగుతున్నది. పొట్టకూటి కోసం దొంగలుగా కూడా మారిన యువకుల ఉదంతాలు దినపత్రికలలో వస్తూనే ఉన్నాయి.

భారీ విధ్వంసంతో కూడుకొని ఉన్నట్టి ఓపెన్ కాస్ట్ గనుల వల్ల వేలాది ఎకరాల ప్రకృతి సంపద భావితరాలకు మిగలకుండా పోతున్నది. ఆదివాసీ ప్రజల జీవనాన్ని విచ్ఛిన్నం చేసి, కేవలం సామ్రాజ్యవాదుల, బహుళజాతి కంపెనీల, పాలకవర్గాల ప్రయోజనాలను నెరవేర్చే ఇట్లాంటి ప్రజావ్యతిరేక 'అభివృద్ధి' నమూనాను ప్రశ్నించాల్సిన అవసరం ఉంది.

అభయారణ్యాల పేరిట, అడవి జంతువుల రక్షణ పేరిట, పులుల

సంరక్షణ పేరిట (టైగర్ జోన్ పేరిట) కవ్వాల్ అభయారణ్యాల ప్రాంతంలోని ఆదివాసీ గ్రామాలను ఖాళీ చేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, అటవీశాఖ రంగం సిద్ధం చేశాయి. తరతరాల నుండి అడవినే నమ్ముకొని జీవిస్తున్న ఆదివాసీలు, ఆదివాసీ భూములను, అటవీ సంపదను, అటవిపై హక్కులను కోల్పోతున్నారు. అనేకమంది ఆదివాసులు నిర్వాసితులు అవుతున్నారు.

ఆదిలాబాద్ జిల్లాలోని కవ్వాల్ అభయారణ్యాన్ని దేశంలో 41వ టైగర్ జోన్ ప్రాజెక్ట్ ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉంది. 45 కోట్ల రూపాయలతో 49 వేల హెక్టార్ల అడవులను టైగర్ జోన్‌గా అభివృద్ధి చేయడానికి చర్యలు చేపట్టింది. టైగర్ జోన్ కింద జన్నారం, కడెం, పెంబి, బీర్యాయిపేట, ఉట్నూర్, తిర్యానీ అటవీ రేంజ్ పరిధిలోని 43 గ్రామాలు అడవి మధ్యలో ఉన్నాయి. ఒక్కొక్క గ్రామంలో 50 నుండి 100 కుటుంబాలు నివాసముంటున్నాయి. వీరంతా అటవీ భూములు సాగు చేసుకుంటూ, అడవిపై ఆధారపడి జీవిస్తున్నారు. ఈ 43 గ్రామాలను రెండు దశల్లో ఖాళీ చేయించాలని అధికారులు నిర్ణయించారు.

మొదటిదశలో నాలుగు గ్రామాలను – దొంగపల్లి, అల్లీనగర్, మల్యాల, మైసంపేట – అక్కడి నుండి ఎత్తివేసి వారికి పునరావాసం కల్పించాలని ప్రభుత్వం యోచిస్తున్నది. మిగిలిన గ్రామాల వారికి కౌన్సిలింగ్ ద్వారా అడవి నుండి మైదాన ప్రాంతాలకు పంపించడానికి సన్నాహాలు చేస్తున్నది.

ఇప్పటికే ఆదిలాబాద్ జిల్లాలో సాగునీటి ప్రాజెక్టులు, కుంటలు, చెరువులు, ఓపెన్ కాస్ట్ గనులు, ఖనిజాల పేరిట వేల ఎకరాల భూమిని ఆదివాసుల నుండి ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. ప్రభుత్వం ఒకపక్క హక్కులు కల్పిస్తామంటూనే మరోపక్క ఆదివాసుల హక్కులను కాలరాస్తున్నది. ఇప్పటికే అనేక రకాలుగా వేలాది ఎకరాల భూములను స్వాధీనం చేసుకొని ఆదివాసులను నిర్వాసితులు చేసింది.

అభయారణ్యంలోని అటవీ ప్రాంత ఆదివాసులను జంతువుల కోసం అడవి నుండి వెళ్లగొట్టడం, అంటే జంతువుల కంటే ఆదివాసులను హీనంగా చూడడమే అవుతుంది. తమ స్థిరమైన జీవనాధారం కోల్పోతున్న ఆదివాసులు భూమి మీద, అడవి మీద, నీటి మీద హక్కుల కోసం, వాటిని కాపాడడం కోసం పోరాడుతున్నారు. ఇవి ఏవీ పట్టించుకోకుండా రాజ్యం వారిపై హింసను ప్రయోగిస్తున్నది. అణచివేత ప్రతిఘనటకు దారి తీస్తుంది అనేది మార్క్సిస్ట్ సూత్రం. ఈ సూత్రం చరిత్రలో అనేక ఆదివాసుల తిరుగుబాట్లలో నిరూపించబడింది. అందుకే ఇంద్రవెల్లి అమరవీరుల స్ఫూర్తితో పోరాడుతామనీ, టైగర్ ప్రాజెక్ట్‌ను రద్దుచేసే వరకు పోరాడుతామనీ ఆదివాసీ సంస్థలు ప్రకటించాయి. ఉద్యమం కొనసాగుతున్నది.

నేరడిగొండ మండలంలో ఉన్న రిజర్వ్ ఫారెస్ట్‌లో ఉన్న అందమైన అపురూపమైన జలపాతంపై మినీ హైడల్ స్కీమ్‌ని ప్రైవేట్‌రంగం ఆధ్వర్యంలో నిర్మించడానికి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం అనుమతించింది. కడెం నదిపై కుంటాల గ్రామం వద్ద సుమారు 70 అడుగుల ఎత్తు నుండి దూకే జలపాతం, ఈ జలపాతం చుట్టూ దట్టమైన కుంటాల, నాగుమల్లె, రోల్‌మామడ, సిరిచెల్మ రిజర్వ్ ఫారెస్టులు ఉన్నాయి.

కడెం నది గ్రానైట్ పరుపు బండలపై సుమారు నాలుగు కిలోమీటర్లు ప్రవహించి 70 అడుగుల కిందికి దూకి నాగుమల్లె రిజర్వ్ ఫారెస్ట్‌ను చీల్చుకుంటూ ప్రవహిస్తూ చివరికి కడెం రిజర్వాయర్ చేరుతుంది. కుంటాల జలపాతంపై ఆరు మెగావాట్ల జల విద్యుత్ కేంద్రం ఏర్పాటు చేయడానికి సూరపరాజ్ అనే కాంట్రాక్టర్ రాజీ పవర్ కార్పొరేషన్ లిమిటెడ్ పేరు మీద 1999లోనే ప్రభుత్వ అనుమతి కోరుతూ దరఖాస్తు చేసుకున్నాడు. ఆదివాసీ సంఘాలు, స్థానిక ప్రజలు తీవ్రంగా ప్రతిఘటించడంతో ఇంతకాలంగా ఈ ప్రతిపాదనలు ప్రభుత్వం పక్కన పెట్టింది.

ఈ జలపాతాన్ని మింగివేయడానికి 12 సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్న ఈ కంపెనీ ఇచ్చిన ప్రతిపాదనలను సూరపరాజు ప్రభుత్వంలో ఉన్న తన పలుకుబడిని, స్థానిక రాజకీయ నాయకుల అండతో పాటు ఇతరత్రా సాధనాలను ఉపయోగించుకొని ఇవాళ తెరమీదికి తీసుకువచ్చాడు. సుమారు 20 కోట్ల రూపాయల అంచనా వ్యయంతో కుంటాల జలపాతంపై నిర్మించ తలపెట్టిన మినీ జల విద్యుత్ కేంద్రంలో ఈ ప్రైవేట్ కంపెనీ ఉత్పత్తి చేసే ఆరు మెగావాట్ల విద్యుత్తును ఓపెన్ మార్కెట్‌లో విక్రయించుకునే అవకాశం కల్పిస్తే ఈ విద్యుత్తు స్థానిక ప్రజలకు ఏ విధంగానూ అందుబాటులోకి రాదు. ఉద్యోగాలు ముగ్గురు, నలుగురికి మాత్రమే లభిస్తాయి.

ఈ మధ్యకాలంలో కుంటాల జలపాతం ఒక టూరిస్ట్ కేంద్రంగా అభివృద్ధి చెందింది. దీనిపై ఆధారపడి అనేక కుటుంబాలు జీవిస్తున్నాయి. అట్లాగే అడవిపై ఆధారపడి ఆదివాసులు, చేపలు పట్టుకునే బెస్త వాళ్లు జీవనం గడుపుతున్నారు. కుంటాల జలపాతం ఇక్కడ గోండులకు పవిత్ర ప్రదేశం. సంవత్సరానికి రెండుసార్లు వారు ఇక్కడికి వచ్చి గుండంలో స్నానం చేసి తమ దేవుడికి మొక్కులు చెల్లించుకుంటారు. ప్రతి మహాశివరాత్రి సందర్భంగా ఇక్కడ రెండు రోజులు సోమన్న జాతర జరుగుతుంది.

కుంటాల జలపాతంపై పవర్ ప్రాజెక్టు నిర్మించి ఆదివాసుల సంస్కృతినే విచ్ఛిన్నం చేయాలని చూస్తున్నారు. కుంటాల జలపాతం మీదుగా కడెం ప్రాజెక్టుకు నీరు వస్తుంది. పవర్ ప్రాజెక్ట్ కట్టడం వల్ల కడెం ప్రాజెక్ట్ నీరు లేక ఎండిపోయి ఎడారిగా మారే ప్రమాదం ఉంది. దీనివల్ల భవిష్యత్తులో కడెం ఆయకట్టు సాగుభూములు బీడు భూములుగా మారే అవకాశముంది.

కుంటాల జలపాతం పరిరక్షణ కోసం జిల్లా వాసులు కదులుతున్నారు. ముక్తకంఠంతో 'మాకు జలవిద్యుత్ ప్రాజెక్ట్ వద్దు – జలపాతమే ముద్దు' అంటున్నారు. సూరపరాజును, అతనికి తాబేదార్లుగా మారిన స్థానిక రాజకీయ నాయకుల కుట్రలను ఛేదించుకొని, జలపాతాన్ని, పర్యావరణాన్ని, రిజర్వ్ ఫారెస్ట్‌ను రక్షించుకొని తమ జీవనాన్ని సంరక్షించుకోవడానికి సిద్ధమవుతున్నారు.

నందిగ్రామ్, సోంపేటలు మనకు కొత్త పోరాట మార్గాలని చూపాయి. తెలంగాణలోని సకల జనులు ఐక్యమై సామ్రాజ్యవాద 'అభివృద్ధి'కి వ్యతిరేకంగా సంఘటితంగా ఉద్యమించడం ద్వారానే నిజమైన ప్రజా ప్రత్యామ్నాయం నిర్మించగలం.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

# కూడంకుళం ఎవరి కుట్ర?

***కూడంకుళం పోరాటంపై ప్రధాని వ్యాఖ్యల నేపథ్యంలో ఈ దేశంలోకి ఒక చేతితో సామ్రాజ్యవాద పెట్టుబడినీ, మరోచేత్తో స్వచ్ఛంద సంస్థలనూ దిగుమతి చేసినవారు దేశ ప్రధానులేనని అంటున్నారు* పి.వి. రమణ**

*'నన్నడిగితే కుట్రనదగ్గదేదైనా జరిగితే*
*రాజ్యాంగం రాసిన నాడే జరిగుండాలి.*
*పంచవర్ష ప్రణాళికలు ఏసిన్నాడే*
*డెఫినెట్‌గా జరిగిందనడానికి దాఖలాలున్నాయి.'*
***– కాళీపట్నం రామారావు గారి కథ 'కుట్ర' (1972)***

తమిళనాడు కూడంకుళం అణువిద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా ఉద్యమంపై ప్రభుత్వం తీవ్రంగా విరుచుకుపడింది. దీని వెనుక విదేశీ కుట్ర ఉందనీ, ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు భారీగా విదేశీ నిధులందుతున్నాయనీ సాక్షాత్తూ దేశ ప్రధానే ప్రకటించడం దొంగే, దొంగ దొంగ అని అరిచినట్లుగా ఉంది. ఈ దేశంలో విదేశీ శక్తులకు తలుపులు బార్లా తెరిచిన ఘనుడిగా పేరుగాంచిన ఆయన అలా అనడంలోనే పెద్ద కుట్ర ఉంది.

24 ఫిబ్రవరి 2012న 'సైన్స్' పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ 'ఈ స్వచ్ఛంద సంస్థల కారణంగా మన అణుశక్తి కార్యక్రమాలకు విఘాతం కలుగుతుంది. మనదేశ అవసరాలకు కావాల్సిన శక్తిని పెంచుకొనడాన్ని, మనం అభివృద్ధి చెందడాన్ని వీళ్లు హర్షించలేక పోతున్నారు. వీటన్నిటికీ అమెరికా, స్కాండినేవియన్ దేశాల నుండి విరివిగా విరాళాలు అందుతున్నాయి' అని ప్రధాని మన్మోహన్ సింగ్ అన్నారు.

హోంశాఖ మంత్రి చిదంబరం 'సహాయ కార్యక్రమాల కోసం విదేశీ నిధులందుకుంటూ, వాటిని వేరే అవసరాల కోసం, ప్రత్యేకంగా కూడంకుళం అణు వ్యతిరేక ఉద్యమాల కోసం ఖర్చు పెడుతున్నా'రని అంటూ రెండు స్వచ్ఛంద సంస్థలపై దర్యాప్తు చెయ్యాలని సి.బి.ఐ.కి ఆదేశాలిస్తూ, మరో రెండు సంస్థలపై దర్యాప్తు చెయ్యమని తమిళనాడు పోలీసులకు అప్పజెప్పారు. సహాయ మంత్రి వి. నారాయణస్వామి గుడ్ విజన్ (జి.వి.) పీపుల్స్ ఎడ్యుకేషన్ ఫర్ ఏక్షన్ అండ్ లిబరేషన్ (పిఇఎఎల్) టుటికురిన్ మల్టీపర్పస్ సోషల్ సర్వీసెస్ సొసైటీ (టిఎంఎస్ఎస్)లకు చెందిన క్రిష్టియన్ సంస్థలు తమ చర్చిలకు వచ్చిన విదేశీ నిధులను అణుశక్తి వ్యతిరేక నిరసన ఉద్యమాలకు మళ్లిస్తున్నాయని ఆరోపించారు.

ఫిబ్రవరి 27న తమిళనాడు నాగర్‌కోయల్‌లో ఉద్యమకారులకు సహకారం అందిస్తున్నాడనే ఆరోపణపై జర్మనీ దేశస్థుడైన రైనర్ సొంటాగ్ హెర్మన్‌ను అదుపులోకి తీసుకొని, అతని టూరిస్టు వీసాను రద్దుచేసి హడావుడిగా చెన్నై నుండి జర్మనీకి రవాణా చేసేసారు. అతను నాకేమీ తెలియదు అని, కేవలం సానుభూతితో వారి ప్రదర్శనలకు వెళ్లాను అంటున్నాడు. నిజంగా అతను విదేశీ కుట్రదారుడు అయి ఉంటే అతన్ని అరెస్టు చేసి వివరాలు సేకరించి మొత్తం వెనకాల ఎవరెవరున్నారు బయటపెట్టాలి కదా. కాని ప్రభుత్వం అసలు ఉద్దేశం వేరు. ఉధృతంగా సాగుతున్న ఉద్యమాన్ని ప్రజల దృష్టి నుండి మరల్చి, గందరగోళం సృష్టించి ఎలాగైనా అణు ప్రాజెక్టును ప్రారంభించడానికి వేసిన ఎత్తుగడే ఇది అని ఎవరికైనా అర్థం అవుతుంది.

'రష్యన్ అణుశక్తి కార్యక్రమాలను సహించలేని పశ్చిమ దేశాల ప్రోద్బలంతోనే ఈ ఉద్యమాలు నడుస్తున్నాయని మా అనుమానం. ఎందుకంటే జపాన్ ఫుకుషిమా అణు ప్రమాదం జరిగిన ఆరు నెలల తర్వాత కూడంకుళంలో ఉద్యమం ప్రారంభమైంది. ఆరు నెలలు నిద్రపోయిన వాళ్లు అకస్మాత్తుగా లేచి అత్యంత భద్రతా ప్రమాణాలు కలిగి ఉన్న మా అణు రియాక్టర్లకు వ్యతిరేకంగా గొంతు విప్పారు' అని భారత్‌లో రష్యా రాయబారి అలెగ్జాండర్ కడాకిన్ ఆరోపించారు. 'అమెరికాకు చెందిన జి.ఇ. వెస్టింగ్ హౌస్ అణు రియాక్టర్లపై భారతదేశం ఇంతవరకూ నిర్ణయం తీసుకోలేనందునే, అణు సంస్థలు కూడా కూడంకుళంలో అణు ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ఆందోళనలు చేస్తున్నాయి' అని సెంటర్ ఫర్ పాలసీ రీసెర్చ్'లో నేషనల్ సెక్యూరిటీ ప్రొఫెసర్ భారత్ కర్నాడ్ అభిప్రాయపడ్డారు.

మరోవైపు స్కాండినేవియన్ దేశాల నుండి కూడంకుళం ఉద్యమానికి నిధులందుతున్నాయని శ్రీలంక పాలకులు ఆందోళన చెందుతున్నారు. వీటి వెనక తమిళ రాడికల్స్ ఉన్నారని భయపడుతున్నారు. వారి దేశ తీర ప్రాంతంలో అణుశక్తి ప్రాజెక్టులను నిర్మించాలని ప్రణాళికలు వేసుకొన్నారు. ఈ ఉద్యమం విజయవంతమైతే దాని ప్రభావం తమ దేశంపై ఉంటుందని వారి ఆందోళన.

ప్రభుత్వ సంస్థలు విచారిస్తున్న స్వచ్ఛంద సంస్థల్లో కన్యాకుమారిలో ఉన్న రూరల్ అప్‌లిఫ్ట్‌మెంట్ సెంటర్ (ఆర్‌యుసి), గుడ్‌విజ్ జోన్ (జివి)లు, టుటికోరిన్‌లో ఉంటున్న టుటికోరిన్ డియోసెసాన్ అసోసియేషన్ (టిడిఎ) నాగర్‌కోయల్‌లో ఉన్న ట్రినిటీ అమెరికా అండ్ అర్బన్ ఎంపవర్‌మెంట్ ట్రస్ట్ (టిఆర్‌యుఇ)లు ఉన్నాయి. పై వాటిలో ఆర్.యు.సి., టిడిఎ సంస్థల్ని సిబిఐ దర్యాప్తు చేస్తుండగా, జివి. టిఆర్‌యుఇ సంస్థల్ని తమిళనాడు పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. ఇవికాక అనుమానితుల జాబితాలో 'పీపుల్స్ ఎడ్యుకేషన్ ఫర్ ఎక్షన్ అండ్ కమ్యూనిటీ ఎంపవర్‌మెంట్ (పిఇఎసిఇ), టుటికోరిన్ మల్టీపర్పస్ సర్వీసెస్ సొసైటీ (టిఎంఎస్ఎన్)లు కూడా ఉన్నాయి. పిఇఎసిఇ సంస్థకు 2010–11లో రెండు కోట్ల అరవై నాలుగు లక్షల రూపాయల విదేశీ నిధులందాయి. తమిళనాడులో మొత్తం 3218 స్వచ్ఛంద సంస్థలు పని

చేస్తున్నాయి. వీటికి 2009-10లో 1663 కోట్ల రూపాయల విదేశీ నిధులు అందాయి.

'పీపుల్స్ మూవ్‌మెంట్ ఎగెనెస్ట్ న్యూక్లియర్ ఎనర్జీస్ (పిఎంఎఎన్ఇ) ద్వారా ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న ఎస్.పి. ఉదయ్‌కుమార్‌కు యూరోప్ నుంచి మంచి సహకారం లభిస్తోంది. ఆయనకి స్టాక్ హోమ్ నుండి నిర్వహిస్తున్న 'రికన్సిలియేషన్ రిసోర్సెస్ నెట్‌వర్క్ (ఆర్ఆర్ఎన్)' చే నడపబడుతున్న 'ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ డెమోక్రసీ అండ్ ఎలక్టోరల్ అసిస్టాన్స్ (ఐడిఇఎ) సంస్థతో సంబంధాలున్నాయి.' గత సంవత్సరం ఆగస్ట్ నుండి ఈ సంవత్సరం ఫిబ్రవరి వరకు 25,17,991 రూపాయలు వసూలు చేసి దాంట్లో 17,64,239 రూపాయలు ఖర్చు పెట్టాం. వసూలు చేసిన సొమ్మంతా మత్స్యకారుల నుండి, స్త్రీ బీడీ కార్మికుల నుండి విరాళాలుగా సేకరించినవే" అంటూ పిఎంఎఎన్ఈ సంస్థ ఫైనాన్షియల్ కమిటీ సభ్యుడు స్టాన్లీ చెబుతున్నారు. 'ఉద్యమం ప్రారంభం నుండి నేటి వరకూ ఉన్న లెక్కలన్నీ చూపిస్తాను పరిరక్షించుకోండి' అని అంటున్నారు ఉదయ్‌కుమార్.

ఉదయ్‌కుమార్‌కు ఏ సంస్థతో సంబంధాలున్నాయో అదే ఐడియా సంస్థకూ కేంద్ర ప్రభుత్వానికి సంబంధాలున్నాయి. మాజీ కాబినెట్ మంత్రి ఎం.ఎస్. గిల్ ఆ సంస్థకు ప్రధాన సలహాదారు, అలాగే ప్రఖ్యాత రాజ్యాంగ నిపుణుడు సుభాష్‌కాశ్యప్‌కూ ఈ సంస్థతో సంబంధాలున్నాయి.

స్వచ్ఛంద సంస్థల్ని మన దేశంలోకి ఆహ్వానించిందెవరు?

సాక్షాత్తు దేశ ప్రధానమంత్రి మన్మోహన్ స్వచ్ఛంద సంస్థల కుట్ర గురించి మాట్లాడాడు కాబట్టి, అసలు అవి మన దేశంలోకి ఎలా ప్రవేశించాయో, ఎవరు వారికి సహకరించారో తెలుసుకోవాల్సిన అవసరం ఉంది.

అప్పుడే స్వేచ్ఛావాయువులు పీల్చుకుంటున్న పేద దేశాల్లో కమ్యూనిజం ప్రభావం పడకుండా, దాన్ని పూర్తిగా నాశనం చేయాలన్న సంకల్పంతో అమెరికా ఏర్పాటు చేసిన ఫోర్డ్ ఫౌండేషన్ కార్యక్షేత్రం గురించి అమెరికా ఆర్థిక శాస్త్రవేత్త జార్జి రోశెన్ '1950 నుండి 1970 వరకు కమ్యూనిజం ప్రమాదం నుండి తప్పించడానికి అమెరికన్ పాలసీ ప్రకారం ఫోర్డ్ ఫౌండేషన్ భారత, పాకిస్తాన్‌లలో పనిచేసింది. ఈ సమయంలో పశ్చిమ దేశాల పెట్టుబడిదారీ ఆర్థిక శాస్త్రవేత్తలు, పాలసీ నిర్దేశకులు ఈ రెండు దేశాల పాలక వర్గాలతో మంచి సంబంధాలు కొనసాగించారు. ఫోర్డ్ ఫౌండేషన్ దృష్టి అంతా ఆ దేశాల విధానాలను నిర్ణయించడం, దాని నిర్వహణకు అవసరమయ్యే యంత్రాంగాన్ని నిర్మించి, బలోపేతం చెయ్యడం తద్వారా ఆ దేశాల ఆర్థిక వ్యవస్థలను తమ లక్ష్యాలకు అనుగుణంగా ప్రభావితం చేయగలిగాయి' అని తన గ్రంథంలో రాసారు.

1949 వరకు కేవలం అమెరికాకే పరిమితమైన ఫోర్డ్ ఫౌండేషన్ ఆ దేశ అవసరాల దృష్ట్యా తర్వాత అంతర్జాతీయ సంస్థగా మారింది. కమ్యూనిస్టు చైనాకు దగ్గరగా ఉన్న భారత, పాకిస్తాన్‌లు కమ్యూనిజం బారిన పడకుండా చూడాల్సిన అవసరం అమెరికాకు ఉంది. కాని ఆ దేశం నేరుగా ఆ పని చేయడంలో ఇబ్బందులున్నాయి కాబట్టి ఆ పని స్వచ్ఛంద సంస్థ ముసుగులో పనిచేస్తున్న ఫోర్డ్ ఫౌండేషన్‌కు అప్పచెప్పింది.

పాల్ హాఫ్‌మన్ అధ్యక్షతన వచ్చిన ఫోర్డ్ ఫౌండేషన్ టీమ్ సభ్యులకు 1951లో భారత ప్రభుత్వం బ్రహ్మాండమైన స్వాగత సత్కారాలు చేసింది. స్వయంగా ప్రధాని నెహ్రూ, ప్లానింగ్ కమిషన్ సభ్యులు కూడా పాల్గొన్నారు. నెహ్రూ స్వయంగా ఫోర్డ్ టీమ్‌తో ప్లానింగ్ కమిషన్ సమావేశాలను ఏర్పాటు చేశారు.

అమెరికా ప్రభుత్వ వ్యవసాయ శాఖ ఉన్నతాధికారి అయిన డగ్లస్ ఎన్స్మింగర్ ఫోర్డ్ ఫౌండేషన్ నాయకునిగా భారతదేశం వచ్చినప్పుడు ప్లానింగ్ కమిషన్‌కు తాను ఇచ్చిన అనేక సలహాలు కమిషన్ స్వీకరించిందని స్వయంగా చెప్పాడు. అందువల్లనే '1950ల నుండి 1960ల వరకు భారతదేశంలో విదేశీ నిపుణులకు విశేష అధికారాలుండేవి. చాలా విషయాల్లో వారు చెప్పేదే జరిగేది' అని జార్జి రోశెన్ రాశారు.

అమెరికా సహకారంతో మన దేశంలో ఏర్పాటు చేసిన 'కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం' (సిడిపి) అమెరికాకే చెందిన వాస్తు శాస్త్రవేత్త ఆల్బర్ట్ మెయర్ నాయకత్వంలో ఏర్పడింది. అతనికి నెహ్రూతో చాలా దగ్గర స్నేహ సంబంధాలుండేవి. అతను ఉత్తరప్రదేశ్‌లోని ఎటావా జిల్లాలో 64 గ్రామాలలో ఈ ప్రాజెక్టును అమలు పరచడానికి ఒక పైలట్ ప్రాజెక్ట్‌ను తయారు చేశాడు. దాన్ని నెహ్రూ 'దేశంలో వ్యవసాయ రంగంలో సామాజిక సంస్కరణలను డిమాండ్ చేస్తున్న వామపక్ష కమ్యూనిస్టుల నాయకత్వంలో చెలరేగుతున్న రైతాంగ ఉద్యమాలను ఎదుర్కొనేందుకు ఈ మోడల్ అద్భుతంగా పని చేస్తుందని' కొనియాడారు. తర్వాత అమెరికా ఆర్థిక, సాంకేతిక సహకారంతో ఈ కార్యక్రమాన్ని దేశమంతటికీ విస్తరించారు.

అలాంటిదే మరొక సంస్థ అయిన ఆసియా ఫౌండేషన్‌ను అమెరికా గూఢచార సంస్థ సిఐఎ ముసుగు సంస్థగా పనిచేస్తోందని భారత దేశం నుండి నిషేధించింది. ఆనాటి ప్రధాని ఇందిరాగాంధీ. కాని అదే సంస్థ నేడు మన భారతీయ దౌత్యవేత్తలందరినీ విదేశీ విధానాల మీద క్రాస్‌కోర్సుల కోసం అమెరికాకు పంపిస్తోంది.

మన దేశంలో 1980-90లలో అసాధారణ స్థాయిలో విదేశీ నిధులు అందుకొంటున్న స్వచ్ఛంద సంస్థలు పుట్టుకొచ్చాయి. గృహ మంత్రిత్వ శాఖ సమాచారం ప్రకారం ప్రభుత్వ నిబంధనలను అనుసరించి 13,800 సంస్థలు మాత్రమే వాటి జమా ఖర్చులు సమర్పించాయి. 2000 నాటికి విదేశీ నిధుల నియంత్రణ చట్టం కింద 20,000 సంస్థలు నమోదయ్యాయి. ఈ సంస్థలు స్వీకరించిన విదేశీ నిధులు 1998-99లో 3403 కోట్ల రూపాయలు, 1999-2000లో 3925 కోట్ల రూపాయలు, కాగా, 2000-2001లో 4535 కోట్ల రూపాయలకు పెరిగాయి.

విదేశీ నిధులందకపోతే మన దేశంలోని మొత్తం స్వచ్ఛంద సంస్థల రంగం కుప్పకూలిపోతుంది. సామ్రాజ్యవాద శక్తుల నిధులతో నడిచే స్వచ్ఛంద సంస్థలు స్వతహాగా సమాజంలో కొనసాగుతున్న వర్గ వైరుధ్యాలను కప్పిపుచ్చి, సమస్యల్ని వర్గాతీత విషయాలుగా ప్రచారం చేస్తాయి. సమస్యల లోతుల్లోకి, మూలాల్లోకి వెళ్లకుండా ప్రజల్ని పోరాటాల వైపు మళ్లకుండా జాగ్రత్తపడతాయి. ప్రజా ఉద్యమాల రంగంలో క్రియాశీలక, ప్రచార స్వచ్ఛంద సంస్థలు ప్రస్తుత రాజకీయ చట్రాన్ని కాపాడుతాయి. మౌలిక మార్పు కోసం జరిగే ప్రజా పోరాటాలను సంఘర్షణ పథం నుండి సంప్రదింపుల మార్గానికి మళ్లించేందుకు పని చేస్తాయి.

ప్రపంచ బ్యాంక్, ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంక్, ఐక్యరాజ్య సమితిచే నడపబడే సంస్థలు వాడే భాషనే వీరు కూడా వాడతారు. 'ప్రజలకే అధికారం', పౌర సమాజం – 'సామాజిక న్యాయం, మానవ హక్కులు, గుర్తింపు ఉద్యమాలు, ఆమోదయోగ్యమైన అభివృద్ధి, ప్రజలందరి భాగస్వామ్యంతో ప్రజాస్వామ్యం, పర్యావరణ పరిరక్షణ లాంటివన్నీ ఆ కోవకు చెందినవే. ఏ సామ్రాజ్యవాద శక్తులైతే ప్రపంచ పర్యావరణాన్ని ధ్వంసం చేస్తున్నాయో, అవే వివిధ సంస్థల ద్వారా వాటి పరిరక్షణ ఉద్యమాలనే నాటకాలు ఆడుతాయి. 'మరో ప్రపంచం సాధ్యమే'నంటూ ఏర్పడిన వరల్డ్ సోషల్ ఫోరమ్ (డబ్ల్యుఎస్ఎఫ్) దీనికి మంచి ఉదాహరణ. దీనికి సామ్రాజ్యవాద సంస్థల నుండి భారీగా నిధులందుతాయని ప్రపంచానికంతా తెలుసు. విప్లవ వాగాడంబరమే గాని ఆచరణలో ఎక్కడా ప్రజా పోరాటాలు నిర్మించిన చరిత్ర దీనికి లేదు.

ఒఇసిడి రిపోర్ట్ ప్రకారం 1989లో ప్రపంచవ్యాప్తంగా 4000 స్వచ్ఛంద సంస్థలుండగా సంవత్సరానికి 15000 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టాయి. 2000 నాటికి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో దాదాపు 50,000 స్వచ్ఛంద సంస్థలున్నట్లు ఒక అంచనా. ఈ సంస్థల ఒక సంవత్సర బడ్జెట్ 40,000 కోట్ల రూపాయలు.

మొదటి ప్రపంచయుద్ధ కాలం నాటికే కేవలం 344 స్వచ్ఛంద సంస్థలుండేవి. సామ్రాజ్యవాద దేశాలు ఆక్రమించుకున్న వలస దేశాలలో తమ సంస్కృతి, విలువలను ప్రచారం చేయడానికి, అవసరమైన సమాచారం ఆయా దేశాల నుండి సేకరించడానికి, గూఢచారి చర్యల్ని కొనసాగించడానికి ప్రారంభంలో ఇవి ఏర్పడ్డాయి.

రష్యాలో విప్లవం వచ్చాక 1921లో మహా కరువు ఏర్పడినప్పుడు, అమెరికా తన దేశ స్వచ్ఛంద సంస్థల ద్వారా ఐదు లక్షల డాలర్ల విలువ చేసే ఆహారం, దుస్తులు, మందులు పంపించింది. అందులోని 'అమెరికన్ రిలీఫ్ అడ్మినిస్ట్రేషన్' (ఎఆర్ఎ) సంస్థ చురుకైన పాత్ర వహించింది.

ఫోర్డ్ ఫౌండేషన్, రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్, కార్నిగీ ఫౌండేషన్, హెన్రిచ్ బాల్ ఫౌండేషన్ లాంటి సామ్రాజ్యవాద సంస్థలు ప్రతీ సంవత్సరం కోట్ల రూపాయలు తమ ఆదేశాలు పాటించే సంస్థలకు విరాళాలుగా ఇస్తాయి. ఫోర్డ్ ఫౌండేషన్ 1936 నుండి నేటి వరకు 40,000 కోట్ల రూపాయలు వివిధ సంస్థలకు, ప్రాజెక్టులకు విరాళాలుగా ఇచ్చింది.

మూడవ ప్రపంచ దేశాలలో ప్రపంచ బ్యాంక్ సహకారంతో ఏర్పడే ప్రాజెక్టులన్నింటిలోనూ స్వచ్ఛంద సంస్థల పాత్రే అధికంగా ఉంటుంది. 'ప్రపంచ బ్యాంక్ – పౌర సమాజం' అన్న తన రిపోర్ట్‌లో 1999లో ప్రపంచ బ్యాంక్ మద్దతిస్తున్న ప్రాజెక్టుల్లో 70 శాతం స్వచ్ఛంద సంస్థలు, పౌర సమాజం నిమగ్నమై ఉన్నాయని స్వయంగా తనే ప్రకటించింది.

మన్మోహన్ సింగ్ కూడంకుళంలో విదేశీ కుట్ర అంటున్నాడు గానీ, ఆయనకు విదేశీ నిధులన్నా, విదేశీ సంస్థలన్నా వ్యతిరేకత లేదనడానికి ఉదాహరణలు కోకొల్లలు. యుఎస్ ఎయిడ్, పిఎటిఎచ్, జిఎవిఐ, బిల్ అండ్ మెలిండా గేట్స్ లాంటి విదేశీ సంస్థల నుండి ప్రభుత్వానికి వివిధ పథకాలకు భారీగా నిధులందుతున్నాయి. ఫోర్డ్ ఫౌండేషన్ మన దేశంలో పౌర సమాజానికి సంవత్సరానికి 70 కోట్ల రూపాయల విరాళాలు అందిస్తుంది. మన దేశంలో అధిక శాతం అధికారులు, కొంతమంది రాజకీయ నాయకులు ఈ సంస్థల సహకారం తోనే విదేశాలలో ట్రైనింగ్ పొందుతున్నారు. విధానాల రూపకల్పన చేసే అధికారులు, మేధావులు, పరిశోధకులు నిరంతరం విదేశీ సంస్థలతో సంబంధాలు కలిగి ఉంటారు.

12వ పంచవర్ష ప్రణాళికా విధానాలను నిర్ణయించడంలోనూ విదేశీ కన్సల్టెన్సీ సంస్థ ప్రమేయం ఉంది. అలాగే మన మునిసిపాలిటీలను ఎలా సంస్కరించుకోవాలో సలహాలు చెప్పడంలోనూ విదేశీ సంస్థల ప్రమేయం ఉంది. రాష్ట్రాలలో మన ప్రజా ఆహార పంపిణీ వ్యవస్థను, అంగన్‌వాడీ కార్యక్రమాలను ఎలా నిర్వహించాలి అనేది కూడా వాళ్ల ఆదేశాల మేరకే జరుగుతున్నాయి.

'గ్లోబల్ అలయన్స్ ఫర్ వాక్సిన్స్ అండ్ ఇమ్యూనైజేషన్' (జిఎవిఐ) సంస్థ ప్రోద్బలం వల్లనే మన దేశంలో హెమోఫిలిస్ ఇనుఫ్లూయింజా, టైపుబి (ఎచ్ఐ బి) ద్వారా కలుగుతున్న కొన్ని రోగాలను నివారించడానికి ప్రజలందరికీ టీకాలు వేయడానికి నిర్ణయించారు. నిజానికి మన దేశంలో అటువంటి జబ్బులు వచ్చే అవకాశం చాలా తక్కువని (0.007 శాతం మాత్రమే) వాటిని నివారించడానికి టీకాలు వంటి భారీ కార్యక్రమం అవసరం లేదని అనేక మంది ఆరోగ్య శాస్త్రవేత్తలు అంటున్నారు. 'మన దేశంలో ప్రజల ఆరోగ్యానికి సంబంధించిన కార్యక్రమాలకు టీకాలు గానీ మందులు గానీ కొన్ని ప్రత్యేక విదేశీ కంపెనీల నుండి కొనాలనే ఒప్పందాల మీద అమలు జరుగుతాయని, ప్రత్యేకంగా ఎచ్ఐ బి విషయంలో కూడా అదే జరిగిందని' ఢిల్లీకి చెందిన నేషనల్ ఇన్‌స్టిట్యూట్ అండ్ డెవలప్‌మెంట్ స్టడీస్‌లో ప్రిన్సిపల్ సైంటిస్ట్ వై. మాధవి అన్నారు.

ప్రపంచీకరణ విధానాల వల్ల అన్ని దేశాల్లో ఆకలి చావులు, నిరుద్యోగం, రోగాలు, పర్యావరణ విధ్వంసం పెరుగుతాయని సామ్రాజ్య వాదులకు తెలుసు. వాటిపై ప్రజల పోరాటాలు వెల్లువెత్తుతాయని కూడా తెలుసు. వాటిని నిరోధించడానికి స్వచ్ఛంద సంస్థలను రంగంలోకి దింపారు. 1980ల నుంచీ మన దేశంలో ఈ స్వచ్ఛంద సంస్థల ప్రమేయం విపరీతంగా పెరిగిపోయింది. 1980లలోనే లాటిన్ అమెరికన్ దేశాలయిన చిలీ, బ్రెజిల్, బొలీవియా, వెనిజులా, పెరూ లాంటి దేశాలలో ప్రపంచీకరణ దుష్ఫలితాలు కనిపిస్తుండగానే ఆ దేశాల్లో అనేక స్వచ్ఛంద సంస్థలు పెరగడం మనం చూసాం. సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని సవాల్ చేస్తూ ప్రజా ఉద్యమాలు పెరిగినకొద్దీ ఈ స్వచ్ఛంద సంస్థలు పుట్టగొడుగుల్లా విస్తరించాయి.

ఈ సంస్థలు ప్రత్యామ్నాయాలను రూపొందిస్తున్న శక్తులకు అనేక పద్ధతుల్లో ఆటంకాలు కల్పిస్తాయి. మాజీ విప్లవకారులు, సామాజిక కార్యకలాపాల నాయకులు, ట్రేడ్ యూనియన్ నాయకులు, ప్రజాదరణ పొందిన మహిళా సంఘ నాయకులను ఈ స్వచ్ఛంద సంస్థలు తమలో చేర్చుకొంటాయి. భారీ జీతాలు, పేరు ప్రఖ్యాతులు, విదేశీ దాతలచే గుర్తింపు, అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొనడం, అన్ని హంగులతో ఆఫీసులు, సిబ్బందితో పాటు, నిర్బంధం నుండి సాపేక్షిక భద్రతా లాంటి ప్రలోభాల ద్వారా వీరిని లోబర్చుకొంటారు.

ఈ మధ్య భారతీయ స్వచ్ఛంద సంస్థ 'చింతన్'కు అమెరికా 'ఫస్ట్ ఇన్నోవేషన్ అవార్డ్ ఫర్ ఎంపవర్‌మెంట్ ఆఫ్ వుమెన్ అండ్ గర్ల్స్ అండ్ ఆర్గనైజింగ్ వేస్ట్ పిక్కర్స్ అండ్ ఎలిమినేటింగ్ చైల్డ్ లేబర్ ప్రం

రీసైక్లింగ్' ప్రకటించింది. ఈ అవార్డు రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ నిధులతో ఏర్పాటు చేయబడింది. చింతన్ సంస్థ వ్యవస్థాపకురాలు భారతి చతుర్వేది. ఐక్యరాజ్య సమితిచే నిర్వహించబడే అనేక స్వచ్ఛంద సంస్థల్లో భాగస్వామి. అంతే కాకుండా హిందుస్థాన్ టైమ్స్‌లో రెగ్యులర్‌గా ఒక కాలమ్ రాస్తున్నారు.

నిజాయితీపరులైన చాలామంది వ్యక్తులు కొన్ని స్వచ్ఛంద సంస్థల్లో పని చేస్తున్నారు. కొంతమంది వాటితో సంబంధాలు కలిగి ఉన్నారు. సమస్యల్లో ఉన్నవారికి ఎంతో కొంత సహాయం అందచేయాలనే ఆకాంక్షతో వారు ప్రేరేపితులవుతున్నారు. ప్రత్యేక సందర్భాలలో వారు నిజానికి కొన్ని సెక్షన్ల ప్రజలకు ఎంతో కొంత సహాయాన్ని అందిస్తున్నారు. అభ్యుదయవాదులు, సామ్రాజ్యవాద వ్యతిరేకులు, సామాజిక మార్పు కోరేవారు కూడా ఈ సంస్థల విప్లవ వాగాడంబర ఉచ్చులో పడుతున్నారు. అలాంటి వ్యక్తుల నిబద్ధతను, నిజాయితీని గుర్తిస్తూనే వారు పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థల నిజస్వరూపాన్ని, విస్తృత రాజకీయ ప్రాముఖ్యతను ఎత్తి చూపాల్సిన అవసరం ఉంది.

**అణు ప్రమాదాలు అబద్ధం కాదు**

'విదేశీ వ్యాపార సంబంధమైన అంశాలను కూడా మనం దృష్టిలో పెట్టుకోవాలి. విదేశీ కంపెనీల, అమెరికా, ఫ్రాన్స్, రష్యా లాంటి దేశాల సహకారంతోనే మన దేశం మీద విదేశాలు విధించిన ఆర్థిక ఆంక్షల్ని తొలగించుకోగలిగాం. అందువల్ల వ్యాపార బంధాల్ని దృఢపరుచు కోవడానికి, వారి వ్యాపార అవసరాల్ని దృష్టిలో పెట్టుకొని మనం అణుశక్తి ప్రాజెక్టుల ఒప్పందాల్ని చేసుకున్నాం' అని అణుశక్తి సంస్థ మాజీ కార్యదర్శి అనిల్ కాకోవర్ ఒక మరాఠీ దినపత్రిక 'సాకాల్'కు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పడం, మన పాలకులకు ప్రజల ప్రాణాలకన్నా సామ్రాజ్యవాదుల సేవే ముఖ్యమనే విషయాన్ని రుజువు చేస్తుంది.

సామ్రాజ్యవాద దేశాలయిన అమెరికా, జర్మనీ, బెల్జియం లాంటి దేశాల్లో ప్రజా ఉద్యమాల ఒత్తిడి కారణంగా అణుశక్తి కేంద్రాలను నిర్ణీత సమయంలో పాతవాటిని మూసివేయాలనీ, కొత్త వాటిని ప్రారంభించా లనే ఆలోచనను వదిలించుకోవాలనీ నిర్ణయం తీసుకొన్నాయి.

అణు రియాక్టర్ల నిర్మాణంలో ప్రపంచ మార్గదర్శిగా గుర్తింపబడిన 'ఆల్విన్ వెయిన్‌బెర్గ్' 'ఒక అణు ప్రమాదం ఎక్కడ జరిగినా అది ప్రపంచంలో అన్నిచోట్లా జరిగినట్లే' అని చెప్పడాన్ని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి. బ్రిటన్‌లో ఉన్న 19 అణు శక్తి ప్రాజెక్టు స్థలాలలో తీర ప్రాంత వరద తాకిడికి 12 స్థలాలలో ప్రమాదం జరిగే అవకాశా లున్నాయని, ఇంకా ప్రచురింపబడని ప్రభుత్వ విశ్లేషణలో ఉందని గార్డియన్ పత్రిక రాసింది. ప్రధానంగా తుపాన్ వరద తాకిడికి ఆ స్థలాలలో ఉన్న అణు వ్యర్థ పదార్థాలు లీక్ అయ్యే ప్రమాదం ఉందని అక్కడి నిపుణులు అంటున్నారు.

'జపాన్, ఫుకిషిమాలో గత సంవత్సరం జరిగిన అణు ప్రమాద చీకటి రోజుల్లో జపాన్ రాజకీయ నాయకులకు ఎంత నష్టం జరిగిందో, జరిగిన నష్టాన్ని ఎలా సరి చేయాలో తెలియని పరిస్థితి నేటికీ ఉంది. వాళ్లు ఆనాడు ఫుకిషిమాకు 350 కిలోమీటర్ల దూరంలో ఉన్న టోక్యో నగరాన్ని పూర్తిగా ఖాళీ చేయించాలని రహస్య సమాలోచనలు జరిపారు' అని 29 ఫిబ్రవరి 2012 ఇంటర్నేషనల్ హెరాల్డ్ ట్రిబ్యూన్ రాసింది. సాంకేతిక పరిజ్ఞానంలో ప్రపంచవ్యాప్త గుర్తింపు పొందిన జపాన్ దేశ పరిస్థితే అలా ఉంటే, రేపు మన దేశంలో ఏదైనా ప్రమాదం జరిగితే మా బతుకులకు జవాబుదారీ ఎవరు? అని కూడంకుళం ప్రజలు ప్రశ్నిస్తున్నారు.

ప్రజల ప్రశ్నలకు జవాబు చెప్పలేని పిరికితనంతో, వారి ఉద్యమానికి నాయకత్వాన్నందిస్తున్నారన్న నెపంతో స్వచ్ఛంద సంస్థలపై దాడి చేయడం ప్రభుత్వ కుట్రలో భాగమే. నిజంగా మన దేశంలో ఉన్న అన్ని స్వచ్ఛంద సంస్థలన్నింటి మీద విచారణ జరిపి శిక్షించే ధైర్యం మన్మోహన్ సింగ్ ప్రభుత్వానికుందా? ఉండదు. ఎందుకంటే ఈ దేశంలోకి వాటినాహ్వానించింది నెహ్రూ హయాం నుండి మన్మోహన్ సింగ్ వరకూ వాళ్లే కాబట్టి.

ప్రజలు చేస్తున్న పోరాటాలలో అనేక రకాల శక్తులు పనిచేస్తుంటాయి. అవి సమస్యల పట్ల నిజాయితీగా పని చేసినంత కాలం ప్రజలు వారి వెంట ఉంటారు. ఏదైనా ద్రోహం చేసి ప్రభుత్వ అనుకూల నిర్ణయాలు తీసుకొంటే ఆ ప్రజలే వారిని శిక్షిస్తారు. అలాగే విదేశీ నిధులందుకుంటున్న సంస్థల పట్ల మనం ఎప్పుడూ జాగురూకతతో ఉండాలి.

కూడంకుళం ప్రజల ఉద్యమం వెనక విదేశీ హస్తం ఉందన్న ప్రధాని ప్రకటనను దేశవ్యాప్తంగా అనేక మంది మేధావులు ఖండించారు. 'వాస్తవానికి మేమంతా మీ ప్రభుత్వం తరఫున, మీ ప్రభుత్వంలో భాగంగా ఉంటూనే పనిచేస్తున్న ఒక విదేశీ హస్తానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాం. దేశభద్రత, రక్షణకు ప్రాధాన్యమిచ్చే లోతైన, నిష్పాక్షిక విశ్లేషణ లేకుండా, భారతీయ విదేశీ బహుళజాతి వాణిజ్య సంస్థల మద్దతుతో, భారతీయ వ్యవసాయాన్ని, సేద్య పద్ధతులను, ఇంధన రంగాన్ని కార్పొరేటీకరణ చేసేందుకై ఆ విదేశీ హస్తం పనిచేస్తోంది' అంటూ జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్, ఎ. గోపాలకృష్ణన్, వందనాశివ, మేధాపాట్కర్, ఇ.ఎ.ఎస్. శర్మ, ప్రొ. రొమిలాథాపర్, అరుణారాయ్, ప్రశాంత్ భూషణ్, ప్రఫుల్ల బిద్వాయ్ ఇంకా అనేక ప్రముఖులు ఇచ్చిన ప్రకటన మన ప్రభుత్వ ద్వంద్వ ప్రమాణాలను సూటిగా ప్రశ్నిస్తోంది.

'సామాన్య ప్రజలకు సొంతంగా విచక్షణ ఉంటుందనీ, శాస్త్ర సాంకేతిక అంశాలు ముడిపడిన ఒక అభివృద్ధి ప్రాజెక్ట్ పర్యావరణ పర్యవసానాలను, ప్రమాదావకాశాలను గుర్తించి నిలకడగా ప్రతిఘటించ గలరని నమ్మకంలేని పాలకులు ఒక భూతాన్ని కనుగొన్నారు. ఇందిరమ్మ దగ్గర నుంచి నేటి దాకా పదే పదే ప్రయోగిస్తున్న అస్త్రం అది. విదేశీ హస్తం. తాము చెప్పే మాటల కంటే విదేశీ నిధులతో నడిచే స్వచ్ఛంద సంస్థలు చెప్పే మాటలనే నమ్ముతున్నారని ప్రభుత్వాధినేతలే చెబుతున్నారంటే తమ విశ్వసనీయతపై వారికి ఎంత గురి ఉన్నదో అర్థం అవుతుంది' అంటూ ఆంధ్రజ్యోతి ఎడిటోరియల్ పరిస్థితిని చక్కగా వివరించింది.

ప్రజలేమీ అమాయకులు కారు. వారికి దొంగలెవరో, దొరలెవరో బాగా తెలుసు. అభివృద్ధి పేరుతో ప్రజల జీవించే హక్కుపై దాడి చేస్తూ, ఈ దేశాన్ని సామ్రాజ్యవాదులకు తాకట్టు పెడుతున్న పాలకవర్గాలకు ప్రజలు తమ పోరాటాల ద్వారానే జవాబు చెబుతారు.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

# విధ్వంసకర పోలవరం అప్రజాస్వామికం

***పోలవరం ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా పోరాడి ఆదివాసులనూ, పర్యావరణాన్నీ కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రజలందరిపైనా ఉందని అంటున్నారు* కూనూరు శివకుమార్**

ప్రస్తుతం రాష్ట్రంలో భారత రాజ్యాంగ సార్వభౌమత్వ, ప్రజాస్వామ్య పాలనకు వ్యతిరేకంగా బహుళజాతి కంపెనీలకు కొమ్ము కాస్తున్న పాలక, ప్రతిపక్ష రాజకీయ పార్టీలు ప్రజలను ముంచి కోట్ల రూపాయలు అక్రమంగా సంపాదించే ప్రయత్నం ఒకటి దృఢ నిశ్చయంతో కొనసాగిస్తున్నాయి. మహారాష్ట్రలోని పశ్చిమ కనుమలలోని త్రయంబకేశ్వరంలో పుట్టిన గోదావరి 1450 కిలోమీటర్లు ప్రవహించి సముద్రంలో చేరుతుంది. సరిగ్గా సముద్ర మట్టానికి 30 కిలోమీటర్ల దిగువన పోలవరం దగ్గర గోదావరికి అడ్డంగా ఈ ప్రాజెక్టును నిర్మించడం ప్రభుత్వ లక్ష్యం. ఒకరకంగా మన పూర్వీకులు తెల్లవారినుండి ఎన్నో పోరాటాలు, ప్రాణత్యాగాలు చేసి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సంపాదిస్తే, అవే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నేడు పాలకులు తెల్లవారికి మరోసారి తాకట్టు పెడుతున్నారని చెప్పవచ్చు.

ఈ ప్రాజెక్టు వలన ఆంధ్రప్రదేశ్‌లో 276 గ్రామాలు, ఒడిశాలో 16 గ్రామాలు, చత్తీస్‌గఢ్‌లో 14 గ్రామాలు, రెండు లక్షల జనాభా గల ఆదివాసీ, ఆదివాసేతరులు, 1.20 లక్షల ఎకరాల సాగుభూమి ముంపునకు గురి అవుతుందని ప్రభుత్వం చెబుతోంది. కానీ 1953లో 72.5 అడుగుల ఎత్తున వరద నీళ్లు వచ్చి గ్రామాలకు గ్రామాలను ముంచినవి. 1953 తరువాత 58 సంవత్సరాలలో 53 సార్లు వరదలు వచ్చినప్పటికీ 1983, 1986, 1990, 2006లో వచ్చిన వరదలే ఎక్కువ నీటి మట్టంగా రికార్డు అయింది. 1986 ఆగస్ట్ 15న వచ్చిన 75.5 అడుగుల వరదను పరిశీలిస్తే భద్రాచలం, బూర్గంపాడు నియోజక వర్గాలలోని 14 మండలాలకు చెందిన 314 గ్రామాలు ముంపునకు గురై 23 వేల మంది ప్రజలు నిర్వాసితులు అయినారు. ఏడుగురు వ్యక్తులు, 2350 పశువులు వరదలలో కొట్టుకొని పోయాయి. 16,136 ఇండ్లు పూర్తిగా నేలమట్టం అయ్యాయి. 13,850 ఇండ్లు పాక్షికంగా దెబ్బతిన్నాయి. రహదారులు, చెరువులు, చిన్న చిన్న బ్రిడ్జిలు కొట్టుకొని పోయి రైతాంగానికి పంట నష్టం వాటిల్లి కోట్లాది రూపాయల ఆస్తి నష్టం జరిగింది. 1990లో 70.8 అడుగుల వరదలలో 250 గ్రామాలు వరద ముంపునకుగురై 1,12,000 మంది ప్రజలు నిర్వాసితులయ్యారు. 5443 ఇండ్లు పూర్తిగా, 13,808 ఇండ్లు పాక్షికంగా దెబ్బ తిన్నాయి. రిమోట్ సెన్సింగ్ ఏజెన్సీ 2006 ఆగస్ట్ 7న తీసిన ఉపగ్రహ ఛాయాచిత్రం ప్రకారం వరదల కారణంగా ఒక్కరోజే డ్యాం నిర్మాణం జరగకముందే భద్రాచలం, కూనవరం, వరహా రామచంద్రాపురం, వేలేరుపాడు, దుమ్ముగూడెం, చింతూరు, బూర్గంపాడు, పోలవరం, దేవిపట్నం, పురుషోత్తమపట్నం, కటారుపల్లి మండలాలలో 369 గ్రామాలు నీటిలో మునిగిపోయాయి. ఇది కేవలం 28.50 లక్షల క్యూసెక్కుల వరద సంభవిస్తేనే, డ్యాం కట్టకముందే ఈ పరిస్థితి ఉంటే గోదావరి నదికి అడ్డంగా డ్యాం నిర్మిస్తే ఎంత ముప్పు ఉంటుందో అంచనా వేయవచ్చు. ప్రాజెక్టు నిర్మాణం జరిగితే సుమారు 800 గ్రామాలు, నాలుగు లక్షల జనాభా వరకు నిర్వాసితులు అవుతారనేది నిపుణుల అంచనా.

ఈ ప్రాజెక్టు వలన ఆదిమ తెగలు తమ ఉనికి, సంస్కృతి, సాంప్రదాయాలు, సామూహిక జీవనం, అస్తిత్వం, ఆత్మగౌరవం, సమిష్టి జీవనం సర్వనాశనం అవుతాయి. 402 చారిత్రక కట్టడాలు, సుందరమైన పాపికొండలు, చిరుతపులులు, పెద్దపులులు, ఎలుగుబంట్లు, దుప్పులు, నక్కలు, జింకలు, కణుజులు, అడవి దున్నలు, సర్పాలు, అడవి కుక్కలు, తోడేళ్లు, కుందేళ్లు, కొండ చిలువలు, విలువైన జీవరాశులు, జంతుజాలం నశిస్తాయి. విలువైన వనమూలికలు, భద్రాచలం రామాలయం, రిజర్వ్ ఫారెస్ట్ నాశనం అవుతాయి. తూర్పు, పశ్చిమ గోదావరి, ఖమ్మం ఏజెన్సీలలో క్రీపూ. 5000 నాటి చారిత్రక ఆధారాలు, మౌలిక లక్షణాలు, జీవన విధానం ఇక్కడ ఆదివాసులకు ఉన్నదని స్వయాన పురావస్తు శాఖ అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. 1984లో పురావస్తు శాఖ బృందం ఈ ప్రాంతాన్ని సందర్శించినప్పుడు పురాతన కాలంలో తయారు అయిన వివిధ రకాల వస్తువులు తదితర సామగ్రి లభించాయి. ఈ ప్రాంతంలో మానవుని ఉనికి 1.5 లక్షల ఏండ్ల పురాతనమైనదని, ఈ వస్తు సామగ్రి వలన తిరుగులేని విధంగా నిర్ధారణ అయింది. దిగువ సీలేరు వైపున ఉన్న లక్ష్మీపురం గ్రామం వద్ద చెక్కరాతి పనిముట్లు కూడా లభించాయి. ఇవి కూడా పురాతనకాలం నాటివే అని పాత రాతియుగం కాలంలోనివని స్పష్టం చేశారు. పోలవరం దగ్గర సింగన్నపల్లి వద్ద కోయదొరల తొలినాటి అవశేషాలు కూడా కనుగొన్నారు. కొమరవరం దిబ్బ వద్ద 14వ శతాబ్దానికి సంబంధించిన మధ్యయుగాల నాటి అవశేషాలు కనుగొన్నారు. ఇలాంటి చారిత్రక ప్రాధాన్యతగలవెన్నో పోలవరంతో జలసమాధి అయ్యే ప్రమాదం పొంచి ఉంది. కాకినాడ, పాల్వంచ, భద్రాచలం – ఈ మూడు డివిజన్ల నుండి మునిగిపోయే అడవి 1664 క్యూబిక్ మీటర్ల వెదురు, 3,29,068 మెట్రిక్ టన్నుల వంట చెరకు, 57,997 క్యూబిక్ మీటర్ల కలప తీయవచ్చు.

ఈ ప్రాజెక్టు కింద నిర్వాసితులు అయ్యే ఆదిమ తెగలకు ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించినా ప్రయోజనం లేని పరిస్థితి. ఎందుకంటే ఇప్పుడున్న లాభనష్టాలు ఆదివాసీ ప్రాంతాలకు న్యాయం చేయవు. ప్రభుత్వ సంస్థలు చెపుతున్నట్లు ఆదివాసులకు భూమి నుండి వచ్చే ఆదాయం / పంట తక్కువ. అతని ఆహారం, ఉపాధి 50 శాతం అడవి నుండి లభిస్తుంది. తునికాకు, ఇప్పపువ్వు, కరక్కాయ, చింతపండు, వెదురు, వంట చెరుకు, పుట్టతేనె, చిల్లగింజలు, దుంపగడ్డలు వాటితోనే జీవన విధానం ముడిపడి ఉన్నది. మైదాన ప్రాంతంలో పునరావాసం కల్పిస్తే సాంస్కృతిక జీవనం అంతరించిపోవడం ఖాయం. 64 ఏండ్ల భారతంలో నాగరిక ప్రపంచం తెలియని గూడాలు మైదాన ప్రాంతంలో ఎంతవరకు నాణ్యమైన జీవనాన్ని గడుపుతాయి అనేది స్పష్టం కావలసి

ఉన్నది. ప్రభుత్వం ఇచ్చే పరిహారంతో నాగరిక సమాజంతో పోటీ పడగలిగే సామర్థ్యం ఆదివాసులకు అలవడుతుందా? నీటిని సైతం డబ్బుగా చూసే మైదానంలో ఆదివాసుల బతుకులు అగమ్యగోచరంగా మారడం అనేది నిర్వివాదాంశం.

పోలవరం ప్రాజెక్ట్ నిర్వాసితులకు ప్రభుత్వం నష్టపరిహారం ఇచ్చే మాట పక్కకు పెడితే ఎప్పుడో పూర్తి అయిన శ్రీశైలం, నాగార్జునసాగర్, శ్రీరాంసాగర్, తాండవ ప్రాజెక్టు నిర్వాసితులకు ఇప్పటివరకు నష్టపరిహారం అందని దుస్థితి. 1981లో పూర్తి అయిన శ్రీశైలం ప్రాజెక్టు కింద 117 గ్రామాలు, 1,50,000 జనాభా, లక్ష ఎకరాల భూమి నీటిపాలైనా వీరికి ఇప్పటివరకు పరిహారం అందని పరిస్థితి. 1986 ఏప్రిల్ 15న తెలుగుదేశం ప్రభుత్వం జి.ఒ.నెం. 98ని విడుదల చేసి ముంపుకు గురైన ప్రాంత ప్రజలకు ఇంటికి ఒక ఉద్యోగం కల్పిస్తామని ప్రకటించింది. కానీ ఈ జి.ఒ.ను పాలకులు వల్లకాటికి పంపించి కనీసం ఇండ్లు కూడా కట్టించలేదు. కనీస పునరావాసం అందక చాలామంది ఆత్మహత్యలు చేసుకొన్నారు. ఈ నిర్వాసితుల పోరాటం ఇప్పటికీ కొనసాగుతోంది. నాగార్జునసాగర్ కింద నిర్వాసితులు అయిన లంబాడీలకు నష్టపరిహారం అందక తమ బిడ్డలను అమ్ముకొని జీవనం కొనసాగించే దౌర్భాగ్యపు స్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు. తాండవ ప్రాజెక్టు నిర్వాసితులకు ముప్పై ఏండ్లు అయినా దిక్కుమొక్కులేదు. దీనిని బట్టి చూస్తే పోలవరం కింద మునిగే ఆదివాసులకు కూడా పునరావాసం అనేది అందని ద్రాక్షగానే మిగులుతుంది.

వాస్తవంగా 2 ఏప్రిల్ 1980న ఆనాటి మధ్యప్రదేశ్ (ప్రస్తుత చత్తీస్‌గడ్), ఒడిశా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి. అదేమిటంటే 36 లక్షల క్యూసెక్కుల నీటిని నిలువ చేసే విధంగా పోలవరం డ్యాం డిజైన్ చేశారు. ఈ ఒప్పందం జరిగి మూడు దశాబ్దాలు అయింది. తదనంతరం 2006 ఆగస్ట్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 36 లక్షల క్యూసెక్కులను కాస్త 50 లక్షల క్యూసెక్కులుగా డ్యాం నిర్మాణం (స్పిల్‌వే)లో మార్పులు చేసింది. కాని పెరిగే ముంపు ప్రాంతాల నిర్ధారణ గానీ, కోబ్రా అపరేషన్ రూల్స్‌గానీ, 50 లక్షల క్యూసెక్కులకు సరిపడ డిజైన్ గానీ రూపొందించలేదు. దీనిపై కేంద్రం గానీ, రాష్ట్రం గానీ చర్య తీసుకోలేదు.

36 క్యూసెక్కుల నీటి సామర్థ్యం గల ఈ డ్యాం 50 లక్షల క్యూసెక్కుల నీటిని ఆపగలదా? ఇటువంటి పరిస్థితులలో డ్యాం తెగదని గ్యారంటీ ఉందా? అవినీతి అక్రమాలలో అగ్రస్థానాన్ని దక్కించుకున్న మన పాలకులు ఎంత నాణ్యతతో ఈ డ్యాం నిర్మాణం చేయగలరు? పైగా అవినీతి అక్రమాలకు పాల్పడి నిర్మించిన కడెంవాగు (ఆదిలాబాద్), పాలెంవాగు (ఖమ్మం), గుండ్లవాగు (వరంగల్) ప్రాజెక్టులు తెగిపోయిన సందర్భాలు తెలియనివి కావు. గత శతాబ్దంలో ప్రపంచవ్యాప్తంగా రెండు వందల డ్యాంలు కూలిపోయాయి. భారతదేశంలో దాదాపు 20 డ్యాంలు కూలిపోయాయి.

దురదృష్టవశాత్తు డ్యాం తెగితే పరిస్థితి ఏమిటనేది చూస్తే పోలవరం విషయంలో మన రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర జలవనరుల మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలో రూర్కిలో గల జాతీయ నీటి వనరుల సంస్థ ఇంజినీర్లచే అధ్యయనం చేయించింది. ఈ నిపుణులు 1999 జూన్‌లో సమర్పించిన నివేదిక ప్రకారం పోలవరం డ్యాం బద్దలైతే పది గంటల వ్యవధిలో రాజమండ్రి, కొవ్వూరు ప్రాంతాలలో 50 లక్షల క్యూసెక్కుల నీరు ఉంటుంది. వరదమట్టం 20 మీటర్లు ఉండి ప్రాంతాలన్ని జలసమాధి అవుతాయని తెలిపింది. రూర్కి నిపుణులు ఉపయోగించిన కంప్యూటర్ మోడల్ అంచనాలను మరిన్ని ప్రాంతాలకు విస్తరించి అదనపు అంచనాలు వేయడం వలన డ్యాం బద్దలైన పది నుంచి పదకొండు గంటలలోపు వరదలు తణుకు, రావులపాలెం, మండపేటలను ముంచెత్తుతాయని, పద్నాలుగు గంటల లోపు అత్తిలిపేట, ద్రాక్షారామం ప్రాంతాలను ఏడు మీటర్ల స్థాయి వరదలతో ముంచుతుందని మరో రెండు మూడు గంటల తరువాత నర్సాపూర్, అమలాపురం, ముమ్మిడివరం ప్రాంతాలను ముంచెత్తుతుందని నిర్ధారణ అయింది. దాదాపు కొల్లేరు సరస్సు నుంచి కోరంగి మధ్య ప్రాంతాలలో ఉన్న వందలాది పల్లెటూర్లతో పాటు భీమవరం, పాలకొల్లు, రాజోలు, మండపేట, రామచంద్రపురం, రాజమండ్రి అనేక పట్టణాలతో సహా నలభై ఐదు లక్షల మందిని జలసమాధికి గురిచేస్తుంది అని పేర్కొంది. ఇందులో ఐదు పట్టణాలు, ఇరవై ఐదు మండలాలు జలసమాధి అవుతాయి. అదీగాక సింగరేణి కాలరీస్ వారి అధ్యయనం ప్రకారం గోదావరి ఇరుపక్కల లభ్యమయ్యే భాస్కర్ రకానికి చెందిన 250 టన్నుల గ్రాఫైట్ నిక్షేపాలు ఎగువ భాగంలో ఉన్నాయి. ఈ ప్రాజెక్టు వలన మునిగిపోయినప్పుడు ఈ గ్రాఫైట్ మట్టి / తెట్ట వల్ల కొన్ని భౌతిక రసాయన చర్యలు చోటు చేసుకుంటాయి. అప్పుడు నీటిలో పెరిగే జీవరాశి బాగా దెబ్బతింటుంది. రాతిలో పగులు ఉన్న కొన్ని చోట్ల కొండ చరియలు విరిగిపడే ప్రమాదం ఉంది. ఇతర ప్రాంతాల వలెనే నీటి పారుదల సౌకర్యం, నీటికి సంబంధించిన వ్యాధులను పెంచే ప్రమాదం ఉంది. నీరు నిలువ ఉన్నందున అనేక వ్యాధులు ఫైలేరియా (బోదకాలు), డయేరియా (నీళ్ల, జిగట విరేచనాలు), జీర్ణకోశ సంబంధ వ్యాధులు ప్రబలుతాయి. రిజర్వాయర్‌లో పెరిగే చాపలు, ఇతర జలచరాలను తినే పిట్టలు వగైరా అనేక ఉదర సంబంధిత వ్యాధులను వ్యాపింపచేయగల పరాన్న జీవులకు నెలవవుతాయి. నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తయిన తరువాత కృష్ణా డెల్టాలో పెరిగిన మురుగు సమస్య అందరికీ తెలిసినదే. పోలవరం ప్రాజెక్టు వలన ఇప్పటి అంచనాల మేరకు కాలువల నిర్మాణం జరిగితే గోదావరి, కృష్ణ డెల్టాలలో సుమారు మూడు లక్షల ఎకరాలలో తొలకరి పంట ఉండదు. ఎందుకంటే మురుగు సమస్య తీవ్రతరం అవుతుంది. ముఖ్యంగా పశ్చిమ గోదావరి డెల్టా నష్టపోతుంది. బుడమేరు వరద తీవ్రమవుతుంది. విజయవాడ పట్టణానికి ప్రమాదం తప్పదు. పర్యావరణ సమతుల్యం దెబ్బతింటుంది. ప్రపంచ సగటు ఉష్ణోగ్రతలు పెరగడం వల్ల వచ్చే మూడు నాలుగు దశాబ్దాలలో సముద్ర మట్టం మూడు నాలుగు అడుగులు పెరగవచ్చు అని శాస్త్రజ్ఞుల అంచనా. ఇదే జరిగితే డెల్టాలో లోతట్టు భూములు ఉప్పునీటిలో మునిగిపోతాయి. మురుగు కాలువల్లో సముద్రపు నీరు ఎగతన్నడం వలన ప్రవాహం తగ్గుతుంది. డెల్టాలో దుర్భర పరిస్థితులు ఏర్పడే ప్రమాదం ఉంది. అప్పుడు లక్షలాది మంది ప్రజలకు పునరావాసం కల్పించే అవసరం ఏర్పడుతుంది. మూడు లక్షల మందిని ముంచే ఈ ప్రాజెక్టు ఇప్పుడున్న పూడిక ప్రమాద తీవ్రతను బట్టి ఎన్ని ఏండ్లలో నిరూపయోగం కాగలదో అంచనా కట్టలేదు. హిరాకుడ్ ప్రాజెక్టు వయస్సు 111 సంవత్సరాలు అంచనా వేసినారు, కానీ 45 సంవత్సరాలు మాత్రమే నిలబడుతుందని అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. గోదావరి బ్యారెజ్ నుండి పోలవరం వరకు 6 నుండి 8 అడుగుల వరకు ఇసుక మేటలు ఏర్పడినాయి అని ప్రముఖ ఇంజినీర్ శ్రీరామకృష్ణయ్య చెప్పారు. ఇదే విధంగా పోలవరం డ్యాం కూడా ఇరుకైన పాపికొండలు దాటి ఇసుక మేటలు వేస్తే ఈ ఆనకట్ట గతి ఏమిటి?

ఈ ప్రాజెక్టు వలన ఇంతకూ లాభపడేది ఎవరు? ఉన్నత వర్గాలా? అణగారిన వర్గాలా? రాజకీయ నాయకులా? అనేది పరిశీలిస్తే దీని వలన 7.20 లక్షల ఎకరాలకు నీరందుతుంది. 965 మెగావాట్ల విద్యుత్తు

ఉత్పత్తి అవుతుంది. 80 టి.ఎం.సి.ల నీటని కృష్ణా డెల్టాకు తరలిస్తారు. 23 టి.ఎం.సి.ల నీటిని విశాఖనగరానికి తరలిస్తారు. కాని ప్రభుత్వం చెప్పేవి కాకి లెక్కలనే చెప్పవచ్చు. ఎందుకంటే ఇప్పటికే పోలవరం ప్రాజెక్టుతో సాగునీరు అందిస్తామని చెబుతున్న 7.20 లక్షల ఎకరాలకు ఏలేరు, తోడిగడ్డ ఎత్తిపోతల పథకం ద్వారా 5.20 లక్షల ఎకరాలకు సాగునీరు అందుతూనే ఉంది. కేవలం తాడిపూడి పుష్కరు ఆయకట్టు ద్వారానే 3.92 లక్షల ఎకరాలు తడుస్తుండగా, ఈ ప్రాజెక్టు వలన నష్టపోయేది 1.85 లక్షల ఎకరాలు (1.20 లక్షల ఎకరాలు పోలవరం రిజర్వాయర్, 35 వేల ఎకరాలు కాలువ తవ్వకం, పారిశ్రామికీకరణ, పట్టణీకరణ కోసం మరో 30 వేల ఎకరాలు) ఎక్కువ ఆయకట్టు, అధిక లెక్కలు చూపిస్తూ ప్రజల ధనాన్ని దుర్వినియోగం మాత్రం చేస్తున్నారనేది స్పష్టం. 965 మెగావాట్ల విద్యుత్‌ను అందించే ఈ ప్రాజెక్టు కేవలం కృష్ణా డెల్టాకు, సంపన్నులకు మూడో పంట కోసం కాకినాడ నుండి విశాఖపట్నం వరకు విస్తరించి ఉన్న పారిశ్రామిక కారిడార్ కొరకు నిర్మించబడుతుంది. ఇక్కడ ఈ ప్రాజెక్టు కట్టి నీటిని విద్యుత్‌ను తీసుకెళ్లే ప్రభుత్వం విశాఖలో బాక్సైట్ తవ్వి ఆదిమ తెగలను విచ్ఛిన్నం చేయాలని చూస్తోంది.

కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ప్రజలను ముంచి ప్రజలకు ఉపయోగపడని ఈ ప్రాజెక్టు వెనుక ఆంతర్యమేమిటి? ఆదిలాబాద్ నుంచి ఖమ్మం వరకు ఆదివాసులకు చుక్కనీరు లేక, తాగడానికి అల్లాడుతుంటే, భూములు బీడుగా మారుతుంటే ఎక్కడో ఉన్న విశాఖపట్టణానికి నీటిని ఎందుకు తరలిస్తున్నారు? అనేది చూస్తే విశాఖలో ఏర్పాటు చేసే ప్రత్యేక పారిశ్రామిక మండలి కోసం కేటాయించడానికని స్పష్టంగా చెప్పవచ్చు. పోలవరం పూర్తయితే తప్ప ఇక్కడికి నీరందే పరిస్థితి లేదు. స్పెషల్ ఎకనామిక్ జోన్‌తోపాటు ఫార్మా సిటీ, గంగవరం పోర్ట్, మెగా కెమికల్ కాంప్లెక్స్, బ్రాండిక్స్, ఎచ్‌పిసిఎల్ విస్తరణ, ఐటి ప్రాజెక్టులు ఈ విధంగా విశాఖ పారిశ్రామిక విస్తరణ అవుతోంది. వీటన్నింటికీ నీరెక్కడ అంటే పోలవరం నుండే రావాలి. అందుకే ఈ శక్తులన్నీ ప్రభుత్వం మీద ఒత్తిడి తెస్తున్నాయి. అదే విధంగా కాకినాడ సముద్రతీరంపై బహుళజాతి సంస్థల కన్నుపడింది. వివిధ పరిశ్రమల ఏర్పాటుకు, సముద్ర మార్గం గుండా ఎగుమతులకు, దిగుమతులకు ఇక్కడి వాతావరణం అనుకూలంగా ఉండడంతో విదేశీ సంస్థలు పెట్టుబడి పెట్టడానికి ముందుకొస్తున్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలి ఏర్పాటు వెనుక ప్రభుత్వంపై ఈ కంపెనీల ఒత్తిడి ఉంది.

ఒకసారి భారత రాజ్యాంగ నియమావళిని చూస్తే 5వ షెడ్యూల్డ్ 'సి క్లాజ్' (6) ప్రకారం ఒక షెడ్యూల్డ్ గ్రామ హోదాను తొలగించే అధికారం రాష్ట్రపతికి ఉంటుంది. కానీ పోలవరం వలన 276 గ్రామాలు మునుగుతాయని ప్రభుత్వం చెబితే అందులో 274 షెడ్యూల్డ్ హోదా కలిగిన గ్రామాలు మునుగుతాయి. ప్రభుత్వానికి గ్రామాలను ముంచే అధికారం ఎవరిచ్చారు? పంచాయితీరాజ్ 1998 ప్రకారం సెక్షన్ 4(1) ప్రకారం షెడ్యూల్డ్ ప్రాంతాలలో అభివృద్ధి ప్రాజెక్టుల కోసం భూమిని సేకరించ డానికి ముందు గ్రామసభలను సంప్రదించాలి. అనుమతి పొందాలి. ప్రజాభిప్రాయ సేకరణ జరగాలి. అటవి హక్కుల చట్టం 2006 (భారత పార్లమెంట్) ప్రకారం సెక్షన్ (5) (ఎ)(బి)(సి)(డి) క్లాజుల ప్రకారం – ఎ) అటవిపై జీవవైవిధ్యంపై హక్కు; బి) వన్యప్రాణులను కాపాడుకునే హక్కు; సి) క్యాచ్‌మెంట్ ఏరియా నీటి వనరులను కాపాడుకునే హక్కు; డి) సహజ సంపదలను, సాంస్కృతిక ప్రదేశాలను కాపాడుకునే సాముదాయక హక్కు కల్పించింది. 2006 జాతీయ గిరిజన ముసాయిదా చట్టం ప్రకారం యాభై వేల కంటే ఎక్కువ జనాభా నిర్వాసితులు అయితే ప్రాజెక్టు నిర్మాణం చేపట్టకూడదు. 1986, 1994, 1997, 2004 పర్యావరణ పరిరక్షణ చట్టం ప్రకారం గిరిజనులకు, పేదలకు, పర్యావరణానికి హాని కలగకుండా శాస్త్రీయ అధ్యయనం జరగాలి. కాని ఇన్ని చట్టాలను ఉల్లంఘించి రాజ్యాంగ విరుద్ధంగా పాలకులు నేడు ఈ ప్రాజెక్టును కట్టాలని చూస్తున్నారు. వ్యతిరేకించాల్సిన రాజకీయ పార్టీలు టెండర్లు మాకు దక్కలేదంటే మాకు దక్కలేదని కొట్టుకుంటున్నాయి. అసలు మన ప్రభుత్వ పాలన, రాజకీయ పార్టీల విధానాలు ఎటు వయనిస్తున్నాయి. ప్రజాస్వామ్యం వైపా? అప్రజాస్వామ్యం వైపా? అనేది స్పష్టం కావాలి?

ప్రస్తుతం 56 సంవత్సరాలు పూర్తి చేసుకున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పోలవరం లేకున్న ఎడారిగా ఎందుకు మారలేదు అనేది ఆదివాసుల ప్రశ్న? తెలుగుదేశం పార్టీ మాత్రం కచ్చితంగా కట్టవలసిందేనని డిమాండ్ చేస్తోంది. సిపిఐ పార్టీ ఒకపక్క పోలవరం ముంపు ప్రాంతాలలో ఆదివాసుల ఓట్లు దండుకుంటూ రాజకీయ లబ్ధి పొందుతూ ఆ ప్రజల్నే ముంచాలని చూస్తోంది. 2006 పోలవరంలో ఆదివాసీ సంఘాలు నిర్వహించిన బహిరంగ సభలో తెలంగాణ రాష్ట్ర సమితి అధినేత కె.సి.ఆర్. పోలవరాన్ని కచ్చితంగా నిలిపివేయాలని మాట్లాడి టెండర్లలో వాటా దక్కేసరికి డిజైన్ మార్చాలని పాట పాడుతున్నారు. హిందువుల ఆరాధ్య దైవం రామాలయం మునిగిపోతున్నా బి.జె.పి. రాముడి పేరుతో రాజకీయాలు చేసి, కనీసం చీమకుట్టినట్లు అయినా లేదు. సిపిఎం, న్యూ డెమొక్రసీ పార్టీలు తటస్థంగా వ్యవహరిస్తున్నాయి. తెలంగాణ ప్రాంతంలో ప్రజాసంఘాలు తప్ప ప్రధాన రాజకీయ పార్టీలైన టి.కాంగ్రెస్, రాజకీయ జెఎసి కాని మాట్లాడే పరిస్థితి లేదు. బహుళజాతి కంపెనీలకు పాలకులు, రాజకీయ పార్టీలు అమ్ముడుపోయారనేది వాస్తవం.

ఏ ప్రాంతానికి ఉపయోగపడని ఈ ప్రాజెక్టును వ్యతిరేకిస్తున్న తెలంగాణ ప్రాంత ప్రజాసంఘాలను, విద్యార్థి సంఘాలను, సీమాంధ్ర విద్యార్థి జెఎసిలు, లాయర్ల జె.ఎ.సి.లు వ్యతిరేకిస్తున్నాయి. దీనిపై అధ్యయనాలు చేసి నిర్ధారించుకోవాలి. దేశ న్యాయవ్యవస్థను కాపాడాల్సిన లాయర్లు పోలవరాన్ని కట్టాలనడం న్యాయమా? దేశ భవిష్యత్తును కాపాడే విద్యార్థులు ఆదివాసులను సమాధి చేయాలని చూడడం సమంజసమా? అనేది ఆత్మవిమర్శ చేసుకోవాలి. నీటి నుంచి చేపను వేరు చేస్తే ఎంత ప్రమాదమో అడవి నుండి ఆదివాసులను వేరు చేస్తే కూడా అంతే ప్రమాదం అనేది గుర్తించాలి. ఈ ప్రాజెక్టును వ్యతిరేకిస్తూ చేసే పోరాటం న్యాయమైనది. అందుకే ప్రజాస్వామిక వాదులు, కవులు, కళాకారులు, రచయితలు, మేధావులు మద్దతు తెలపాలి. ఇది ప్రాంతీయ విభేదాలతో కూడుకున్నది కాదు. పేద ప్రజలను రక్షించే ఉద్యమం.

ఆదివాసీ సంఘాలు ఏకమై తడుం మోగించాలి. ఏజెన్సీలోని రాజకీయ పార్టీలను నిలదీయాలి. గిరిజనుల ఓట్లతో రిజర్వేషన్‌లతో గెలిచిన ఎం.ఎల్.ఎ. (19), ఎం.పి.(2)లు. 165 జి.ఒ ప్రకారం ఎన్నిక కాబడె గిరిజన సంక్షేమ మంత్రి, గిరిజన సలహా మండలిని నిలదీయాలి. ప్రజాస్వామ్య పాలనకు విలువనివ్వని ప్రభుత్వ పాలన వ్యవస్థను స్తంభింపచేయాలి.. పథకాలను రద్దు చేయాలి. ఈ పోరాట క్రమంలో ప్రజాసంఘాలు సూత్రధారులు మాత్రమే అని, నాయకత్వం నిర్వహించేది, ఉద్యమం చేసేది బాధిత ఆదివాసులే అనేది గుర్తించాలి. మన్యంలో అల్లూరి సీతారామరాజు స్వాతంత్ర్య పోరాటంలో ప్రధాన పాత్రధారులు ఘంటం దొర, మల్లు దొర, రామన్ని పడుల లాంటి వారెందరో ఆదివాసీ నాయకులే. ఆ వారసత్వాన్ని కొనసాగించాల్సిన అవసరం మళ్లీ తలెత్తింది.

*(రచయిత అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి, కాకతీయ విశ్వవిద్యాలయం)* వీ

# అభివృద్ధి పేరిట వంచన

***దేశవ్యాప్తంగానూ, ప్రత్యేకించి ఆదివాసీ ప్రాంతాలలోనూ పాలకుల అభివృద్ధి నమూనాను వ్యతిరేకిస్తూ ప్రజలు పోరాడుతున్నారనీ, వారికి బాసటగా నిలవడమే దేశభక్తుల, ప్రజాస్వామిక వాదులందరి కర్తవ్యమనీ అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

బ్రిటిష్ వలస పాలన అంతమైన తొలిరోజున 1947 ఆగస్ట్ 15న జాతినుద్దేశించి ప్రసంగిస్తూ ప్రధాని నెహ్రూ 'పేదరికాన్ని, అజ్ఞానాన్ని, అనారోగ్యాన్ని, అసమానతల్ని' అంతమొందించాల్సిన గురుతర బాధ్యత మనముందుందన్నారు. 1950 జనవరి 26న డా. బి.ఆర్. అంబేద్కర్ 'పరస్పర వైరుధ్యాలతో, పొసగని అభిప్రాయాలతో కలగలిపిన సంవిధానం లోకి భారత రిపబ్లిక్ ప్రవేశించనుంది. మనకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది కానీ ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదు' అన్న మాటలు అక్షర సత్యాలు గానే మిగిలాయి. రాజ్యాంగాన్ని రూపొందించుకొని అమలులోకి తెచ్చుకొని ఆరు దశాబ్దాలు గడిచిపోయాయి. ఆ గురుతర బాధ్యతలు నెరవేర్చడంలో ఈ దేశ రాజకీయాలు ఎక్కడ మొదలై ఎటువైపుగా పయనిస్తున్నాయో గమనిస్తే గుండె చెరువవక మానదు. ఎటు చూసినా నిరుద్యోగం, పేదరికం, చితికి పోయిన చేతివృత్తులు, జీవనాధారాలను కోల్పోతున్న ప్రజలు, అవిద్య, అనారోగ్యం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, హక్కుల కాలరాత, మతకల్లోలాలు, పోషకాహార లోపం, ఆకలిచావులు, ఆత్మహత్యలు, అభద్రత, అపనమ్మకం, అవమానం, స్త్రీలపై అత్యాచారాలు, దళితులపై దాడులులాంటి సమస్యలు సమాజాన్ని నిత్యం వేధిస్తున్నాయి. ఆరు దశాబ్దాలుగా కొనసాగుతున్న అభివృద్ధి ఇంత దయనీయంగా ఉంటే అభివృద్ధి లెక్కల అంకెలగారడీని ప్రవచిస్తున్న పాలకుల మాటలు మనం నమ్మి శిరసావహించాల్సిందేనా?

ఉదాత్త సమాజ నిర్మాణాన్ని కోరుకునే రాజకీయ సిద్ధాంతకర్తలకు, పాలకవర్గ పార్టీలకు దేశకాల పరిస్థితులపట్ల సరైన అవగాహన, చిత్తశుద్ధి లోపిస్తే జరిగే అనర్థాలకు మూల్యం చెల్లించేది బడుగు బలహీనవర్గాల ప్రజలే. ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రభుత్వ బాధ్యత విస్తృతమైంది, బహుముఖమైంది. ఆహారం, వైద్యం, విద్య, ఇల్లు, ఉపాధి, గౌరవప్రదమైన జీవనం, అభివృద్ధి సోపానాలు అధిరోహించడానికి అవకాశాలు కల్పించడం లాంటివి అన్నీ ప్రభుత్వ బాధ్యతలే. అయితే ప్రభుత్వానికి ప్రజలకన్నా, పారిశ్రామికవేత్తలే ప్రాధాన్యంగా మారిపోవడం వల్ల గ్రామీణ వ్యవసాయ దారుడు మొదలుకొని పట్టణ ప్రాంత విద్యావంతుడి వరకు ప్రతి ఒక్కరు నిరంతర భద్రతారాహిత్యంలో బతుకులీడుస్తున్నారు. సమగ్ర మానవాభివృద్ధి, సామాజిక వికాసం కోసం ప్రభుత్వం ప్రజానుకూల అభివృద్ధి వ్యూహాలను అమలు పరచడం లేదు. ప్రభుత్వం అనుసరిస్తున్న పెట్టుబడిదారీ అనుకూల విధానాల వలన గత మూడు సంవత్సరాలల్లో భారత దేశంలో బిలియనీర్లు 26 నుండి 69కి పెరిగారు. ఈ 69 మంది సంపన్నులు మొత్తంగా జిడిపిలో మూడవ వంతుకు సమానంగా ఆస్తులు కలిగి ఉన్నారు. అందుకే భారతదేశాన్ని పేదలున్న సంపన్నదేశం అంటారు.

గడిచిన ఆరున్నర దశాబ్దాల భారతదేశ చరిత్రలో పాలకులు అనుసరించిన అభివృద్ధి ఆర్థిక రాజకీయాలు గ్రామీణ ఆర్థిక వ్యవస్థలను ఛిన్నాభిన్నం చేసి పట్టణాల్లోని బడా బూర్జువా, విదేశీ బహుళజాతి సంస్థలకు దోచిపెట్టినవేనన్నది సుస్పష్టం. పాలకులు అనుసరించిన హరిత విప్లవం, క్షీర విప్లవం, పారిశ్రామిక విధానం, గ్రామీణ అభివృద్ధి పథకాలు బడా బూర్జువా, భూస్వాముల ప్రయోజనాలకు మాత్రమే ఉద్దేశించి జరిగాయి. ఫలితంగా ప్రజల జీవితాలు ఛిద్రమయ్యాయి. కోట్లాది మందిని నిర్వాసితులను చేశాయి. పర్యావరణాన్ని ధ్వంసం చేశాయి. సంపన్నులు మరింత సంపన్నులుగా, పేదలు మరింత పేదలుగా మారారు. వర్తమాన భారత సామాజిక రాజకీయ ఆర్థిక వ్యవస్థలు సంక్లిష్టమైన సంక్షోభం దిశగా పయనిస్తున్నాయి. భారతదేశ స్థూల జాతీయాభివృద్ధి 8 శాతంపైనే ఉంది. ఆర్థికాభివృద్ధి రేటు పెరుగుతూనే ఉన్నా ఆకలిచావులు, ఆత్మహత్యలు ఎందుకు తగ్గడటం లేదు? అవిద్య, అనారోగ్యం, పేదరికం ఎందుకు అంతం కాలేదు? జాతీయాభివృద్ధి రేటుకు, సగటు మనిషి జీవన ప్రమాణ స్థాయికీ మధ్యన ఇంతటి అంతరం ఉండడం ప్రజాస్వామ్య రాజకీయార్థిక విధానం అవుతుందా ?

భారత రాజ్యాంగ ప్రవేశికలో 'భారత ప్రజలమైన మేము భారత దేశాన్ని సర్వసత్తాక సామ్యవాద లౌకిక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యం'గా నిర్మించుకోవడానికి, 'పౌరులందరికీ సాంఘిక ఆర్థిక రాజకీయ న్యాయాన్ని, ఆలోచన భావప్రకటన విశ్వాసం ధర్మం ఆరాధనలలో స్వాతంత్ర్యాన్ని, అంతస్తుల్లోను అవకాశాల్లోను సమానత్వాన్ని చేకూర్చుటకు' వారందరిలో 'వ్యక్తి గౌరవాన్ని జాతీయ సమైక్యతను సంరక్షిస్తూ సౌభ్రాతృత్వాన్ని' పెంపొందించడానికి నిశ్చయించుకొని 1949 నవంబర్ 26న మన రాజ్యాంగ పరిషత్తులో ఎంపిక చేసుకొని శాసనంగా రూపొందించుకున్న ఈ రాజ్యాంగాన్ని మాకు మేము ఇచ్చుకున్నాం అని ఉంది. కాని ప్రస్తుతం జరుగుతున్నది ఏమిటి? భారత రాజ్యాంగం ప్రకారం పౌరులందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం అందాల్సి ఉంది. కాని ప్రస్తుతం కొన్ని వర్గాల వారే సామాజికంగా ఆర్థికంగా ముందున్నారు. ఎస్.సి., ఎస్.టి.లు అరవై ఏళ్ల గణతంత్ర రాజ్యంలో బడుగులుగానే మిగిలారు. బడుగులు ఆర్థికంగా అభివృద్ధికి ఆమడదూరంలో ఉన్నారు. ఆరు దశాబ్దాల తరువాత పేదరిక విష పరిష్వంగంలో చిక్కి దేశం విలవిల్లాడుతోంది. గత సంవత్సరం కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ దేశంలో 250 జిల్లాలు వెనుకబడియున్నాయని తేల్చింది. మన మేడిపండు స్వరాజ్యం అందాలను అది కళ్లకు కడుతోంది.

ఇప్పటికి ప్రాంతీయ అసమానతలకు తావులేకుండా దేశాన్ని ప్రగతి పథంలో ఏకోన్ముఖ లక్ష్యంతో 12 పంచవర్ష ప్రణాళికలు, వందలాది సామాజిక సంక్షేమ పథకాలు అమలైన తర్వాత కూడా దాదాపు సగం జిల్లాలు దారిద్ర్యంతో మగ్గిపోతున్నాయంటూ పేర్కొనడం అరవై మూడేళ్ల స్వాతంత్ర్యానికి దివిటీ పట్టేదేనా? దేశంలో ఎక్కడి దుర్భిక్ష్యాన్ని అక్కడే పదిల పరుస్తూ 63 ఏళ్లుగా చేస్తోన్న లక్షలాది కోట్ల రూపాయల ఖర్చుకు,

ప్రవేశపెట్టిన పథకాలకు అర్థమేమిటన్నదే ప్రధాన ప్రశ్న. అబద్ధాలకు నిజం ముసుగేసి ప్రజల్ని నమ్మించేందుకు పాలకులందరూ ఘోషించడం ఎవరి ప్రయోజనాల కోసం? ఆకలిగొన్నవానికి ప్రభుత్వాలను, రాజ్యాంగాన్ని పట్టించుకుని అందుకనుగుణంగా మసలుకునే ఓపిక ఎక్కడిది? ఆహార భద్రత, పేదరిక నిర్మూలన, పనికి ఆహారం అంటూ చేతులు దులిపేసు కోవడమేగాని, ప్రజలకు పని కల్పించి జీవనాధారాలను సమకూర్చి స్వేచ్ఛగా జీవించే స్థితిని కల్పించే ప్రణాళికలు, ఆలోచనలు మన పాలకుల్లో కొరవడ్డాయి. ఆ అవగాహనా దారిద్ర్యమే దేశంలో శాంతి భద్రతలు అదుపు తప్పడానికి కారణమవుతోందన్న జ్ఞానం మన పాలకులకు ఎన్నడు కలుగుతుందో!

ప్రాథమిక విద్య, ప్రాథమిక ఆరోగ్యం, శిశు సంక్షేమం వంటి రంగాలలో సాధించిన అభివృద్ధి నామమాత్రమే. ప్రజారోగ్యంపై ప్రభుత్వం చేస్తున్న ఖర్చు జిడిపిలో ఒక శాతం కంటే తక్కువగానే ఉంది. విద్యారంగంలో పూర్తిగా వాణిజ్య ధోరణులు ప్రబలుతున్నాయి. ప్రైవేటీకరణ దిశగా విద్యా, వైద్య రంగాలు పయనిస్తున్నాయి. ప్రభుత్వ వైద్యశాలలు డాక్టర్లు లేక మందులు లేక కునారిల్లుతుంటే ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు వనరుల కొరతతో బలహీనమవుతున్నాయి. ఓ స్వచ్ఛంద సంస్థ అధ్యయనం ప్రకారం 42 శాతం మంది బాలలు పౌష్టికాహార లోపానికి గురవుతున్నారని స్వయంగా ప్రధానే వాపోతూ ఇది జాతికి సిగ్గుచేటన్నారు. కాని ఇలాంటి దుర్భర పరిస్థితికి కారణం ఏ విధానాలు అన్న విషయం జోలికి ఆయిన వెళ్లలేదు. ప్రభుత్వం చెబుతున్న అభివృద్ధి అత్యధిక సంఖ్యలోని పేదల బతుకుల్లో ఎలాంటి గుణాత్మక మార్పుకు దోహదపడలేదు. తాజా అధ్యయనాలు, విశ్లేషణల ప్రకారం దేశంలో ప్రసవ సమస్యలతో ఏటా 55 వేల మంది మహిళలు చనిపోతున్నారు. ప్రతి ఏటా మొదటి పుట్టినరోజు జరుపుకోకుండానే 15 లక్షల మంది, అయిదేళ్లలోపు 16 లక్షల మంది పిల్లలు చనిపోతున్నారు. ప్రపంచంలో మరెక్కడా లేనన్ని శిశు మరణాలు, బాలబాలికల్లో రక్తహీనత, నిరక్షరాస్యులు, నిరుద్యోగులు, పేదలు మన దేశంలోనే ఉన్నారు. మన దేశంలో ఆర్థికాభివృద్ధి, పేదరికం ఊర్ధ్వ ముఖం గానే సాగుతోంది. అందుకు కారణం ఉపాధి కల్పించని వృద్ధి, సంపద పంపిణిలో చోటు చేసుకుంటున్న అసమానతలు.

కేంద్రమంత్రులు, ఉన్నత స్థానాల్లో ఉన్న అధికారుల అవినీతి, అక్రమార్జనలు బయల్పడటంతో యుపిఏ ప్రభుత్వం అసలు స్వరూపం బయటపడింది. కామన్వెల్తు క్రీడల నుండి, 2జి స్పెక్ట్రం కేటాయింపులు, గనుల కేటాయింపుల వరకు సరళీకరణ పేరిట దేశ సంపదను స్వదేశీ, విదేశీ గుత్త సంస్థలు దోచుకునేందుకు అనుమతినిచ్చారు. అధికారం చేతిలో ఉన్న నేతలకు, అధికారులకు లంచాలు మేపగలవారికి దేశ సహజ, ఆర్థిక వనరులను కట్టబెట్టారు. ప్రపంచీకరణతో అవినీతి విడదీయలేని భాగమైంది. ఈ మొత్తం భారమంతా ప్రజలపై పడుతున్నది. మన దేశంలో నుండి అక్రమంగా విదేశీ బ్యాంకులకు తరలివెళ్లిన నల్లడబ్బు ఒక కోటి కోట్లని అంచనా. దానికి తోడు మెగా కుంభకోణాలు. అక్రమ సంపాదన పరులపై సరైన చర్యలు లేవు, శిక్షలు లేవు. వ్యవస్థలు అన్నీ అవినీతి మయమయ్యాయి. ప్రజాస్వామ్యానికి విలువ, రాజ్యాంగానికి గౌరవం లేకుండా పోతోంది. నల్లధనం విషయంలో భారత్ రారాజుగా వెలిగిపోతోంది. స్విస్ బ్యాంక్‌లో దాచుకున్న అక్రమ సొమ్ము మొత్తంలో ప్రపంచ దేశాలన్నింటిది సగం ఉంటే, ఒక భారతదేశ సంపదనే సగం ఉంది. దేశం అభివృద్ధి చెందుతోందని, వెలిగిపోతోందని, అగ్రరాజ్యంగా ఎదుగుతోందని చంకలెగరేసుకుంటున్న పాలకులు సామాజిక రుగ్మతలను గుర్తించడంలో వైఫల్యం చెందారు? ప్రజల సమస్యలు పరిష్కరించడంకంటే బహుళజాతి సంస్థలకు దోచి పెట్టి కమిషన్లతో కాలం వెళ్లబుచ్చుతున్నట్లు స్పష్టమవు తోంది. వీరికి దేశ ప్రజల ప్రయోజనాల పట్లగానీ, వనరుల పరిరక్షణపట్ల గానీ శ్రద్ధలేదు. ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామన్న స్పృహలేదు. ప్రజలకు జవాబుదారీగా ఉండాలన్న రాజనీతి కొరవడింది. 'ఇంటర్నేషనల్ కరప్షన్ పర్సెప్షన్ ఇండెక్స్' (సిపిఐ) ప్రకారం ప్రపంచంలో అత్యంత అవినీతి, లంచగొండితనం ఉన్న దేశాలల్లో భారతదేశం ప్రథమ స్థానంలో ఉంది. ఆర్థిక సంస్కరణల తర్వాత అవినీతి ఇంకా వేగంగా పరుగులు తీసిందని తెలిపింది.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలను తలకెత్తుకున్న దోపిడి పాలకవర్గాలు దేశంలో అనేక ప్రజావ్యతిరేక విధానాలను ముందుకు తెచ్చాయి. గత రెండు దశాబ్దాలుగా సామ్రాజ్యవాద ద్రవ్యపెట్టుబడి ఆదేశాలతో అమలు జరిగిన ఆర్థిక విధానాలు భారత ప్రజలలో అత్యధికులకు ఆహార, ఉపాధి వనరుగానున్న వ్యవసాయరంగాన్ని కునారిల్ల చేశాయి. సామ్రాజ్యవాద కార్పోరేట్ల ప్రయోజనాలను ఈడేర్చేందుకు పాలకులు అత్యుత్సాహంగా అమలు చేసిన రాజకీయార్థిక విధానాలు వ్యవసాయరంగాన్ని సంక్షోభంలోకి నెట్టాయి. సెజ్‌లు, పరిశ్రమలు, మైనింగ్, హైవేల పేరిట ప్రజల భూములను బడా బూర్జువాలకు కట్టబెట్టాయి. ఈ రాజకీయార్థిక విధానాలే ఆకలికి, ఆహారలేమికి మూలకారణం. అభివృద్ధి పేరుతో కొనసాగుతున్న అనర్థాలకు భారత రైతాంగం భారీ మూల్యాన్నే చెల్లించింది. ఆర్థిక సంస్కరణల అనంతరం రైతాంగం పండించిన పంటలకు గిట్టుబాటురాక, అప్పులపాలై, అవమానాలు భరించలేక గడిచిన రెండు దశాబ్దాల కాలంలో రెండున్నర లక్షల మందికి పైగా ఆత్మహత్యలు చేసుకున్నారు. వ్యవసాయరంగానికి 1990లో 14 శాతం నిధులు కేటాయిస్తే 2011లో 3 శాతం మాత్రమే నిధులు కేటాయించారు. 1950లో వ్యవసాయరంగం వాటా జిడిపిలో 54 శాతం ఉండగా 2011లో 14 శాతానికి తగ్గింది. 1950-51లో 41 శాతంగా ఉన్న సాగుభూమి ఇప్పుడు 46 శాతానికి చేరింది. వ్యవసాయేతర కార్యక్రమాలకు వినియోగిస్తున్న భూమి విస్తీర్ణం 94 లక్షల హెక్టార్ల నుంచి 2.6 కోట్ల హెక్టార్లకు పెరిగింది. వ్యవసాయ జీవనాధారంగా జీవిస్తున్న వారు 1950లో 65 శాతం ఉండగా 2011 నాటికి 52 శాతం ఉన్నారు. ఆహార పంట భూములను అగ్రీ బిజినెస్ ముడిసరుకునందించే వాణిజ్య పంటలకు, జీవ ఇంధన పంటలకు వినియోగిస్తుంది. మరోవైపు పారిశ్రామికీకరణ, సెజ్‌లు, విమానాశ్రయాలు, మైనింగ్, రోడ్ల వెడల్పు పేరిట రైతాంగాన్ని భూముల నుండి గెంటివేస్తున్నది. ఆనకట్టలు, మైనింగ్, పవర్ ప్రాజెక్టులకు విచక్షణారహితంగా అటవీ భూములు కేటాయించడం వలన ఆదివాసీల వినాశనానికి దారితీసింది. గత దశాబ్దకాలంలో పరిశ్రమలకు, సెజ్‌లకు, ఆనకట్టలకు 12 లక్షల హెక్టార్ల పంట భూములను రైతుల నుండి బలవంతంగా సేకరించింది. వ్యవసాయ భూములు ఇతర అవసరాలకు మళ్లించడంతో ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గి, ఆహార భద్రత ప్రమాదంలో పడిందని కేంద్ర గ్రామీణాభివృద్ధి మంత్రి నియమించిన కమిటీ తెలిపింది.

నిస్సారమవుతున్న నేలలు, అడుగంటుతున్న భూగర్భజలాలు, సాగునీటి కొరత, పెట్టుబడులభారం, తరుగుతున్న దిగుబడి, పర్యావరణ దుష్ప్రభావాలు, రైతు దరిచేరని పరిశోధనలు, కొరవడిన పరపతి, వ్యవసాయాభివృద్ధికి అరకొర ప్రభుత్వ నిధుల లాంటి సమస్యలతో రైతాంగం దివాళాతీస్తోంది. పెట్టుబడి ఖర్చులు పెరగడంతో చిన్న, సన్నకారు రైతులకు వ్యవసాయం గుదిబండగా మారింది. వ్యవసాయం అప్పులపాలు

చేస్తుండడంతో యువకులు మెరుగైన జీవన ప్రమాణాల కోసం పట్టణాల బాట పడుతున్నారు. ప్రత్యామ్నాయం ఉంటే 42 శాతం రైతులు సాగును వదిలేయడానికి సిద్ధంగా ఉన్నారన్న కఠోర సత్యాన్ని జాతీయ నమూనా సర్వే సంస్థ అధ్యయనం వెల్లడించింది. రైతు సమస్యలపై దాదాపు 18 జాతీయ కమిటీలు అందజేసిన సిఫార్సులు అమలుకు నోచుకోలేదు. వ్యవసాయ భూమి కోల్పోయిన రైతులు పట్టణాలకు వలసపోతున్నారు. వ్యవసాయాన్ని గిట్టుబాటు కానిదానిగా మార్చి, రైతులు స్వచ్ఛందంగా భూములు వదలుకునేట్లుగా చేయడం లేదా బహుళజాతి సంస్థలకు అమ్ముకునేట్లు లేదా లీజుకిచ్చే విధంగా చేయడమే గత రెండు దశాబ్దాలుగా అమలు చేస్తున్న వ్యవసాయ విధానంగా కొనసాగుతోంది.

మానవ జీవన వికాసానికి దోహదపడేదే అసలైన అభివృద్ధి. కాని, ప్రస్తుత ప్రపంచీకరణ, సరళీకృత, ఉదారవాద ఆర్థికపథంలో అభివృద్ధి అంటే మార్కెట్ వ్యవహారమే. ఎగుమతులు, దిగుమతులు, విదేశ మారక ద్రవ్యం, బహుళజాతి సంస్థల భారీ పెట్టుబడులను పాలకులు అభివృద్ధిగా పేర్కొంటుంటారు. ఇదేమి సాధారణ పౌరుడికి పట్టని వ్యవహారాలు. సామాన్యుడు తన చుట్టూ ఉన్న వనరులు తన బాగోగులకు దోహదపడాలని కోరుకుంటాడు. వాటికి అపాయం వాటిల్లితే తమకు బతుకుతెరువు పోతుందని భయపడతాడు. భూములు కోల్పోయిన రైతులకు, ఉపాధి కోల్పోయిన కూలీలకు, జీవనాధారాలు కోల్పోయిన ప్రజలకు ప్రత్యామ్నాయ జీవనాధారం చూపకుండా నిర్వాసితులను చేస్తున్న క్రమంలో వివిధ ప్రాజెక్టులు, గనుల తవ్వకాల విషయంలో ఆందోళనలు వ్యక్తమవుతున్నాయి. మన రాష్ట్రంలోనే కాదు ఒడిశా, చత్తీస్‌గఢ్, జార్ఖండ్, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, పంజాబ్... ఇలా అన్ని చోట్లా విధ్వంసకర 'అభివృద్ధి' ప్రాజెక్టులపై స్థానికుల్లో నిరసనలు, ఆందోళనలు వెల్లువెత్తుతున్నాయి.

సింగూర్, నందిగ్రాం, కళింగనగర్, నారాయణపట్నా, సింగరేణి ఓపెన్‌కాస్ట్, పోలవరం, సోంపేట, కాకరాపల్లి, జైతాపూర్, గ్రేటర్ నోయిడాలాంటి చోట్ల జరిగిన విశాఖ-జిందాల్ వ్యతిరేక పోరాటాలు, సెజ్‌లకు వ్యతిరేకంగా పోరాటాలు, రైతాంగ సమస్యలపై పోరాటాలు, అధిక ధరలకు వ్యతిరేకంగా, అవినీతి వ్యతిరేకంగా పోరాటాలు, దళిత, మహిళ పోరాటాలు, తెలంగాణ ఉద్యమం లాంటివి గమనిస్తే ప్రజల రాజకీయ చైతన్యం పెరుగుతున్నట్లు కనిపిస్తోంది. దేశంలోని, ముఖ్యంగా ఆదివాసీ ప్రాంతాలలోని అమూల్యమైన ఖనిజ సంపదలను, వ్యవసాయ భూములను, అటవీ భూములను బడా బూర్జువా, భూస్వామ్య వర్గాలకు కట్టబెట్టే కుట్రకు వ్యతిరేకంగా ప్రజల పక్షాన నిలిచినందున ఉద్యమకారులను అడ్డు తొలగించుకోవడానికే కేంద్ర ప్రభుత్వం అమెరికా సామ్రాజ్యవాద సహకారంతో గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను కొనసాగిస్తోంది. ఇది ప్రజలపై యుద్ధం తప్ప మరొకటి కాదన్నది స్పష్టం.

సహజ వనరులు వినియోగించుకోకుండా ప్రగతి ఎలా సాధ్యమంటూ పాలకులు ప్రజల్ని మభ్యపెడుతున్నారు. వాస్తవానికి మనదేశంలో జరుగుతున్న గనుల తవ్వకాలు, ఖనిజాల వెలికితీత, ఇతర సహజ వనరుల్లో ఎంత భాగం దేశాభివృద్ధికి, స్థానిక ప్రాంతాల ప్రగతికి వినియోగిస్తున్నారంటే ప్రభుత్వాల వద్ద సరియైన సమాధానం ఉండదు. ఇప్పటివరకూ దేశంలోని అన్ని ప్రాంతాల్లో జరిగిన ఖనిజాల వెలికితీత, గనుల తవ్వకాలన్నీ బడా పారిశ్రామికవేత్తలను, రాజకీయ నాయకులను సుసంపన్నులుగా తీర్చిదిద్దాయేతప్ప ఆయా ప్రాంతాల ప్రగతికి ఏమాత్రం దోహదపడలేదన్నది నిర్వివాదం. ఆదివాసీ ప్రాంతాల్లో నిక్షిప్తమై ఉన్న ఖనిజ సంపదను టాటా, ఎస్సార్, పోస్కో, బిహెచ్‌పి బిల్లిటన్, జిందాల్, రిలయెన్స్, మిత్తల్, వేదాంత, టిస్కో, డీబీర్స్, రియోటింటో తదితర దళారీ పెట్టుబడిదారీ కంపెనీలకు, బహుళజాతి సంస్థలకు దోచిపెట్టేందుకేనని అందరికీ తెలిసిందే. దేశంలోని 80 శాతం మంచి ఇనుము, 70 శాతం బొగ్గు నిల్వలు, 60 శాతం బాక్సైట్, వంద శాతం క్రోమేట్ నిక్షేపాలున్న ఒడిశా, చత్తీస్‌గఢ్, జార్ఖండ్‌లు ఇప్పటికీ ప్రగతి పథంలో చివరి వరసలోనే ఉన్నాయి. ఖనిజాదాయంపై అంతగా ఆధారపడని మహారాష్ట్ర, గుజరాత్, తమిళనాడుల కంటే ఎంతో వెనుకబడి ఉన్నాయి.

దేశంలోని ఇనుప ఖనిజంలో మూడోవంతు, బాక్సైట్‌లో సగం నిక్షేపాలున్న ఒడిశా ఇప్పటికీ అతి పేదరిక రాష్ట్రాల్లో ఒకటిగా ఉంది. ఇక్కడి బాక్సైట్ నిక్షేపాల విలువ దాదాపు రు. 18 లక్షల కోట్లని, గనుల తవ్వకాల కుంభకోణాల విలువ సుమారు మూడు లక్షల కోట్ల రూపాయలని అంచనా. అయినా ఇక్కడి ప్రజల్లో 60 శాతం దారిద్ర్యరేఖకు దిగువ ఉన్నారు. ఏడాదికి ఏడువేల కోట్ల రూపాయల విలువైన ఇనుము, ఇతర ఖనిజాల తవ్వకాలు సాగుతున్న కియోంజార్ జిల్లాలో 60 శాతం ప్రజలు దుర్భర పేదరికంలో మగ్గుతున్నారు. బాక్సైట్ ఉత్పత్తిలో 40 శాతం సమకూర్చుతున్న కోరావుట్ జిల్లా జనాభాలో 78 శాతం నిరుపేదలే. 30 జిల్లాలున్న ఒడిశా మానవాభివృద్ధి సూచీల్లో ఈ రెండూ జిల్లాలు వరసగా 24, 27 స్థానాల్లో ఉన్నాయి. దేశంలోని ఇనుము ఉత్పత్తిలో 20 శాతాన్ని అందిస్తున్న కర్ణాటకలోని బళ్లారిలో కొందరు నాయకులు వేలకోట్ల ఆస్తులు కూడగట్టి ప్రభుత్వాల్నే శాసించే స్థాయికి చేరుకున్నారు.

చత్తీస్‌గడ్‌లో గత దశాబ్దంలో 19 వేల హెక్టార్ల అటవీ భూముల్నీ పారిశ్రామికీకరణకు మళ్లించారు. మరో 13 వేల హెక్టార్లలో ప్రతిపాదనలు పెండింగులో ఉన్నాయి. 97 శాతం భూమి గనుల తవ్వకాలకు ఉద్దేశించిందే. 30 శాతం అడవులే ఉన్న ఏడు జిల్లాల్లో సాగుతున్న గనుల తవ్వకాలు ఎంత విధ్వంసాన్ని సృష్టించి ఉంటాయో అర్థం చేసుకోవచ్చు. ఇక్కడి ఖనిజ నిక్షేపాలపై కన్నేసిన బహుళజాతి సంస్థలకు అటవీ భూభాగాన్ని ధారాదత్తం చేయడానికి రాజ్యం అనుసరిస్తున్న 'హరితవేట'లే ఇందుకు సాక్ష్యాలు. జార్ఖండ్‌లో మైనింగ్ కార్యకలాపాలవల్ల దాదాపు 20 లక్షల మంది గిరిజనులు నిరాశ్రయులయ్యారు. ఒకప్పుడు గని కార్మికుడైన మధుకోడా తరవాత లీజుదారు వేషమెత్తి గనులను సొంతం చేసుకుని ఏకంగా ముఖ్యమంత్రి స్థాయికి ఎదిగారు. ఈ రాష్ట్రంలో రోజుకు 7,500 టన్నుల బొగ్గు అక్రమ తవ్వకం జరుగుతోందని అంచనా. మానవాభివృద్ధి సూచీలో ఈ రాష్ట్రం ఏమంత ప్రగతి సాధించకపోయినా, ముఖ్యమంత్రిగా రెండేళ్లు వ్యవహరించిన మధు కోడా మాత్రం దాదాపు రు. 4,000 కోట్ల అక్రమాస్తులు పోగేసుకున్నారు.

ఇక మన రాష్ట్రంలో ఓబుళాపురం మైనింగ్ కంపెనీ వ్యవహారం, దాని యజమాని గాలి జనార్ధన్‌రెడ్డి కూడబెట్టిన అపార ఆస్తిపాస్తులు సిబిఐ దర్యాప్తులో బయటపడ్డాయి. విశాఖ జిల్లాలోని మొత్తం మన్యంలో జియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా అంచనా ప్రకారం 8 వేల హెక్టార్లలో 700 మిలియన్ మెట్రిక్ టన్నుల బాక్సైట్ నిల్వలు ఉన్నాయి. ఈ నిక్షేపాలను జిందాల్, అన్‌రాక్, ఆల్‌కెమ్ కార్పోరేట్లకు కట్టబెట్టాలని మన రాష్ట్ర ప్రభుత్వం 2005లో ఒప్పందం కుదుర్చుకుంది. దీని ఫలితంగా విశాఖ మన్యంలోని 274 గూడేలలో 45 వేల మంది ఆదివాసీలు నిర్వాసితులవుతున్నారు. ఈ బాక్సైట్ శుద్ధి వలన పర్యావరణానికి ముప్పు ఉందని పర్యావరణ వేత్తలు ఆందోళన వ్యక్తం చేశారు. బాక్సైట్ శుద్ధి వలన సల్ఫర్‌డైఆక్సైడ్, కార్బన్ మోనాక్సైడ్, హైడ్రోజన్ సల్ఫైడ్‌లాంటి విషవాయువులు

వెలుబడుతాయి. ఈ విషవాయువులు అడవిని, నేలను, నీటిని, జీవరాశిని, పంట పొలాలను నాశనం చేస్తాయి. రాజ్యాంగంలోని ఐదవ షెడ్యూలు ఆదివాసీలకు రక్షణ కల్పిస్తోంది. వారి భూములు అన్యాక్రాంతం కాకుండా నిరోధిస్తుంది. కానీ దానిని ఎవరూ పట్టించుకుంటున్నట్లు లేదు. 1997లో పరమోన్నత న్యాయస్థానం సమత వర్సెస్ స్టేట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ కేసులో ఇచ్చిన తీర్పు ప్రకారం షెడ్యూల్ ఏరియాలో ప్రభుత్వాన్ని కూడ గిరిజనేతరునిగానే పరిగణించాలి. అయినా 1959 షెడ్యూల్ ప్రాంత భూబదిలీ చట్టానికి సవరణగా వచ్చిన 1/70 చట్టాన్ని 'అడవి హక్కుల చట్టం 2006' ను కూడా ప్రభుత్వం ఉల్లంఘిస్తోంది.

మన దేశం నేరుగా తన అవసరాలకోసం, పారిశ్రామిక అభివృద్ధి కోసం ఖనిజ నిల్వలను ఉపయోగించుకోవడం లేదు. ఇక్కడి తవ్వకాలన్నీ విదేశాలకు అమ్ముకోవడానికి ఉద్దేశించినవే. లీజు, రాయల్టీ రూపంలో ప్రభుత్వానికి నామమాత్రపు చెల్లింపులతో సరిపెట్టి అత్యధిక లాభాలు ఆయా సంస్థలు మూటగట్టుకుంటున్నాయి. ఇనుప ఖనిజం తవ్వకంపై నాణ్యతను బట్టి టన్నుకు రు. 27 వరకు రాయల్టీ చెల్లిస్తున్నారు. హెక్టారు విస్తీర్ణంలో ఏడాదిపాటు తవ్వకానికి లీజు రూపంలో రు. 350 చెల్లిస్తున్నారు. ఇదికాకుండా యంత్రాలకు, తవ్వకాలకు, సిబ్బందికి, రవాణాకు, లంచాలకు అన్నీ కలిపి టన్నుకు మరో రు. 1500 వరకూ ఖర్చవుతుంది. అదే టన్ను ఇనుప ఖనిజాన్ని విదేశీ మార్కెట్లో రూ။ 4500 నుంచి రు. 6500 వరకు విక్రయిస్తున్నారు. అంటే టన్ను నాసిరకం ఇనుప ఖనిజం తవ్విన గనుల కంపెనీకి రు. 3000 ఆదాయం వస్తుంది. అంటే జాతి సంపద ఏ మేరకు దోపిడి అవుతుందో ఊహించుకోవచ్చు.

ఆధునిక యుద్ధాల్లో ఎక్కువగా వినియోగించే అల్యూమినియం తయారీకి మూల ఖనిజం బాక్సైట్. అల్యూమినియం లేకుండా విమానాలను, యుద్ధ సామాగ్రిని రూపొందించలేవు. అల్యూమినియం కంపెనీ ఆఫ్ అమెరికా బాక్సైట్‌ను దిగుమతి చేసుకుంటున్న 40 దేశాల్లో భారతదేశం కూడా ఉంది. జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా లెక్కల ప్రకారం విశాఖ మన్యంలో ఎనిమిది వేల హెక్టార్లలో వెయ్యి మిలియన్ కోట్ల మెట్రిక్ టన్నుల బాక్సైట్ నిల్వలున్నాయి. మన దేశ అవసరాలకు సరిపడే అల్యూమినియం నాల్కో, బాల్కో, హిండాల్కో కంపెనీలు తయారు చేస్తున్నాయి. కొత్త అవసరం అమెరికాకే ఉంది. ఎందుకంటే ప్రపంచ వ్యాప్తంగా దేశాలను వశపరచుకోవాలి. దిక్కరించిన దేశాలతో యుద్ధాలు చేయాలి. నూతనంగా యుద్ధ విమానాలు తయారు చేయాలంటే అల్యూమినియం కావాలి. ఏ దేశంలో ఏ వనరున్నా దేగలా వాలి తన్నుకుపోవాలి. అది దాని స్వభావం. వీటి వెలికితీతకు అన్‌రాక్, జిందాల్ గ్రూపులు ప్రభుత్వంతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఏడాదికి 7.5 కోట్ల టన్నుల ఖనిజానికి రు. 64.5 కోట్ల రాయల్టీ లభిస్తుంది. దీనిపై అన్‌రాక్ రు. 2350 కోట్లు, జిందాల్ రు. 1260 కోట్లు లాభాలు పొందుతాయని అంచనా. దీనివల్ల కనీసం 50 వేల మంది గిరిజనులు నిరాశ్రయులవుతున్నారు.

అటవీప్రాంతాల్లో గనుల తవ్వకాలకు అనుమతులు ఇవ్వకూడదని, దానివల్ల అడవులు, నీటి వనరులూ, పర్యావరణం సర్వనాశనమై పోతాయనీ, లక్షలాది ఆదివాసీల జీవనోపాధి దెబ్బతింటుందనీ సర్వోన్నత న్యాయస్థానం నిపుణుల కమిటీ విస్పష్టం చేసినప్పటికి ప్రభుత్వాలు గనుల తవ్వకాలకు అనుమతులిస్తునే ఉన్నాయి. ఆరు దశాబ్దాల విధ్వంసకర అభివృద్ధి పథకాల అనంతరం ఎలాంటి ప్రత్యామ్నాయానికి నోచుకోక విచ్ఛిన్నమైన గ్రామీణ సమాజం అక్కడి ప్రజల్ని మరింత దుర్భర దారిద్ర్యం వైపే నెడుతున్నాయి తప్ప సమగ్ర గ్రామీణాభివృద్ధి సాధించలేక పోతున్నాయి. పేదరికాన్ని, అజ్ఞానాన్ని, అనారోగ్యాన్ని రూపుమాపటానికి ఆరు దశాబ్దాల క్రితం ప్రారంభమై నేటికి కొనసాగుతున్న ఈ దేశ రాజకీయార్థిక అభివృద్ధి ప్రక్రియలో పూసలో దారంలా కన్పిస్తున్న మార్పు ఒక్కటే. అది, అభివృద్ధి పేరుతో వ్యవసాయాన్ని, వృత్తుల్ని, గ్రామాలని విధ్వంసం చేయడం మాత్రమే. ఎందుకంటే నెహ్రూకాలంలో శ్రమను మాత్రమే తాకట్టు పెడితే, ఈనాడు శ్రమను, వనరులను మొత్తంగా అశేష ప్రజల జీవనాధారాలను తద్వార వారి జీవితాలను బహిరంగ వేలంలో దేశీయ, విదేశీ గుత్త పెట్టుబడిదారు లకు సగర్వంగా దోచిపెడుతూ దానినే రాజకీయ అభివృద్ధి సిద్ధాంతంగా నమ్మమని మన పాలకులు బుకాయిస్తున్నారు.

సామ్రాజ్యవాదానికి లొంగిఉన్న దేశీయ పెట్టుబడిదారీ సంబంధాలు, దేశీయ పెట్టుబడిదారులలో పెనవేసుకున్న ఫ్యూడలిజం భారత ప్రజలను మరింత దారిద్ర్యంలోకి, బానిసత్వంలోకి నెట్టివేస్తున్నాయి. గ్రామీణ పేదలు భూమిని, ఉపాధినీ కోల్పోతున్నారు. అశేష ప్రజానీకం జీవనాధారాలను కోల్పోయి నిరాశ్రయులు అవుతున్నారు. ప్రజలలో అసంతృప్తి రోజురోజుకు పెరుగుతోంది. ప్రజల అసంతృప్తిని అణచివేసేందుకు పాశవిక నిర్భంధాన్ని కూడా వినియోగిస్తున్నారు. విశాల ప్రాంతాలకు కేంద్రం సాయుధ దళాలను పంపింది. ప్రత్యేక నిర్భంద చట్టాలను చేసింది. మధ్య, తూర్పు భారతదేశంలో గల ఖనిజ సంపదను బహుళజాతి సంస్థలకు దోచిపెట్టేందుకు, అందుకు అంగీకరించని ఆదివాసీలపై యుద్ధానికి ఏకంగా సైన్యాన్నే పంపింది. ఆదివాసీలు పోరాడుతుంది జల్, జంగల్, జమీన్ కోసం. అయితే 'ప్రకృతి వనరులున్న ప్రాంతాల్లో వామపక్ష తీవ్రవాదం బలంగా ఉంటే పెట్టుబడి పెట్టే పరిస్థితి మీద తీవ్ర ప్రభావం పడుతుందని' పార్లమెంటులో ప్రధాని ప్రకటించడం జరిగింది. మావోయిస్టులను అణచివేసేందుకే గ్రీన్‌హంట్ ఆపరేషన్ అని పైకి ప్రకటించినప్పటికి అటవి సంపద, ఖనిజ సంపద బహుళజాతి సంస్థల భోజ్యం కాకూడదని పోరాడుతున్న ఆదివాసీల పైననేనన్నది స్పష్టం.

ఆదివాసీ ప్రాంతంలోని అమూల్యమైన ఖనిజ సంపదను, భూములను సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు, భారత దళారీ నిరంకుశ బూర్జువా భూస్వామ్య వర్గాలకు దోచిపెట్టే కుట్రను ఎదిరిస్తున్నందుకు ఆదివాసీ ఉద్యమాన్ని అణచివేసేందుకు కేంద్ర ప్రభుత్వం గ్రీన్ హంట్ పేరిట సైన్యాన్ని పంపింది. అయితే మనదేశ పౌరులపై మన సైన్యం యుద్ధం చేయడం ఎంతవరకు సమంజసం. ఆదివాసీలు మొదటి నుండి జీవిస్తున్న తమ అడవి అన్యాక్రాంతం కాకూడదని పోరాడుతున్నారు. నిజానికి ఇది సామ్రాజ్యవాద దోపిడికి వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమం. ప్రతి దేశభక్తుడు, ప్రజాస్వామికవాది ఈ పోరాటాలకు సంఘీభావం తెలుపవల్సిన చారిత్రక సందర్భం ఇది. ప్రముఖ స్వీడిష్ రచయిత యాన్ మిర్డాల్ మాట్లాడుతూ భారత ప్రభుత్వం అమెరికా ప్రయోజనాలకొరకు ఆదివాసీలపై గ్రీన్‌హంట్ ఆపరేషన్ చేపట్టిందని, ఇది ఇరాక్, ఆఫ్ఘన్ యుద్ధాలకంటే ప్రమాదకరమైందని హెచ్చరించాడు. ఈ సందర్భంలో బుద్ధిజీవులు సామ్రాజ్యంవాద దోపిడి వైపో లేక పోరాడుతున్న ఆదివాసీలవైపో తేల్చుకోవల్సిన సమయం ఆసన్నమైనదని అన్నారు. మన దేశంలోని ప్రకృతి వనరుల లూటీని, ప్రజల జీవనోపాధిని కొల్లగొట్టే ప్రభుత్వ విధానాల్ని మార్చేందుకు పటిష్టమైన ఉద్యమాల ద్వారా ఒత్తిడిని పెంచాల్సిన అవసరం ప్రజాస్వామికవాదులపైన ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# విద్యారంగానికి బడ్జెట్ సరిపోతుందా?

*రాష్ట్ర బడ్జెట్‌లో విద్యారంగానికి కేటాయింపు ఇతర రాష్ట్రాలతో పోలిస్తే తక్కువనీ, అది కూడా సరైన విధంగా ఖర్చు పెట్టడం లేదనీ, ఇక నాణ్యమైన విద్య ఎలా సాధ్యమనీ అంటున్నారు* **సిలువేరు హరినాథ్**

ఆర్థిక మాంద్యం నుండి బయటపడి, అనేక సవాళ్లను ఎదుర్కొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2012-13 ఆర్థిక సంవత్సరానికి వార్షిక బడ్జెట్‌ను భారీ స్థాయిలో ప్రవేశపెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. అదే సమయంలో ప్రకటిత లక్ష్యాలకూ ఆచరణలో సాధిస్తున్న దానికీ గల వ్యత్యాసాన్ని తలుచుకున్నప్పుడు ప్రతిపాదన సమయంలోని అంకెలలో అలరారే భారీ బడ్జెట్‌కాయాన్ని చూసి మురిసిపోనవసరం లేదన్న చేదు సత్యాన్ని సైతం గుర్తించవలసి ఉంది. ప్రస్తుత బడ్జెట్ ఎనిమిది అంకెల్లో (రు.1,45,854.67) లక్షా నలభై ఐదు వేల కోట్ల రూపాయలు పెద్దగానే కన్పిస్తున్నా ఆచరణలో 6 అంకెలు దాటుతుందా లేదా అనేది వేచి చూడాల్సి ఉంది. రాష్ట్రంలో 2004 నుండి 2010 వరకు ప్రవేశపెట్టిన వార్షిక బడ్జెట్‌లో రు.66,259 కోట్లు కోత విధించారు. 2008-09 సంవత్సరానికి రు.1,00,436 కోట్లు బడ్జెట్ కేటాయించగా రు.80,467 కోట్లు ఖర్చు చేసి రు.19,969 కోట్లు కోత విధించారు. అలాగే 2009-10 సంవత్సరానికి రు.1,03,485 కోట్లు బడ్జెట్ రూపొందించగా 85,107.78 కోట్ల రూపాయలు ఖర్చు చేసి రు.18,378 కోట్లు కోత విధించారు. ప్రాథమిక అంచనాల ప్రకారం 2011-12 ఆర్థిక సంవత్సరానికి కేటాయించిన రు.1,28,542 కోట్లు రాష్ట్ర బడ్జెట్‌లో కనీసం లక్ష కోట్ల రూపాయలు కూడా ఖర్చు కాలేదని ఆర్థిక విశ్లేషకుల అంచనా.

అయితే ఈ భారీ బడ్జెట్‌లో విద్యారంగానికి పెద్దపీట వేశామని ప్రభుత్వం గొప్పలు చెబుతోంది. ఇతర రాష్ట్రాలతో పోలిస్తే మన రాష్ట్ర ప్రభుత్వం విద్యారంగానికి కేటాయిస్తున్న బడ్జెట్ చాలా తక్కువేనని చెప్పవచ్చు. భారతదేశంలో జనాభా ఎక్కువగా ఉన్న రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ 5వ స్థానంలో ఉంది. అక్షరాస్యతలో మాత్రం 67.66 శాతంతో 31వ స్థానంలో ఉంది. అందులో పురుషులు 75.56 శాతం అక్షరాస్యతతో 33వ స్థానంలో ఉండగా, మహిళలు 59.74 శాతంతో 29 స్థానంలో ఉన్నారు. 2001లో మన రాష్ట్రం అక్షరాస్యతలో 21వ స్థానంలో ఉండగా 2011 సంవత్సరానికి 23వ స్థానంలో ఉంది. ఈ గణాంకాలను బట్టి చూస్తే విద్యా అభివృద్ధికి ఎంత భారీ బడ్జెట్ కేటాయించినా తక్కువనే చెప్పవచ్చు. ప్రస్తుత విద్యారంగానికి గత బడ్జెట్ కన్నా రు.2279 కోట్లు అదనంగా మొత్తం 18,438 కోట్లు కేటాయించారు.

అందులో పాఠశాల విద్యాశాఖకు రు.15,510 కోట్లు కాగా, ఉన్నత విద్యకు రు.1,841 కోట్లు, సాంకేతిక విద్యారంగానికి రు.1087 కోట్లు కేటాయించి ప్రభుత్వం తబ్బిబ్బైపోతోంది. ప్రస్తుత బడ్జెట్ లెక్కల ప్రకారం సగటున ప్రతి ఏటా ఒక విద్యార్థిపై సుమారు పదిహేడు వేల రూపాయలు ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది. కాని అధికారిక సర్వేల ప్రకారం సర్కారు బడుల్లో 3వ తరగతి, 5వ తరగతి విద్యార్థులు కనీసం లెక్కలు కూడా చేయలేకపోతున్నారు అంటే సర్కారు విద్య ఎంత నిర్లక్ష్యంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. గ్రామీణ ప్రాంతాలల్లో ఉన్న అనేక పాఠశాలలు దుర్భర స్థితిలో ఉన్నాయి. విద్యార్థులు ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ విద్యనభ్యసిస్తున్నారు. రాష్ట్రంలో దాదాపు 60 శాతానికి పైగా ప్రాథమిక పాఠశాలలు అనేక మౌలిక సమస్యలతో కొట్టుమిట్టాడుతున్నాయి. అనేక జిల్లాల్లో జిల్లా విద్యాశాఖ అధికారులు లేరు. దానికి తోడు మండల విద్యాశాఖ అధికారుల పర్యవేక్షణ సరిగా లేదు. ఉపాధ్యాయుల పనితీరు సమర్థవంతంగా లేకపోవడంతో పాటు రాష్ట్రంలో రోజురోజుకూ విద్యా ప్రమాణాలు దిగజారుతున్నా పట్టించుకునే నాథుడే కరువయ్యారు. ప్రభుత్వ జూనియర్, డిగ్రీ కళాశాలల్లో ఉపాధ్యాయుల కొరత తీవ్రంగాఉన్నా రెగ్యులర్ పోస్టులు మంజూరు కాలేదు. కాంట్రాక్టు పద్ధతిన అధ్యాపకులను విధుల్లోకి తీసుకున్నా వారి సమస్యలతోనే అధ్యాపకులు సతమౌతున్నారు. దాని వలన విద్యార్థుల భవిష్యత్తు ప్రశ్నార్థకంగా మారినా ప్రభుత్వం ఉదాసీనతతో వ్యవహరిస్తున్నది. రాష్ట్రంలో 30 శాతం పైగా ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో రెగ్యులర్ ప్రిన్సిపాల్స్ లేరు. పైగా ఎక్కడో 40-50 కిలోమీటర్ల దూరంలో ఉన్న ప్రిన్సిపాళ్లను ఇన్‌చార్జిలుగా నియమించారు. కొత్తగా ఏర్పాటు చేసిన డిగ్రీ కళాశాలలకు సొంత భవనాలు లేక అద్దె కొంపల్లో నడిపిస్తున్నారు. ఆధునిక సౌకర్యాలు లేకపోవడంతో 2011-12 విద్యా సంవత్సరానికి మైదాన ప్రాంతంలో ఉన్న కళాశాలల్లో కేవలం 30-40 మంది విద్యార్థులే అడ్మిషన్లు పొందారంటే ప్రభుత్వం తీరు ఎలా ఉందో అర్థం పడుతుంది.

ఇక రాష్ట్రంలో ఉన్న విశ్వవిద్యాలయాలు నిధులలేమితో కొట్టుమిట్టాడుతున్నాయి. అధ్యాపకులు లేక డిపార్టుమెంటులు వెలవెల పోతున్నాయి. రాష్ట్రంలో దాదాపు 1200 పైగా అధ్యాపకుల పోస్టులు ఖాళీగా ఉన్నా భర్తీ కాలేదు. కొత్తగా ఏర్పాటు చేసిన విశ్వవిద్యాలయాలు ఇప్పటికింకా కొత్త భవనాలకు నోచుకోలేదు. విశ్వవిద్యాలయాల ప్రమాణాలు అంతంత మాత్రమే ఉండడంతో విద్యార్థులు పరిశోధన రంగంలో వెనకబడడానికి ప్రభుత్వమే కారణమని చెప్పవచ్చు. విద్యా రంగానికి ప్రతి ఏడాది భారీ బడ్జెట్ కేటాయించామని గొప్పలు చెప్పుకుంటున్న ప్రభుత్వం అందులో ఎంత మేరకు ఖర్చు చేస్తుందో ఎవరికీ తెలియడం లేదు. ఫలితంగా విద్యా ప్రమాణాలు మెరుగుపడడం లేదు. దీంతో ప్రభుత్వ విద్యాసంస్థలపై విశ్వాసం సన్నగిల్లుతోంది. ప్రతి ఏటా దాదాపు 46.21 శాతం మంది విద్యార్థులు 1-10వ తరగతి వరకు విద్యకు దూరమౌతున్నారని ఆర్థిక సర్వే తన నివేదికలో పేర్కొని ఆందోళన చెందుతోంది.

రాష్ట్రంలో నాణ్యమైన విద్యను అందుబాటులోకి తేవడానికి ఈ బడ్జెట్ సరిపోతుందా, లేదా అనేది అనుమానమే. రాష్ట్రంలో నిరక్షరాస్యత ఇంకా పెరిగిపోతూనే ఉంది. నిరక్షరాస్యులని అక్షరాస్యులుగా మార్చాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ప్రవేశపెట్టిన సాక్షర భారత్ ఆదిలోనే రాజకీయ కొలిమిలో కొట్టుమిట్టాడుతోంది. విద్యారంగ అభివృద్ధికి కేటాయించిన బడ్జెట్‌కు రాజకీయ దుర్వాసన తాకరాదు. రాజకీయ నాయకుల ప్రమేయంతోనే బడ్జెట్ కేటాయింపు రూపురేఖలు మారిపోతున్నాయి. వారి కనుసన్నల్లో అభివృద్ధి కార్యక్రమాలు జరుగుతున్నాయి. అలా కాకుండా ప్రభుత్వ అధికారులే స్వయంగా ఆ బడ్జెట్‌ను కాపాడి ఈ విద్యారంగ అభివృద్ధికి తోడ్పడితే ప్రస్తుత విద్యారంగం బడ్జెట్ సఫలీకృతమై సమస్యలలేమి నుండి ఉపశమనం పొందే అవకాశం ఉంది.

*(రచయిత డాక్టొరల్ ఫెలో, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

# యాన్ మిర్డాల్‌తో ఇష్టాగోష్ఠి

*యాన్ (ఇంగ్లిష్ లో జెఎఎన్ అని రాస్తారు గాని స్వీడిష్‌లో యాన్ అని ఉచ్చరిస్తారు) మిర్డాల్ భారత ప్రజలకు చిరకాల మిత్రుడు. స్వీడన్‌లోని స్టాక్‌హోంలో 1927లో పుట్టిన యాన్ మిర్డాల్ యువకుడిగా నాజీ వ్యతిరేక యువజన సంఘాల సభ్యుడిగా, మార్క్సిస్టుగా మారి అరవై సంవత్సరాలకు పైగా రచయితగా, పత్రికారచయితగా ఉన్నారు. భారతదేశం, చైనా, అఫ్ఘనిస్తాన్, ఇరాన్, క్యూబా, అమెరికా వంటి అనేక దేశాలు పర్యటించారు, చాల పుస్తకాలు రాశారు. చైనా గ్రామాన్ని అధ్యయనం చేసి 1962లో **రిపోర్ట్ ఫ్రమ్ ఎ చైనీస్ విలేజ్**, 1982లో ఆ గ్రామానికే వెళ్లి **రిటర్న్ టు ఎ చైనీస్ విలేజ్** రాశారు. **కన్ఫెషన్స్ ఆఫ్ ఎ డిస్ లాయల్ యూరపియన్** అనే నవల రాశారు. భారతదేశంలో ఢిల్లీలో 1950లలో కొన్ని సంవత్సరాలు నివసించారు. 1980లలో నక్సలైట్ ఉద్యమాన్ని పరిశీలిస్తూ దేశవ్యాప్తంగా పర్యటించారు. గోదావరిలోయ అడవులలో సాయుధదళాలతో పాటు తిరిగారు. ఆ అనుభవాలన్నిటినీ 1984లో వెలువడిన **ఇండియా వెయిట్స్** పుస్తకంలో రాశారు. మళ్లీ మావోయిస్టు ఉద్యమాన్ని పరిశీలించడానికి 2010లో దండకారణ్యంలో రెండువారాలకు పైగా ఉన్నారు. ఆ నేపథ్యంలో రాసిన **రెడ్‌స్టార్ ఓవర్ ఇండియా** పుస్తక ఆవిష్కరణ కోసం 2012 ఫిబ్రవరి మొదటివారంలో హైదరాబాద్ వచ్చారు. హైదరాబాద్ వచ్చిన ప్రముఖులతో వీక్షణం కార్యాలయంలో ఏర్పాటు చేసే ఇష్టాగోష్ఠుల పరంపరలో భాగంగా ఫిబ్రవరి 2 సాయంకాలం యాన్ మిర్డాల్ రెండు గంటల పాటు అనేక విషయాల మీద మాట్లాడారు, ప్రశ్నలకు సమాధానాలిచ్చారు. ఆ సంభాషణలోంచి ముఖ్యమైన భాగాలు:*

**భా**రత దేశంలో ఏం జరుగుతున్నదో చాలకాలంగా చూస్తూనే, తెలుసుకుంటూనే ఉన్నాను. 2010 సంవత్సరాది సమయంలో నాకు ఒక ఫోన్ కాల్ వచ్చింది. భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) అగ్రనాయకత్వం నన్ను దండకారణ్యంలో, తూర్పు కనుమలలో కలుసుకోదలచుకున్నదని సందేశం. పన్నెండు రోజుల్లో వాళ్లను కలవవలసి ఉంది. అదృష్టవశాత్తూ నాకు స్వీడిష్ సాహిత్యం మీద, ప్రత్యేకించి ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్ మీద భారతదేశంలో ప్రసంగాలు ఇవ్వడానికి ఒక ఫెలోషిప్ ఉంది. వెంటనే ఢిల్లీకి విమానంలో వచ్చాను. అక్కడి నుంచి మావోయిస్టు పార్టీ కార్యకర్తలు, సానుభూతిపరులు నన్ను దండకారణ్యంలోకి తీసుకువెళ్లారు. నా మోకాళ్లనొప్పుల వల్ల అది కష్టమే అయింది. మావోయిస్టు గెరిల్లాలు కొన్నిసార్లు నన్ను మోసుకుని వెళ్లవలసి వచ్చింది కూడ. చివరికి మేం క్యాంపుకు చేరాక పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ సైనికులు, ఆదివాసులు నాకు స్వాగతం చెప్పారు. నాకు టీ ఇచ్చారు.

కాసేపటికి అడవుల్లోనుంచి కొందరు వచ్చారు. వారితో మాట్లాడు తుండగా నాకు అర్థమయింది, ఆ వచ్చినవారిలో ఒకరు మావోయిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి గణపతి అని. ఇండియాలో సాధారణంగా పొడి అక్షరాలతో పిలుస్తుంటారు. ఆయన జి ఎస్ అంటే జనరల్ సెక్రటరీ.

మేం ప్రధానంగా రెండు విషయాలు మాట్లాడుకున్నాం. యూరప్ లో ఉన్న సాధారణ స్థితి గురించి నేను చెప్పాను. భారత విప్లవోద్యమంలో అభివృద్ధి భావన గురించి జి ఎస్ చెప్పాడు. పరిశ్రమలు ఎలా అభివృద్ధి చేయాలో, సోవియట్ యూనియన్ లో పైనుంచి పరిశ్రమల అభివృద్ధి ఎలా జరిగిందో, చైనా సాంస్కృతిక విప్లవ అనుభవాలు ఏమిటో మాట్లాడుకున్నాం. సోవియట్ యూనియన్ లో పరిశ్రమలను ఫోర్డిస్టు పద్ధతిలో అభివృద్ధి చేయడం వల్ల ఆ పరిశ్రమలు కార్లను మాత్రమే తయారు చేయలేదు, బూర్జువా భావజాలాన్ని కూడ తయారు చేశాయి. అదే ఏకైక అభివృద్ధి నమూనా కాదు. ప్రజల వైపు నుంచి ప్రత్యామ్నాయ అభివృద్ధి ఆలోచనలు సైద్ధాంతికంగా పారిస్ కమ్యూన్ నాటినుంచీ ఉన్నాయి. చైనాలో ఆచరణాత్మక అనుభవంగా ఉన్నాయి. అదంతా చాల ఆసక్తిదాయకంగా, స్వేచ్ఛగా జరిగిన సంభాషణ. ఇతర దేశాలలో నేను చేసిన చర్చలతో పోలిస్తే ఇది చాల సాఫీగా, సూటిగా జరిగిన సంభాషణ.

తర్వాత మేం వాళ్లతో పదహారు రోజులు గడిపాం. నా మోకాళ్ల నొప్పులవల్ల నేను కొన్ని ప్రాంతాలకు వెళ్లలేకపోయాను గాని నాతోపాటు వచ్చిన గౌతమ్ నవ్లాఖా వాళ్లతో మాడ్ ప్రాంతానికి వెళ్లాడు. నేను క్యాంపులోనే ఉండిపోయాను. సుదీర్ఘమైన చర్చలలో పాల్గొన్నాను. పార్టీ డాక్యుమెంట్లు, సాహిత్యం చదివాను.

ఈ ప్రయాణంలో నాకు గుర్తుండిపోయే అనుభవాలు ఎన్నో ఉన్నాయి. మేం సాధారణ రాజకీయ చర్చలూ చేశాం. నిర్దిష్ట అంశాల మీదా వేరువేరు స్థాయిలలో చర్చించాం. మొత్తం మీద వారు నాకు చాల నచ్చారు.

ఒక అతి మామూలు ఉదాహరణ ఇవ్వాలంటే ప్రజల మధ్య వైరుధ్యాలతో వ్యవహరించడంలో పార్టీ ఎలా ప్రవర్తించిందో చెప్పాలి. రుతుస్రావ సమయంలో స్త్రీలు ఊరి బయట ఉండాలనేది అక్కడి ఆదివాసుల ఆచారం. అక్కడ మహిళా ఉద్యమం బలపడుతున్న సందర్భంలో ఇది సరైన ఆచారం కాదని, మార్చాలని ఆలోచించారు. ఆ సమయంలో కూడ స్త్రీలు ఊరిలోనే ఉండేలా చూడాలని ఆలోచించారు. కాని ప్రజలు అందుకు అంగీకరించలేదు. చాల లోతయిన, దీర్ఘకాలంగా అమలులో ఉన్న ఆ ఆచారాన్ని మార్చడానికి వీల్లేదని ప్రజలు అన్నారు. అప్పుడు పార్టీగాని, మహిళా ఉద్యమ కార్యకర్తలు గాని "ఇది పార్టీ ఆదేశం. కచ్చితంగా పాటించాల్సిందే" అని పట్టుపట్టలేదు. ఈ విషయంలో మార్పు మెల్లమెల్లగా తేవాలని ఆలోచించారు. ప్రజల మధ్య వైరుధ్యాలతో సున్నితంగా వ్యవహరించడం ఎట్లా అనే దానికి ఇది ఉదాహరణ.

మరొక ఉదాహరణ కూడ వాళ్లు నాకు చెప్పారు. మీకు తెలుసు, దేశంలో చాల ప్రాంతాలలో ఒకే ఇంటి పేరుగలవాళ్లను ఒకే కుదురుకు, కుటుంబానికి చెందినవాళ్లుగా గుర్తిస్తారు. ఒకే ఇంటి పేరుగల వాళ్ల మధ్య వివాహం నిషేధం. అది రక్తబంధువులను పెళ్లి చేసుకున్నట్టు లెక్క. పార్టీలో ఒక సమస్య వచ్చింది. అది పైకి చూడడానికి చిన్న సమస్యే. ఇద్దరు పార్టీ కార్యకర్తలు ప్రేమించుకున్నారు, పెళ్లి చేసుకోదలచారు. కాని ఆ ఇద్దరు ఆదివాసుల ఇంటిపేరూ ఒకటే. ఈ సమస్య ప్రగాఢమైన వ్యక్తిగత అనుభవానికి సంబంధించినది. కాని అదే సమయంలో రాజకీయమైనది కూడ. కనుక కిందినుంచి పైదాకా చాల చర్చకు దారి తీసింది. ఇతర దేశాల అనుభవాలను, చైనా

అనుభవాన్ని పరిగణనలోకి తీసుకున్నారు. ఈ సమస్యపై తీసుకునే నిర్ణయానికి దీర్ఘకాలిక ప్రభావం ఉంటుంది. ఆ మార్పు దీర్ఘకాలికంగా జరగవలసిందే గాని హఠాత్తు నిర్ణయంతో జరిగేది కాదు. చివరికి ఆ కార్యకర్తలు వివాహం చేసుకోగూడదని పార్టీ నిర్ణయించింది. నేను ఈ సమస్యలు మీ దృష్టికి ఎందుకు తెస్తున్నానంటే ఇవి వ్యక్తిగత, చిన్న ఉదాహరణలు అయినప్పటికీ పార్టీ ఎటువంటి దూరదృష్టితో, సమన్వయంతో సమస్యలు పరిష్కరిస్తుందనేది, ప్రజల మధ్య వైరుధ్యాలను పెంచే దిశగా కాక తగ్గించే దిశగా పనిచేస్తుందనేది అర్థమవుతుంది.

అలాగే నేను వాళ్ల డాక్యుమెంట్లలో చదివినదీ, వారితో చర్చల్లో ప్రస్తావనకు వచ్చినదీ కులం వంటి విషయాలలో వాళ్ల అవగాహన. నేను 1940లలో యువజన సంఘంలో పనిచేసినప్పటినుంచీ ఇటువంటి చర్చలు ఉన్నాయి. మన మెదళ్లలో పాత భావాలు ఉంటాయి. మనం హఠాత్తుగా కొత్త మనుషులుగా పుట్టుకురాలేదు. పాత సమాజపు దురలవాట్లు, తప్పుడు అభిప్రాయాలు, ఆధిక్యత –న్యూనత భావాలు చాల లోతుగా మన మీద ప్రభావాలు వేస్తుంటాయి.

పాలకవర్గాలు కొత్త కొత్త పద్ధతులు నేర్చుకున్నాయనే గుర్తింపు కూడ అవసరం. వంద సంవత్సరాల కింద, యాభై సంవత్సరాల కింద ఎటువంటి పద్ధతులలో పోరాడామో అవే పద్ధతులు ఇప్పుడు ఉపయోగ పడవు. ఈ విషయాలలో పార్టీ పత్రాలు, పార్టీ నాయకుల ఆలోచనలు చాల రాజకీయంగా, చైతన్యవంతంగా ఉన్నాయని నాకనిపించింది. నాకు తెలిసిన యూరపియన్ కమ్యూనిస్టు ఉద్యమాలతో పోలిస్తే వీళ్లు ఉన్నత స్థాయి రాజకీయ చైతన్యంతో ఉన్నారని నాకనిపించింది.

పార్టీ గురించి నాకు ప్రశంసనీయంగా కనిపించిన మరొక అంశం స్త్రీపురుష సమానత్వం. బహుశా ఇక్కడి పత్రికలలో మావోయిస్టు పార్టీలో స్త్రీల మీద అత్యాచారాల గురించీ, స్త్రీపురుష అసమానత గురించీ, వివక్ష గురించీ వార్తలు చదివిఉంటారు. అదంతా ప్రభుత్వ ప్రచారం. నేను స్వయంగా చూసినది అందుకు పూర్తిగా భిన్నం. స్త్రీపురుషుల మధ్య కామ్రేడ్లీ సంబంధాలు, సదవగాహన ఉన్నాయని నాకు కలిగిన సాధారణ అభిప్రాయం.

వాళ్లు సాధారణ మానవ సమస్యలనూ, ఇంకా విస్తృతమైన అభివృద్ధి సమస్యనూ, జీవనోపాధి, వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, నీటి పారుదల వగైరా సమస్యలనూ పట్టించుకుంటున్నారు. ప్రస్తుతం వారొక చక్రబంధంలో ఉన్నారు. ప్రభుత్వం వారికి ఉప్పు కూడ అందకుండా ఆంక్షలు విధిస్తోంది. కష్టతరమైన పరిస్థితులలో వారు పోరాటం సాగిస్తున్నారు.

◆ ◆ ◆

నేను 1980లో భారతదేశానికి వచ్చాను. మొదట దేశవ్యాప్తంగా చాల మంది మావోయిస్టులను, సాంస్కృతిక కార్యకర్తలను కలిశాను. ఆ తర్వాత బొంబాయిలో చంద్ర పుల్లారెడ్డిని కలిశాను. నేను అజ్ఞాతంగా ఆంధ్రప్రదేశ్ కు తిరిగివెళ్లాలని, సాయుధ దళాలను కలవాలని ఆయన సూచించారు. నేనూ, నా భార్య గన్ కెసిల్, నా కూతురు ఇవా అలా అడవుల్లోకి వెళ్లాం. అప్పటి నా అనుభవాలన్నీ 'ఇండియా వెయిట్స్' పుస్తకంలో రాశాను. అప్పటికి భారత నక్సలైట్ ఉద్యమాన్ని గురించి బైటివాళ్లు ఎవరూ రాయలేదు. బహుశా నేనే తొలి యూరపియన్ రచయితను అయి ఉంటాను. నేను ఆ ఉద్యమాన్ని అర్థం చేసుకోవడానికి, వివరించడానికి ప్రయత్నించాను. అప్పుడు నక్సలైట్ ఉద్యమం అనేక పాయలుగా ఉండేది. ఆ విషయం పుల్లారెడ్డి నాతో చర్చించారు కూడ. అప్పటికి ఒక జాతీయస్థాయి పార్టీ గాని, దేశవ్యాప్తంగా ఆమోద యోగ్యమైన నాయకుడు గాని లేరు. అదంతా స్థానిక ఉద్యమాల నుంచి రూపొందిన చిన్న చిన్న బృందాలుగా ఉండేది. ఇవాళ ఒక దేశవ్యాప్తమైన, సంఘటితమైన నిర్మాణం ఉంది. ఇప్పటికీ అక్కడక్కడ చిన్న చిన్న బృందాలు ఉన్న మాట నిజమే. ఐతే అప్పుడు ఉన్నంత పరస్పర వ్యతిరేకత లేదు. తప్పనిసరిగా అప్పటికీ ఇప్పటికీ భారత విప్లవోద్యమం గణనీయమైన అభివృద్ధి సాధించింది, విస్తరించింది.

ఇక చైనా విషయానికి వస్తే, నేను మొదట 1962లో వెళ్లాను. అది మూడు సంవత్సరాలు వరుస కరువు తర్వాత. చైనా అప్పటికి చాల ఇబ్బందులను, ఆహార కొరతను, ఆకలిచావులను ఎదుర్కొంటోంది. నేనప్పుడు చైనాకు భారతదేశం నుంచే వెళ్లాను. భారత్‌తో పోలిస్తే చైనా పరిస్థితి మెరుగనే చెప్పాలి. భారతదేశంతో పోలిస్తే చైనా సమాజం హేతుబద్ధ సమాజంగా ఉండింది. నేనూ నా భార్యా చైనాలో ఒక గ్రామానికి వెళ్లాలనుకున్నాం. అప్పటికి చైనాలో పర్యటిస్తున్న రచయితలు, విదేశీయులు బీజింగ్ కో , షాంఘైకో, ఇతర నగరాలకో వెళ్లి అక్కడి రాజకీయాలను, ప్రజా జీవితాన్ని పరిశీలిస్తున్నారు. మేం మాత్రం గ్రామానికి వెళ్లాలనుకున్నాం. అందుకు కారణాలున్నాయి. ఎప్పుడైనా కిందికి వెళ్లి పరిశీలించాలని, అక్కడ విస్తృతంగా చూసి వివరించాలని గోర్కీ అన్నాడు. అక్కడ పాత కొండ గుహల నివాసాలకు కొనసాగింపుగా ప్రజలు ఇళ్లు కట్టుకున్నారు. మాకంటె ముందు విదేశీయులు ఈ ఇళ్లను పరిశీలించారు. కాని ఆశ్చర్యకరంగా మేం మాత్రమే ఆ ప్రజల దగ్గరికి వెళ్లి ఆ ఇళ్లు వారెలా కట్టుకున్నారు, ఏ పదార్థాలు వాడారు, వగైరా వివరాలు తెలుసుకున్నాం. మేం సేకరించిన ఈ వివరాలు జోసెఫ్ నీథమ్ వంటి శాస్త్రవేత్త కూడ ఉపయోగించుకున్నాడంటే అది మాకు గర్వకారణం. మేం గ్రామస్తులను కలిసి వివరంగా మాట్లాడాం. ఆ సంభాషణలన్నిటినీ, వారి పేర్లతో సహా రాశాం. మా కృషికి అందుకే ప్రాచుర్యం వచ్చింది. మామీద విమర్శలు కూడ వచ్చాయనుకోండి. అభివృద్ధి నిరోధక పత్రికలు 'ఒక్క గ్రామమే మొత్తం చైనా కాదు' అని విమర్శించాయి. అవును. నిజమే. ఒక్క గ్రామాన్ని పరిశీలించి చైనా అంతా అలాగే ఉందని చెప్పలేం. ఒక్కగ్రామాన్ని పరిశీలించి ఆంధ్రప్రదేశ్ అంతా ఇంతే అని చెప్పలేం. కాని మా పుస్తకం ఒక ముఖ్యమైన విషయాన్ని వివరించింది. ఒకవైపు పాశ్చాత్య పత్రికలలో చైనాలోని నగరాలలో జరుగుతున్న సంచలనాత్మక సంఘటనల గురించి వార్తా కథనాలు వస్తున్నప్పుడు మా పుస్తకం సోషలిస్టు చైనాలో ఒక గ్రామంలో సాధారణ పరిస్థితులు ఎలా ఉన్నాయో వివరించింది.

సాంస్కృతిక విప్లవ కాలంలో మేం మళ్లీ చైనా వెళ్లాం. మళ్లీ ఆ గ్రామానికే వెళ్లదలచుకున్నాం. సాంస్కృతిక విప్లవం గురించి మా అవగాహన, అది సైద్ధాంతికంగా సరైనదే అని. ఆచరణాత్మకంగా కూడ సరైనదని రుజువు కావలసిందే అని. నిజంగానే అది ఆరోగ్య సేవలలో, వ్యవసాయంలో, విద్యలో చాల సానుకూలమైన ఫలితాలు సాధించింది. వారు రెడ్ బుక్ పట్టుకుని అందులోంచి కొటేషన్లు చదువుతూ ఆయా రంగాలలో ఎలా పనిచేయాలో చర్చించుకున్నారు. మేం అదంతా వాస్తవికంగా నమోదు చేశాం.

ప్రస్తుత చైనా నాయకత్వానిది ఈ విషయంలో ద్వంద్వ వైఖరి. ఇవాళ వాళ్లు సాంస్కృతిక విప్లవకాలం గురించి అదంతా చీకటి కాలమని వ్యాఖ్యానిస్తారు. అందువల్ల నా రెండో నివేదికను వాళ్లు గుర్తించలేదు. మొదటి నివేదికను మాత్రం గౌరవంగా చూస్తారు. నాకు ఇప్పుడు ఆ పుస్తకానికిగాను గౌరవ డాక్టరేట్ ఇచ్చారు. ఇది కూడ ద్వంద్వ వైఖరికి నిదర్శనమే.

సాంస్కృతిక విప్లవ తుదిదశలో మేం మళ్లీ అక్కడికి వెళ్లాం. చాలకాలమే ఉన్నాం. అప్పుడు చాల తీవ్రమైన పరిణామాలు జరుగుతున్నాయి. రెండు పంథాలకు చెందినవారి మధ్య బీజింగ్‌లో తుపాకి కాల్పులు కూడ జరిగాయి. దేశం అల్లకల్లోలంగా ఉండింది. అప్పుడు మావో, చౌ ఎన్‌లై లు పార్టీ కార్యకర్తలను గ్రామసీమల్లోకి వెళ్లి అధ్యయనం చేయమని ఎందుకు సూచించారో నాకు అర్థమయింది. గ్రామసీమల్లోనే నిజమైన చైనా ఉంది. సాంస్కృతిక విప్లవపు చివరి సంవత్సరంలో చాల రోజుల పాటు మేం చెంగ్‌టు లో ఉన్నాం. ఆ సమయంలో ఆ పట్టణ పార్టీ నాయకురాలిగా ఒక వీథులు ఊడ్చే స్త్రీ ఉండేది. ఆ పట్టణంలోని పరిస్థితుల గురించి నా భార్య ఒక నివేదిక రాసింది. అక్కడ రాజకీయ కృషి ఎలా సాగిందో, శ్రామికవర్గ నియంతృత్వం ఎలా సాగిందో, అక్కడ సమస్యలు ఎలా పరిష్కరించేవారో, పాఠశాలలో ఎలా పనిచేసేవారో, పాఠశాలలో వికలాంగులైన పిల్లల అవసరాలు ఎలా చూసేవారో, కింది నుంచి ఒక పరిశ్రమను ఎలా అభివృద్ధి చేసేవారో ఈ విషయాలన్నీ వర్ణించింది. మాకు చాల సంతృప్తినిచ్చిన నివేదిక అది. మేం దానిమీద చాలరోజులు పనిచేశాం. ఆ తర్వాత పరిస్థితులన్నీ తారుమారు అయ్యాయి. అయితే ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఒకటుంది. సాంస్కృతిక విప్లవంలోని మంచి అంశాలకు గ్యాంగ్ ఆఫ్ ఫోర్ ప్రతినిధి కాదు. నిజంగానే సాంస్కృతిక విప్లవకాలంలో రెండు పంథాల మధ్య పోరాటం జరిగింది. పెట్టుబడిదారీ మార్గావలంబకులు వంటి మాటలు పాశ్చాత్య పరిశీలకులకు అర్థమయ్యేవి కాదు. కాని అప్పుడు ఎవరు ఏ పంథా తీసుకుంటున్నారో స్పష్టంగానే ఉండేది. పార్టీ నాయకత్వ శ్రేణుల్లో ఉన్నతస్థానాల్లో, మధ్యంతర స్థాయిలో ఉన్నవారిలో చాలమంది పెట్టుబడిదారీ పంథా తీసుకున్నారు. కారణాలు పెద్ద కష్టమైనవేమీ కావు. యేనాన్ నాటినుంచీ, రైతాంగ పోరాట నాయకులుగా ఉన్న కామ్రేడ్స్‌ను నేను ఇంటర్వ్యూ చేశాను. వారు 1930ల నుంచీ పార్టీతో ఉన్నారు. చాల అద్భుతమైన మనుషులు. తెలివైన వారు. కాని నిరక్షరాస్యులు, చదువుకున్నవారు కాదు. వారు పైస్థాయి రాజకీయ, సిద్ధాంత విషయాలు అర్థం చేసుకోగలిగిన వారు కారు. ఇక మరొక రకం పార్టీ శ్రేణులు విప్లవానంతరం ప్రభుత్వోద్యోగాలలో చేరి పార్టీ సభ్యులైన యువకులు. శ్రేణుల మధ్య విభజన అది. అంతే కాకుండా మరెన్నో సంక్లిష్టతలున్నాయి. కాని మౌలికంగా గ్రామాలను, పునాదిని అర్థం చేసుకుంటే చైనా విప్లవపు సానుకూలతలు తెలుస్తాయి.

ఇక్కడొక ఆసక్తికరమైన ఉదంతం చెప్పాలి. నా భార్య గన్ కెసిల్ మంచి ఫొటోగ్రాఫర్. తను ఆ కాలంలో సాధారణ ప్రజాజీవితాన్ని ఫొటోలు తీసింది. వాళ్లు పొలంపని ఎట్లా పనిచేస్తారు, కాంగ్ మీద కూచున్నప్పుడు ఎలా ఉంటారు, వంటపని ఎలా సాగుతుంది, తినడం ఎలా ఉంటుంది, పిల్లలతో ఎలా ఉంటారు, పాఠశాలలో ఎలా ఉంటారు వగైరా సాధారణ జీవితానికి సంబంధించిన ఫొటోలు. అప్పుడు కాస్త సంకుచిత దృక్పథం ఉన్న ఒక కామ్రేడ్ మేం అటువంటి ఫోటోలు తీయడం మంచిది కాదన్నాడు. మనుషులు మురికిగా, బురదలో, బట్టలు లేకుండా కనబడితే మెరుగైన జీవితం కనబడదన్నాడు. కాని వ్యవసాయ పనులు చేసే మనిషి బురద అంటకుండా, చలువచేసిన చొక్కాతో చేస్తాడా? మరి ఇప్పుడేమైందో తెలుసా? చైనా ప్రభుత్వం మాకు కబురు పెట్టింది. సాంస్కృతిక విప్లవ రోజులకు సంబంధించి వారి దగ్గర మనుషులు నినాదాలు ఇస్తున్నవీ, పార్టీ కార్యక్రమాల్లో పాల్గొంటున్నవీ, విప్లవకరంగా కనబడుతున్నవీ తప్ప, మామూలు రోజువారీ జీవితంలో ఉన్న చిత్రాలు లేవట. గన్ కెసిల్ తీసిన ఫొటోలు ఇవ్వగలరా అని చైనావాళ్లు అడిగారు. మేం అవన్నీ ఇచ్చేశాం. చైనా ప్రభుత్వానికి కాదు, స్వీడిష్ మంత్రిత్వశాఖకు ఇచ్చాం. వాళ్లు చైనా ప్రభుత్వంతో సంబంధంలో ఉన్నారు. ఇది ఎందుకు చెపుతున్నానంటే చైనీయులైనా, భారతీయులైనా, విప్లవకారులైనా వారేమీ అతీతమానవులు కారు, ఎక్కడినుంచో ఊడిపడలేదు. వారు చాల మామూలు, కష్టజీవులు, శ్రామికులు. రైతులు, కూలీలు, ఇతరులు. మేం వారిని ఆ స్థాయిలోనే చూశాం.

ఇవాళ చైనా అపారమైన అభివృద్ధి సాధిస్తోంది. కాని ఈ అభివృద్ధి అంతా తొలి దశాబ్దాలలో సాధించిన అభివృద్ధి మీద ఆధారపడి జరుగుతున్నదే. 1953 నుంచి మావో మరణం వరకూ సాగిన క్రమబద్ధమైన అభివృద్ధిని పునాదిగా చేసుకుని డెంగ్ సియావో పింగ్ గాని ఇతరులు గాని ఇవాల్టి పరిణామాలు సాధిస్తున్నారు.

దీన్ని తాత్వికంగా చూడవలసి ఉంది. మావో అలా చూశాడు. మార్క్స్ నాటినుంచీ ఈ తాత్వికత ఉంది. ఎంగెల్స్ చెప్పినట్టుగా మార్క్స్ ఎప్పుడూ ఏదీ కచ్చితంగా 'ఇది ఇంతే, ఇంకొకలా ఉండదు' అని నిర్వచించలేదు. ఆయన ఎపుడైనా 'ఇది ఇలా ప్రయాణించవచ్చు, ఇలా మారవచ్చు' అని చెప్పాడు. మావో కూడ అంతే. వారు చెప్పినవాటిలో ముఖ్యమైనది చరిత్ర సోషలిస్టు విప్లవంతో అంతం కాదు అనేది. వర్గపోరాటం సోషలిస్టు విప్లవంతో అంతం కాదు. భవిష్యత్తులో కూడ అంతం కాదు. అది కేవలం రూపం మార్చుకుంటుంది. ఘర్షణలు, వైరుధ్యాలు ఎల్లప్పుడూ ఉంటాయి. పదివేల ఏళ్లయినా సరే అని మావో అన్నాడు. సోషలిస్టు విప్లవమనేది రాగానే అక్కడితో మన పని అయిపోతుంది అని యూరప్ కమ్యూనిస్టులం అనుకున్నాం. మావో ఎప్పుడూ అలా అనుకోలేదు. సాంస్కృతిక విప్లవంతో కూడ పని అయిపోతుందనుకోలేదు. కొత్త తరాలు వస్తాయని, కొత్త వైరుధ్యాలను పరిష్కరిస్తాయని అనుకున్నాడు. అలా ఆయన అన్నిటినీ స్వీకరించేలా ఉన్నాడు. మరొకరకంగా సాంప్రదాయిక మార్క్సిస్టుగా ఉన్నాడు.

మార్క్సిస్టుల గురించి దురభిప్రాయాలుండే చాలమంది వాళ్లేవో వంటకాల పుస్తకాలు రాశారనీ, ఇది చేస్తే, ఇది కలిపితే, ఇది తయారవుతుంది అన్నారని అనుకుంటారు. అది నిజం కాదు. అసలు 'ఇంతవరకూ జరిగిన చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే' అనే కమ్యూనిస్టు మానిఫెస్టో మొదటి వాక్యానికే కొంతకాలం తర్వాత ఎంగెల్స్ ఒక పాదసూచిక చేర్చాడు. ఆ వాక్యం అప్పటివరకు తెలిసిన చరిత్ర మీద ఆధారపడి రాశాం. ఆ తర్వాత పూర్వ చరిత్ర గురించి అదనపు సమాచారం తెలిసింది. అందువల్ల ఇది లిఖిత చరిత్రకు, వర్గ సమాజానికి సంబంధించిన నిర్ధారణ మాత్రమే అని సవరించాడు. మార్క్స్, ఎంగెల్స్ లు ప్రవక్తలు కారు, వారు చెప్పినవి శిలాశాసనాలు కావు. వాళ్లు ఒక ప్రత్యేక సంవిధానం అవలంబించి తమకాలపు వాస్తవికతను చూశారు. మావో ఈ విషయాన్ని బాగా గుర్తించాడు. ఆయన మహా మేధావి. ఇవాళ చైనా నుంచి మావో కనుమరుగు కాలేదని గుర్తు పెట్టుకోవాలి. ఇప్పటికీ సాంస్కృతిక విప్లవం గురించీ, మావో గురించీ అక్కడ చాల ఎక్కువగా చర్చిస్తున్నారు. అధికారిక పత్రికలలో కాదు, విశ్వవిద్యాలయాలలో, వ్యక్తిగత సంభాషణల్లో నేను చాల చోట్ల గమనించాను. పార్టీ, ప్రభుత్వం పూర్తిగా పెట్టుబడిదారీ మార్గంలో ఉన్నప్పటికీ ప్రజల్లో ఈ చర్చ జరుగుతోంది. అందువల్లనే నేను ఆశతో ఉన్నాను.

◆ ◆ ◆

భారత విప్లవోద్యమానికి సంబంధించి నేను చెప్పగలదేమంటే ఇవాళ ఈ విప్లవోద్యమానికి విస్తృత ప్రజా మద్దతును, సంఘీభావాన్ని

కూడగట్టడం చాల ముఖ్యం. ముఖ్యంగా మధ్యతరగతి వర్గంలో, పట్టణ మేధావి వర్గం వగైరాలలో. దండకారణ్యంలో సాగుతున్న ఆర్థిక పోరాటాలు కేవలం అటవీ ఉత్పత్తులకు సంబంధించినవి మాత్రమే కాదు. అది గతంలో వలసవాద కాలంలో జరిగింది. ప్రస్తుతం ఇది ఇంకా లోతయినది. ఇది భూగర్భంలోని ఖనిజ వనరులకోసం, ఆ ప్రాంతం నుంచి రాబట్టగలిగిన జల విద్యుత్ కోసం, కలపకోసం జరుగుతోంది. భారత ప్రభుత్వం బహుళజాతి, సామ్రాజ్యవాద, బడా గుత్త పెట్టుబడితో ఒప్పందాలు చేసుకుంది. అది సజావుగా సాగాలంటే అక్కడి ప్రజలలో కొందర్నయినా ఉద్యోగాల ఆశ చూపి ఆకట్టుకోవాలి. మిగిలిన లక్షలాది ప్రజలు పట్టణాలకు వలస వచ్చి మురికివాడల వాసులుగా మారిపోతారు. లేదా అంతరించి పోతారు. ఈ అభివృద్ధి క్రమం కిందిదాకా ప్రవహిస్తుందని ప్రభుత్వం చెప్పేది అబద్ధం. అభివృద్ధి అంటే ఇది ఒక్కటే నమూనా కాదు, ఇతర నమూనాలు ఉన్నాయి. మావోయిస్టు పార్టీ అభివృద్ధికి వ్యతిరేకం కాదు. అది కూడ నీటిపారుదల సౌకర్యాలు కలిగిస్తోంది. ప్రజలను విధ్వంసం పాలు చేసే, నిర్వాసితులను చేసే అభివృద్ధి నమూనాను మాత్రమే మేం వ్యతిరేకిస్తున్నాం అని పెద్దఎత్తున ప్రచారం చేస్తే సంఘీభావాన్ని కూడగట్టవచ్చు. బహుళజాతి కంపెనీలు తమకు లాభసాటిగా ఉన్నంతవరకే ఏపని అయినా చేస్తాయి. వారికి లాభసాటిగా లేకపోతే, ప్రతిఘటన ఉంటే ఆ పని చేయవు. పెద్దఎత్తున సంఘీభావాన్ని కూడగట్టి ప్రతిఘటనోద్యమాన్ని నిర్మిస్తే బహుళజాతి కంపెనీలు వెనక్కి తగ్గుతాయి. ప్రభుత్వం వాటిని తీసుకురాజాలదు. ఇది ఒక అవకాశం. ఒకటే అనివార్య పరిణామం లేదని మాత్రమే నేను చెపుతున్నాను. అనేక అవకాశాలున్నాయి. బహుళజాతి కంపెనీలు వచ్చి భూములను, ఖనిజాలను ఆక్రమించడం తప్ప మరొక ప్రత్యామ్నాయం లేదనేది నిజం కాదు. ఇది ప్రచారం చేయాలి. మధ్యతరగతిని ఒప్పించాలి. మావోయిస్టుల అభివృద్ధి నమూనా ప్రజల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని, ప్రజల కోసం, ప్రజల చైతన్యం మీద ఆధారపడి ఉంటుందని చెప్పి ఒప్పించాలి. ఇవాళ దేశంలో విప్లవోద్యమం ముందున్న సమస్యలలో ఇదే ప్రధానమైనదని నేననుకుంటున్నాను. పెద్దఎత్తున మృత్యువునూ, విధ్వంసాన్నీ, భయంకరమైన అసమానతలనూ తెచ్చే అభివృద్ధిని మధ్యతరగతిలో ఎక్కువమంది సమర్థించరు. తప్పకుండా ఎదిరిస్తారు. అలాగే ఈ అభివృద్ధి నమూనాను ఎదిరించడంలో కలిసి వచ్చే మిత్రులు మరెంతో మంది ఉంటారు. ఈ మిత్రులలో రాజకీయవాదులూ ఉండవచ్చు. గాంధీ అనుయాయులలో చాలమంది ఇటువంటి అభివృద్ధి నమూనాను వ్యతిరేకించవచ్చు. అంటే ఇవాళ్టి సందర్భంలో మావోయిస్టులకు విశాల స్థాయిలో మిత్రులు వచ్చే అవకాశం ఉందని నేను ఊహిస్తున్నాను.

అలాగే ప్రభుత్వం అన్నప్పుడు కూడ అది ఒక ముద్ద కాదు. వేరువేరు స్థాయిల వేరువేరు శక్తులు ఉన్నాయి. మావోయిస్టులకు కూడ ఈ స్పష్టత ఉంది. పాలకవర్గ శక్తులమధ్య ఉన్న వైరుధ్యాలను వాడుకుని వాటిని ఒకదానికొకటి ఎదురుగా పెట్టడం సాధ్యమే. నేను కలకత్తాలో దిగినరోజే ప్రభుత్వం ఎన్ కౌంటర్ల పేరిట ప్రజలను చంపడాన్ని సుప్రీంకోర్టు తప్పుపట్టిందని చదివాను. అంటే రాజ్యంలో ఒక అంగం మరొక అంగాన్ని విమర్శిస్తున్నదన్నమాట. ఒకభాగం భయంకరమైన, హత్యాకాండ సాగిస్తుండగా మరొకభాగం తప్పుపడుతున్నదన్నమాట. అంటే పాలకవర్గాలలోనే వైరుధ్యాలు ఉన్నాయన్నమాట. అలాగే భారత పాలనా వ్యవస్థ పినోషె నియంతృత్వం కింద చిలీ పాలన లాగ కరడుగట్టినది కాదు. అందువల్ల మీదగ్గర ఎన్నో అవకాశాలుంటాయి. మీ దగ్గర ఒకటో రెండో మూడో అవకాశాలు మాత్రమే కాదు ఎన్నెన్నో అవకాశాల వరుస ఉంది. ఆయా వర్గశక్తులను బట్టి, వర్గపోరాట స్థాయిని బట్టి ఆయా అవకాశాలు వస్తాయి.

మొత్తం మీద మావోయిస్టుల పనితీరు నాకు నచ్చింది. వారి ఆలోచనలు, చర్చాసరళి నాకు నచ్చాయి. వారు ఒక కష్టతరమైన పరిస్థితిలో ఉన్నారు. ప్రభుత్వం, లేదా ప్రభుత్వంలోని కొన్ని అంగాలు వారి నాయకత్వాన్ని మట్టుపెట్టడానికి చూస్తున్నాయి. మావోయిస్టులు ఇప్పుడున్నదానికంటె ఎక్కువ జాగ్రత్తగా ఉండాలి. ఉదాహరణకు, ఎంతోమంది విదేశీ, స్వదేశీ పాత్రికేయులను దండకారణ్యానికి రమ్మని పిలవడం గురించి చర్చ వచ్చింది. నేను అలా పిలవడమే మంచిదన్నాను. వారు ఏమిరాసినా ఉద్యమానికి ప్రచారం దొరుకుతుందన్నాను. కాని తర్వాత నా అభిప్రాయం కొంత మారింది. ఉదాహరణకు పార్టీ వారు నన్ను సోదా చేయకుండానే అనుమతించారు. నన్ను సోదా చేసి ఉండవలసింది. నా దగ్గర మొబైల్ ఫోన్ ఉండి ఉంటే ఎక్కడికి వెళుతున్నానో తెలుసుకోవడం, వాళ్లను కలవగానే మానవ రహిత విమానం సహాయంతో బాంబుదాడి చేయడం సాధ్యమే. అంటే ప్రమాదాలు, నిజమైన ప్రమాద అవకాశాలు ఉన్నాయి. విదేశీ పాత్రికేయులు రావడం వల్ల ప్రయోజనాలూ ఉన్నాయి. జాగ్రత్త తీసుకోవలసిన ఇటువంటి ప్రమాదాలూ ఉన్నాయి. ఆజాద్‌ను ఎలా చంపివేశారో, చర్చల పేరుతో నడిచిన ఉత్తరాల ద్వారా ఆయన ఆచూకీ ఎలా కనిపెట్టారో మీకు తెలుసు. ఎప్పుడో ఒకసారి చర్చలు అవసరమే. కాని ఆజాద్ ను చంపడానికి దారితీసిన పరిస్థితులు కోడిని చంపడానికి ముందు దానికి గింజలు చల్లుతూ ఆకర్షించినట్టుగా జరిగాయి.

◆ ◆ ◆

జనతన సర్కార్ జెండాలో రెండు నక్షత్రాలు, విల్లమ్ములు చిత్రించి ఉండడం చాల ఆసక్తికరం. రెండు నక్షత్రాలు ఆదివాసులకు, దళితులకు చిహ్నాలు. విల్లమ్ములు చాల మంచి ఆయుధం. అది శబ్దం లేకుండా ప్రయోగించగల ఆయుధం. మెటల్ డిటెక్టర్లకు దొరకని ఆయుధం. ఆ జెండా జాతీయ, స్థానిక సంప్రదాయాలను గౌరవిస్తున్నా రనడానికి నిదర్శనం. అది వాస్తవిక దృక్పథానికి సూచిక.

◆ ◆ ◆

భారతదేశపు కుల వ్యవస్థ గురించి నాకంటె మీకే ఎక్కువ తెలుసు. దాన్ని చారిత్రకంగా అర్థం చేసుకోవచ్చు. కుల వ్యవస్థకు మూలం కుటుంబం, ఆస్తి, స్త్రీల పట్ల భయంకరమైన వివక్ష. ఇప్పుడది పరువు హత్యల రూపంలో జరుగుతోంది. అయితే ఇక్కడ ఒక ప్రత్యేకమైన విషయం చూడాలి. గాంధీ, మావో ఇద్దరూ కూడ తమ కార్యకర్తలను మరుగుదొడ్లు కడగమనీ, మలమూత్రాలు ఎత్తుకుపొమ్మనీ ఆదేశించారు. మరుగుదొడ్డిని కడిగే బ్రాహ్మణుడు, మలమూత్రాలు ఎత్తుకుపోయే ఉన్నతవర్గ చైనీస్ మేధావి తమ కుల, ఉన్నతవర్గ ఆభిజాత్యాన్ని వదులుకోవలసి ఉంటుంది. భారతదేశంలో విప్లవకారుడు కావడమంటే వదులుకోవలసినవి చాల ఉన్నాయి. జంధ్యం గురించి గర్వంగా భావిస్తూ, సాంప్రదాయిక బ్రాహ్మణుడిగా ఉంటూ విప్లవకారుడుగా పురోగమించడం సాధ్యం కాదు. చాల సంస్కృతులలో కులానికి సమానమైన ఆభిజాత్యాలు ఉన్నాయి. స్వీడన్‌లో ఎల్లప్పుడూ రెండు రకాల బృందాలు ఉన్నాయి. అవి దాదాపు కుల విభజన లాగానే ఉన్నాయి. ఒకటి యూదు జనాభా. వాళ్లు వ్యాపారస్తులు. మీదగ్గర మార్వాడీల లాంటి వాళ్లనుకోండి. మరొక బృందం జిప్సీలు. సంచార జాతులు. ఈ రెండు బృందాలు కూడ పూర్తిగా అంతర్వివాహం మీద ఆధారపడినవే.

అయితే మా దగ్గర ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చిన కుర్దులు, సోమాలీలు వంటి అనేక సమూహాలు ఉన్నాయి. ఈ సమూహాలు ఇతర సమూహాలతో సంబంధం లేకుండా తమకు తాముగా జీవిస్తుంటాయి. వీరిలో పరువుహత్యలు కూడ ఉన్నాయి. స్వీడన్‌లో పరువు హత్యలు, కూతురు మరొక సమూహపు మనిషిని పెళ్లి చేసుకుంటే, చేసుకుంటానంటే చంపివేయడం గతంలో లేదు. ఈ సమూహాలతో మొదలయింది. అయితే భారత కుల వ్యవస్థకు, ఇతర అసమానతలకు తేడా ఏమంటే, భారత్ లో అది ప్రధానమైన సమస్య. అది చాల సున్నితమైనది కూడ. దాని మీద భావోద్వేగాలు హెచ్చు.

◆ ◆ ◆

భారత విప్లవానికి అంతర్జాతీయ సంఘీభావాన్ని సాధించవలసి ఉంది. అది ఒక ఉద్యమంగా ఇప్పుడిప్పుడే మొదలవుతోంది. రెండు సమస్యలు ఉన్నాయి. ఒకటి సమాచార కొరత. నిజానికి సమాచార కొరత ఉండడం ఆశ్చర్యకరమైన విషయం. భారతదేశంలో మీకు చాల పత్రికలున్నాయి. హిందూ, తెహెల్కా వంటి పత్రికలు విప్లవోద్యమం మీద వార్తలు, వ్యాఖ్యలు అచ్చువేస్తాయి. అందువల్ల సూత్రరీత్యా చూస్తే భారత మధ్యతరగతికి ఈ విషయాలు తెలిసి ఉండడానికి అవకాశాలు మెండుగా ఉన్నాయి. ఆజాద్ హత్య గురించి చాల వివరాలు వచ్చాయి. కాని ఈ వార్తలు బయటికి వెళ్లవు. అంతర్జాతీయ సమాజానికి ఈ విషయాలు తెలియవు. అదేమీ భారత ప్రభుత్వ ఆంక్షల వల్ల కాదు. భారత్ లో ఉండే విలేకరులు మంచివాళ్లా చెడ్డవాళ్లా అనేది కూడ సమస్య కాదు. వాళ్లు ఈ వార్తలు పంపినా, మా దేశాలలో వార్తాపత్రికలకు ఉండే కాపలాదార్లు, ఎడిటర్లు ఈ వార్తలు వేయరు. కత్తిరించేస్తారు. అలా ఎందుకు చేస్తారు? పత్రికా స్వేచ్ఛ అనే మాట విన్నప్పుడల్లా అడగవలసిన ప్రశ్న పత్రికల యజమానులెవరు అని. అది చాల చిన్న ప్రశ్నే. స్వీడన్ విషయమే చూసుకుంటే అక్కడి ప్రధానమైన సోషల్ డెమొక్రటిక్ అని చెప్పుకునే పత్రిక యజమానీ, ప్రధాన అభివృద్ధి నిరోధక పత్రిక యజమానీ ఒకరే. ఆస్లో లో ఉండే ఒక కోటీశ్వరుడు. అక్కడక్కడా స్వేచ్ఛ కనబడవచ్చు గాని మొత్తం స్థితి ఇది. ఇక నేను ప్రారంభించిన పత్రిక లాంటి చిన్న పత్రికలు ఉన్నాయి గాని అవి చాల చిన్నవి. ఈ పరిస్థితిలో ఎలాగో ఒకలాగ భారత సమాచారాన్ని అంతర్జాతీయ సమాజం దృష్టికి తీసుకురావాలి. ఇంటర్నెట్ వాడుకోవచ్చు. చిన్న పత్రికలకు పంపవచ్చు. క్రమంగా పెద్ద పత్రికల అడ్డుగోడలను ఛేదించవచ్చు. యూరప్ లోని సాధారణ కార్మికవర్గ పాఠకులకు ఈ సమాచారం అందించడానికి ప్రయత్నాలు చేయాలి. రెండవ సమస్య ఏమంటే ఇటీవల లండన్ లో నేనూ, అరుంధతీ రాయ్ భారత విప్లవోద్యమం మీద మాట్లాడాం. ఆ సభకు చాల మందే వచ్చారు. కాని వారిలో అత్యధికులు భారత ఉపఖండం నుంచి వచ్చి అక్కడ ఉన్నవారే తప్ప బ్రిటిష్, యూరపియన్ పౌరులు లేరు. వారికి చేరడం గురించి ఆలోచించాలి.

సంఘీభావ ఉద్యమానికి రెండు స్థాయిలు ఉన్నాయి. ఒకటి భారత ప్రజలకు సంఘీభావం తెలిపే ఉద్యమం. మేం స్వీడన్ లో అది ప్రారంభించాం. దీనిలో అన్నిరకాల వాళ్లు చేరారు. పాత కామ్రేడ్స్ ఉన్నారు. ప్రధానంగా ఇది 'వామపక్ష' ఉద్యమం. ఇక్కడ మీకొక సంగతి చెప్పాలి. యూరప్ లో కమ్యూనిస్టు ఉద్యమం వామపక్ష ఉద్యమంగా దిగజారి పోయింది. అది వామపక్షమే గాని కమ్యూనిజం కాదు. అందులో అన్నిరకాల వాళ్లు ఉంటారు. దాన్ని పార్టీ లేని ఐక్య సంఘటన అనవచ్చు. వాళ్లు బలమైన సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని నిర్మించినవారే. మా ఉద్దేశం భారత ప్రజల న్యాయమైన పోరాటంలో వారికి సంఘీభావం ప్రకటించేందుకు ఎంతమంది వీలయితే అంతమందిని కూడగట్టడమే. మాకు చాల మద్దతు ఉంది. ఫోర్త్ వరల్డ్ మూవ్‌మెంట్ అనే ఆదివాసుల ఉద్యమం మాతో కలిసింది. అంబేద్కర్ ను అనుసరించే దళిత ఉద్యమం మాతో కలిసింది. ఉదారవాదులు, చర్చ్ వారు కూడ చేరారు. ప్రజల న్యాయమైన పోరాటాన్ని సమర్థించడం, గ్రీన్‌హంట్ వంటి ప్రభుత్వ పాశవిక దాడులను ఖండించడం అనే సూత్రబద్ధ వైఖరి మీద మేం ఈ ఐక్యత సాధించాం. ఐనా మా నిర్మాణం చాల చిన్నదే. నిరసనలు, భారత రాయబార కార్యాలయం ముందు ప్రదర్శనలు లాంటి పనులు చేశాం. ఇప్పుడు మా కార్యకర్తలకు అధ్యయన తరగతులు ఏర్పాటు చేస్తున్నాం. ఐక్య సంఘటన అనేది విప్పుకునే విసనకర్ర లాంటిది. ఒకవైపు అది ఎంత విశాలంగానైనా విప్పుకుంటుంది. మరొకవైపు దానికి అటు చివరా ఇటు చివరా కచ్చితమైన సరిహద్దులూ ఉంటాయి.

రెండో దృక్పథంగా ఇటాలియన్ కామ్రేడ్స్ ఏమంటున్నారంటే అంతర్జాతీయ సంఘీభావ ఉద్యమ లక్ష్యం భారత దేశంలో నూతన ప్రజాస్వామ్యాన్ని సమర్థించడంగా ఉండాలని. ఈ పని జరగాలంటే నూతన ప్రజాస్వామ్యం అంటే ఏమిటో అర్థం చేసుకుని, దాన్ని సమర్థించ వలసి ఉంటుంది. అంటే ఇది కేవలం మార్క్సిస్టులకు, మావోయిస్టులకు పరిమితమవుతుంది. విశాలత్వం సంతరించుకోదు అని మేం వాదిస్తున్నాం. మా మధ్య విభేదమేమీ లేదు. సంఘీభావాన్ని కూడగట్టడానికి వేరు వేరు మార్గాలలో మేం ప్రయత్నిస్తున్నాం. అంతే. ఇది ఐక్యసంఘటన గురించి చాల కాలంగా ఉన్న చర్చే.

◆ ◆ ◆

'భారత్‌పై అరుణతార' అనడంలో నేను 'చైనాపై అరుణతార' అన్న ఎడ్గార్ స్నోను అనుసరించాను. కాని ఎడ్గార్ స్నో చైనాలో నాలుగు నెలలు ఉన్నాడు. నేను పదహారు రోజులే ఉన్నాను. ఎడ్గార్ స్నో చైనా ప్రజా సైన్యాన్ని 1936లో చూశాడు, చైనాలో విప్లవ విజయం చాల కాలం తర్వాత 1949లో జరిగింది. అలాగే చైనాకూ భారత్ కూ మధ్య తేడాలున్నాయి. చైనాలో విముక్తి ప్రాంతాలు చాలకాలం ఉన్నాయి. మొదటి విముక్తి ప్రాంతం 1927లోనే ఏర్పడింది. దాని మీద పెద్ద ఎత్తున దాడి జరిగినందువల్ల లాంగ్ మార్చ్ చేయవలసి వచ్చింది. చివరికి ఏనాన్ విముక్తి ప్రాంతం ఏర్పడింది. ఇతర ప్రాంతాలు విముక్త మయ్యాయి. ఈలోగా చాంగ్ కైషేక్ ను బందీగా పట్టుకుని ఐక్యసంఘటనకు ఒప్పించడం జరిగింది. విముక్తి ప్రాంతాల మీద ప్రభుత్వ బలగాల దాడులు జరుగుతున్నప్పుడు ఏనాన్ ను రక్షించుకోవడం ఎట్లా అనే సమస్య వచ్చినప్పుడు, 'ఏనాన్ ను రక్షించుకోవడమంటే పోగొట్టుకోవడమే, ఏనాన్ ను వదిలి పోవడమే అంతిమంగా ఏనాన్ ను రక్షించుకోవడం' అని మావో అన్నాడు. అలా అక్కడ ఒక సంక్లిష్ట క్రమం సాగింది. భారత్ లో కూడ అదే విధంగా విముక్తి ప్రాంతాలు ఏర్పడుతూ పోవడం జరగదు. ఇది మరింత సంక్లిష్ట క్రమం. 1930 ల చైనాకూ, 2010ల భారత్ కూ తేడాలున్నాయి. భారత్ లో ఒక గెరిల్లా జోన్ ఉంది. అది విస్తరించి బలపడి, స్థలకాల పరిస్థితులకు లోబడి విముక్తి ప్రాంతంగా మారవచ్చు. అది అలాగే జరగాలనీ లేదు. ఎన్నెన్నో అవకాశాలు, సంభావ్యతలు ఉన్నాయి. ఇవాళ భారత్ ఉన్న స్థితిలో చైనా ఒకానొక సమయంలో ఉండింది. అక్కడ కూడ ఏనాన్ వదిలేశారు, కియాంగ్సీ వదిలేశారు. ఇదేమీ అంకగణిత సమీకరణం కాదు. ఇది చాల సంక్లిష్ట సామాజిక ప్రయాణం. వీ

# గ్రామాల అధ్యయనాల చరిత్ర - 2

***మానవ చరిత్ర పరిణామ క్రమంలో గ్రామాల పుట్టుక, పెరుగుదల, రాజకీయార్థిక పరిణామాలనూ, గ్రామాల అధ్యయనాల చరిత్రనూ వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

*( గత సంచిక తరువాయి...)*

ఆధునిక కాలంలో జరిగిన గ్రామ అధ్యయనాలలో ప్రధానమైనవి గ్రామ కైఫియత్తులు. బ్రిటిష్ పాలనా కాలంలో తయారయిన గ్రామ కైఫియత్తులలో ఎక్కువ భాగం మద్రాసు ప్రెసిడెన్సీలోని తెలుగు భాషా ప్రాంతాలలో జరిగినవే. ఈ గ్రామ కైఫియత్తుల రచన శాస్త్రీయ ప్రమాణాలను పూర్తిగా సంతరించుకోకపోయినా, లోపభూయిష్టంగానే ఉన్నా, గ్రామాల అధ్యయనాల చరిత్రలో ఒక ముఖ్యమైన మైలురాయిగా జరిగిన ఆ కృషిని గురించి కొంచెం వివరంగానే తెలుసుకోవాలి.

ఈస్టిండియా కంపెనీ దేశంలో ప్రవేశించిన తర్వాత నూట యాభై ఏళ్లకు, అంటే 1750ల తర్వాత, అనేక ప్రాంతాలలో పాలనాధికారం సంపాదించింది. అప్పుడు పాలనాధికారం అంటే ప్రధానంగా పన్నుల వసూలు అధికారమే. అప్పటికి ప్రధానమైన పన్ను ఆదాయం గ్రామాల నుంచి, వ్యవసాయ రంగం నుంచి వచ్చేదే గనుక గ్రామాలను, వ్యవసాయరంగాన్ని, పంటల విధానాన్ని, దిగుబడిని అధ్యయనం చేయడం బ్రిటిష్ పాలనావసరాలలో ముఖ్యమైన భాగమయింది. అప్పటికే ఇంగ్లండ్ లో పరిశ్రమలు వికసిస్తూ వాటికి ఎన్నెన్నో ముడిసరుకులు – వ్యవసాయోత్పత్తులు గాని, ఖనిజాలు గాని – అవసరమయ్యే స్థితి కూడ పెరుగుతూ వచ్చింది. ఈ అవసరాల నుంచే ఈస్టిండియా కంపెనీ భారత భూభాగంలో దొరికే వనరులను కనిపెట్టడానికి, అంచనా వేయడానికి, మదింపు వేయడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. ప్లాసీ యుద్ధం (1757)లో, బక్సార్ యుద్ధం (1764)లో ఈస్టిండియా కంపెనీ సాధించిన విజయం భారతదేశంలో బ్రిటిష్ వలసవాదానికి పాలనాధికారాలు ఇవ్వగా, కొద్ది కాలానికే 1767లోనే సర్వే ఆఫ్ ఇండియా ఏర్పాటు చేయడం భారత దేశ వనరుల అధ్యయనానికి వాళ్లు ఎంత ప్రాధాన్యత ఇచ్చారో సూచిస్తుంది. ఆ ప్రాధాన్యతలో భాగమే ఈస్టిండియా కంపెనీ అధికారులు జరిపిన వేరువేరు సర్వేలు, పరిశీలనలు, అన్వేషణలు. పెట్టుబడిదారీ పరిశ్రమలకు ముడిసరుకులను హామీ ఇచ్చే, సమకూర్చిపెట్టే ప్రయత్నంలో భాగంగా ఈ అధ్యయనాలు క్రమబద్ధంగా, కచ్చితంగా, స్పష్టంగా, ఆనాటికి అభివృద్ధి చెందినంత మేరకు శాస్త్రీయ పద్ధతులలో సాగాయి. ఆయా అన్వేషణలు చేసిన అధికారులు తమ సొంత చొరవతో ఎక్కువగానో తక్కువగానో ఈ అధ్యయనాలు జరిపి ఉండవచ్చు. వారిలో కొందరు స్థానిక చరిత్రలపట్ల, కళా సాహిత్య సాంస్కృతిక అంశాల పట్ల ఆదరాభిమానాలు కూడ ప్రదర్శించి ఉండవచ్చు. కాని, ఈస్టిండియా కంపెనీకి, మొత్తంగా బ్రిటిష్ పాలకవర్గాలకు మాత్రం ఈ అధ్యయనాల ఉద్దేశ్యాలు స్పష్టంగానే ఉన్నాయి.

అందుకే ఈ గ్రామ అధ్యయనాలు జరపడంలో 1784 నుంచి 1816 మధ్య కాలిన్ మెకంజీ (1754–1821) చేసిన అపారమైన కృషిని ప్రశంసిస్తూ ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ల బోర్డు "...భారత సమాజం గురించిన పరిజ్ఞానానికి, సైనిక, ఆర్థిక, వాణిజ్య ప్రయోజనాలకు ఉపయుక్తమైన విస్తృత సమాచారాన్ని అందించడంలో అసాధారణమైన ప్రతిభతో సాధించిన విజయాలు" అని అభివర్ణించింది. ఈస్టిండియా కంపెనీ విస్పష్టంగా గుర్తించిన "సైనిక, ఆర్థిక, వాణిజ్య ప్రయోజనాల" కొరకు కాలిన్ మెకంజీ చేసిన కృషిలో గ్రామ అధ్యయనాలు ఒక భాగం. ఇవాళ తెలుగు సీమలో అత్యధిక భాగం కనీసం పది జిల్లాల గ్రామాల చరిత్రకు ఈ మెకంజీ తయారు చేయించిన కైఫియత్తులే ఆధారం గనుక మెకంజీ కృషి గురించి తెలుసుకోవాలి.

కాలిన్ మెకంజీ ఆనాటి బ్రిటిష్ యువకులందరిలాగానే ఉద్యోగం వెతుక్కుంటూ తన ముప్పయవ ఏట, 1783లో భారతదేశానికి వచ్చాడు. ఇంజనీరింగ్ విభాగంలో ఉద్యోగిగా కంపెనీ సైన్యం వెంట తిరుగుతూ 1784–90 మధ్య నెల్లూరు, రాయలసీమ ప్రాంతాలలో రహదారుల, మార్గాల పటాలు తయారుచేశాడు. ఆ నేపథ్యంలో 1790లో ఆయనకు గుంటూరు సర్కార్‌ను సర్వే చేసే బాధ్యత అప్పగించారు. అప్పటికి రెండు సంవత్సరాల కిందనే నిజాం నవాబుల నుంచి గుంటూరు సర్కార్ ఈస్టిండియా కంపెనీ చేజిక్కింది. తమ పాలనలోకి వచ్చిన ప్రాంతంలో ఉన్న వనరులను, అక్కడ పన్నుల వసూలు అవకాశాలను అధ్యయనం చేయడమే ఈ సర్వే ప్రధాన ఉద్దేశం. మెకంజీ 1790 నుంచి 1793 వరకు గుంటూరు సర్కారును మాత్రమే కాక, పొరుగున ఉన్న కడప, కర్నూలు ప్రాంతాలను, నల్లమల, ఎర్రమల కొండలను కూడ సర్వే చేశాడు. ఆ తర్వాత 1794లో పెన్నా, కృష్ణ నదుల మధ్య ఉన్న నిజాం సరిహద్దు ప్రాంతాలన్నిటిని కూడ సర్వే చేశాడు. నిజాం పాలనా ప్రాంతాల గురించిన వివరమైన పటాన్ని 1796లో తయారు చేశాడు. ఈ కృషివల్ల మెకంజీ ఆ తర్వాత ఈస్టిండియా కంపెనీ అధికార నిచ్చెనలో పైపైకి ఎక్కి 1810లో మద్రాసు ప్రాంత సర్వేయర్ జనరల్‌గా, 1816లో భారత దేశపు మొదటి సర్వేయర్ జనరల్‌గా పదవులు చేపట్టాడు.

బ్రిటిష్ పాలకవర్గాల ప్రయోజనాల కోసమే అయినా మెకంజీ భూగోళం, భూగర్భవనరులు, వ్యవసాయం, సామాజిక వ్యవస్థ, పురావస్తు అవశేషాలు, చరిత్ర, సాహిత్యం వంటి ఎన్నో అంశాల మీద విలువైన సమాచారం సేకరించిపెట్టాడు. దాదాపు పదహారు వందల తాళపత్ర గ్రంథాలు, రాతప్రతులు, ఎనిమిది వేలకు పైగా శాసనాలు, ఆరు వేలకు పైగా నాణాలు సేకరించడంతో పాటు మెకంజీ చేసిన పనులలో 2,070 స్థానిక చరిత్రల సేకరణ ముఖ్యమైనది. ఆయా గ్రామాల గురించి

పాలకులకు అవసరమైన సమాచారాన్ని రాబట్టడానికి మెకంజీ ఈ స్థానిక చరిత్రలు రాయించాడు. వాటికి కొంతవరకు ఆధారంగా నిలిచినవి అప్పటికి కొన్ని గ్రామాలలోనయినా భూముల గురించి, పంటల గురించి, పన్నుల గురించి సమాచారాన్ని భద్రపరచిన కవిలె, లేదా దండ కవిలె అనే కరణీకపు చిట్టాలు. మెకంజీ కూడ ఆనాటి సమాజంలో చదువూ, గ్రామం గురించి అవగాహనా ఉన్న కరణాలతోనే ఎక్కువగా వారి వారి గ్రామాల గురించి ఈ స్థానిక చరిత్రలు రాయించాడు. వాటన్నిటినీ గ్రామ కైఫియత్తులు అనిగాని, మెకంజీ కైఫియత్తులు అనిగాని పిలుస్తున్నారు. ఇవన్నీ కనీసం రెండువందల సంవత్సరాల కింద వాడకంలో ఉన్న భాషలో, పదప్రయోగాలతో, అదికూడ శిష్టులు రాసినవిగా ఉన్నాయి. కనుక చదవడానికి కష్టపడవలసి వచ్చినా కొంత విలువైన సమాచారం దొరకకపోదు.

గ్రామ చరిత్రను, గ్రామపు కవిలెకట్టను కైఫియత్ అనడం అలవాటు. స్థితి అనే అర్థం ఉన్న ఆ ఉర్దూ మాట హిందీలో వివరణ, నివేదిక, చిట్టా అనే అర్థంలో వాడకంలోకి వచ్చింది. ఇవి గ్రామాల గురించిన వివరణలే గాని గుర్తించవలసిన అంశం వీటిలో ఎక్కువ భాగం గ్రామ కరణాలు రాసినందువల్ల వారి వంశచరిత్రలు, వారి మత విశ్వాసాలు, వారికి ప్రధానమని అనిపించిన అంశాలు, వారి ఇష్టాయిష్టాలు ఎక్కువగా నమోదయ్యాయి. గుంటూరు ప్రాంతానికి సంబంధించి దొరుకుతున్న రెండు వందలకు పైగా కైఫియత్తులలో దాదాపు ప్రతిదానిలోనూ మొదట తమకు గ్రామ కరణీకం ఎలా వచ్చిందో ఒకే రకమైన వివరణ కనబడుతుంది. అలాగే గ్రామంలోని ఆలయాలు, వాటి నిత్య నైవేద్యానికి మాన్యాలు, ఆచారాలు, గ్రామం గురించిన గాథలు, విశ్వాసాలు, గ్రామం పుట్టుక గురించి అభూత కల్పనలు, గ్రామ సరిహద్దు వివరాలు ఎక్కువగానే కనబడతాయి. గ్రామంలోని భూములు, పంటలు, పన్నులు, చేనేత వంటి ఆనాటి ఉత్పత్తులు, వృక్షసంపద, జలవనరులు, ఖనిజాలు, సామాజిక సంబంధాలు, వృత్తికులాలకు మాన్యాలు వంటి వివరాలు కూడ కొన్ని కైఫియత్తులలో ఎంతో కొంత నమోదు అయ్యాయి. ఉదాహరణకు కడప జిల్లా సంబటూరు కైఫియత్తులో కరమ (కురుబ లేదా కురుమ కావచ్చు), వడ్లంగి (వడ్రంగి), అగసాల, తలారి, మంగలి, చాకలి, అంతుజాతికట్టు (బహుశా దళితులు కావచ్చు), దేవాదాయ, బ్రహ్మాదాయ మాన్యాలను గురించి విస్తీర్ణం, సరిహద్దులతో సహా చాల వివరంగా రాశారు. అలాగే కడప జిల్లా శెట్టిగుంట కైఫియత్తులో "యీ గ్రామం భూమిలో పండే ధాన్యాదుల వివరం – రాగులు, అరికెలు, ఉలవలు, మినుములు, వరి, సజ్జ, చామ, ఆముదాలు, జొన్నలు, మిర్పకాయలు, పొగాకు, నిమ్మ తోటలు, అరిటితోటలు, ఆకుతోటలు, పోకతోటలు, టెంకాయ తోటలు, గోగులు, కొర్రలు, కూరగాయలు, వగైరా, గుమ్మడికాయలు, సొరకాయలు, బీరకాయలు, బెండకాయలు, కాకరకాయలు – 23 జుమలా దినుసు వారి యిరువైమూడు" అని రాశారు. ఈ రెండో రకమైన ఆధారాల వల్ల కైఫియత్తులు గ్రామాల పరిశోధనకు ప్రధానమైన ఆధారాలుగా ఉపయోగపడతాయి.

1790ల నుంచి 1810ల నాటివరకు రాసిన ఈ కైఫియత్తులలో కొన్నిటిని మూడు నాలుగు దశాబ్దాల తర్వాత సి పి బ్రౌన్ (1798–1884) తిరగరాయించి భద్రపరిచాడు. **మెకంజీ కైఫియత్తులలో** గుంటూరు (254 గ్రామాలు), కృష్ణా (3), ప్రకాశం (14), నెల్లూరు (7), శ్రీకాకుళం (12), విశాఖపట్నం (12), విజయనగరం (4) జిల్లాలకు సంబంధించిన కైఫియత్తులను ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ ప్రచురించగా, కడప జిల్లా (127)కు సంబంధించిన కైఫియత్తులను సి పి బ్రౌన్ భాషా పరిశోధనా కేంద్రం ప్రచురించింది. ఈ గ్రామ కైఫియత్తులను అధ్యయనం చేస్తే, వాటిలో వదిలివేయవలసిన అంశాలను వదిలేసినా, గ్రామంలో ఎటువంటి భూములు ఉన్నాయి, అవి ఎవరి అధీనంలో ఉన్నాయి, గ్రామ కంఠం వంటి ఉమ్మడి భూములు ఎన్ని, ఏయే వృత్తికులాలకు ఎంతెంత మాన్యాలు ఉన్నాయి, గ్రామంలో ఏ పంటలు పండుతాయి, తోటలు ఎన్ని, ఏయే చెట్లున్నాయి, జలవనరులు ఏమిటి, గ్రామంలో పాలన ఎవరిది వంటి అనేక ప్రశ్నలకు స్థూలమైన జవాబులైనా దొరుకుతాయి. ఇప్పుడు అదనంగా చేరిన అనేక అంశాలతో పాటు, ఈ అంశాలను అధ్యయనం చేయడమే ఇవాళ్టికి కూడ గ్రామ అధ్యయనాలుగా భావిస్తున్నారు. కాకపోతే ఈ రెండు వందల సంవత్సరాలలో ఆ అధ్యయనాలకు శాస్త్రీయత, క్రమబద్ధత, నిర్దిష్టత్వం, ఒక వాస్తవాన్ని పలుకోణాలనుంచి పరిశీలించి నిగ్గు తేల్చడం, సర్వే, కేస్ స్టడీ, సెన్సస్, పార్టిసిపెంట్ అబ్జర్వేషన్ వంటి పటిష్టమైన క్షేత్ర పరిశోధనా సంవిధానాలు వచ్చాయి.

మెకంజీ దక్షిణ భారతదేశంలో చేసినటువంటి పనినే ఇతర బ్రిటిష్ అధికారులు దాదాపు అదే సమయంలో ఇతర ప్రాంతాలలో కూడ చేశారు. సరిగ్గా అదే సమయంలో బెంగాల్ ప్రెసిడెన్సీ గవర్నర్‌గా వచ్చిన కారన్ వాలిస్ (1738–1805) శాశ్వత భూమి శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టి గ్రామాలను, గ్రామాలలో భూసంబంధాలను, కంపెనీకి రాబట్టగల పన్నుల ఆదాయాన్ని అధ్యయనం చేయించాడు. దాదాపు అదే సమయంలో ఈస్టిండియా కంపెనీ స్కాటిష్ వైద్యుడు, భూగోళ శాస్త్రవేత్త ఫ్రాన్సిస్ బుచానన్ (1762–1829)ని ప్రత్యేకంగా మద్రాసు, మైసూరు, బీహార్, బెంగాల్ గ్రామాలలో, పట్టణాలలో ప్రజల పరిస్థితిని అధ్యయనం చేసి నివేదిక ఇమ్మని కోరింది. ఆయన పుస్తకం **'ఎ జర్నీ ఫ్రమ్ మద్రాస్ త్రూ ది కంట్రీస్ ఆఫ్ మైసూర్, కనరా, అండ్ మలబార్'** 1807లో అచ్చయింది.

శాశ్వత భూమి శిస్తు విధానం బెంగాల్ లో 1793లో మొదటిసారి అమలులోకి వస్తే, సరిగ్గా వంద సంవత్సరాల తర్వాత ఇండియన్ సివిల్ సర్వీస్ అధికారి, న్యాయమూర్తిగా పనిచేసిన బి ఎచ్ బెడెన్ పావెల్ (1841–1901) మూడు సంపుటాల, 2100 పేజీల **'ది లాండ్ సిస్టమ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా'** పుస్తకం రాశాడు. ఆయనే 1896లో ప్రధానంగా ఉత్తర భారత గ్రామాల గురించి **'ది ఇండియన్ విలేజ్ కమ్యూనిటీస్'** అనే 450 పేజీల పుస్తకాన్ని, 1899లో మొత్తంగా భారత గ్రామాల గురించి **'ది ఆరిజిన్ అండ్ గ్రోత్ ఆఫ్ విలేజ్ కమ్యూనిటీస్ ఇన్ ఇండియా'** అనే 100 పేజీల పుస్తకాన్ని ప్రచురించాడు. అలా దాదాపు పద్దెనిమిదో శతాబ్దం చివరినుంచీ బ్రిటిష్ అధికారులు, సామాజిక శాస్త్రవేత్తలు భారతీయ గ్రామాన్ని అధ్యయనం చేస్తూ వచ్చారు. వాటిలో పొరపాట్లు, పాలకవర్గ ప్రయోజనాల కొరకు మాత్రమే చేసిన అధ్యయనాలు ఉండవచ్చుగాని అవి ఇరవయో శతాబ్దిలో ఇంకా విస్తరించిన గ్రామ అధ్యయనాలకు ఉదాహరణలుగా నిలిచాయి. ప్రభావం చూపించాయి. అనుకూల, ప్రతికూల పాఠాలు నేర్పాయి.

ఆ క్రమంలోనే గ్రామాల అధ్యయనానికి వ్యవసాయాదాయ దృష్టి మాత్రమే కాక ఇతర అవసరాలు కూడ ఉనికిలోకి వస్తున్నాయి. అప్పుడే

ప్రారంభమవుతున్న కార్ఖానాలకు, రైల్వేలకు అవసరమైన కలప, బొగ్గు విపరీతంగా దొరికే భూభాగంగా భారత దేశాన్ని అధ్యయనం చేయడం బ్రిటిష్ ప్రయోజనాలలో అనివార్య భాగమయింది. అలా 1830ల నుంచీ వేరువేరు వనరుల లభ్యతను అధ్యయనం చేసే కమిటీలు వేయడం మొదలయింది. అలా 1836లో కోల్ (బొగ్గు) కమిటీ ఏర్పడింది. క్రమంగా ఇతర ఖనిజాలను అన్వేషించడానికి కమిటీలు ఏర్పడ్డాయి. మెకంజీ కైఫియత్తులలోనే, అంటే 1811 కు ముందే గుంటూరు జిల్లాలో వొణుకుబాదు, కుంకలకుంటలలో పొటాషియం నైట్రేట్, అగ్నిగుండాల, రావులపురంలలో రాగి, గండి గనుమలలో ఇనుము, చీమలమర్రిలో చౌడుప్పు (సోడియం కార్బనేట్), సూరేకారం దొరుకుతాయని, వేమవరంలో కాగితం తయారు చేస్తారని నమోదు చేశారంటే గ్రామ అధ్యయనాల వెనుక ప్రయోజనాలేమిటో అర్థమవుతుంది. అలాగే దాదాపు ప్రతి గ్రామంలోనూ పండే పంటల వివరాలు, ఉత్పత్తి అయ్యే చేనేత వస్త్రాల వివరాలు కూడ కైఫియత్తులలో నమోదయ్యాయి. ఈ అవసరాల కొనసాగింపుగానే 1851లో జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా ఏర్పాటయింది. క్రమక్రమంగా గ్రామ అధ్యయనాల స్థానాన్ని వనరుల అధ్యయనాలు ఆక్రమించాయి.

ఆ తర్వాత గ్రామ అధ్యయనాల బాధ్యత కొంతవరకు స్వతంత్ర సామాజిక శాస్త్రవేత్తల మీద, ప్రజా రాజకీయ శక్తుల మీద పడింది. అందుకే ఆధునిక ప్రజానుకూల గ్రామ అధ్యయనాల చరిత్ర పందొమ్మిదో శతాబ్దం చివర, ఇరవయో శతాబ్ది మొదట మొదలయింది. మహాదేవ గోవింద రానడే (1842-1901), దాదాభాయి నౌరోజీ (1825-1917) వంటి తొలితరం జాతీయవాదులు, అర్థ శాస్త్రవేత్తలు 1890లనాటికే భారత ఆర్థికవ్యవస్థకు, గ్రామాలకు బ్రిటిష్ పాలనవల్ల జరుగుతున్న నష్టాలను వివరించడానికి అధ్యయనాలు, విశ్లేషణలు ప్రారంభించారు గాని వారికి గ్రామాలతో పెద్దగా పరిచయం లేదు. భారత ఆర్థిక వ్యవస్థను బ్రిటిష్ ప్రభుత్వ పత్రాల నుంచి విశ్లేషించడానికే వారు ప్రయత్నించారు. అదే సమయంలో జి. ఎఫ్ కీటింగ్ (**రూరల్ ఎకానమీ ఇన్ ది బాంబే దక్కన్**, 1912), గిల్బర్ట్ స్లేటర్ (**ది రిపోర్ట్ ఆఫ్ ది లాండ్ ఎంక్వైరీ కమిటీ**, 1913), హెరాల్డ్ మాన్ (**లాండ్ అండ్ లేబర్ ఇన్ ఎ దక్కన్ విలేజ్**, 1917) వంటి స్వతంత్ర పరిశోధకులు గ్రామ, వ్యవసాయ రంగ అధ్యయనాలు ప్రారంభించారు.

బ్రిటిష్ అర్థశాస్త్రవేత్త, మద్రాస్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేసి దక్షిణ భారత గ్రామ అధ్యయనాలలో చాల కృషి చేసిన గిల్బర్ట్ స్లేటర్ 1918లో '**సమ్ సౌతిండియన్ విలేజెస్**' అనే పుస్తకం ప్రచురించాడు. ఆయన ఆ పుస్తకానికి ఉపోద్ఘాతంలో "పట్టణాల కన్న ముందు చూడవలసినవి గ్రామాలు. ఎన్నో ఆర్థిక సమస్యలను పట్టణాల దృక్పథం నుంచి పరిశీలించడం అలవాటయిన పారిశ్రామిక దేశాలలో కూడ గుర్తుంచుకోవలసిన విషయమేమంటే ఆ నగరాల, పట్టణాల ఆర్థిక జీవనాన్ని గ్రామాలతో సంబంధం లేకుండా అర్థం చేసుకోలేం. ఆ నగరాలకు, పట్టణాలకు అవసరమైన ఆహారాన్నీ, ముడి సరుకులనూ, అక్కడ శ్రామికులుగా అవసరమయ్యే యువతీ యువకులను అందించేది గ్రామీణ భూములే. భారతదేశంలో గనులు, పరిశ్రమలు, వాణిజ్యం, రవాణా వంటి ఏ రంగం కన్న ఎక్కువ మంది వ్యవసాయం మీదనే ఆధారపడి ఉంటారు. అందువల్ల గ్రామీణ కార్యకలాపాలు, గ్రామీణ జీవనం అత్యంత కీలకమైనవి. విస్మరించడానికి వీలులేనివి" అని రాశాడు.

ఇరవయో శతాబ్ది తొలి దశకాలలో, మొదటి ప్రపంచ యుద్ధ విధ్వంసం వల్ల భారత ఆర్థిక వ్యవస్థ దెబ్బతిన్న తర్వాత, వ్యవసాయ రంగం, రైతాంగం తీవ్రమైన సంక్షోభంలో పడడంతో 1926లో బ్రిటిష్ ప్రభుత్వం మొదటి రాయల్ కమిషన్ ఆన్ అగ్రికల్చర్ ఏర్పాటు చేసింది. సరిగ్గా అప్పుడే భారత జాతీయోద్యమం ఒక మలుపు తిరుగుతోంది. జాతీయోద్యమంలో భాగం కాగలిగిన విస్తారమైన ప్రజాశక్తి గ్రామాలలో ఉన్నదని, బ్రిటిష్ పాలకుల ముడిసరుకుల అవసరాలను గాని, మార్కెట్ విస్తరణ అవసరాలను గాని తీరుస్తున్నదీ, అపారమైన పన్ను ఆదాయాన్ని సమకూరుస్తున్నదీ గ్రామాలేనని గుర్తింపు వచ్చింది. దానితో రాజకీయ ఉద్యమానికి కూడ గ్రామాలవైపు దృష్టి మళ్లింది. గాంధీ ప్రభావంతో చంపారన్ (బీహార్)లో, కైరా (గుజరాత్)లో జాతీయోద్యమంలో భాగంగా గ్రామీణ, రైతాంగ ఉద్యమాలు ప్రారంభం కావడంతో గ్రామాల అధ్యయనం ప్రాధాన్యతను సంతరించుకుంది.

ఆ రాజకీయ, సామాజిక నేపథ్యంలో దేశ వ్యాప్తంగా గ్రామీణ అధ్యయనాలు సాగించే సంస్థలు పుట్టుకువచ్చాయి. పంజాబ్ బోర్డ్ ఆఫ్ ఎకనమిక్ ఎంక్వైరీ అనే సంస్థ ఏర్పడి 1920ల నుంచి పంజాబ్‌లో విడివిడిగా గ్రామాలను అధ్యయనం చేయడం ప్రారంభించింది. అదే పనిని 1930లలో బెంగాల్ లో బెంగాల్ బోర్డ్ ఆఫ్ ఎకనమిక్ ఎంక్వైరీ, కలకత్తా ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్ స్టిట్యూట్, విశ్వభారతి రూరల్ రికన్ స్ట్రక్షన్ బోర్డ్ సంయుక్తంగా చేశాయి. మిగిలిన అన్ని ప్రాంతాలలోనూ గ్రామాల అధ్యయనాలు ప్రారంభమయ్యాయి. అలా 1930ల చివరికి దేశ వ్యాప్తంగా గ్రామ అధ్యయనాల పట్ల శ్రద్ధాసక్తులు పెరిగాయి. ఆ దశకానికే గాంధీ ప్రభావం వల్ల గ్రామీణ ఆర్థిక వ్యవస్థ గురించి ఆలోచనలు కూడ పెరిగాయి. గాంధేయ ఆర్థికవేత్త జె సి కుమారప్ప 1935లో అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంఘం ఏర్పాటు చేశాడు. ఆయనే 1931లో గుజరాత్ లోని కైరా జిల్లాలో ఒక తాలూకా గ్రామాలలో అధ్యయనం జరిపి **'యాన్ ఎకనమిక్ సర్వే ఆఫ్ మటర్ తాలూకా'** పుస్తకం రాశారు. గాంధేయ సంఘ సంస్కర్త కాకా కాలేల్కర్ ఆ పుస్తకానికి రాసిన ముందుమాటలో "గ్రామాన్ని పట్టించుకోనక్కరలేదనే విద్యావంతులు తయారవుతున్నార"ని ఎగతాళి చేశారు. గ్రామాలు ముఖ్యమైనవని అనుకునేవారు కూడ గ్రామాలను నిర్దిష్టంగా, కచ్చితంగా, శాస్త్రీయంగా అధ్యయనం చేయడం లేదని, రైతులు స్వయంగా చెప్పినవి విని వాళ్ల నుంచి గణాంకాలు, వివరాలు సేకరించడం లేదని అన్నారు.

ఈ విమర్శలు ఎలా ఉన్నా 1940ల నాటికి గ్రామాల అధ్యయన ప్రాధాన్యత పెరిగింది. గ్రామాలను అధ్యయనం చేయాలనే ఆలోచనలు పెరిగాయి. అధ్యయనం చేసే పరిశోధకులు పెరిగారు, సంస్థలు విస్తరించాయి. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో అర్థశాస్త్రవేత్తలు డి ఆర్ గాడ్గిల్, సి ఎన్ వకీల్, సమాజ శాస్త్రవేత్తలు ఆర్ కె ముఖర్జీ, జి ఎస్ ఘుర్యే స్వయంగా గాని, తమ పరిశోధక విద్యార్థుల చేత గాని గ్రామాల అధ్యయనం మీద కేంద్రీకరించారు.

ఈ అకడమిక్ పరిశోధనలకు, అధ్యయనాలకు సమాంతరంగా, ఒక్కోసారి పరస్పర ప్రభావాలతో, సహకారంతో ఇరవయో శతాబ్ది తొలి అర్ధ భాగంలో రాజకీయ దృక్పథంతో కూడ గ్రామ అధ్యయనాలు జరిగాయి. గ్రామాల ప్రాధాన్యత గురించి గాంధీ అభిప్రాయాలు చాల ప్రాచుర్యంలో ఉన్నవే. గాంధీ ప్రభావం ఉన్నమేరకు జాతీయోద్యమ

కార్యకర్తలు గ్రామాల మీద దృష్టి పెట్టారు. అలాగే పట్టణంలో పుట్టి, పట్టణ ఉన్నతవర్గాల ప్రతినిధిగానే పేరు తెచ్చుకున్న జవహర్ లాల్ నెహ్రూ కూడ ఈ సమయంలోనే గ్రామాల మీద దృష్టిపెట్టాడు. గ్రామాలతో పరిచయం తమ వంటి మధ్యతరగతి కళ్లు తెరిపించిందని, తమ కళ్ల ముందర ఒక కొత్త భారతదేశం లేచి నిలిచిందని ఆయనే తన **డిస్కవరీ ఆఫ్ ఇండియాలో** రాసుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో జాతీయోద్యమంలో వస్తున్న చీలికలలో జయప్రకాశ్ నారాయణ, ఎన్ జి రంగా, సోషలిస్టులు, కమ్యూనిస్టులు అందరూ కూడ గ్రామాల మీద కేంద్రీకరించారు. గ్రామ రాజకీయాలు భారత జాతీయోద్యమ ప్రధాన రంగస్థలంగా మారాయి. అందువల్ల గ్రామాలను అధ్యయనం చేయడం ప్రతి రాజకీయ బృందానికీ అనివార్యమయింది. జాతీయోద్యమ నాయకులలో ప్రధానంగా డా. బి ఆర్ అంబేద్కర్ గ్రామాల గురించిన ఈ వైఖరిని వ్యతిరేకించారు. గ్రామమంటే హిందూ గ్రామమే అని ఆయన భావించారు. "హిందూ సామాజిక ధర్మం సంపూర్ణంగా పనిచేసేది గ్రామంలోనే" అని ఆయన అన్నారు. చివరికి రాజ్యాంగ ముసాయిదా చర్చలలో కొందరు సభ్యులు గ్రామ రాజ్యాలకు (రిపబ్లిక్‌లకు) అనుకూలంగా మాట్లాడినప్పుడు, "ఈ గ్రామ రాజ్యాలనేవి భారతదేశ క్షీణతకే దారితీశాయి...గ్రామమంటే ఏమిటి? అది స్థానికతా కూపం, అజ్ఞానం, సంకుచితత్వం, మతోన్మాదం వంటి వాటికి ఆలవాలం" అని జవాబిచ్చారు. గ్రామ పునరుద్ధరణలోగాని, పునర్నిర్మాణంలో గాని, గ్రామాభివృద్ధిలోగాని దళితులకు ఆశాజనకమైనదేమీ లేదని కూడ ఆయన భావించారు. అందువల్ల గ్రామాల అధ్యయనం మీద ఆయన ఆసక్తి కనబరచలేదు.

1947 తర్వాత వచ్చిన కొత్త ప్రభుత్వం తన దేశ పునర్నిర్మాణ లక్ష్యాలలో ఒకటిగా గ్రామీణాభివృద్ధిని ఎంచుకుంది. కనుక గ్రామాలను వాస్తవికంగా అధ్యయనం చేయడానికి, గ్రామాల స్థితిలో మార్పు తేవడానికి అవసరమైన ప్రణాళికలు రచించడానికి ఎక్కువ ప్రయత్నాలు మొదలయ్యాయి. ఆ సందర్భంలోనే బొంబాయి స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ ప్రొఫెసర్ వి వి శయన 1949లో **'అగ్రేరియన్ ప్రాబ్లమ్స్ ఆఫ్ మద్రాస్ ప్రావిన్స్'** అనే పేరుతో కోస్తా ప్రాంతాల గ్రామాల అధ్యయనం చేశారు. అర్థ శాస్త్రవేత్త పి సి జోషి **'చేంజెస్ ఇన్ క్లాస్ స్ట్రక్చర్ ఇన్ రూరల్ ఉత్తరప్రదేశ్'** పరిశోధన కోసం 1952-55 మధ్య ఉత్తరప్రదేశ్ గ్రామాలను అధ్యయనం చేశారు (ఆయన పరిశోధనా అనుభవాలను **'క్షేత్ర పరిశోధన అనుభవం - పునస్సమీక్ష'** పేరుతో వీక్షణం 2009 సెప్టెంబర్, అక్టోబర్ సంచికలలో చూడవచ్చు). సమాజ శాస్త్రవేత్త ఎస్ సి దూబె 1951-52లో హైదరాబాద్ పరిసరాలలోని షామీర్ పేటలో రెండు సంవత్సరాల పాటు అధ్యయనం చేసి **'ఇండియన్ విలేజ్'** పుస్తకం రాశారు. (తెలుగు అనువాదం **భారతీయ గ్రామము** తెలుగు అకాడమి ప్రచురణగా వెలువడింది). ఒక భారతీయ గ్రామం గురించి సమగ్రమైన అధ్యయనంగా ఈ రచనకు చాల పేరు వచ్చింది. గ్రామంలోని సామాజిక నిర్మితిని, ఆర్థిక నిర్మితిని, సంస్కార నిర్మితిని, కుటుంబ సంబంధాలను, జీవన స్థాయిలను, కలసిమెలసి జీవించడాన్ని, సామాజిక పరివర్తనను ఈ పుస్తకం విశ్లేషించింది. అప్పటికే సమాజ శాస్త్రవేత్త ఎం ఎన్ శ్రీనివాస్ మైసూరు రాష్ట్రంలో గ్రామాల అధ్యయనాలు చేసి ఉన్నారు. సమాజ శాస్త్రానికి సంబంధించినంతవరకు గ్రామీణ అధ్యయనాలలో 1955ను కీలక సంవత్సరంగా గుర్తిస్తారు. ఆ సంవత్సరమే ఎస్ సి దూబె **'ఇండియన్ విలేజ్'**, డి ఎన్ మజుందార్ సంపాదకత్వంలో **'రూరల్ ప్రొఫైల్స్'**, మెక్ కిమ్ మారియట్ సంపాదకుడిగా **'విలేజ్ ఇండియా'**, ఎం ఎన్ శ్రీనివాస్ సంపాదకుడిగా **'ఇండియాస్ విలేజెస్'** పుస్తకాలు వెలువడ్డాయి. ఆ తర్వాత 1950లలోనూ 1960లలోనూ అర్థశాస్త్ర, సమాజ శాస్త్ర శాఖలలో భారత గ్రామ అధ్యయనాలు, ప్రచురణలు విరివిగా జరిగాయి. గ్రామాలను అధ్యయనం చేయడానికీ, అర్థం చేసుకోవడానికీ, వివరించడానికీ, విశ్లేషించడానికీ అనేక సిద్ధాంతాలు, పరిశోధనా చట్రాలు, సంవిధానాలు ఉనికిలోకి వచ్చాయి.

అయితే గ్రామీణ అధ్యయనాలను ఇటు అర్థశాస్త్రవేత్తలు, అటు సమాజ శాస్త్రవేత్తలు చెరి ఒకవైపు లాక్కు పోయారని, అవసరమైన సమన్వయం కొరవడిందని సమాజ శాస్త్రవేత్త రామకృష్ణ ముఖర్జీ అంటారు. "సామాజిక శాస్త్రవేత్తలు గ్రామీణ సమాజ ఆర్థిక వ్యవస్థ మీదనే ఎక్కువ దృష్టి పెట్టారు గనుక, అది 1940ల తర్వాత మరింతగా పెరిగిపోయింది గనుక, గ్రామస్తులను సంఘజీవులుగా చూపే బదులు, అంతకంతకూ ఎక్కువ నైపుణ్యంతో వారిని అమూర్త ఆర్థిక, గణాంక ప్రత్యయాలుగా చూపడం మొదలయింది....అందువల్ల మరొక దృక్కోణం నుంచి గ్రామ అధ్యయనాలు జరపవలసిన అవసరం పెరిగింది. అంతకు ముందరి దశలోని అర్థశాస్త్రవేత్తలు తయారు చేసిన దృక్కోణానికి భిన్నమైన దృక్కోణాన్ని సాంస్కృతిక, సామాజికనర శాస్త్రవేత్తలు, సమాజ శాస్త్రవేత్తలు అభివృద్ధి చేశారు, వ్యాఖ్యానించారు....ఇలా అటు అర్థశాస్త్ర, ఇటు సామాజిక నరశాస్త్ర, సమాజ శాస్త్ర ముద్ర బలంగా ఉన్న రెండు పాయల గ్రామ అధ్యయనాలు కలవవలసిన అవసరం ఉంది. కనీసం రెండు పాయల మీద వంతెనలు నిర్మించవలసి ఉంది.... 'అర్థశాస్త్ర' 'సమాజ శాస్త్ర' దృక్కోణాలు కీలక స్థలాల దగ్గరనైనా కలుసుకోనంతవరకూ గ్రామ జీవితం గురించి సమగ్ర అవగాహన సాధ్యం కాదు, గ్రామీణ సమాజ చలనసూత్రాల గురించి సమ్యగ్ దృక్పథం సాధ్యం కాదు" అని ఆయన 1963లో రాసిన మాటలు ఇవాళ్టికీ గుర్తుంచుకోవలసినవే.

ఈ అకడమిక్ గ్రామీణ అధ్యయనాలు, చర్చలు ఒకవైపు జరుగుతుండగానే గ్రామ అధ్యయనాలను మరొక దృక్కోణం నుంచి చూడడం మొదలయింది. గ్రామాల అధ్యయనం కేవలం అధ్యయనం కోసమో, విశ్లేషణ కోసమో మాత్రమే కాదని, అది ఆచరణ కోసం, సామాజిక పరివర్తనా వ్యూహ రచన కోసం, సామాజిక చరిత్ర నిర్మాణంలో చోదకశక్తులయిన ప్రజలు గ్రామాలలో ఉన్నారు గనుక వారిని అధ్యయనం చేయాలని భావించే కమూనిస్టు, విప్లవ దృక్పథం అది. అంతకు ముందు నుంచీ కూడ ఈ దృక్పథం ఉన్నప్పటికీ భారత గ్రామ అధ్యయనాలలోకి 1960లలో ఎక్కువగా ప్రవేశించింది. అకడమిక్ ప్రపంచం కూడ దానికి ప్రతిస్పందించవలసి వచ్చింది. విస్తృతంగా చర్చలు జరపవలసి వచ్చింది. అలా ఇరవయో శతాబ్ది మలి అర్థభాగంలో కమ్యూనిస్టులు, నక్సలైట్ విప్లవకారులు చేసిన గ్రామ అధ్యయనాల చరిత్ర చాల ఆసక్తికరమైనది, ఆలోచనాప్రేరకమైనది, ఆచరణకు మార్గదర్శిగా పనిచేసేది.

(ఇంకా ఉంది)

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# రాజకీయ వేదికలు కానున్న సర్కార్ బళ్లు

***ఇప్పటికే పలు రుగ్మతలతో అవస్థ పడుతున్న పాఠశాలలను బోధనేతర అవసరాలకు వాడుకోవడానికి అనుమతులు ఇవ్వడంతో పరిస్థితి మరింత దిగజారిపోయే ప్రమాదం ఉందని అంటున్నారు ఎ. పున్నయ్య***

పాఠశాల విద్యారంగం తీవ్ర సంక్షోభంలో ఉండగా విద్యా వ్యవస్థను ఛిన్నాభిన్నం చేస్తూ, పాఠశాలలను రాజకీయ వేదికలుగా చేసే ప్రయోగమే జి.ఒ. నెం. 130. గత ప్రభుత్వాలు పాఠశాల విద్యా కమిటీలకు ఎన్నికలు పెట్టి ఆ చేదు అనుభవం పూర్తిగా మరువకముందే మరొక ప్రయత్నానికి ప్రభుత్వం పూనుకోవడం విద్యారంగం పట్ల ప్రభుత్వ అసంబద్ధ విధానాలకు అద్దం పడుతుంది. విద్యారంగం ద్వారా గొప్ప రాజకీయ విలువలను అభివృద్ధి చేసే, నైతిక విలువలున్న ఆదర్శ నాయకులకు పునాదిగా ఉండే విద్యార్థి సంఘ ఎన్నికలను కొన్ని లొసుగులు చూపిస్తూ ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వం అప్రజాస్వామ్యంగా రద్దు చేసింది. కాగా స్వతంత్ర ప్రతిపత్తిగల విద్యావ్యవస్థగా కొనసాగాల్సిన విద్యారంగంలో నిరంతర ఘర్షణా వేదికల నిలయాలుగా పాఠశాల మేనేజ్‌మెంట్ కమిటీ (ఎస్.ఎం.సి.) ల రూపంలో పట్టణాలు, గ్రామాల్లో ప్రవేశించనున్నాయి.

పాఠశాల మౌలిక వసతుల కల్పనలో ఈ కమిటీలు పనిచేస్తే ఆహ్వానించాల్సిందే కాని ఇవాళ గ్రామీణ ప్రాంతాల్లో రాజకీయ పెత్తనం విద్యావ్యవస్థను ఎట్లా శాసిస్తున్నదో తెలిసిందే. మధ్యాహ్న భోజన ఏజెన్సీల కోసం ఎన్ని గొడవలు సృష్టిస్తున్నారో పత్రికల్లో చూస్తున్నాం. పంట ఏజెన్సీ కోసం వెంపర్లాడే ఈ రాజకీయ పెత్తందార్లకు విద్యార్థులకు సరైన ఆహారం అందించడంలో ఆ చైతన్యం కనిపించడం లేదు. ప్రభుత్వం విడుదల చేసే కాంటింజెన్సీ గ్రాంట్స్, మెయిన్‌టెనెన్స్ గ్రాంట్స్, స్కూల్ గ్రాంట్స్ పాఠశాల కోసం ఖర్చు చేస్తే మీకేంటి? మావాటా ఎంత? అన్న సజీవ సాక్ష్యాలెన్నో.

కేంద్ర ప్రభుత్వం ఏప్రిల్ 2010న విద్యా హక్కు చట్టాన్ని అన్ని రాష్ట్రాల్లో అమలుకు నిర్ణయించింది. మన రాష్ట్రంలో మార్చ్ 3న రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన జి.ఒ. నెం. 20 ప్రకారం విద్యాహక్కు చట్టం అమలుకు చేపట్టాల్సిన చర్యల గురించి తన లేఖ ద్వారా ప్రభుత్వానికి సూచించారు. విద్యాహక్కు చట్టం 2010ని స్వాగతిస్తూనే కొన్ని మౌలిక మార్పులు చేపట్టాలని అనేకమంది మేధావులు, విద్యావేత్తలు, విద్యార్థి ఉపాధ్యాయ సంఘాలు సదస్సులు, ఆందోళనలు, ప్రజా ఉద్యమాల ద్వారా ప్రభుత్వానికి నివేదించాయి. వాటి గురించి ప్రభుత్వం సమీక్షిస్తున్నట్లు గాని, పరిశీలిస్తున్నట్లు గాని కనీస హామీ ఇవ్వలేదు.

ప్రధానంగా ఈ విద్యాహక్కు చట్టంలో విభేదించే అంశాల్లో, ప్రభుత్వం పాఠశాల విద్యారంగమంటే 1 నుండి 8 తరగతి వరకే తమ బాధ్యత అన్నట్లు స్పష్టంగా పేర్కొంది. కాని 1 తరగతికి ముందు పూర్వ బాల్య దశ గురించి, 8వ తరగతి తర్వాత పాఠశాల విద్యను గురించి పరిగణనలోకి తీసుకోవడం లేదని, పూర్వ బాల్య దశ నుండి ప్లస్ టూ స్థాయి వరకు ప్రభుత్వ నిర్వహణలో ఉంటే పటిష్టంగా ఉంటుందన్న మెజారిటీ అభిప్రాయాలను పట్టించుకోలేదని విద్యాహక్కు చట్టం అమలుకు రాజీవ్ విద్యా మిషన్ డైరెక్టర్ లేఖ నెం. 16 ఆధారంగా రాష్ట్ర ప్రభుత్వం సెప్టెంబర్ 9న జి.ఒ. నెం. 130ని విడుదల చేసింది. ఇందులో ప్రధానంగా మానసిక శాస్త్రవేత్తలు చెప్పిన విషయాలు పక్కనపెట్టి, క్షేత్రస్థాయిలో సామాజిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకోకుండా, విద్యారంగ నిపుణుల అభిప్రాయాలను సమీక్షించు కోకుండా, పాఠశాలలో అకడమిక్ అథారిటీ నిర్దేశించిన విద్యా సామర్థ్యాలను పిల్లలు సాధించారా, లేదా అనే అంశానికి ఉపాధ్యాయుడే బాధ్యుడని, 60 శాతం కంటే విద్యా సామర్థ్యాల స్థాయి తగ్గితే ఆ తరగతుల సబ్జెక్టును బోధించిన ఉపాధ్యాయునికి పాఠశాల మేనేజ్‌మెంట్ కమిటీ నిర్ణయం మేరకు శిక్షలుంటాయి అన్నదే సారాంశం. సిసిఎ రూల్స్ ఆధారంగా ఉపాధ్యాయునికి భారీగా అపరాధ రుసుం, సస్పెన్షన్, ఇంక్రిమెంట్ కట్ వంటి శిక్షలు విధిస్తారు. సామర్థ్యాల సాధన 90 శాతం మించితే ఆ ఉపాధ్యాయునికి అవార్డు, ప్రశంస కోసం పాఠశాల మేనేజ్‌మెంట్ కమిటీ ప్రభుత్వానికి నివేదిస్తుంది.

ఇప్పటికే స్వయం దరఖాస్తు విధానంతో అవార్డుల కోసం పాకులాడే విద్యా వ్యవస్థలో స్కూల్ మేనేజ్‌మెంట్ కమిటీ (ఎస్.ఎం.సి.) లను మేనేజ్ చేయడంతో పాటు కాగితాలపై చూపే సామర్థ్యాల సాధన ఏ మేరకు ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. దీంతోపాటు పొలిటికల్ మేనేజ్‌మెంట్ కేంద్రాలుగా ఇవి కొనసాగే అవకాశం ఉంది. ప్రభుత్వం బలవంతంగా ఈ జి.ఒ.ను అమలు చేయాలని చూస్తే శిక్షణా కేంద్రాల్లో నామమాత్రంగా సాగే బోధన, లక్ష్యసాధనపై లేని పర్యవేక్షణ వల్ల కచ్చితంగా కాగితాలకే పరిమితమై విఫల ప్రయత్నమే అవుతుంది. నిజానికి సామర్థ్యాల (సి.ఎల్.ఐ.పి., ఎల్.ఇ.పి.) ఆధారంగా అన్ని తరగతుల పుస్తకాల రచన జరగలేదు. కొన్ని జరిగినప్పటికీ ఆ మేరకు అవగాహన కల్పించడానికి నిర్వహించిన శిక్షణా తరగతుల్లో శాస్త్రీయంగా బోధించడంలో విఫలమయ్యారు. కాంప్లెక్స్ మీటింగ్ పేరుతో పేరుకే తేదీలు ప్రకటించి నామమాత్రపు ఎజెండాతో వృత్యంతర శిక్షణా తరగతులకు హాజరయ్యే ఉపాధ్యాయుల శాతం అంతంత మాత్రమే. పర్యవేక్షణ లోపం, సామర్థ్యాల సాధనలో అవగాహనా లోపాలు ఉండనే ఉన్నాయి. అందువల్ల ప్రస్తుతం పాఠశాలల్లో ఎ బి సి డి గ్రేడుల్లో ఎ / బి గ్రేడ్ పాఠశాలల సంఖ్య కనిష్టంగా ఉన్నాయి. సి డి గ్రేడ్ పాఠశాలలు గరిష్ట స్థాయిలో ఉన్నాయి. ఈ విషయాన్ని ప్రభుత్వాలు ఇప్పటికైనా గ్రహించాలి.

ప్రభుత్వ ఉత్తర్వుల (జి.ఒ.) ప్రకారం స్కూల్ మేనేజ్‌మెంట్

# రష్యాలో అక్టోబర్ విప్లవం

***రష్యాలోని రాచరికాలతో, భూస్వామ్య పీడనలతో నలిగిపోయిన రైతుల, శ్రామికుల తిరుగుబాటుగా వచ్చిన మహత్తర అక్టోబర్ విప్లవ చరిత్ర పూర్వాపరాలను వివరిస్తున్నారు*** **ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు**

ప్రపంచ విప్లవాల చరిత్రలో రష్యాలో జరిగిన అక్టోబర్ విప్లవానికి ఒక మహోన్నతమైన స్థానం ఉంది. ఆ విప్లవం ప్రపంచ చరిత్రలోనే తొలిసారిగా ఒక శ్రామికవర్గ రాజ్యాన్ని స్థాపించింది. అప్పటిదాకా సిద్ధాంతరీత్యా మాత్రమే సాధ్యమైన కమ్యూనిస్టుల కలల రూపం ఆచరణ రీత్యా కూడా సాధ్యమైంది. అంతేగాక మాటల్లో విప్లవాన్ని, చేతల్లో వెనకబాటుతనాన్ని ప్రదర్శించే వాగాడంబరులైన కుహనా విప్లవకారుల డొల్లతనాన్నీ అది బట్టబయలు చేసింది. యూరప్‌లో కెల్లా అత్యంత వెనకబడిన, పరమ ఫ్యూడల్ స్వభావం గల ఒక దేశంలో బూర్జువా ప్రజాస్వామ్యంగాక, వాస్తవిక అర్థంలోగల ప్రజాస్వామ్యాన్ని పరిఢవిల్లేట్లు చేసింది. అంత మాత్రమే కాదు, ప్రపంచంలోని పలు ఇతర దేశాలలోనూ విప్లవాలకు ప్రేరణనిచ్చింది. ఈ సమస్త భూ ప్రపంచంలోనూ పలు రూపాల్లో సాగుతున్న దోపిడీ, పీడన, అణచివేతలకు వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలను రగుల్కొల్పింది.

రష్యన్ విప్లవానికి ఇంతటి చారిత్రక ప్రాధాన్యత ఉన్నందు వల్లనే పలువురు చరిత్రకారులు తమ తమ దృక్పథాల నుండి దాన్ని పలు విధాలుగా కొనియాడారు. ఇస్లాం ఆవిర్భావం తర్వాత ఘటనలలో దాన్ని అత్యంత ముఖ్యమైందిగా ఒక చరిత్రకారుడు (ఎచ్.జి. వెల్స్) భావిస్తే, క్రీస్తు జననం తర్వాత అత్యంత భావగర్భితమైందిగా మరో ప్రసిద్ధ చరిత్రకారుడు (హెరాల్డ్ లాస్కీ) భావించాడు.

ఎంతో వెనకబడి ఉన్న రష్యాలో ఇంతటి ప్రాధాన్యమున్న విప్లవం రావడానికి దారితీసిన అంశాలలో ఒకటి తరతరాలుగా సాగిన జార్ చక్రవర్తుల పరమ నిరంకుశ పాలన. ప్రస్తుత వ్యాసంలో వారు సాగించిన క్రూర పద్ధతుల గురించి తెలుసుకునే ముందు రష్యా దేశ చరిత్ర గురించి, దాని వెనకబాటుతనం గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

## చరిత్రలో రష్యా

16వ శతాబ్దికి ముందు చరిత్రలో ఎక్కడా 'రష్యా' అన్న దేశం పేరే కనబడదు. 'మస్కవి' అన్న బలహీనమైన సంస్థానమే 'మాస్కో'గా పరిణమించింది. 9వ శతాబ్దిలో జర్మనులు, 10వ శతాబ్దిలో గ్రీకులు, 13వ శతాబ్దిలో తార్తారులు బానిస జాతికి చెందిన రష్యన్ ప్రాంతాన్ని ఆక్రమించుకుని పాలించారు. 16వ శతాబ్దంలో 'మాస్కో'ను పాలించిన 3వ ఇవానోవ్ (ఇవాన్ ది గ్రేట్), 4వ ఇవానోవ్ (ఇవాన్ ది టెర్రిబల్) తార్తారుల్ని తరిమి, రష్యాను విముక్తి చేసి, 'జార్' అనే బిరుదును పొందారు. వీరి కాలంలో రాజ్యం ఉరల్ పర్వతాల దాకా విస్తరించి

---

కమిటీలో తల్లిదండ్రులు లేదా సంరక్షకులు సభ్యులుగా ఉంటారు. వీరిలో జనరల్ కేటగిరి నుంచి ఇద్దరు, ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ నుంచి ఒక్కొక్కరు సభ్యులుగా ఉంటారు. వీరిని తల్లిదండ్రులు ఎన్నుకుంటారు. ప్రధానోపాధ్యాయుడు కన్వీనర్‌గా వ్యవహరిస్తారు. ఇందులో గ్రామ పంచాయతీ వార్డు సభ్యుడు, అంగన్‌వాడి టీచర్, ఇతర స్వచ్ఛంద సంస్థలకు చెందిన వ్యక్తులు సభ్యులుగా ఉంటారు. తల్లిదండ్రులందరూ సాధారణ సభ్యులు. ఈ కమిటీ సభ్యులిచ్చే ఏ ఫిర్యాదులైనా వాటి పరిష్కారానికి నాలుగు స్థాయిల్లో వేదికలు ఏర్పాటు చేస్తారు. ఈ క్రమంలో కమిటీలోని సభ్యులు ప్రతి ఉపాధ్యాయుడూ తమ అధీనంలో ఉన్నాడన్న భావనతో ఉంటూ ఉపాధ్యాయులపై వ్యక్తిగత వేధింపులకు దిగే అవకాశాలెన్నో. గ్రామ పంచాయతీ మండల, జిల్లా, రాష్ట్రస్థాయి కమిటీల ద్వారా ఫిర్యాదులు పరిష్కరిస్తామని చట్టంలో పేర్కొన్నందున, ఎక్కడ, ఏ స్థాయిలోనైనా మేనేజ్ అయ్యే అవకాశాలు ఉండనే ఉంటాయి.

విద్యా వ్యవస్థను సంక్షోభంలోనికి నెట్టడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభుత్వాలు, ప్రభుత్వ విద్యారంగ వ్యతిరేక విధానాలే కారణమని అవి గుర్తించడం లేదు. ప్రభుత్వానికి విద్యారంగం మీద చిత్తశుద్ధి ఉంటే విద్యా శాఖలో అన్ని స్థాయిల్లో ఇన్ని ఖాళీలుండేవి కావు. ఇంతగా పర్యవేక్షణా వ్యవస్థ కుప్ప కూలేదా? విద్యావ్యవస్థ కుదేలయ్యేదా? జిల్లా, మండల పాఠశాల స్థాయిల్లో కీలకమైన పర్యవేక్షణాధికారుల పోస్టుల్లో సింహభాగం ఖాళీగానే ఉన్నాయి. మొత్తం డి.ఇ.ఓ. కేడర్ పోస్టులు 33 వరకు ఉండగా ప్రస్తుతం 23 ఖాళీగా ఉన్నాయి. నాలుగు ఏజెన్సీల్లో డి.ఇ.ఓ. పోస్టులు, ఆరు డిప్యూటీ డైరెక్టర్లు, 146 ఉప విద్యాధికారులుంటే అందులో 90 ఖాళీలు; 1143 మండల విద్యాధికారులుంటే అందులో 836 ఖాళీలు, 50 వేల ఉపాధ్యాయ పోస్టులను భర్తీ చేయాల్సి ఉంది.

విద్యా హక్కు చట్టం ప్రకారం ఒక్క పోస్టు కూడా ఖాళీ ఉండరాదు. పాలనాపరంగా ఇంచార్జీ బాధ్యతలు నిర్వహిస్తే కేవలం మూడు నెలలు మాత్రమే ఇంచార్జీలుగా కొనసాగాలనే నియమాన్ని ప్రభుత్వమే తుంగలో తొక్కింది.

ఖాళీలు భారీగా పేరుకుపోవడంతో దాని ప్రభావం విద్యా బోధనా ప్రమాణాలపై పడుతుంది. ఇంచార్జీల పాలనతో సరైన పర్యవేక్షణ లేదు. ఎక్కడా తనిఖీల్లేవు. ఇంచార్జీలకు రాతపూర్వక రిపోర్టులు పంపేందుకే సమయం చాలట్లేదు అనేది బహిరంగ చర్చ. ఇంకా డి.ఇ.ఓ. స్థాయి ఇంచార్జిలకు విద్యావ్యవస్థపై సరైన అవగాహన లేదు. తనిఖీలు లేని కారణంగా క్షేత్రస్థాయిలో ఏమి జరుగుతోందో సర్కారుకు తెలియని స్థితిలో ఈ జి.ఓ. 130 తీయడం మరింత విడ్డూరంగా ఉంది.

*(రచయిత డి.టి.ఎఫ్. రాష్ట్ర కౌన్సిలర్)* వీ

'రష్యా' అనే రాజ్యంగా అవతరించింది. వీరి తర్వాత వచ్చిన 'రోమనోవ్' వంశస్తుల పాలనలో రష్యా మరింత విస్తరించి, ఆధునికీకరణ జరిగి, ఐరోపాలో ఒక ముఖ్యపాత్ర వహించింది. వీరిలో పీటర్ (1682-1725) 'ఘనత వహించిన పీటర్' (పీటర్ ది గ్రేట్)గా ప్రసిద్ధి పొందాడు. అలాగే రెండో కాథరిన్ (1762-96). ఈ ఇద్దరూ రష్యా సామ్రాజ్య విస్తరణకూ, ఆధునికీకరణకూ కృషి చేశారు.

## రష్యా వెనకబాటుతనం

రాజ్యం ఎంత విస్తరించినా, అభివృద్ధిలో ఎంత ముందడుగు వేస్తున్నా, నాడు రష్యా ఇతర ఐరోపా దేశాలతో పోల్చుకుంటే ఎంతో వెనకబడి ఉంది. పారిశ్రామిక అభివృద్ధి లేక, కేవలం వ్యవసాయిక దేశంగానే ఉంది. చాలాకాలం దాకా రష్యాకు సముద్ర రేవులు లేకపోవడం వల్ల పశ్చిమ ఐరోపాతో సంబంధాలు లేవు. అందువల్ల తూర్పు దేశాల నాగరికతకే సన్నిహితంగా ఉండి, తన వలసలను కూడా తూర్పు దేశాలలోనే నెలకొల్పింది. రష్యన్ సామ్రాజ్యం అతి విశాలంగా ఉండి (సోవియట్ యూనియన్ విడిపోయాక కూడా రష్యా దేశం వైశాల్యంలో నేటికీ ప్రపంచంలోనే అతి పెద్ద దేశం), ఇటు ఆసియా ఖండానికీ, అటు ఐరోపా ఖండానికీ వ్యాపించినప్పటికీ, పశ్చిమ ఐరోపాతో సంబంధాలు లేకపోవడం చేత, ఐరోపాలో 16, 17 శతాబ్దాలలో వచ్చిన సాంస్కృతిక పునరుజ్జీవనం వల్ల వచ్చిన మత, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, సాంఘిక మార్పులు రష్యాలోకి ప్రవేశించలేదు. అందువల్లనే ఐరోపాలో అవలంబిస్తున్న కాథలిక్కు, ప్రొటస్టెంట్ మతశాఖలకు దూరంగా ప్రాచీనమైన గ్రీక్ ఆర్థడాక్స్ శాఖనే అంటిపెట్టుకుని ఉంది.

ఇక ఇప్పుడు ప్రస్తుత వ్యాసాంశమైన జార్ ప్రభువుల నిరంకుశ పాలన గురించి తెలుసుకుందాం. రష్యాను పాలించిన జార్ చక్రవర్తులంతా పరమ నిరంకుశంగా పాలించారు. తమ కత్తికి ఎదురే లేనట్లు, తాము అనుకున్న పనిని నెరవేర్చడానికి ఎంతటి ఘోరాలకైనా తెగబడ్డారు. తమ మాట వినని, తమని ఎదిరించినవారు ఎంతటి వారైనా, ఎంత మందినైనా నిర్దాక్షిణ్యంగా ఊచకోత కోశారు. ప్రజల్ని భయభ్రాంతులకు గురిచేసి, వారంతా అణగిమణిగి పడి ఉండేటట్లు చేశారు. వారికి ఎలాంటి హక్కులూ లేకుండా నిరంకుశ పాలన సాగించారు. వారి నిర్దాక్షిణ్యానికీ, క్రూరత్వానికీ కొన్ని ఉదాహరణలు చూడండి.

'పీటర్ ది గ్రేట్'గా చరిత్రకారులచేత మన్ననలందిన పీటర్ రష్యాను శక్తిమంతమైన రాజ్యంగా తీర్చిదిద్దినప్పటికీ, ఇతడు సాగించిన దురాగతాలకు లెక్కలేదు. తాను విదేశ పర్యటనలో ఉన్నప్పుడు తిరుగుబాటు చేసిన తన అంగరక్షక దళ నాయకులు రెండు వేల మందిని ఉరికంబాలెక్కించి, ఐదు వేల మందిని దారుణంగా నరికి, తిరుగుబాటును క్రూరంగా అణచివేశాడు. విదేశీ సైనికాధికారుల్ని రప్పించి, ఉన్నత పదవుల్లో కూర్చోబెట్టడం ఈయనతోనే మొదలైందని చెప్పవచ్చు. తన నిరంకుశాధికారాల్ని సుస్థిరం చేసుకోవడానికి సాంప్రదాయిక ప్రభు వర్గాన్ని రద్దుచేసి, తన ఏజెంట్లను నియమించాడు. మధ్య యుగాల నుండి కొనసాగుతున్న పార్లమెంట్‌ను పోలిన 'డ్యూమా'ను సమావేశ పరచలేదు. ఇతని కాలంలోనే విరోధుల గుట్టు ముట్లులాగే రహస్య పోలీసు వాళ్లను దేశమంతటా ఏర్పాటు చేశాడు. జుట్టు, దుస్తులతో మొదలై ప్రజల ఆచార వ్యవహారాల్లో కూడా జోక్యం చేసుకుని, బలవంతాన పాశ్చాత్యీకరణ సాగించాడు. అంతా పొగతాగాలని నిర్బంధించాడు. కొన్ని విషయాల్లో అభ్యుదయ దృక్పథం కనబరచినా (స్త్రీలు పరదాను వదలాలనడం, పురుషులతో పాటు అన్ని రంగాల్లోనూ వారిని ప్రోత్సాహపరచడం) అదంతా పాశ్చాత్య పద్ధతులపై వ్యామోహంతో తప్ప, తన బుర్రకు తట్టి కాదు. ఈ పద్ధతుల్ని వ్యతిరేకించిన వారెవరైనా సహించలేదు. అలా చేసిన తన వదిననే కఠినంగా శిక్షించి, కాన్వెంట్‌కి (మత విషయకమైన సంస్థ) పంపించాడు. తన స్వంత భార్యకు విడాకులిచ్చాడు. ఆఖరికి యువరాజైన అలెక్సిస్‌ను కూడా వదిలిపెట్టక, చనిపోయేదాకా కొరడాలతో కొట్టించాడు.

ఇక సామ్రాజ్య విస్తరణకు కృషిచేసి, సమర్థకురాలిగా పేరొందిన రెండో కాథరిన్ మహారాణి (1762-96) కూడా, తాను జర్మన్ జాతికి చెందినప్పటికీ, అధికారాన్ని చేపట్టగలగడం భర్తను చంపడం ద్వారానే కావడం గమనార్హం! ఈమెకు నీతి నియమాలు లేవంటారు. ఈమె కూడా కొన్ని మంచి పనులు చేస్తున్నట్లు నటించడం కపటోద్దేశంతోనే. ఉదాహరణకు ఈమె పలు పాఠశాలలకు, అకాడమీలు స్థాపించింది. ఆ పని చేసింది ఎందుకో ఆమె మాటల్లోనే చూడండి - మాస్కో గవర్నర్‌కు ఆమె రాసిన ఉత్తరంలో 'రష్యన్‌లకు విద్యార్జన దష్టిలేదని విచారించకు. నేను పాఠశాలల్ని స్థాపించడం రష్యన్ల కోసం కాదు. వాటి ద్వారా ఐరోపా అంతటా మన పేరు ప్రతిష్ఠలు నిలబెట్టుకోవడానికే, మన రైతులు నిజంగా విద్యావంతులైన నాడు నీవూ, నేనూ మన పదవుల్ని కోల్పోక తప్పదు' అని అన్నది. సంస్కరణాభిలాషగల ప్రభుత్వ ఉద్యోగుల్ని ఈమె కొరడాతో కొట్టి శిక్షించిందంటే, ఈమె నిజస్వరూపం ఏమిటో గ్రహించవచ్చు.

ఈమె రాజ్యదాహానికి పోలెండ్ దేశం మూడుసార్లు విభజించ బడ్డది. స్వాతంత్ర్యం కోసం ఆ దేశ ప్రజలు తిరుగుబాటు చేస్తే, వేలాది మందిని ఊచకోత కోయించింది. మతం పేరుతో టర్కీలో పదే పదే జోక్యం చేసుకుని, ఆ రాజ్యంలోకి జొరబడి, నల్ల సముద్రంపై ఆధిపత్యం నెలకొల్పి, మధ్యధరా సముద్రం ద్వారా పశ్చిమ రాజ్యాలతో వర్తకం చెయ్యడానికి రెండో పశ్చిమ కిటికీ సంపాదించింది.

ఈ విధంగా 18వ శతాబ్ది అంతానికే రష్యాను ఒక బలవత్తరమైన, శక్తిమంతమైన రాజ్యంగా రూపొందించి, ఐరోపా వైపుకు కిటికీలు తెరిచారు గానీ, జార్ చక్రవర్తులు జాత్యాహంకారంతో తమ కళ్లకు కమ్మిన పొరల్ని మాత్రం విడవలేకపోయారు. ఎన్నో జాతులకు నిలయంగా ఉన్న తమ విశాల రాజ్యాన్ని రష్యనేతర జాతుల బందిఖానాగా మార్చారు. రష్యన్ జాతీయులలో అత్యధికులు స్లావ్ (బానిస) జాతికి చెందినవారు. వీరిలో జాతి భావనను రెచ్చగొట్టి, దేశ ప్రజలలో సగానికి పైగా ఉన్న రష్యనేతర జాతులను తక్కువ జాతివారుగా, నీచంగా చూడడం జార్ ప్రభుత్వం నేర్పింది. ఈ జాతులకు ఏ హక్కులూ లేవు. వారిని అన్ని విధాలా అవమానాలకు గురిచేసేది. వారిని అధికార ప్రకటనలలో పరాయి వారి (ఇన్‌టార్‌ట్సీ)గా ప్రకటించేది. వారిపై ద్వేషమూ, అసహ్యమూ పురికొల్పేది. బుద్ధిపూర్వకంగా వివిధ జాతుల మధ్య విభేదాలు కల్పించేది. ఒక జాతిపై మరొక జాతిని రెచ్చగొట్టేది. అంతేగాక, యూదులపై హత్యాకాండలను (పోగ్రోమ్స్)ను ప్రోత్సహించింది. ఆర్మీనియన్లకూ, అజర్‌బైజానియన్లకూ మధ్య హత్యాకాండలు రేగేట్టు రెచ్చగొట్టింది. కొన్ని రష్యనేతర జాతుల్ని వారి స్వస్థలాల నుండి తరిమివేసి, వాళ్ల భూముల్ని రష్యన్ భూస్వాములకూ, ధనిక రైతులకూ అప్పగించింది. దేశ, రాష్ట్ర స్థాయిల్లోని ఉద్యోగాలలో అధిక భాగం రష్యన్ జాతీయులతోనే నింపింది. అలాగే పాలనా భాషగానూ, కోర్టు

భాషగానూ, విద్యాబోధనా మాధ్యమంగానూ రష్యన్ భాషనే వినియోగించింది. అంతేగాక, రష్యనేతర జాతుల్ని బలవంతంగా 'రష్యన్ మయం' చేయడానికి ప్రయత్నించింది. అంతటితో ఆగకుండా, రష్యనేతర భాషల్లో పుస్తకాలు గానీ, పత్రికలు గానీ ప్రచురించడాన్ని నిషేధించింది. ఈ విధంగా రష్యనేతర ప్రజల్ని నానా హింసలకు గురిచేశాయి అన్ని జార్ ప్రభుత్వాలు. అంతేగాక, ప్రాంతీయంగా ఉన్న కొద్ది పాఠశాలల్లో కూడా ప్రాంతీయ భాషల్లో బోధించకుండా నిషేధించాయి. ఆయా జాతుల ప్రత్యేక సంస్కృతి ఎక్కడ కనిపించినా, దాన్ని రూపుమాపే వరకూ ఏ జార్ ప్రభుత్వమూ విశ్రమించింది కాదు. ఈ విధంగా తమ సామ్రాజ్యంలోని ప్రజలంతా స్లావ్ భాషనూ, సంస్కృతి వ్యవస్థలనూ అవలంబించాల్సిందిగా బలవంతం చేసింది. ఇలా చెయ్యడాన్నే 'రూసీకరణ' అంటారు.

కేవలం జాతి వివక్షను పాటించి స్లావ్ భావనను రెచ్చగొట్టిన రష్యన్ జాతీయుల మద్దతు పొందడానికి కృషి చేయడంతోనే సరిపెట్టుకోకుండా పీటర్, ప్రజల్లో కృత్రిమంగా అంతస్తుల తేడాను ఏర్పర్చడం ద్వారా కృత్రిమ కులీన వర్గాన్ని ఏర్పరచి, వారి మద్దతును కూడా పొందాడు. వీటికి తోడు వాణిజ్యాన్ని, చిన్న పరిశ్రమల్ని స్థాపించడానికి కృషి చేసి మధ్యతరగతి వర్గాన్ని సృష్టించి, వారి మద్దతూ పొందాడు. అయితే వీరెవరూ పేద ప్రజల స్థితిగతుల్ని పట్టించుకున్న పాపాన పోలేదు. పీటర్ చేసిన ఒకానొక దుష్కృత్యాన్ని గురించి చెబితే, అతడెంతటి క్రూరుడో అర్థం చేసుకోవచ్చు. రష్యా దేశానికి రెండో రాజధాని కోసం చిత్తడి నేల 'సెంట్ పీటర్స్‌బర్గ్' పట్టణాన్ని నిర్మించింది ఇతడే. ఆ పట్టణ నిర్మాణ సమయంలో బలవంతంగా వేలాది మంది పేద ప్రజల నెత్తురు చిందింపజేసి, ఆ బురద నేలలోకి దూర ప్రాంతాల నుంచి నగర నిర్మాణానికి సరిపడా గట్టి మట్టినీ, రాళ్లనూ రప్పించాడు. ఆ పనిలో ఎన్నో వేల మంది మరణించినా లెక్క చెయ్యలేదు.

1801-25 మధ్య పాలించిన మొదటి అలెగ్జాండర్ తన పాలన తొలినాళ్లలో కొంత ఉదార బుద్ధితో వ్యవహరించినా, తర్వాత్తర్వాత తీవ్ర నిరంకుశంగా వ్యవహరించాడు. ఇతని కాలంలోనే (1807-12) నెపోలియన్ రష్యాపైకి దండెత్తి వచ్చి, ఆపై తీవ్ర పరాజయానికి లోనై ఫ్రాన్స్‌కి పారిపోవలసి వచ్చింది. ఈ యుద్ధం వల్ల దేశంలోని కులీన వర్గాలలో గల ఉన్నత భావాలు గల విద్యావంతులైన యువతరం అలెగ్జాండర్‌పై ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. దేశంలో ప్రజాస్వామిక సంస్కరణలు వస్తాయని ఆశించారు. యూరప్ దేశాలలో పాత పద్ధతుల మీద, కృత్రిమ నాగరికత మీద తిరుగుబాటు చేస్తూ, స్వేచ్ఛ కోసం పరితపిస్తూ సాగిన ఉద్యమాల ప్రభావం వీరిమీద బలంగా పడింది. వీరంతా జార్ ప్రభువులు సాగించిన నిరంకుశ పాలనను వ్యతిరేకించడమే గాక, ఆ పాలనకు ఆర్థిక పునాదిగా నిలిచిన భూస్వాముల ఎస్టేట్లలో అమలుచేసే భూ బానిస విధానాన్ని తీవ్రంగా అసహ్యించుకున్నారు. రైతాంగం దుస్థితి పట్ల తీవ్రంగా కలత చెందారు. వీరిలో చాలా మంది భూస్వాములైన తమ తల్లిదండ్రులు సేద్య బానిసల పట్ల క్రూరంగా వ్యవహరించడాన్ని నిరసించి, వారితో కలహించి, ఇంట్లోంచి వెళ్లిపోయిన సందర్భాలు కూడా చాలా ఉన్నాయి. వారినే ఆ క్రూర పద్ధతులు అంతగా కలచి వేశాయంటే, ఇక ఆ బానిసల పాట్లు ఏ స్థితిలో ఉండేవో అర్థం చేసుకోవచ్చు. ప్రజల్లో అధిక సంఖ్యాకులైన ఈ బానిసలను వారి యజమానులు కొరడాతో చావగొట్టొచ్చు, సైబీరియాకు ప్రవాసమూ పంపొచ్చు. కుటుంబం నుండి చీలదియ్యవచ్చు. ఇష్టం వచ్చినప్పుడు వాళ్లకు పెళ్లిళ్లూ చెయ్యవచ్చు.

ఇలాంటి పరిస్థితుల్లో, నెపోలియన్‌తో జరిగిన యుద్ధం ఈ యువతరాన్ని ఎంతో ప్రభావితం చేసింది. బానిస విధానాన్ని రద్దు చేసి, ప్రజాస్వామిక సంస్కరణలు తీసుకువస్తాడని వీరు ఎంతో ఆశపెట్టుకున్న మొదటి అలెగ్జాండర్, వీరి ఆశల్ని వమ్ము చేసేసరికి, వీరిలో ధైర్యవంతులు 'డెక్‌బ్రిస్ట్'లై (1825లో) తిరుగుబాటు చేశారు. ఈ డెక్‌బ్రిస్ట్‌లనే 'డిసెంబరిస్ట్'లని కూడా అంటారు. డిసెంబర్ నెలలో ఈ తిరుగుబాటు జరిగింది కనుక, వీరికా పేరు వచ్చింది. ఈ డెక్‌బ్రిస్ట్‌లను మొదటి అలెగ్జాండర్ కుమారుడు మొదటి నికలస్ (1825-55) తీవ్రంగా అణచివేశాడు. ఈ తిరుగుబాటు చేసిన వారిలో ఎక్కువ ప్రభువర్గానికి చెందిన రష్యన్ సైనికాఫీసర్లు, రహస్య సంఘాల సభ్యులతో పాటు, ఇతర ఉన్నత వంశీకులూ, విప్లవకారులూ, దేశభక్తులూ ఉన్నారు. వీరిలో రిపబ్లిక్‌ని వాంఛించేవాళ్లూ, రాజ్యాంగపరమైన రాజరికాన్ని కోరేవాళ్లూ, రదీష్చెవ్ భౌతికవాదంతో ప్రభావితం అయిన వాళ్లూ - ఇలా పలు బృందాలకు చెందిన వాళ్లున్నారు. పీటర్స్‌బర్గ్‌లోని సెనేట్ చౌక్‌లో ఈ తిరుగుబాటుని అణచివేశాక, తిరుగుబాటు నాయకులు అయిదుగుర్ని ఉరితీశారు. వంద మంది అధికార్లను సైబీరియాకు ప్రవాసం పంపారు. వారి స్థాయిని సాధారణ సైనికుల స్థాయికి తగ్గించారు. ఈ తిరుగుబాటులో పాల్గొన్న వందలాది సైనికుల్ని కొరడాలతో కొట్టి (చాలా మందిని చనిపోయేదాకా కొట్టారు), దూర ప్రాంతాలలోని సైనిక దుర్గాలకు పంపారు. క్రూరుడైన ఈ జారు పత్రికలపై ఆంక్షలు విధించడమే గాక, విదేశీ యాత్రలనూ నిషేధించాడు. విదేశీ ప్రచురణలపైనా ఆంక్షలు విధించాడు. ఇతని నిరంకుశ ధోరణుల వల్ల దేశంలో పరిస్థితులు ఉద్రిక్తమై, పలు విప్లవవాదాలు ప్రచారంలోకి వచ్చాయి. వాటిలో అరాచకవాదం, శూన్యవాదం (నిహిలిజం), సామ్యవాదం (సోషలిజం), మార్క్సిజం మొదలైనవి ఉన్నాయి. ఇలాంటి ఒక గ్రూప్‌ను 1848లో పట్టుకుని అందులోని 21 మంది సభ్యులుగల బృందాన్ని దీర్ఘకాల విచారణ జరిపి, వారందరికీ మరణశిక్ష విధించారు. (ప్రసిద్ధ మేధావి మిఖాయిల్ పెత్రోషేవ్‌స్కీ ఇంట్లో జరిగే చర్చల్లో పాల్గొనేది ఈ బృందం. ఈ బృందంలోని వాడే ప్రసిద్ధ రచయిత దొస్తొయేవ్‌స్కీ. వారిలో కొంతమందిని ఆఖరి నిమిషంలో వధ్యశిలపైకి చేరిన క్షణంలో మరణశిక్షను రద్దుచేసి, ప్రవాస శిక్షగా మార్చారు. ఇలాంటి కపట నాటకం రాజకీయ ఖైదీలపట్ల నాటి జార్ ప్రభుత్వం తరచూ ప్రదర్శించేది. అప్పటిదాకా మరణభయంతో నరకయాతన అనుభవించిన ఆ ఖైదీలు రకరకాల తీవ్ర వ్యాధుల బారిన పడ్డారు. కొందరు పిచ్చివాళ్లయితే, మరికొందరు మూర్ఛవ్యాధి బారిన పడ్డారు. దొస్తొయేవ్‌స్కీ మూర్ఛ వ్యాధి బారిన పడ్డాడు. అది జీవితాంతం ఆయన్ను వదిలింది కాదు.)

తర్వాత అధికారంలోకి వచ్చిన రెండో అలెగ్జాండర్ (1855-81) పరిస్థితిని గమనించి, కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టాడు. 1861లో బానిసత్వ విమోచన శాసనాన్ని తీసుకొచ్చాడు. అయితే ఈ శాసనాన్ని తీసుకురావడంతో అసలు ఉద్దేశం రైతాంగానికి మేలు చెయ్యాలన్న ఉదార బుద్ధితో కాదు. 1861లో జరిగిన క్రిమియా యుద్ధంలో జార్ ప్రభుత్వం ఓడిపోయి బలహీనపడింది. నాటి భూస్వాములకు వ్యతిరేకంగా రైతాంగం చేసిన తిరుగుబాట్లు చూసి ప్రభుత్వం బేజారెత్తింది. దీనికి తోడు నాడు పరిశ్రమలకు కావలసిన సమర్థులైన కార్మికుల కొరతను తీర్చాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే రష్యాలో పెట్టుబడిదారీ విధానం ఆలస్యంగా అభివృద్ధి కావొచ్చింది. 1860కి పూర్వం రష్యాలో మిల్లులు, ఫ్యాక్టరీలు చాలా స్వల్పంగా ఉన్నాయి. భూ బానిస విధానం కింద

నిజమైన పారిశ్రామికాభివృద్ధి ఉండదు. భూ బానిసలు చేసే శ్రమ ఐచ్ఛికం కాదు. కనుక వ్యవసాయంలో వారి సామర్థ్యం తక్కువగా ఉండేది. కనుక ఆర్థికాభివృద్ధి పరిణామానికి భూ బానిస విధానం నాశనం కావడం తప్పనిసరి అయింది. ఈ అన్ని కారణాల వల్ల నాటి జార్ ఈ భూ బానిస విధానాన్ని రద్దు చేశాడు.

అయితే ఈ భూ బానిస విధానం రద్దయిన తర్వాత కూడా భూస్వాములు రైతుల్ని పీడిస్తూనే ఉన్నారు. రైతుల్ని బానిసత్వం నుండి 'విముక్తి' చేసే కార్యక్రమంలో వారు రైతుల్ని పలు విధాల దోపిడీ చేశారు. ఇదివరలో రైతులు ఉపయోగించుకుంటున్న భూమిలో కొంత భాగాన్ని విభజించి, తమ భూమిలో కలుపుకొన్నారు. ఇలా విభజించబడిన భూభాగాన్ని 'ఓట్రిజ్కీ' (కోత) అనేవారు. అంతేగాక, రైతుల్ని ఉద్ధరించినందుకు బదులుగా రైతులు భూస్వాములకు కొంత డబ్బు ముట్టజెప్పాల్సి వచ్చింది. దీనికి తోడు భూ బానిస విధానం రద్దు చేయబడ్డాక భూస్వాముల నుండి రైతులు భూమిని అతి నష్టదాయకమైన షరతులతో కౌలుకు తీసుకుపోవాల్సి వచ్చింది. డబ్బు రూపంలో కౌలు చెల్లించడమే గాక, భూస్వాముల పొలాల్ని రైతులు తమ పశువులతో, వ్యవసాయ పరికరాలతో ఉచితంగా సేద్యం చేయాల్సి వచ్చింది. ప్రతిఫలం లేకుండా చేసే ఈ వెట్టి చాకిరీని 'ఓట్రబోట్కీ', లేక 'బార్ష్చినా' అనేవారు. అంతేగాక తమకు పండిన దాంట్లో సగం ధాన్యం రూపేణా చెల్లించాలి. దీనినే 'ఇస్పోలూ' అనేవారు. అంటే రైతులు ఒక విధంగా పూర్వంలా భూ బానిసలుగా ఉన్నప్పటి స్థితే గాని, ఇప్పుడు వారి వ్యక్తిగత స్వేచ్ఛ కలిగి ఉన్నారు. అంతే తేడా. పూర్వంలా పశువుల మాదిరి వారిని కొనడానికీ, అమ్మడానికీ వీల్లేదు. కానీ, ఆర్థికంగా బానిసే.

భూస్వాముల పీడన ఇంతటితో పూర్తి కాలేదు. కౌలు మాత్రమే గాక, జరిమానాలూ విధించేవారు. ఈ దోపిడీ వలన రైతాంగం తమ క్షేత్రాలను సరిగా అభివృద్ధి చేసుకోలేకపోయేవారు. అందుచేతనే అక్టోబర్ విప్లవానికి పూర్వం రష్యాలో వ్యవసాయం చాలా వెనకబడి ఉండేది. అందువల్ల, పంటలు సరిగా పండక, కరువులు వచ్చేవి. కౌలూ, జరిమానాలూ తరచు రైతుల ఆదాయాన్ని మించి పోయినందు వల్ల వారు దిక్కుతోచక పెద్ద సంఖ్యలో గ్రామాల్ని వదిలి, పట్టణాల బాట పట్టి, ఫ్యాక్టరీల్లో, మిల్లుల్లో చౌకగా శ్రమశక్తి (కూలీ) లభించడానికి మార్గం ఏర్పడింది.

ఈ విధంగా గ్రామాల్లో రైతాంగం శిథిలమవుతుంటే, కాస్త కలిగిన రైతుల నుండి 'కులక్' (ధనిక రైతు) వర్గం ఒకటి తలెత్త సాగింది. దీనినే 'గ్రామీణ బూర్జువా' (గ్రామీణ పెట్టుబడిదారీ వర్గం) అంటారు. ఇది రైతాంగంలో పై వరుస.

ఈ విధంగా ఒకపక్క పేద రైతుల, గ్రామీణ శ్రామికుల, అర్ధ శ్రామికుల సంఖ్య పెరిగిపోతూంటే, మరోపక్క మధ్యతరగతి రైతుల సంఖ్య తగ్గిపోతోంది. దోపిడీకి గురవుతున్న ప్రజల నుండి కులక్కులను, భూస్వాములనూ, జార్ ప్రభుత్వాన్నీ కాపాడడం కోసం ప్రభుత్వాధికార్లూ, పోలీసులూ సిద్ధంగా ఉండేవారు. భూ బానిస విధానం రద్దు చేయబడినప్పటికీ, పన్నులు చెల్లించకపోయినా, ఏ చిన్న నేరం చేసినా కొరడా దెబ్బలు తప్పవు. అలాగే ఫ్యాక్టరీలలో సమ్మెలు చేస్తే పోలీసులూ, కొసక్కులూ (గుర్రపురౌతులు) వచ్చి శిక్షించేవారు. ఇలా పీడన మరింత పెరిగిపోవడంతో దేశంలో ఆందోళనలు చెలరేగి 1881లో రెండో అలెగ్జాండర్ ఒక నిహిలిస్టు చేతిలో హత్యగావించబడ్డాడు. దాంతో తర్వాత అధికారం చేపట్టిన మూడో అలెగ్జాండర్ (1881-91) మరింత నిరంకుశుడై, నిహిలిస్టులను వేటాడి, పలువురిని ఉరితీసి, మరికొందర్ని సైబీరియాకు ప్రవాసం పంపి, విప్లవకారులనే వారినే లేకుండా చెయ్యాలని దేశమంతటా 'ఓక్రానా' అనే గూఢచారుల వల ఏర్పాటు చేశాడు. ఇతని తర్వాత అధికారాన్ని చేపట్టిన రెండో నికోలస్ (1894-1917) కాలంలో పారిశ్రామికాభివృద్ధి త్వరితమైంది. విపరీతమైన పని గంటలు, అతి తక్కువ వేతనాలు, వీటికి తోడు జరిమానాలు, పారిశ్రామిక మాంద్యం పేరుతో కార్మికుల తొలగింపులు, జీతాల తగ్గింపులు మొదలైన పెట్టుబడిదారుల దోపిడీ రూపాలు అధికమైనందున కార్మికుల జీవితాలు నికృష్టంగా తయారై సమ్మెలు, ఆందోళనలకు పూనుకోవడంతో పారిశ్రామిక అశాంతి పెరిగిపోయింది. మరోపక్క 1904-05లో జపాన్‌తో జరిగిన యుద్ధంలో రష్యా ఓడిపోవడంతో ప్రభుత్వ అసమర్థత బయటపడి దేశంలో అసంతృప్తి అధికమైంది. ప్రజాస్వామిక హక్కుల కోసం, ప్రజల ఆందోళనలు అధికమయ్యాయి. మరోపక్క కార్మిక పోరాటాలూ తీవ్రరూపం దాల్చేసరికి, వాటిని పక్కదారి పట్టించేందుకు ప్రభుత్వ అనుకూల కార్మిక నాయకుడు ఫాదర్ గేపన్ ప్రయత్నించాడు. ఆయన నాయకత్వంలో చక్రవర్తికి వినతి పత్రం ఇచ్చేందుకు వచ్చిన వేలాది మంది కార్మికుల్ని సైన్యం సహాయంతో కాల్పించి చంపింది జార్ ప్రభుత్వం. ఈ హత్యాకాండతో ఆగ్రహించిన ప్రజలు తీవ్ర ఆందోళనలకు పూనుకోవడంతో దేశమంతా అట్టుడిగినట్లు ఉడికిపోయింది. సైన్యంలోనూ, నౌకాదళంలోనూ పలు తిరుగుబాట్లు జరిగాయి. అప్పుడు ప్రజల దృష్టిని మళ్లించడానికి ప్రతినిధుల సభ డ్యూమాను జార్ సమావేశపరిచాడు గానీ, అది నిజమైన ప్రజా ప్రతినిధుల సభ కాదు. ఆందోళనలను రూపుమాపేందుకు తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించింది ప్రభుత్వం. 1914లో మొదలైన మొదటి ప్రపంచ యుద్ధంలోకి దేశాన్ని ఈడ్చడం జరిగింది. ఆ యుద్ధంలో పాల్గొన్న సైన్యం సరైన తిండిలేక, ఆయుధాలు లేక శిథిలావస్థకు చేరుకుంది. సాధారణ సైనికులు ఇంతటి దుస్థితిలో ఉంటే, ఉన్నత సైనికాధికారులు, పెట్టుబడిదారులు స్వార్థమే పరమావధిగా పనిచేస్తూ దేశాన్ని పతనం వైపు నడిపారు. విప్లవం పేరు చెప్పుకుని పనిచేసే కుహనా రాజకీయ పార్టీలు, పెట్టుబడిదారులు భూస్వాములతో కుమ్మక్కు కావడంతో కార్మికులూ, కర్షకులూ వంచనకు గురయ్యారు. దేశంలో విప్లవ పరిస్థితులు పూర్తి పక్వానికి వచ్చాయి.

దేశంలో అధిక సంఖ్యాక ప్రజలు విప్లవాన్ని అభిమానించడానికి నాటి సాహిత్యకారులు కూడా తీవ్ర కృషి జరిపారు. మహాకవి పుష్కిన్, ప్రపంచ ప్రఖ్యాత రచయితలు లేర్మొంతోవ్, గోగొల్, తుర్గేనెవ్, తొల్‌స్తోయ్, చేహోవ్, కుప్రీన్, గోర్కీలతోపాటు విమర్శకుడు బెలిన్‌స్కీ వంటి వారు తమ రచనల ద్వారా ప్రజల్లో విప్లవ చైతన్యానికి దోహదం చేశారు. ఆ చైతన్యాన్ని వి.ఐ. లెనిన్ నాయకత్వంలోని 'రష్యన్ సోషలిస్ట్ డెమోక్రటిక్ పార్టీ' (బోల్షివిక్) పూర్తిస్థాయిలో వినియోగించుకొని, అత్యంత తక్కువ హింసతో ప్రపంచంలోనే తొలిసారిగా రష్యా దేశాన్ని విప్లవ పథంలోకి విజయవంతంగా నడిపింది.

1990లో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైనప్పటికీ, రష్యాలో వచ్చిన అక్టోబర్ విప్లవానికి, చరిత్రలో ఏర్పడ్డ ప్రాధాన్యతకు ఏమాత్రం భంగం వాటిల్లదు. ప్రపంచ విప్లవాలకు అక్టోబర్ విప్లవం ఒక దిక్సూచి అయితే, సోవియట్ విచ్ఛిన్నం ఒక గుణపాఠం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# వికలాంగులకు ప్రభుత్వ భరోసా ఏదీ?

*వికలాంగుల హక్కులను గుర్తించడం, వారికి అన్ని రకాల సహకారం అందించడం, అవకాశాలు కల్పించడం, వివక్ష లేకుండా వ్యవహరించడం చాలా అవసరమని అంటున్నారు* **బిల్లా మహేందర్**

సమాజంలో అన్ని రకాల వర్గాల ప్రజలు ఏ విధంగానైతే మానవ హక్కులను, ప్రాథమిక స్వేచ్ఛలను సంపూర్ణంగా అనుభవిస్తున్నారో వికలాంగ వ్యక్తులు కూడా వారితో సమానంగా వారి హక్కులను, ప్రాథమిక స్వేచ్ఛలను సంపూర్ణంగా అనుభవించిన నాడే వారు అన్ని రంగాలలో అభివృద్ధి చెందగలరు. అందువల్ల వికలాంగ వ్యక్తుల మీద బీదరకం చూపే వ్యతిరేక ప్రభావాన్ని ఎదుర్కొనే కీలక అవసరాలను ప్రభుత్వం తప్పకుండా గుర్తించవలసిన అవసరం ఎంతో ఉంది. 'మానవ హక్కులన్నీ, ప్రాథమిక స్వేచ్ఛలన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడినవి, వానిని సంపూర్ణంగా అనుభవించాల'ని ఐక్యరాజ్య సమితి ఏనాడో నొక్కి చెప్పింది. కాని మన ప్రభుత్వాలు మాత్రం వికలాంగులకు అలాంటి అవసరాలను గుర్తించి వారికి సరైన భరోసాను కల్పించ లేకపోతున్నాయి.

స్వాతంత్ర్యం వచ్చి అరవై ఐదు సంవత్సరాలు కావస్తున్నా వికలాంగుల జీవితాల్లో మాత్రం ఇప్పటి వరకు ఎలాంటి మార్పు రాకపోవడానికి పాలకులే ప్రధాన కారణంగా చెప్పవచ్చు. వికలాంగుల సంక్షేమం కొరకు ఎన్నో చట్టాలు ఉన్నప్పటికి వాటిని అమలు చేసే తీరును చూస్తే ఎవరికైనా చాలా విస్మయం కలగక మానదు. వికలాంగుల చట్టాల అమలుకు కావలసిన చర్యలు చేపట్టడానికి సరైన అధికారులు కూడా లేకపోవడం చాలా విచారించదగిన విషయం. రాష్ట్రంలోని వివిధ జిల్లాల్లో వికలాంగుల సాంఘిక సంక్షేమ కార్యాలయా లు ఉన్నప్పటికీ వాటికి సరిగా నిధులు మంజూరు కాకపోవడం వల్ల అవి మొక్కుబడిగానే పనిచేస్తున్నాయి. నిధులు లేని మూలంగా వికలాంగుల కార్యాలయంలో కూడా ఈ మధ్య సిబ్బందిని తొలగించ వలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. దీనిని బట్టి వికలాంగుల సంక్షేమం పట్ల ప్రభుత్వ ధోరణి ఏ విధంగా ఉందో మనకు స్పష్టంగా కనబడుతోంది.

'భారతదేశం 1995 వికలాంగుల చట్టాన్ని' (సమాన అవకాశాలు, హక్కుల రక్షణ, పూర్తి భాగస్వామ్యం, వివక్ష లేకుండా చూడడం) రూపొందించింది. ప్రభుత్వాలు ఎక్కడా కూడా వికలాంగ వ్యక్తులను కచ్చితంగా సమాన అవకాశం, వివక్షలు లేకుండా ఉండేటట్టు, చట్టంలో రాసుకున్న లక్ష్యాలు అమలయ్యేటట్లు చూడడం లేదు. మన రాష్ట్ర జనాభాలో దాదాపు 60 లక్షలకు పైగా ఉన్న వికలాంగులకు ఎక్కడా న్యాయం అందడం లేదు. సమాజంలో వికలాంగులు అత్యంత నిర్లక్ష్యానికి, అణచివేతకు, దోపిడీకి గురవుతున్నారు. మన రాష్ట్రంలో ఇటీవల మహబూబ్‌నగర్ జిల్లాలో ఒకటవ తరగతి చదివే మూగ విద్యార్థి దారుణ హత్యకు గురికావడం, అదే విధంగా వరంగల్ జిల్లాలో పన్నెండేళ్ల మూగ అనాథ బాలికపై అత్యాచారం జరగడమే ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యాలుగా మనం చూడవచ్చు. శారీరక, మానసిక వైకల్యాల కారణాల వల్ల కుటుంబం, సమాజం నుండి వికలాంగులు విడిపోయి ఆదరణ కోసం ఆశ్రయాలనూ, మనోవికాస కేంద్రాలనూ ఆశ్రయిస్తే అక్కడ కూడా వికలాంగులు సకలాంగుల చేతుల్లో ఎన్నో అకృత్యాలకూ, అన్యాయాలకూ బలై పోతున్నారు. దీనంతటికీ కారణం ఇటు ప్రభుత్వం, అటు సమాజం వికలాంగుల పట్ల నిర్లక్ష్య వైఖరిని అవలంబించడమే.

రాష్ట్రంలో ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ వర్గాల గురించి మాట్లాడే రాజకీయ నాయకులు మాత్రం వికలాంగుల సంక్షేమాన్ని విస్మరించడం చాలా అన్యాయం. వికలాంగులను కేవలం ఓటు బ్యాంకులుగానే పరిగణించి, వారికి కూడా జనాభా ప్రాతిపదికన చట్ట సభల్లో ప్రాధాన్యత ఇవ్వాలని ఏ రాజకీయ పార్టీ నాయకులు గుర్తించక పోవడం వల్ల వారి సమస్యల పరిష్కారం కోసం చట్ట సభల్లో గొంతెత్తే అవకాశం లేకుండా పోయింది. దీనివల్ల అనేక సమస్యలు సంవత్సరాల తరబడి పరిష్కార సాధనకు నోచుకోలేకపోతున్నాయి. మన రాష్ట్రంలో వికలాంగుల సమస్యలను గుర్తించి వారందరినీ ఐక్యం చేసిన ఘనత మందకృష్ణ మాదిగదే. ఆయన ఆధ్వర్యంలోనే 'వికలాంగుల హక్కుల పోరాట సమితి' ఆవిర్భవించి వికలాంగ సమస్యలను సాధించే దిశగా కృషి జరుగుతున్నదే తప్ప, ఇంతవరకు ఏ ఇతర నాయకులు కూడా వికలాంగుల సమస్యల పట్ల సానుకూల దృక్పథంతో స్పందించలేదనే విషయం వాస్తవం.

రాష్ట్ర జనాభాలో దాదాపు పదిశాతం ఉన్న వికలాంగులకు విద్య అందనంత దూరాన ఉంది. వికలాంగులలో కేవలం ఒక్క శాతం మంది మాత్రమే విద్యను అభ్యసిస్తున్నారు. ఈ ఒక్క శాతంలో అధికశాతం శారీరక వికలాంగులు మాత్రమే ఉన్నారు. దీనిని బట్టి వికలాంగుల విద్య పట్ల ప్రభుత్వం ఎంత నిర్లక్ష్య వైఖరిని కలిగి ఉందో మనం తెలుసుకోవచ్చు. చాలా ప్రభుత్వ పాఠశాలల్లో, కళాశాలల్లో వికలాంగులకు కావలసిన వసతులు సరిగా కల్పించడం లేదు. అన్ని పాఠశాలల్లో, కళాశాలల్లో వికలాంగులు సులువుగా వెళ్లడానికి ర్యాంపు సౌకర్యాలు ఇప్పటికీ అరకొరగానే ఉన్నాయి. ఇక కార్పొరేట్ పాఠశాలలు, కళాశాలల విషయానికొస్తే అవి వికలాంగులకు అందని ద్రాక్షే అవుతోంది. అదే విధంగా చాలా ప్రభుత్వ, ప్రైవేట్ కార్యాలయాల్లో అవసరాల కోసం వెళ్లే వికలాంగులకు కార్యాలయాల ముందు నిర్మించిన గ్రిల్స్ వల్ల నడవడానికి చాలా ఇబ్బందులు పడుతున్నారు. సాక్షాత్తు వివిధ జిల్లాలోని కలెక్టర్ కార్యాలయాలలోనే ఇటువంటి పరిస్థితులు ఉత్పన్నం కావడం శోచనీయం. ఒక్కొక్కసారి సకలాంగులే గ్రిల్‌లలో కాళ్లు ఇరుకున్న సందర్భాలనూ పేపర్లలోనూ, మీడియాలోనూ అప్పుడప్పుడు మనం చూస్తూనే ఉన్నాం. అదే విధంగా రాష్ట్రంలో కొనసాగుతున్న వికలాంగుల బాలికల, బాలుర సాంఘిక సంక్షేమ వసతి గృహంలోని పరిస్థితులు చాలా దయనీయంగా ఉన్నాయి. వసతి గృహంలోని వికలాంగ

విద్యార్థులకు కనీస సదుపాయాలు లేక వారు ప్రతిరోజు దుర్భరమైన పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుంది. కొన్ని చోట్ల తాగునీరు వసతి సదుపాయం కూడా లేకపోవడం వల్ల విద్యార్థులు తీవ్ర ఇబ్బందులకు గురి కావలసి వస్తోంది. విద్యార్థులకు ప్రతి నెల రావలసిన కాస్మోటిక్స్ ఛార్జీలు కూడా గత సంవత్సర కాలం నుండి పెండింగ్‌లో ఉన్నాయి. సంక్షేమ హాస్టళ్ల సమస్యలపై ప్రభుత్వానికి, అధికారులకు ఎన్నిసార్లు మొరపెట్టుకున్నా నిధులు లేవనే సాకుతో ప్రభుత్వం తప్పించుకుంటోంది. విద్యార్థులకు ఏం చెయ్యాలో అర్థంకాని పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

జనాభా ప్రాతిపదికన వికలాంగులకు ప్రభుత్వం రాష్ట్ర బడ్జెట్‌లో సరైన నిధులను కేటాయించడం లేదు. కనీసం వికలాంగుల కోటా కింద రావలసిన మూడు శాతం నిధులను కూడా రాష్ట్ర బడ్జెట్‌లో కేటాయించకపోవడం చాలా బాధాకరమైన విషయం. సకలాంగుల కోసం వేల కోట్లు వెచ్చిస్తున్న ఈ ప్రభుత్వం వికలాంగుల కోసం తక్కువ నిధులను కేటాయించడం వికలాంగుల పట్ల ప్రభుత్వం చిన్న చూపు చూస్తోందనడానికి నిదర్శనం. వై.ఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు వైకల్య శాతం ఆధారంగా వికలాంగులకు ఇస్తానన్న పెన్షన్ ఆరు వందలు, ఏడు వందల రూపాయలను కూడా ఈ రాష్ట్ర ప్రభుత్వం అమలు చేయడంలో తీవ్ర జాప్యం చేస్తోంది. ఇప్పుడు ఇస్తున్న ఐదు వందల పెన్షన్ కూడా వికలాంగుల హక్కుల పోరాట సమితి పోరాట ఫలితమే. వికలాంగుల సమస్యల పరిష్కారం కోసం మూడు సంవత్సరాల క్రితం మంత్రి సునితా లక్ష్మారెడ్డి అధ్యక్షతన ఏర్పడిన కమిటీ పందొమ్మిది సిఫారసులతో కూడిన ఒక నివేదికను తయారు చేశారు. ఆ సిఫారసులకు అనుగుణంగా ఈ మధ్యనే వికలాంగులకు వివాహ ప్రోత్సాహక బహుమతి పెంపుదల, వికలాంగ ఉద్యోగులకు ప్రమోషన్‌లలో రిజర్వేషన్ కల్పించడం తప్పా మిగతా సిఫారసులన్నీ మూడు సంవత్సరాల తరబడి పెండింగ్‌లోనే ఉన్నాయి. అదే విధంగా మహిళా వికలాంగులపై పెరుగుతున్న అత్యాచార, అవమాన నిరోధక చట్టం తీసుకు రావాలని రాష్ట్ర ప్రభుత్వానికి కమిటీ సిఫారసు చేసినా అటువంటి ప్రయత్నాలు ఏమీలేవు. అర్హులైన వికలాంగులకు అసైన్డ్ భూమి ఇవ్వాలని కమిటీ సిఫారసు చేసినప్పటికీ ప్రభుత్వం స్పదించకపోవడం బాధాకరం.

వికలాంగులను అన్ని రంగాలలో అభివృద్ధి చేయాలని చట్టాలు చెబుతున్నప్పటికీ మన ప్రభుత్వాలు ఏమాత్రం పట్టించుకోలేని పరిస్థితులలో ఉన్నాయి. వికలాంగుల కోసం ఎన్ని చట్టాలు ఉన్నప్పటికీ వారికి హక్కులను కల్పించడంలోనూ, సంక్షేమ కార్యక్రమాలు చేపట్టలేక పోవడంలోనూ ఆయా ప్రభుత్వాలకు చిత్తశుద్ధి లేకపోవడం వికలాంగుల దౌర్భాగ్యంగా పరిగణించవచ్చు. ఏ రాష్ట్ర ప్రభుత్వాలైనా సంక్షేమ పథకాలను నూతనంగా ప్రవేశపెట్టినప్పుడు ఆ పథకాలలో ముందు భాగంలో వికలాంగులకు సరైన ప్రాధాన్యత ఇవ్వడం వల్ల వారికి చాలా మేలు కలుగుతుంది. అదే విధంగా వికలాంగుల జనాభా ప్రాతిపదికన రాష్ట్ర బడ్జెట్‌లో వికలాంగులకు సరైన నిధులు కేటాయించినట్లయితే వారికి కావలసిన సదుపాయాలను పొందగలుగుతారు.

ప్రభుత్వాలు వికలాంగ వ్యక్తులకు సమానావకాశాలు కల్పించడం, వివక్ష లేకుండా చూడడం, హక్కులను కాపాడడం, పూర్తి భాగస్వామ్యం కల్పించే విధంగా చర్యలు తీసుకోవడం ఎంతో అవసరం. రోజు రోజుకూ మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా 'వికలాంగుల చట్టం 1995' ప్రకారం అన్ని ప్రభుత్వ శాఖల నుండి మూడు నుండి కనీసం ఏడు శాతం వరకు నిధులను వికలాంగుల సంక్షేమానికి తప్పకుండా ఖర్చు చేయాలి. దానితో పాటు వికలాంగులకు సరైన విద్య, వైద్య సదుపాయాలను అందించి వారికి అవసరమైన ఉపాధిని, ఉద్యోగ భద్రతను కల్పించినప్పుడు మాత్రమే వారు అన్ని రంగాలలో అభివృద్ధి చెందడంతో పాటు శారీరక, మానసిక సమస్యలను అధిగమించి సకలాంగులతో సమనంగా జీవించగలుగుతారు. లేకపోతే ప్రభుత్వాలు ఎన్ని 'ప్రపంచ వికలాంగుల దినోత్సవాలు' జరిపినా అవి మొక్కుబడిగానే సాగుతాయే కాని వికలాంగులకు ఏలాంటి మేలు చేకూరదని గమనించ వలసిన అవసరముంది. కాబట్టి ప్రభుత్వాలు వికలాంగులకు సరైన భరోసాను ఇచ్చివారు అన్ని రంగాలలో అభివృద్ధి చెందడానికి సహకరించాలి.

*(రచయిత ప్రధాన కార్యదర్శి,*
*వికలాంగుల ఉపాధ్యాయ సంఘం, వరంగల్)* వీ

# అవినీతి భారతం

*పార్టీలేవైనా, నాయకులెవరైనా, అధికారంలో ఉన్నా, లేకున్నా ఆస్తులు కూడబెట్టడంలో, కోట్లాది రూపాయల అవినీతికి పాల్పడడంలో ఒకే విధంగా ఉన్నారని అంటున్నారు* **సాదు రాజేష్, సిరిసనగండ్ల సాహితి**

అవినీతి, బంధుప్రీతి, ఆశ్రిత జన పక్షపాతం మన దేశ పాలకవర్గ రాజకీయాలను పెనవేసుకుని పోయాయి. పాలకవర్గాలు మారినకొద్దీ అవినీతి రాశిలో.. వాసిలో వందల రెట్లు అవుతోందే తప్ప తగ్గడం లేదు. ఇటీవల అది తారాస్థాయికి చేరుకుంది. భారత ప్రజాస్వామ్య మనుగడను శాసిస్తున్న ఈ పరిణామాలు పేద, మధ్య తరగతి ప్రజల్లో తీవ్ర ఆందోళన కలిగిస్తున్నాయి. దేశంలోని నూటికి తొంభై శాతం మంది రాజకీయనాయకులు ఈ దేశ సంపదను, ప్రజాధనాన్ని నిలువునా దోచుకుంటున్నారు. విధానాల రూపకల్పనలో, అమలు చేయడంలో కీలక పాత్ర పోషిస్తున్న బ్యూరోక్రసీ అధికారంలో ఉన్న వారి అడుగులకు మడుగులొత్తుతూ తమవాటా తాము తీసుకుంటూ.. అవినీతికి రాచమార్గం వేసింది.

1991లో నూతన పారిశ్రామిక విధానాలు అమల్లోకి వచ్చిన తర్వాత అవినీతికి చట్టబద్ధత ఏర్పడింది. ప్రపంచీకరణ, సరళీకరణ విధానాల ఫలితంగా ప్రభుత్వరంగ సంస్థల్లో ప్రైవేట్ వ్యక్తులకు భాగస్వామ్యం కల్పించడమో, లేదా వాటిని పూర్తిగా ప్రైవేటీకరించడమో జరుగుతూ వచ్చింది. లాభాల్లో ఉన్న ప్రభుత్వ కంపెనీలను ప్రభుత్వాలు ఉద్దేశపూర్వకంగా నష్టాల్లోకి వచ్చేలా చేసి .. అదే రంగంలో ప్రైవేట్ కంపెనీలను ప్రోత్సహించాయి. ప్రతిఫలంగా ఆయాకంపెనీల యజమానులు అధికారంలో ఉన్న వారికి కోట్లల్లో ముడుపులు సమర్పించుకోవడం సర్వసాధారణ విషయమైపోయింది.

మన దేశ పార్లమెంట్ సభ్యుల్లో ఎంతోమంది అవినీతిపరులైన కోటీశ్వరులు, మల్టీ మిలియనీర్లు ఉన్నారు. వారంతా రాజకీయాల్లోకి వచ్చాక అక్రమ మార్గంలో సంపాదించడమో, లేదంటే కోటీశ్వర్లుగా ఉన్న కొందరు రాజకీయాల్లోకి వచ్చాక మల్టీ మిలీయనీర్లుగా మారడమో జరిగింది. వీరిలో ఎక్కువగా బడా కాంట్రాక్టర్లతోపాటు రియల్ ఎస్టేట్, మైనింగ్, విద్యా రంగాలకు చెందిన వ్యక్తులకే పరిమితం కాలేదు, అధికార యంత్రాంగంలో ఉన్న అన్ని స్థాయిలకు అది విస్తరించింది. ప్రభుత్వ కార్యాలయంలోని అటెండర్ మొదలు ఉన్నతస్థాయి అధికారుల వరకు, అలాగే వివిధ రాజకీయ పార్టీల్లోని గ్రామస్థాయి నాయకుడు మొదలు ప్రధాని స్థాయి వరకు అవినీతికి పాల్పడడంలో ఎవరూ మినహాయింపు కాదు. వీరంతా తమతమ స్థాయిల్లో ప్రజాధనాన్ని కొల్లగొడుతున్న వారే.

ఈ పదేళ్ల కాలంలో దేశంలో, ప్రత్యేకించి మన రాష్ట్రంలో అవినీతి పతాకస్థాయికి చేరింది. ప్రపంచబ్యాంకు విధానాలకు రాష్ట్రాన్ని ప్రయోగశాలగా మార్చి, బహుళజాతి సంస్థలకు ప్రభుత్వ ఆస్తులను, కంపెనీలను అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు తాకట్టు పెడితే, సెజ్ పేరిట నయా జమీందారీ వ్యవస్థకు, భూముల పందేరానికి రాజశేఖరరెడ్డి తెరతీశారు.

## ఎమ్మార్ ప్రాపర్టీస్ కుంభకోణం

దుబాయ్‌కి చెందిన ఎమ్మార్ ప్రాపర్టీస్ అనే బహుళజాతి సంస్థకు చంద్రబాబునాయుడు ప్రభుత్వం 2002లో నానక్‌రామ్ గూడలో ఐదువేల కోట్ల రూపాయల విలువైన 535 ఎకరాల భూమిని నామమాత్రపు ధరకు కేటాయించింది. రాష్ట్రంలో వేళ్ల మీద లెక్కించగలిగేంత మంది కూడా ఆడని గోల్ఫ్ కోర్సు కోసం ఇంత భూమిని కేటాయించడం అప్పట్లో వివాదాస్పదమైంది. ఈ మొత్తం వ్యవహారాన్ని చక్కబెట్టింది కోనేరు ప్రసాద్ అనే పారిశ్రామికవేత్త. ఇదే కేసులో అతడిని సిబిఐ అధికారులు అరెస్ట్ చేసి జైలుకు పంపారు. అంతేగాక ఇదే కేసులో వైఎస్ జగన్ అనుచరుడు సునీల్ రెడ్డిని జనవరి 23న అరెస్ట్ చేశారు.

చంద్రబాబు హయాంలో పాలేరు సుగర్స్‌ను నామా నాగేశ్వర్‌రావుకు, గురజాలలోని నాగార్జున కో-ఆపరేటివ్ సుగర్స్ మిల్స్‌ను నూజివీడు సీడ్స్‌కు, నెల్లూరు స్పిన్నింగ్ మిల్లును సిఎం రమేష్‌కు, రిపబ్లిక్ పోర్జ్ భూములు దేవేందర్ గౌడ్‌కు కట్టబెట్టడాన్ని చూస్తే ప్రభుత్వ రంగ సంస్థలను సంతలో సరుకుల్లాగా ఎలా అమ్మకానికి పెట్టారనేది అర్థమవుతుంది. ప్రభుత్వరంగంలో పరిశ్రమల స్థాపన కోసం 1973లో ఏర్పాటైన ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్(ఏపిఐఐసీ) ఉద్దేశాలు, లక్ష్యాలు చంద్రబాబు హయాంకు వచ్చేసరికి పూర్తిగా మారిపోయాయి. పెట్టుబడిదారులకు భూములు సేకరించి, అప్పగించే దళారీ సంస్థగా ఇది మారిపోయింది. ఇలా ఎమ్మార్, రహేజాలాంటి రియల్ ఎస్టేట్ సంస్థలతోపాటు సత్యం, విప్రో, మైక్రోసాఫ్ట్‌లాంటి సాఫ్ట్‌వేర్ సంస్థలకు వేలాది ఎకరాల భూములను అతి తక్కువ ధరకు కట్టబెట్టింది. ఈ మొత్తం వ్యవహారంలో వేలాది కోట్ల రూపాయలు చేతులు మారయనేది బహిరంగ రహస్యమే.

భూముల కేటాయింపులో సరిగ్గా చంద్రబాబు అనుసరించిన పాలసీనే ఆ తర్వాత అధికారంలోకి వచ్చిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అనుసరించారు. సెజ్‌ల పేరిట వేలాది ఎకరాల భూములను పేదల నుంచి చౌకగా సేకరించి అరబిందో, హెటెరో, జివికె, విప్రో లాంటి కంపెనీలకు అప్పగించారు. ఇలా లబ్ధిపొందిన కొందరు పారిశ్రామిక వేత్తలు, ఆయన కుమారుడు వైఎస్ జగన్ స్థాపించిన కంపెనీల్లో ఎక్కువ ధరకు షేర్లు కొనుగోలు చేసి పెట్టుబడులు పెట్టారు. భూములు పొందినందుకు ప్రతిఫలంగానే జగన్ కంపెనీల్లో పలువురు పారిశ్రామిక వేత్తలు పెట్టుబడులు పెట్టారని ఆరోపణలు ఉన్నాయి. తండ్రి అధికారాన్ని

అడ్డం పెట్టుకుని జగన్ వేల కోట్లు విలువ చేసే ఆస్తులు సంపాదించాడని, ఆయన ఆస్తులపై విచారణ చేపట్టాలని రాష్ట్ర మంత్రి శంకర్‌రావు పిటిషన్ వేయడంతో రాష్ట్ర హైకోర్టు సిబిఐ విచారణకు ఆదేశించింది.

ఆంధ్ర, కర్ణాటక ప్రభుత్వాల అండదండలతో ఓబుళాపురం మైనింగ్ కార్పొషన్ (ఓఎంసి) డైరెక్టర్ గాలి జనర్దన్ రెడ్డి వందల కోట్ల రూపాయాల విలువైన ఇనుప ఖనిజాన్ని యథేచ్ఛగా కొల్లగొట్టి విదేశాలకు తరలించాడు. రాజకీయాల్లో అక్టోపస్‌లా విస్తరించి, మైనింగ్ మాఫియాకు కేరాఫ్ అడ్రస్‌గా మారిన ఈయన కర్ణాటక రాజకీయాలను ఫుట్‌బాల్‌లా ఆడుకున్నారు. తన వ్యాపార ప్రయోజనాలకు అడ్డొచ్చిన అప్పటి ముఖ్యమంత్రి యడ్యూరప్పకు ముచ్చెమటలు పట్టించారు. అనుమతి లేని ప్రాంతాల్లో సైతం అక్రమంగా మైనింగ్‌కు పాల్పడి బళ్లారి, డీహీరేలాల్, ఓబుళాపురం ప్రాంతాలను విధ్వంసం చేశాడు. సుమారు 60 లక్షల టన్నుల ఇనుప ఖనిజాన్ని విదేశాలకు అక్రమంగా తరలించినట్టు జనార్ధన్ పర్సనల్ సెక్రటరీ మసూద్ అలీ ల్యాప్ టాప్‌లో సిబిఐకి ఆధారాలు లభించాయి. దీంతో జనార్ధన్‌రెడ్డితోపాటు కంపెనీ మరో డైరెక్టర్ అయిన శ్రీనివాస్‌రెడ్డిని, నిబంధనలు ఉల్లంఘించి మైనింగ్‌కు అనుమతులు ఇచ్చిన గనులశాఖ మాజీ కార్యదర్శి రాజగోపాల్‌ను, మరో ఐఏఎస్ అధికారి శ్రీలక్ష్మీని ఈ కేసులో సిబిఐ అధికారులు అరెస్ట్ చేశారు.

1991 నుంచి 1996 వరకు సుఖ్‌రాం టెలికం శాఖ మంత్రిగా పనిచేశారు. తన హయంలో 20 వేల కోట్లరూపాయల విలువైన ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం కొనుగోళ్లలో రూ. 1500 కోట్ల కమిషన్లు తీసుకున్నారని ఆరోపణలు వచ్చాయి. ఇవి ఇటీవల రుజువు కావడంతో అతడికి కోర్టు జైలు శిక్ష విధించింది. 1999 నుంచి 2001 వరకు ఎన్‌డిఎ ప్రభుత్వ హయంలో టెలికం మంత్రిగా పనిచేసిన రామ్‌విలాస్ పాశ్వాన్ రిలయన్స్ ఇన్ఫోకామ్‌కు దేశవ్యాప్త సర్వీసులు చేపట్టే అవకాశం కల్పించారు. సిడిఎంఎ, జిఎస్‌ఎం సేవల లైసెన్స్‌ల జారీలో ఆయన రు.1300 కోట్ల ముడుపులు తీసుకున్నారనే ఆరోపణలు వచ్చాయి. ఆయన తర్వాత 2001నుంచి 2003 వరకు టెలికం శాఖ మంత్రిగా పనిచేసిన ప్రమోద్ మహజన్ హయాంలో సెల్‌ఫోన్ విప్లవం ఊపందుకుంది. ఆయన ఫీజుల బకాయిలను రద్దు చేయడంతో టెలికం కంపెనీలకు వేల కోట్లు మిగిలాయి. విదేశీ సంచార్ నిగమ్ లిమిటెడ్ (విఎస్‌ఎన్‌ఎల్) వివాదాస్పదం కావడంతో ఆయనను మంత్రి పదవి నుంచి తొలగించారు. ప్రమోద్ మహజన్ తన పదవీ కాలంలో రు.2500 కోట్లు వెనకేశారని అంచనా.

మహజన్ తర్వాత అరుణ్ శౌరీ 2003 నుంచి 2004 వరకు మంత్రిగా పనిచేసి 'ముందు వచ్చిన వారికి ముందు లైసెన్స్' అనే వివాదాస్పద విధానాన్ని ప్రవేశపెట్టి, కంపెనీల నుంచి ముడుపులు తీసుకొని కారు చౌకగా లైసెన్స్‌లు మంజూరు చేశారు. ఇలా స్పెక్ట్రమ్ కుంభకోణానికి ఎన్‌డిఎ హయాంలో బీజాలు పడినప్పటికి యుపిఎ ప్రభుత్వ హయాంలో అది వెర్రి తలలు వేసింది.

యుపిఎ ప్రభుత్వంలో 2007 నుంచి 2010 వరకు టెలికం శాఖ మంత్రిగా పనిచేసిన ఎ. రాజా 2008లో కొత్త సెల్‌ఫోన్ ఆపరేటర్లకు 2001 నాటి ధరకు లైసెన్స్‌లు జారీ చేశారు. ఈయన కూడా కేబినేట్ ఆమోదం లేకుండా 'ముందు వచ్చిన వారికి ముందు అవకాశం' పేరుతో లైసెన్స్‌లు కట్టబెట్టారు. బహిరంగ వేలం వేయకపోవడం వల్ల ప్రభుత్వ ఆదాయానికి లక్షా డెభై ఆరు వేల కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని కాగ్ తేల్చింది. ప్రతిపక్షాల ఆందోళనతో తన మంత్రి పదవికి రాజీనామా చేసిన రాజాను కొన్నాళ్లకు కేసు దర్యాప్తు చేపట్టిన సిబిఐ అరెస్ట్ చేసి జైలుకు పంపింది. ఈ మొత్తం వ్యవహారంలో కొన్ని జాతీయ మీడియా సంస్థల ప్రతినిధులు, కార్పోరేట్ కంపెనీల కన్సల్టెన్సీ నిర్వాహకురాలు నీరా రాడియా, కేంద్ర మాజీ మంత్రి కనిమొళి ప్రభుత్వానికి టెలికం కంపెనీలకు మధ్య దళారులుగా వ్యవహరించారనే ఆరోపణలు ఉన్నాయి. ఇదంతా ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు, అప్పటి ఆర్థిక శాఖ మంత్రి చిదంబరానికి తెలిసే జరిగిందని 2జి స్పెక్ట్రమ్ కేసులో ప్రధాన నిందితుడు రాజా బహిరంగంగానే వెల్లడించడం గమనార్హం.

అవినీతి ఆరోపణలు రాగానే ఏ విచారణకైనా సిద్ధమని ప్రకటించే రాజకీయ నాయకులు, ప్రజాప్రతినిధులు తీరా ఏదైనా కోర్టు వారి ఆస్తులపై విచారణకు ఆదేశిస్తే నిస్సిగ్గుగా పై కోర్టుకు వెళ్లి స్టే తెచ్చుకుంటున్నారు. చంద్రబాబు, ఆయన బినామీ ఆస్తులపై విచారణ జరపాలని పులివెందుల ఎంఎల్.ఎ. వైఎస్ విజయమ్మ హైకోర్టులో కేసు వేస్తే ఆయన బినామీలు విచారణ నిలిపివేయాలని సుప్రీంకోర్టును ఆశ్రయించారు. అలాగే మంత్రి శంకర్రావు పిటిషన్‌పై స్పందించి జగన్ ఆస్తులపై విచారణకు ఆదేశిస్తే ఆయన కూడా సుప్రీంకోర్టుకు వెళ్లారు. ఒక వేళ కేసు విచారణ కొనసాగితే ఏదో ఒక దశలో అధికార పార్టీతో రాజీపడి దానిని మధ్యలోనే నీరుగార్చే ప్రయత్నాలు చేస్తున్నారు. దోచుకోవడమే ఈ రాజకీయ నాయకుల పరమావధి అయినప్పుడు దేశంలో అవినీతి రహిత ప్రత్యామ్నాయ రాజకీయ శక్తులు బలపడాల్సిన అవసరం ఉంది.

*(రచయితలు కాకతీయ విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **'గ్రామాల అధ్యయనం' గురించి మరికొంత! - చిమ్మె జాన్ బర్నబాస్**
- **ఆదిలాబాద్ జిల్లా టైగర్ ప్రాజెక్ట్ అభివృద్ధి ఎవరి కోసం? - మడావి భాస్కరరావు**
- **బాక్సైట్ బద్ధలైతే! - ఎం. నాగమణి**
- **మరో మిలియన్ మార్చ్ కానుందా! - నాగజాను సూరేపల్లి**

# రైతు వ్యవసాయంపై పెట్టుబడి దాడి

*సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల దిగుమతితో, ప్రపంచబ్యాంక్ నిర్దేశిత విధానాలతో వ్యవసాయానికీ, ప్రజల జీవన విధానానికీ జరిగిన విధ్వంసాన్ని ఫిలిప్పైన్స్, మెక్సికో దేశాల ఉదాహరణలతో వివరిస్తున్నారు* **నరేంద్రమోహన్**

భారత ప్రభుత్వాలు రెండు దశాబ్దాలుగా అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాలు ఇలాగే కొనసాగితే రైతుల పరిస్థితి, దేశంలో ఆహార ధాన్యాల ధరలు, ఆహార భద్రత ఎలా ఉండగలవో తెలుసుకోవాలంటే, ఆ విధానాలు మనకంటే ముందుగానే అమలుచేసిన దేశాల అనుభవాలు పరిశీలిస్తే, జరగబోయే పరిణామాలు కొంతమేరకైనా తెలుసుకోవచ్చు.

దేశంలో ఇటీవలి కాలంలో ఆహార పరిస్థితి గురించి చూడాలంటే, సరిపడ ఆహారం లేనివారిలో 1992-2007 మధ్య 2 కోట్ల మంది కొత్తగా చేరారు. (వరల్డ్ ఫుడ్ ప్రోగ్రాం; హంగర్ ఆన్ ది రైజ్, 2008.)

2008 చివరికి వెనుకబడ్డ దేశాల ఆహార దిగుమతుల ధర 2000 నాటికంటే మూడు రెట్లు పెరిగింది. ప్రపంచవ్యాప్తంగా వెనుకబడ్డ దేశాల్లో 7.5 కోట్ల మంది ప్రజలు ఆహారలేమికి గురయ్యారు. 12.5 కోట్ల మంది నిరుపేదలుగా మారారు. భారతదేశంలో అదేకాలంలో సుమారు రెండు లక్షలమంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ప్రస్తుత విధానాలు ఇలాగే కొనసాగితే రైతుల స్థితిగతులు, ఆహార లభ్యత ఎలా ఉండగలవో చూడాలంటే, ప్రపంచీకరణ (గ్లోబలైజేషన్), స్వేచ్ఛా వ్యాపార (ఫ్రీ ట్రేడ్) విధానాలు మనకంటే ముందుగానే అమలుపరచిన మెక్సికో, ఫిలిప్పైన్స్ దేశాల్లోని వ్యవసాయదారుల స్థితిని గమనించవచ్చు.

దానికంటే ముందు కొంత, రాజకీయార్థిక సిద్ధాంతంలోకి, చరిత్ర లోకి తొంగి చూద్దాం. రైతు అంటే ఎవరు, రైతాంగ వ్యవసాయం అంటే ఏమిటి అనే విషయంలో చాలామందిలో అస్పష్టత ఉంది. పెద్ద భూస్వాములు, వ్యాపారవేత్తలు, ఫ్యాక్షన్ నాయకులు కూడా తాము రైతుల మని చెప్పుకుంటున్న సందర్భంలో దీని గురించి కొంత స్పష్టత అవసరం.

**ప్రాథమికంగా రైతు వ్యవసాయం (పెజంట్ అగ్రికల్చర్) లక్షణాలు ఇవి:**

◆ వేతన కార్మికులతో కాకుండా కుటుంబ శ్రమశక్తితో - ఇరుగు పొరుగుల సహకారంతో- పంటలు, (ఇతర చిరు ఉత్పత్తులు) పండించడం.

◆ ఉత్పత్తి ప్రధానంగా స్వయంపోషణ కొరకు, లేదా స్థానిక అవసరాల కొరకు జరపడం. డబ్బు అవసరాల కోసం పంట మార్కెట్లో అమ్మడం.

◆ కొద్దిపాటి వనరులు, సాధనాలతో, సాపేక్షంగా మార్కెట్‌కు స్వతంత్రంగా ఉత్పత్తి కొనసాగించడం.

◆ భూమి, సాధనాలు కుటుంబ యాజమాన్యంలో ఉండడం.

◆ ఒకే వ్యక్తి వివిధ రకాల పనులు చేయడం.

◆ దీనికి భిన్నంగా, పెట్టుబడిదారీ విధానం లక్షణం - ప్రాథమికంగా కార్మికుల (శ్రామికుల) నుండి మిగులు విలువ (లాభం) వెలికితీసే విధంగా ఉత్పత్తి కొనసాగించడం, మిగులును తిరిగి పెట్టుబడి పెట్టి ఉత్పత్తి పెంచే క్రమం నిరంతరం కొనసాగించడం.

◆ శ్రామికులకు భూమి, సాధనాల మీద యాజమాన్యం లేకపోవడం.

ఈ క్రమంలో అత్యధిక ప్రజల నిజమైన అవసరాలు నెరవేర్చడం అనేది లాభం ముందు స్వల్ప విషయం. అంటే ఆహార పంటలా, వాణిజ్య పంటలా అనే నిర్ణయం లాభాల శాతం మీద ఆధార పడి ఉంటుంది.

చదివేవారికి మనవి ఏమిటంటే ఎంతో వైవిధ్యం, చలనం ఉన్న రైతు సమాజానికి ఒక అమూర్త చిత్రీకరణ చేసే ప్రయత్నం ఇది. కానీ అన్ని సందర్భాల్లో, నూటికి నూరుపాళ్లు వర్తింపజేసే ప్రయత్నం కాదు. అన్ని సిద్ధాంతాల లాగే ఇది కూడా చలనంలో ఉన్న వాస్తవాన్ని సారాంశ రూపంలో చూపే ప్రయత్నం. పెట్టుబడిని, రైతు వ్యవసాయ క్రమాలను (ప్రాసెసెస్) చూపగలిగినంతవరకు ఈ సూత్రీకరణలను ఆమోదించవచ్చు.

ప్రపంచవ్యాప్తంగా పారిశ్రామిక, సేవారంగాలలోకి ప్రవేశించి నంతగా, వ్యవసాయంలోకి పెట్టుబడిదారీ విధానం ప్రవేశించలేదు. నాలుగు వందల సంవత్సరాలుగా పెట్టుబడిదారీ వ్యవసాయం రైతుల వ్యవసాయ స్థానాన్ని ఆక్రమించే ప్రయత్నం చేస్తూనే ఉంది. కానీ ఆ ప్రక్రియ ఇంతవరకు పూర్తికాలేదు. ఆసక్తికరమైన విషయమేమిటంటే యూరోప్‌లో, ముఖ్యంగా బ్రిటన్‌లో పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవ మూలాలు అక్కడి వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పుల్లో ఉన్నాయి. పదహారు, పదిహేడవ శతాబ్దాలలో ఉన్ని ధరలు పెరగడం ప్రేరణగా అక్కడి భూస్వాములు, ధనిక కౌలుదార్లు, బీళ్లు, బంజర్లు, కౌలు భూములను జప్తు చేసుకొని (ఎనక్లోజర్) వేలాదిమంది చిన్న రైతులను, గ్రామీణ వృత్తిదారులను బజారున పడేసారు. పరిశ్రమలు ఎదగని ఉత్తర స్కాట్లండ్‌లో (హైలాండ్స్) గ్రామాలకు గ్రామాలే ఖాళీ అయిన శిథిలాలు నేటికీ చూడవచ్చు. ఇలా ఊరూ వాడా లేని వ్యవసాయదారులే పరిశ్రమల్లో చవకగా పనిచేసే పారిశ్రామిక రిజర్వ్‌గా (ఇండస్ట్రియల్ రిజర్వ్ ఆర్మీ) మారడం, అమెరికాకు వలస వెళ్లడంతో బ్రిటన్‌లో రైతు (పిసంట్) వ్యవసాయం అంతరించింది.

అలాగే, ఫ్రాన్స్ వంటి దేశాల్లో రైతు వ్యవసాయం ఇంకా మిగిలే ఉంది. పెద్ద ఎత్తున పెట్టుబడిదారీ వ్యవసాయం ప్రవేశించ గల్గిన అమెరికా, ఆస్ట్రేలియా వంటి దేశాల్లో కూడా వ్యవసాయంలో కుటుంబ యాజమాన్యం మిగిలే ఉంది. ప్రపంచవ్యాప్తంగా వ్యవసాయంలో పెట్టుబడి ప్రవేశాన్ని మూడు స్థాయిల్లో చూడవచ్చు.

రైతు వ్యవసాయం (పెజెంట్ అగ్రికల్చర్); వాణిజ్య వ్యవసాయం (కమర్షియల్ ఫార్మింగ్); కార్పొరేట్ వ్యవసాయం.

ఇక ప్రస్తుత విషయంలోకి వద్దాం. మూడవ ప్రపంచ దేశాల్లో వ్యవసాయాన్ని పారిశ్రామిక ఉత్పత్తిగా మార్చడానికి జరుపుతున్న ప్రయత్నాలు విస్తారంగా పరిశీలించిన హాలండ్ శాస్త్రవేత్త ఇయన్ దౌవ్ వాన్ దర్ ప్లోఎగ్ ఇలా వర్ణించారు. 'ప్రస్తుత ఆహార ఉత్పత్తి, వినియోగాల పారిశ్రామికీకరణ, ప్రపంచీకరణ, ఉదార విధానాలు (పెట్టుబడి పట్ల), జన్యు మార్పిడి వంగడాల విస్తరణ అనే కచ్చితమైన కార్యక్రమం (అజెండా) ప్రకారం అమలు జరుగుతున్నది. దీనికి పక్కనే ప్రపంచంలో మునుపెన్నడూ ఇంత మంచి ఆహారం లభించలేదని, అలాగే ఈ కార్యక్రమం వల్ల వెనుకబడ్డ దేశాలలోని పేద రైతులకు ఎంతో లాభం అని, మరింత పారిశ్రామిక ఉత్పత్తి (కార్పొరేట్ విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు, జన్యు మార్పిడి వంగడాలు, మార్కెట్ ఆధారిత పంటలు) తప్ప మరో దారి లేదనే ప్రచారం జరుగుతున్నది.' (ది న్యూ పెజెంట్రీస్, ఎర్త్ స్కాన్ ప్రచురణ)

లాభం మాట దేవుడెరుగు, ఉన్ని బట్టల కోసం వెళ్లితే ఉన్న బట్టలు ఊడాయా అన్న సంగతి చూద్దాం. కొంత వివరంగా చూడడానికి వరి పండించే ఫిలిప్పైన్స్ దేశ అనుభవాన్ని పరిశీలిద్దాం.

మూడవ ప్రపంచ దేశాల్లో, రైతు ఆధారిత విప్లవాలను ఆపడానికి అమెరికా రెండు ప్రధాన విధానాలు ఎంచుకున్నది. పైనుండి భూ సంస్కరణల అమలు. వియత్నాంలో భూసంస్కరణలు విప్లవాన్ని ఆపలేవని తెలుసుకున్న తరువాత, వనరుల పంపకం లేకుండా హరిత విప్లవం ద్వారా ఉత్పత్తి పెంపుదల. ఫిలిప్పైన్స్ దేశంలో మార్కోస్ నియంతృత్వం సహాయంతో (మసగ్న 99 పథకం). అమెరికా ఈ రెండు విధానాలు అమలు చేసింది. దీనిలో భూసంస్కరణలను మార్కోస్ ప్రభుత్వం త్వరలోనే వదిలేసింది – తన పార్టీలోని చిన్న భూస్వాముల వ్యతిరేకత వల్ల పెద్ద ఎస్టేట్‌ల (హసియెండా) జోలికి వెళ్లకుండా ప్రభుత్వమే దీనికి తూట్లు పొడిచింది.

మసగ్నలోని మిగతా భాగాలు పెద్ద ఎత్తున గ్రామీణ సౌకర్యాల నిర్మాణం, తక్కువ వడ్డీలతో, తనఖా లేకుండా రుణాల మంజూరు, వేలాది మంది నిపుణుల ద్వారా, సబ్సిడీలతో కొత్త వంగడాలు, ఎరువులు, పురుగు మందులు, పరికరాల విస్తరణ. దీని వెనుక మార్కోస్ రాజకీయ ఉద్దేశం రైతులను తన ప్రభుత్వ వత్తాసుగా మలచుకోవడం. ఇతరత్రా ఎన్నో దుర్మార్గాలు చేసిన మార్కోస్ ఇందులో మాత్రం భారీగా ఖర్చుపెట్టాడు. మసగ్న వల్ల చాలా వరకు చిన్న భూస్వాములు, ధనిక రైతులే లాభపడినా, పర్యావరణానికి నష్టం జరిగినా, ఒక స్వల్పకాల ప్రయోజనం నెరవేరింది.

నీటి పారుదల 5 లక్షల హెక్టార్ల (1960ల లెక్కలు) నుండి 13 లక్షల హెక్టార్లకు (1980ల లెక్కలు) పెరిగింది. ఫిలిప్పైన్స్ బియ్యం దిగుమతి చేసుకునే స్థాయి నుండి స్వయం సమృద్ధి స్థాయికి చేరింది. మార్కోస్ ఫిలిప్పైన్స్ నుండి పారిపోయే నాటికి (1986) దేశంలో 9 లక్షల టన్నుల వరి నిల్వలున్నాయి. (వాల్డెన్ బెల్లో, ది ఫుడ్ వార్స్, వెర్సో ప్రచురణ.)

ఈ నిలకడలేని ఎదుగుదల ఎటు దారితీసేదో గాని, 1980ల మధ్యలో ప్రపంచ బ్యాంక్ ఆదేశాల మేరకు ప్రవేశపెట్టిన వ్యవస్థీకృత సర్దుబాట్ల పుణ్యాన తిరిగి ఆహార ధాన్యాల కొరత ఏర్పడింది. ఈ సర్దుబాట్ల వల్ల దిగుమతి సుంకాలు 44 శాతం నుండి 20కి తగ్గించారు. విదేశీ పెట్టుబడికి, వ్యాపారానికి తలుపులు తెరిచారు. దీని వల్ల పెద్ద ఎత్తున కాగితం, పింగాణి, రబ్బర్, ఫర్నిచర్, పెట్రోకెమికల్స్, పానీయాలు, ఉన్ని, నూనెలు, తోళ్ల, బట్టల పరిశ్రమలు దివాలా తీసాయి. 1970లో 200 బట్టలు సంస్థలు ఉండగా, 2006కి పది మిగిలాయి. (ది ఫుడ్ వార్స్).

విదేశీ రుణాలు తీర్చడానికి ఎగుమతి సరుకుల తయారీ, సబ్సిడీ, సులభ రుణాల ఎత్తివేతవల్ల వ్యవసాయంపై ప్రభుత్వ ఖర్చు 1982 –1987ల మధ్య బడ్జెట్‌లో 7.5 శాతం నుండి 3.3 శాతానికి తగ్గింది. ఫిలిప్పైన్స్ రుణాల వడ్డీ ఖర్చు బడ్జెట్‌లో 2005లో 29 శాతానికి పెరిగింది. మొత్తం 47 లక్షల ఎకరాల సాగు భూమిలో నీటి పారుదల 13 లక్షల ఎకరాల వద్ద నిలిచిపోయింది. వరి దిగుబడి హెక్టారుకు సరాసరి 2.8 టన్నుల వద్ద నిలిచిపోయింది.

ఈ నేపథ్యంలో, ఫిలిప్పైన్స్ 1995లో ప్రపంచ వాణిజ్య సంస్థ (వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్)లో చేరడంతో మరో విడత 'ఉదార' ఆర్థిక విధానాలు – ధాన్యం దిగుమతిలో కోటాలు రద్దు, సుంకాల తగ్గింపు – అమలు జరిపింది. వరి విషయంలో కోటాలు ఉన్నప్పటికీ పంటలు తగ్గిపోవడంతో 1998 నాటికి 21 లక్షల టన్నుల దిగుమతి చేసుకోవడంతో రైతులకు గిట్టుబాటు ధరలు లభించక వరి సాగు మరింత క్షీణించింది. వరితో బాటు మొక్కజొన్న రైతులూ దివాలా తీసారు. మొక్క జొన్న పంటలు పొలాలలోనే కుళ్లబెట్టారు. మొక్కజొన్న పంట, 1993లో 30.5 లక్షల హెక్టార్ల నుండి 2000 నాటికి సుమారు 25 లక్షల హెక్టార్లకు తగ్గింది. అమెరికా నుండి సబ్సిడీల పంటల దిగుమతితో ఇదే పరిస్థితి కోళ్ల, పందుల, కూరగాయల రైతులకు ఎదురైంది.

ప్రపంచ వాణిజ్య సంస్థలో చేరే ముందు, ప్రపంచ బ్యాంక్ ఆదేశాల ప్రకారం, ప్రభుత్వ ఆర్థికవేత్తలు ధాన్యం సాగు స్థానే ఫ్లవర్‌వాజ్ పువ్వులు, అస్పరాగాస్, బ్రోకోలి, స్నో పీస్ వంటి ఇతర 'అధిక విలువ' ఎగుమతులతో లాభాలు సంపాదించుకోవచ్చని ప్రచారం చేసారు. ఈ ఎగుమతి పరిశ్రమలేవీ నిజం కాలేదు. ప్రభుత్వ ఆదాయానికి గండి పడడంతో, వడ్డీలు కట్టడంతో సరిపెట్టుకున్న ప్రభుత్వం, రవాణా, మార్కెటింగ్ వంటి సదుపాయాలు కల్పించకపోవడంతో, మార్కెట్ ప్రభావం వల్ల కొత్తగా ఏర్పడతాయని చెప్పిన 5 లక్షల పనులు ఏర్పడకపోగా, 1994లో ఉన్న కోటి పన్నెండు లక్షల వ్యవసాయ ఉపాధి స్థానాలు, 2001కి కోటి ఎనభై వేలకు పడిపోయాయి. 2004 నాటికి దిగుమతి సుంకాలు సున్నా నుండి ఐదు శాతం మధ్యకు తగ్గించడంతో ప్రభుత్వ ఆదాయం మరింత పడిపోయింది.

ఈనాడు ఫిలిప్పైన్స్ పరిస్థితి ధాన్యం దిగుమతి చేసుకోవడం, గల్ఫ్, ఇతర దేశాలకు ప్రజలను కూలీలుగా పంపడం, అమెరికా వంటి దేశాల నుండి ఔట్‌సోర్సింగ్ పనులు సంపాదించుకోవడం, సాగు భూములను వ్యవసాయ ఇంధనాలు పండించే విదేశీ సంస్థలకు అప్పగించడం. రైతుల పరిస్థితి నగరాల్లోని మురికివాడల్లో చేరి చిన్న చిన్న వృత్తులు చేసుకోవడం, విదేశాలలో శ్రామికులుగా, ఆయాలుగా పనిచేసి శ్రమ దోపిడీతో వ్యవసాయాన్ని నిలుపుకోవడం, లేదా భూములు బీడు (పడావు) పెట్టడం.

మిగులు ధాన్యం పండించిన దేశం, 2011లో సుమారు 26 లక్షల టన్నుల వరి దిగుమతి చేసుకునే స్థితికి చేరి (అమెరికా వ్యవసాయ శాఖ అంచనా) ఈనాడు ప్రపంచంలోనే అతిపెద్ద వరి కొనుగోలుదారుగా మారింది.

మన హరిత విప్లవానికి, ప్రైవేటీకరణకి, ఫిలిప్పైన్స్, మసగ్న, ప్రపంచీకరణకు చాలా పోలికలు ఉన్నాయి. జన్యు మార్పిడి, కార్పొరేట్ వ్యవసాయం, విత్తనాల నుండి కొనుగోలు వరకు కార్పొరేట్ సంస్థల అధీనం లోకి రైతులు వెళుతున్న దశలో మనం ఉన్నాం.

**మెక్సికో రొట్టెల సంక్షోభం**

ఇప్పుడు ప్రపంచ మెట్ట ప్రాంతాల పంట అయిన మొక్కజొన్న పండించే మెక్సికో అనుభవం చూద్దాం. 2007 రొట్టెల సంక్షోభం (తోర్టిల్ల క్రైసిస్) అని పిలవబడే ఆందోళన చెలరేగింది. దీని వెనుక తక్షణ కారణం మెక్సికన్ పేదలు ప్రధానంగా తినే మొక్కజొన్న రొట్టెల ధర 2006–2007 మధ్య సుమారు నాలుగు నెలల కాలంలో కిలో 63 సెంట్ల (సుమారు రు.35) నుండి 1.8 డాలర్లకు పెంచడం. ఈ పెరుగుదలకు కారణం అమెరికాలో ప్రభుత్వ సబ్సిడీల వల్ల వ్యవసాయదారులు మొక్కజొన్న పంటను ఎథనాల్ (పెట్రోల్‌లో కలిపి వాహనాల ఇంధనంగా వాడడానికి) తయారీకి మళ్లించడం. దానివల్ల మెక్సికోలో మొక్కజొన్న దిగుమతి ధరలు పెరగడం అని చాలామంది భావించారు. ఇదే కాక అర్చెర్ డానియెల్స్, మిడ్‌లాండ్ వంటి అమెరికా ఆహార కార్పొరేట్ సంస్థలు తమ మార్కెట్ అధిపత్యాన్ని వినియోగించుకోవడం, గోల్డ్‌మెన్ శాక్స్ వంటి అమెరికన్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకులు ఆహార ధాన్యాల స్పెకులేషన్‌లోకి (ఫ్యూచర్స్ మార్కెట్లు) పెద్ద ఎత్తున ప్రవేశించడం కూడా కారణం అన్న వాదనలు వినిపించాయి. బయో ఇంధనాలు, గుత్త కార్పొరేట్లు, స్పెక్యులేషన్ దేని పాపం ఎంత అని తేలలేదుకాని, ఒక ప్రశ్న మాత్రం మిగిలింది.

ప్రపంచంలోనే మొక్కజొన్న సాగుకు పురిటిగడ్డ, సుమారు నాలుగువేల రకాల మొక్కజొన్న వంగడాలు పండించే పనితనం ఉన్న రైతులు, వేల సంవత్సరాలు మొక్కజొన్న మీద బతికిన నాగరికత గల దేశానికి, అమెరికా నుండి మొక్కజొన్న దిగుమతి చేసుకునే పరిస్థితి ఎందుకు కలిగింది?

దీనికి మూలం 1980 దశాబ్దంలో మెక్సికో ఎదుర్కొన్న విదేశీ రుణాల సంక్షోభంలో ఉంది. తీగ పట్టుకుని డొంకంతా వెదికే ప్రయత్నం చేయకుండా చెప్పాలంటే, 1982 ఆగస్ట్‌లో మెక్సికో విదేశీ రుణాల మీద 90 రోజుల

చెల్లింపు నిలిపివేత (మారటోరియం) ప్రకటించింది. విదేశీ ప్రైవేటు బ్యాంకుల బకాయిలు చెల్లింపు కోసం అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్), ప్రపంచ బ్యాంకులు, ఆ సంస్థలు విధించిన నిర్మాణ సర్దుబాట్లు అనే షరతులకు అంగీకరించి అప్పు చేసింది. టూకీగా చెప్పాలంటే, సర్దుబాట్లంటే ఆర్థిక కార్యకలాపాలలో ప్రభుత్వ పాత్ర వీలైనంతవరకు కుదించడం, ప్రైవేటు, విదేశీ వ్యాపారాలపై నిబంధనలు తొలగించడం.

బడ్జెట్ ఖర్చులో వడ్డీల చెల్లింపు 19 శాతం (1982) నుండి 57 శాతానికి (1988) పెరిగింది. స్థిరాస్తి సేకరణ కేటాయింపు (కాపిటల్ ఎక్స్‌పెండిచర్) 19.3 శాతం నుండి 4.4 శాతానికి పడిపోయింది. దిగుమతి సుంకాలు 50 నుండి 20 శాతానికి తగ్గించి, దిగుమతి లైసెన్సులు తొలగించారు. దీంతో వందలాది చిన్న పరిశ్రమలు దివాలా తీశాయి. 1987 నాటికి నిరుద్యోగం 20 శాతానికి, తగినంత ఉపాధి లేమి (అండర్ ఎంప్లాయిమెంట్) 40శాతానికి పెరిగింది. (ది ఫుడ్ వార్స్, పేజీ 40-44).

దీంతోబాటు ప్రైవేటీకరణ చేపట్టారు. 1982లో ఉన్న 1,155 ప్రభుత్వ రంగ సంస్థలను 1990 నాటికి 285కు తగ్గించారు. జాతీయం చేసిన 18 బ్యాంకుల్లో, తొమ్మిదింటిని తిరిగి ప్రైవేటీకరించారు. దీనివల్ల స్వేచ్ఛా వ్యాపారం ఏర్పడుతుందని మత ప్రచారం లాంటి ప్రచారం నయా ఉదారవాదులు చేశారు. కాని ప్రపంచ వాణిజ్యం ప్రధానంగా గుత్త కార్పొరేట్ సంస్థల ఆధీనంలోకి వెళ్లిన కాలంలో జరిగేది అందుకు పూర్తిగా విరుద్ధంగా ఉంటుంది. మెక్సికోలో జరిగింది కూడా అదే. మెక్సికో జాతీయ ఆదాయంలో 47 శాతం మీద కేవలం పాతిక పెద్ద కంపెనీలే పట్టు సాధించాయి.

1994లో మెక్సికో, అమెరికా, కెనడాలతో ఉత్తర అమెరికా స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం (నార్త్ అమెరికన్ ఫ్రీ ట్రేడ్ అగ్రిమెంట్, లేక నాఫ్టా) కుదుర్చుకుంది. దీని ప్రభావంతో, అరవై ఏళ్లకు పైగా రైతులు అనుభవిస్తున్న రాయితీలు, మెక్సికో విప్లవం (1910-1920) వల్ల సాధించుకున్న భూ సంస్కరణలను కూడా మెక్సికో ప్రభుత్వం రద్దు చేసింది.

వ్యవసాయరంగంలో ప్రభుత్వం తన పాత్రను తగ్గించుకుని ప్రైవేటు, బహుళజాతి సంస్థలను ఆహ్వానించింది. రైతులకు ప్రభుత్వ రుణాలు తగ్గాయి. రాయితీలు, మద్దతు ధరలు రద్దు చేసారు. ప్రభుత్వం అందజేసే పంటల బీమా, నిలువ, విస్తరణలను ప్రైవేట్‌రంగానికి వదలి వేసారు.

ఉదాహరణకు, ప్రభుత్వ విత్తన ఉత్పత్తి కంపెనీ ప్రోడ్యుటురా నసిఒనల్ ది సేమిల్లాస్లో (ప్రోనసే) ఉత్పత్తి తగ్గించుకుంటూ పోయి 1997లో మూసివేసారు. ప్రభుత్వ వ్యవసాయ నీటిపారుదలశాఖ బడ్జెట్‌లో కేవలం 1991-95 మధ్య 34 శాతం కోతపెట్టారు. (ఎరోడింగ్ ది మెక్సికన్ కంట్రీసైడ్, ది ఫుడ్ వార్స్).

అదే సమయంలో అమెరికా నుండి మెక్సికోకు విత్తనాల దిగుమతి విలువ 37.82 కోట్ల డాలర్లకు చేరింది. మెక్సికో నుండి అమెరికాకు ఎగుమతి చేసిన విత్తనాల విలువ 1.86 కోట్ల డాలర్లు. (ప్లాంటింగ్ సీడ్స్, అమెరికా వ్యవసాయ శాఖ రిపోర్ట్, 2007)

అప్పటికే దెబ్బతిన్న వ్యవసాయం, నాఫ్టా కారణంగా పూర్తిగా సంక్షోభంలో పడింది. ఇది ప్రధానంగా మొక్కజొన్న విషయంలో బయట పడింది. అమెరికా ప్రభుత్వం తన వ్యవసాయదారులకు సబ్సిడీలు పెంచి, తన మిగులు ఉత్పత్తిని అమ్ముకోవడానికి మెక్సికోకు 300 కోట్ల డాలర్ల వ్యవసాయ రుణం ఇచ్చి, తన మొక్కజొన్న పంటను మెక్సికోలోకి ప్రవాహంలా పారించడంతో రైతుల దగ్గర కొనుగోలు ధరలు సగానికి పడిపోయాయి.

అదే సయమంలో మెక్సికన్ ప్రభుత్వ మొక్కజొన్న మార్కెటింగ్ సంస్థను మూసివేయడంతో, మార్కెట్ మొత్తం కార్గిల్ (అమెరికన్ సంస్థ) మసేక (అమెరికా, మెక్సికన్ మిలాఖత్ కార్పొరేషన్), అర్చెర్ డానియెల్ మిడ్‌లాండ్ (మెక్సికోలో గ్రుమా తో మిలాఖత్) వంటి సంస్థల గుప్పిట్లోకి వెళ్లింది. (మెక్సికోస్ తోర్తిల్ల క్రైసిస్, ది ఇంటర్నేషనలిస్ట్, జనవరి 2007). ఈ గుత్తాధిపత్యంతో ఎథనాల్, ఆహార మార్కెట్ ధరలను తమకు అనుకూలంగా వాడుకొని మొక్కజొన్న రొట్టెల ధరలను 2007లో కార్పొరేట్ సంస్థలు విపరీతంగా పెంచివేసాయి.

మరోవైపు, పెట్టుబడిదారీ వ్యవసాయానికి ఆటంకంగా ఉన్న భూసంస్కరణల రద్దు మెక్సికన్ విప్లవం (సామ్యవాద విప్లవం కాదు) తరువాత అధికారంలోకి వచ్చిన పిఆర్ఐ (పార్టీ అఫ్ ఇన్‌స్టిట్యూషనల్ రెవల్యూషన్) సాగించిన సంస్కరణలవల్ల, 1990నాటికి మెక్సికోలోని 56 శాతం సాగు భూమిని, 70 శాతం అడవి భూమిని, సుమారు 30 వేల సామూహిక కమతాలకు (ఎయిదోస్) పంచింది. అంటే భూమి సామూహిక ఆస్తిగా ఉండి, కౌలు, తనఖా, అమ్మకం వంటివి చెల్లనప్పటికీ, సేద్యపు హక్కు తరతరాలకు ఉంటుంది. అంటే రైతు వ్యవసాయానికి (పెసంట్ మోడ్ అఫ్ ప్రొడక్షన్) చట్టబద్ధ రక్షణ ఉంటుంది. అంటే ఆర్థిక వ్యవస్థలో ఎగుడు దిగుడులు ఎదురైనప్పటికీ, తక్షణ అవసరాలకు భరోసా ఉంటుంది. దీనివల్ల రైతులకు భూమిలేని కూలీలుగా, పట్టణ నిరుద్యోగులుగా మారే గతి పట్టదు.

మెక్సికో విప్లవం నాటికి కేవలం 1100 ఎస్టేట్‌ల అధీనంలో 56 శాతం భూమి ఉండగా, కోటిన్నర మంది భూమిలేని పేదలు ఉండేవారు. అదే 1990నాటికి ఎయిదోలో 78 శాతం, సొంత భూముల కమతాల్లో 62 శాతం ఐదు హెక్టార్లకు లోపు ఉన్న చిన్న కమతాలు. వ్యవసాయ జనాభాలో 70 శాతానికి కల్పించి, జాతీయ వ్యవసాయ దిగుబడిలో సగం అందిస్తూ పెట్టుబడిని కేవలం 38 శాతం మాత్రమే ఈ కమతాలు వాడుకునేవి. వ్యవసాయంలో మార్కెట్ సంబంధాలకు పెద్ద అడ్డంకిగా ఉన్న ఈ కమతాల స్థానే కొద్ది మంది చేతిలో భూమి కేంద్రీకరించే ప్రయత్నంలో భాగంగా 'మార్కెట్ నాయకత్వంలో భూ సంస్కరణ'అనే విధానం ప్రపంచ బ్యాంకు ప్రవేశపెట్టింది. (ఆనా డి ఐటా, ల్యాండ్ కాన్‌సెన్‌ట్రేషన్ ఇన్ మెక్సికో ఆఫ్టర్ ప్రొసీడ్, ఫుడ్ ఫస్ట్).

భూమి హక్కుల రక్షణ పేరుతో మెక్సికో ప్రభుత్వం ఈ ఎయిదోస్ భూములను ప్రైవేటు ఆస్తులుగా - అమ్మకం, కొనుగోలు, తనఖా, లీజుకు వీలుగా - మార్చే ప్రయత్నం సాగించింది. మొక్కజొన్నకు తగిలిన దెబ్బ వరి, కోళ్ల, పశువుల, పందుల పెంపకందారులకు తగిలి (వ్యవస్థాత్మక సర్దుబాట్లు, నాఫ్టా, ప్రైవేటీకరణలు ) దాదాపు కోటిన్నర రైతులు వ్యవసాయాన్ని వదులుకున్నారు.

వీరితో కొత్త ఎగుమతి వ్యాపార పంటలు, పుచ్చ కాయలు, బ్రోకోలి, పచ్చి బఠాణి, కాలిఫ్లవర్ వంటివి పండించడం తమ లక్ష్యం అని ప్రపంచ బ్యాంకు, మెక్సికన్ ప్రభుత్వం ప్రచారం మాత్రం చేసాయి. కాని ఈ పంటలకు తగిన రుణాలు మాత్రం రైతులకు అందలేదు. ఉదాహరణకు మొక్కజొన్న హెక్టార్‌కు పెట్టుబడి 210 డాలర్లు (సుమారు రూ. 12 వేలు.) కాగా, పచ్చి బఠాణికి పెట్టుబడి 3,145 డాలర్లు. (ది ఫుడ్ వార్స్).

నాఫ్టా పుణ్యాన మెక్సికోలోని చిన్న, మధ్య తరహా పరిశ్రమలు మూతపడడంతో, ఈ రైతులకు మిగిలింది, నగరాల్లో మురికివాడల్లో చేరడం. లేదా ఏదో విధంగా అమెరికా వెళ్లి వ్యవసాయ కూలీలుగా పనిచేయడం. పని దొరకని వారు మాదకద్రవ్యాలు అమ్మే గూండాల చేతుల్లో చిక్కి నేరస్తులుగా, హంతకులుగా మారడం. అమెరికాకు అక్రమ రవాణా చేసే మాదకద్రవ్యాల వ్యాపారం, దాని రక్షణ కోసం అమెరికానుండి ప్రవాహంలాగా వచ్చిపడే తుపాకులు, ముఠా యుద్ధాలు, వందల్లో హత్యలు, పెరిగిన మాఫియా సంస్కృతి, ఖాళీ అవుతున్న పల్లెలు, 40 శాతం మొక్క జొన్న ఎగుమతి చేసే సమాజం, దానిని దిగుమతి చేసుకునే పరిస్థితి - ఇది మెక్సికో స్థితి.

జన్యు మార్పిడి అనో, కార్పొరేట్ వ్యవసాయం అనో అరచేతిలో స్వర్గం చూపేవారు, మరి మెక్సికో గురించి ఏమంటారో ?

*(రచయిత సామాజిక కార్యకర్త, ఆస్ట్రేలియా)* వీ

# భూంకాల్ బాటలో బస్తర్‌వాసులు

***ఆదివాసుల స్వేచ్ఛాకాంక్షకు, పోరాట పటిమకు భూంకాల్ పోరాటం ప్రతీక అయితే ఆ వారసత్వాన్ని వాళ్లు ప్రత్యామ్నాయ పోరాటంలో కొనసాగిస్తున్నారని అంటున్నారు* బి.డి. దమయంతి, అమన్**

ప్రతి సంవత్సరం వలెనే, ఈ సంవత్సరం ఫిబ్రవరి 10న దండకారణ్య ప్రజలు 'భూంకాల్' దినాన్ని స్ఫూర్తిదాయకంగా జరుపుకున్నారు. ఆదివాసీ పోరాట చరిత్రలో, దండకారణ్య పోరాట చరిత్రలో భూంకాల్ తిరుగుబాటుకు ఎంతో ప్రాధాన్యత ఉంది. మన దేశ నూతన ప్రజాస్వామిక విప్లవ చరిత్రలో కూడా దీనికి ప్రాధాన్యత ఉంది. మన దేశ ఆదివాసీలకు సంపద్వంతమైన పోరాట చరిత్ర ఉందని అందరికీ తెలిసిందే. దండకారణ్య ఆదివాసీలు సైతం తమ వీరోచిత పోరాట తత్వంతో అనేక నూతన అధ్యాయాలు జోడిరచి ఈ చరిత్రను సుసంపన్నం చేశారు.

1774 నుండి 1910 వరకూ దండకారణ్యంలోని అవిభాజిత బస్తర్ ప్రాంతంలో పది పెద్ద తిరుగుబాట్లు జరిగాయి. భారత ప్రథమ స్వతంత్ర సంగ్రామానికి ముందుగానే, 1824 నుండే ఇక్కడ బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాట్ల పరంపర ప్రారంభమైంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా జరిగిన ఆదివాసీ పోరాటాల్లో దండకారణ్య ఆదివాసీలు సముచిత పాత్రను పోషించారని సగర్వంగా చెప్పవచ్చు. ఈ తిరుగుబాట్లన్నిటిలో 1910లో ప్రజా రాజ్య స్థాపన లక్ష్యంతో జరిగిన భూంకాల్ అగ్రస్థానంలో నిలుస్తుంది. అయితే అణగారిన వర్గాలు సృష్టించిన చరిత్రను పాలకవర్గాలు లిఖిత చరిత్రగా నమోదు కానీయలేదు లేదా వక్రీకరించాయి. కొందరు చరిత్రకారులు వీటిని లిఖిత చరిత్రలో నమోదు చేసినా, వాటిని ప్రచారం కాకుండా పాలకవర్గాలు అడ్డుకున్నాయి. అందుకే వీరోచితంగా, విస్తృత స్థాయిలో జరిగిన భూంకాల్ తిరుగుబాటు గురించి నేటి తరాలకు, ముఖ్యంగా బైటి వాళ్లకు తెల్సింది చాలా తక్కువ. దేశవ్యాప్తంగా ప్రచారం కావాల్సి ఉండిన భూంకాల్ తిరుగుబాటుకు కేంద్రం బస్తర్‌లోని మాడ్ ప్రాంతం. 'మాడ్' ప్రాంతాన్ని ప్రభుత్వం అబూజ్‌మాడ్‌గా వ్యవహరిస్తోంది. 'అబూజ్' అంటే 'తెలియని' లేదా 'అర్థం కాని' అని అర్థం. వందేళ్ల క్రితమే ఇంత పెద్ద పోరాటానికి కేంద్రంగా ఉండిన ఈ ప్రాంతం ప్రభుత్వం దృష్టిలో తెలియని ప్రాంతం ఎలా అయ్యింది? ఈ ప్రాంతం ఉనికినే ప్రయత్న పూర్వకంగా విస్మరించే పాలకవర్గాలు, ఇక ఈ ప్రాంతపు చరిత్రను ఎలా వెలుగులోకి రానిస్తాయి? అయితే పాలకవర్గాలు తొక్కిపట్టిన ఈ చరిత్ర ఇక్కడి ప్రజానీకం స్మృతిలో మాత్రం ఇప్పటికీ సజీవంగా ఉంది. ఒకతరం నుంచి మరోతరానికి మౌఖికంగానే ఇది అందించబడుతున్నది. ప్రస్తుతం ఇక్కడ కొనసాగుతున్న విప్లవోద్యమం, ఈ ప్రాంతపు గత చరిత్రను కూడా లిఖితపరుస్తున్నది. ఈ కృషిలో భాగంగా దండకారణ్య విప్లవోద్యమ పత్రిక 'ప్రభాత్' భూంకాల్ చరిత్రను, బస్తర్‌లో జరిగిన తిరుగుబాట్లన్నిటి చరిత్రను పరిచయం చేస్తూ 1999-2001 మధ్యకాలంలో వరుసగా పలు వ్యాసాలు ప్రచురించింది. 1999 నుండి విప్లవోద్యమం 'అబూజ్' అనే అసంబద్ధమైన, అవమానకరమైన విశేషణాన్ని తీసిపారేసి ఈ ప్రాంతాన్ని 'మాడ్'గా వ్యవహరిస్తున్నది. ఈ ప్రభావంతో ప్రస్తుతం బూర్జువా మీడియా సైతం 'మాడ్'గానే వ్యవహరిస్తున్నది.

భూంకాల్ అంటే విస్తృత ప్రకంపన అనీ, సామూహిక తిరుగుబాటు అని చెబుతారు. ప్రజల వాడుకలో మాత్రం భూంకాల్ అంటే ప్రజలందరి సమ్మేళనం. బస్తర్ ఆదివాసుల సామాజిక జీవితంలో భూంకాల్ చేసే నిర్ణయం అత్యున్నతమైనదిగా, సర్వామోదంగా ఉంటుంది. కోయ, మురియా, మాడియా, గోండీ, హల్బీ, ధుర్లీ, భత్రా తదితర ఆదివాసీ తెగలకు, ఆదివాసీయేతర సముదాయాలకు చెందిన విస్తృత ప్రజానీకం పాల్గొన్న సామూహిక తిరుగుబాటు కాబట్టి దీన్ని భూంకాల్ తిరుగుబాటుగా పిలిచి ఉంటారు. భూంకాల్ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడింది. మొదట ఆంగ్ల-మరాఠాల పరాయి పాలన సాగగా, 1854 నాటికి బస్తర్ పూర్తిగా బ్రిటిష్ వాళ్ల ప్రత్యక్ష పాలనలోకి వెళ్లిపోయింది. ఈ పాలనలో బస్తర్ ఆదివాసీలు విపరీతమైన పీడనకు గురయ్యారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రూపొందించిన నూతన అటవీ చట్టాలు ఈ అడవి బిడ్డలకు అడవి మీదున్న జన్మహక్కును హరించి వేశాయి. రకరకాల పన్నుల భారంతో వీరి బతుకులు అతలాకుతల మయ్యాయి. నూతనంగా రంగ ప్రవేశం చేసిన అబ్కారీ శాఖ ఈ పీడనను మరింత పెంచింది. ఈ దోపిడీ పాలనను నిరాటంకంగా కొనసాగించడం కోసం మరింత నిరంకుశమైన పోలీసు వ్యవస్థ రూపొందింది. పన్నులు, శిక్షలు, జైళ్లు, అత్యాచారాలు ఆదివాసీల జీవితాల్లో విడదీయలేని భాగమయ్యాయి.

స్వేచ్ఛాజీవులైన ఆదివాసీలు సహజంగానే ఈ పీడనను వ్యతిరేకించారు. "వారికి (ఆదివాసీలకు) ఈ కొత్త అటవీ చట్టాలు గానీ, పోలీసుల జోక్యం గానీ, పాఠశాలలు గానీ, వెట్టి చాకిరీ గానీ నచ్చలేదు. తమ జీవన పద్ధతుల్లో ప్రవేశపెట్టబడుతున్న మార్పు గురించి బస్తర్‌లో ఎల్లెడలా ప్రజానీకం చర్చించుకుంటున్నారు. వీటన్నింటిపైన, అడవిపైన తమకు అనుల్లంఘనీయమైన హక్కు ఉందనీ, ఇందులో ఎటువంటి జోక్యమైనా సరే తమకు గిట్టబోదని అడవి బిడ్డలైన ఈ ఆదివాసీలు భావిస్తున్నారు. అడవులపై సర్వాధికారాలు తమవేనని ఈ విషయంలో జోక్యం కలుగజేసుకునే హక్కు ఎవరికీ లేదని వారు భావిస్తున్నారు" అని ఆనాటి బ్రిటిష్ ఉన్నతాధికారి స్టెయిండెన్ అన్న మాటలను చూస్తే

నాటి బ్రిటిష్ అణచివేత, ప్రజల వ్యతిరేకత రెండూ అర్థమవుతాయి. ఈ నేపథ్యంలోనే, అణచివేత తిరుగుబాటుకి తప్పక దారితీస్తుందనే సత్యాన్ని చాటుతూ బస్తర్ ప్రజానీకం భూంకాల్‌ను చారిత్రక రంగస్థలం పైకి తెచ్చారు. తమ ప్రాంతంలో పరాయి పాలనను అంతం చేసి తమ రాజ్యాన్ని నెలకొల్పుకోవడమే భూంకాల్ లక్ష్యంగా ఉండింది.

భూంకాల్‌కు తగిన సన్నాహాలు చేయడం కోసం 1909 అక్టోబర్‌లో ఏర్పాటు చేసిన సభలో మొట్టమొదట భూంకాల్‌ను ప్రకటించారు. గుండాదూర్, అయితు మహరా వంటి మాంజీలు, ముఖియాలు (ఆదివాసీ తెగల పెద్దలు) ఇందులో పాల్గొన్నారు. కుటుంబ కలహాలతో అధికారానికి దూరమైన రాజ కుటుంబీకులు లాల్ కాలేంద్ర సింగ్ (మాజీ దివాన్), రాణీ సుబరన్ కుంవర్ తదితరులు కూడా ఈ సభలో పాల్గొన్నారు. వేలాది మంది ప్రజలు గుండాదూర్‌ను తమ నేతగా ఎన్నుకున్నారు. ఆనాడు బస్తర్‌లో 84 పరగణాలు ఉండేవి. ఇందులోని 48 పరగణాల్లో భూంకాల్ వీరోచితంగా జరిగింది. భూంకాల్‌ను విజయవంతంగా నడపడానికి ప్రతీ పరగణాకు విడివిడిగా నాయకులను ఎన్నుకున్నారు.

ఈ సభలో లాల్ కాలేంద్రసింగ్, రాణి సుబరన్ కుంవర్ తదితర నేతలు చరిత్రలో ఆదివాసీల వీరోచిత పోరాటాలను శ్లాఘించారు. రాణి సుబరన్ కుంవర్ "ఆంగ్లేయుల నమ్మిన బంటు అయిన ప్రధాని (దివాన్)కి వ్యతిరేకంగా మీరు వెంటనే పోరాటం ప్రారంభించండి. వారి ఉద్యోగులందరినీ బయటకు గెంటేయండి. వారంతా బస్తర్ ప్రజల శత్రువులు. వారు తమ స్వభావ రీత్యానే బస్తర్‌ను అణచిపెడుతున్నారు. వీరి పోషకులైన ఆంగ్లేయ రాజులను మట్టిగరిపించండి" అని వుద్వేగంగా మాట్లాడింది.

భూంకాల్‌కు సంబంధించిన సమగ్రమైన యుద్ధ పథకం అత్యంత పకడ్బందీగా తయారైంది. శత్రువుకు అంతుపట్టకుండా పూర్తి రహస్యంగా అది ప్రజల్లోకి పోయింది. వారి యుద్ధ పథకంలోని ముఖ్యాంశాలు:

1. బస్తర్‌ను కబ్జా చేసిన వలసవాదులపై అంతుపట్టని వేగంతో, ఊపిరి సలపనివ్వని ఆకస్మిక దాడులు చేయాలి.

2. దేశంలోని ఇతర ప్రాంతాలతో బస్తర్‌ను కలిపే కమ్యూనికేషన్ (టెలిఫోన్, టెలిగ్రాఫ్, పోస్టల్) వ్యవస్థను పూర్తిగా నిర్మూలించాలి.

3. బస్తర్‌ను పొరుగు ప్రాంతాలతో కలిపే రోడ్లను ధ్వంసం చేయాలి. ఈ విధంగా బ్రిటిష్ వాడి సైన్యాల రాకను అడ్డుకోవాలి.

4. ముందు నుండే ప్రభుత్వోద్యోగులను ఖైదీలుగా బంధించి పెట్టుకోవాలి. అవసరమైనపుడు వారిని యుద్ధ ఖైదీలుగా వినియోగించుకోవాలి. ఖైదీలు ప్రతిఘటిస్తే వారిని హతమార్చాలి.

1910 జనవరిలో ఉత్తర బస్తర్ ప్రాంతంలోని తాడోకిలో మరోసారి సభ జరిగింది. నేల తల్లి విముక్తికి తమ ప్రాణాలను, ఆస్తులను తృణప్రాయంగా అర్పిస్తామని ప్రజలంతా ఈ సభలో ప్రతిజ్ఞ చేశారు. తాడోకిలోని దేవి మందిరంలో పూజింపబడిన అనంతరం ఒక 'కటార్' (కత్తి వంటి ఆయుధం) ప్రజల చేతికి వచ్చింది. ఈ 'కటార్' ఒకరి చేతి నుండి మరొకరి చేతికీ, ఒక ఊరు నుండి మరొక వూరికీ, ఒక పరగణా నుండి మరొక పరగణాకు మొత్తం 48 పరగణాలు శత్రువు దృష్టిలో పడకుండా యుద్ధ సందేశాన్ని అందిస్తూ ప్రయాణించింది. ఇది ప్రయాణించిన గ్రామాలన్నీ కదనరంగంలో కదం కలిపాయి.

ఫిబ్రవరి 1న బస్తర్ రాజ్యానికి రాజధానిగా ఉన్న జగ్దల్‌పూర్‌పై దాడితో భూంకాల్ ప్రారంభమైంది. జగ్దల్‌పూర్ దివాన్‌ను చంపాలనే ఉద్దేశంతో ఇక్కడ దాడి చేయగా దివాన్ తప్పించుకున్నాడు. విదేశీయులను తరిమేశారు. జగ్దల్‌పూర్-ధమ్‌తరిల మధ్య టెలిగ్రాఫ్ లైన్‌ను ధ్వంసం చేశారు. రోడ్లను దిగ్బంధించి బయటి ప్రపంచంతో సంబంధాలను తెంచివేసి జగ్దల్‌పూర్ మాదేనని ప్రకటించారు.

ఫిబ్రవరి 2న చింగ్‌పాల్ బజార్‌పై దాడి చేసి వ్యాపారుల నుండి సామాన్లు స్వాధీనం చేసుకున్నారు. ఫిబ్రవరి 4న కుకనార్ బజార్‌పై దాడి చేశారు. 5న కరంజి, మారెంగ, తోకపాల్‌లపై దాడి చేశారు. ఫిబ్రవరి 7 చారిత్రక దినం. ఈరోజున గీదంలో గుండాదూర్ తదితరుల నాయకత్వంలో జరిగిన సభలో గీదం కేంద్రంగా 'మాడియా రాజ్యం' ఏర్పడిందని ప్రకటించారని కొందరు చరిత్రకారులు పేర్కొన్నారు. ఇదే రోజు రాణి సుబరన్ కుంవర్ "బస్తర్‌లో నేటితో బ్రిటిష్ రాజ్యం అంతమైంది. ఈరోజు మనమంతా తిరిగి మన రాజ్యాన్ని ఏర్పరుచుకోవడానికి ప్రతిన బూనుదాం" అని ప్రకటించింది. ఈ ప్రకటన వెలువడిన వెంటనే తిరుగుబాటుదారుల చేతికి వచ్చిన తొలి కేంద్రం గీదం. ఇలాంటి మరెన్నో కేంద్రాల్లో తమ అధికారాన్ని నెలకొల్పాలని ఈ ప్రకటనకు జోడించారు. ఈ ప్రకటన బస్తర్ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది. తిరుగుబాటుదారుల దాడులు మరింత ఉధృతమయ్యాయి.

ఫిబ్రవరి 8న కుట్రుపై దాడి చేసి ప్రజల అధికారాన్ని నెలకొల్పారు. 9న దంతెవాడపై దాడి చేశారు. ఇదే రోజు కువ్వకొండలో ముగ్గురు పోలీసులను చంపేశారు. ఇదే రోజున మాడ్‌లో కమాండర్ దూరి (మాడ్‌లో రగులుతున్న పోరాటాన్ని అణచివేయడానికి నియమితుడైన ఇంగ్లీష్ అధికారి) సేనపై దాడి చేసి ఒక హవల్దార్‌ను చంపేశారు. భూంకాల్‌లో ముఖ్య భూమిక పోషించిన చోటే డోంగర్, కుత్తుల్ గ్రామాలపై దాడి చేసి కుత్తుల్‌లోని పోలీసు స్టేషన్‌ను తగులబెట్టారు. అందులోని పోలీసులందరినీ చంపేశారు. ఇలా భూంకాల్ తిరుగుబాటు దారులు అప్రతిహతంగా పురోగమిస్తూ దక్షిణ బస్తర్ ప్రాంతంలోని మద్దేడ్, భూపాల్‌పట్నం, జేగురుగొండ, ఊసూరులపై దాడులు చేశారు. జగ్దల్‌పూర్ మినహా మొత్తం బస్తర్ అంతా భూంకాల్ వీరుల చేతికొచ్చింది. మొత్తంగా దాదాపు 40 రోజులు ప్రజా రాజ్యాధికారం కొనసాగింది.

భూంకాల్‌ను అణచివేయడానికి నాటి బ్రిటిష్ ప్రభుత్వం తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించింది. కేవలం సాంప్రదాయక ఆయుధాలతో పోరాడుతున్న ప్రజలపైకి ఆధునిక ఆయుధాలు కలిగిన సాయుధ బలగాలను ఉసిగొల్పింది. సెంట్రల్ ప్రోవిన్స్‌కు చెందిన రెండు వందల సాయుధ బలగాలు, మద్రాస్‌కు చెందిన డిప్యూటీ సూపరింటెండెంట్ పిళ్లై నాయకత్వాన 150 మంది సాయుధ బలగాలు, మేజర్ బ్లోయిన్ జాన్సన్ నాయకత్వంలో 70 మంది బలగాలు, 22వ బెటాలియన్‌కు చెందిన పంజాబ్ హంతక దళాలే కాక జబల్‌పూర్, విశాఖపట్నం, జైపూర్ (ఒడిశా), నాగ్‌పూర్‌ల నుండి సాయుధ బలగాలు బస్తర్‌లో దిగాయి. వీటితో పాటు రాయ్‌పూర్ నుండి వచ్చిన 150 మంది పోలీసు బలగాలు కూడా ఉన్నాయి.

ఈ పాశవిక సాయుధ బలగాలు భూంకాల్‌ను అణచివేయడంలో

భాగంగా, ప్రజలపై విచక్షణా రహితంగా హింసను ప్రయోగించాయి. భూంకాల్ వీరులు ఎన్నో చోట్ల ఈ బలగాలతో వీరోచితంగా తలపడ్డారు. చోటేడోంగర్, కుత్తుల్, జగదల్‌పూర్‌లలోనూ, జగదల్‌పూర్ సమీపంలోని ఖడక్‌ఘాట్, నేతనార్, ఆల్‌నార్‌లలోనూ భూంకాల్ తిరుగుబాటుదారులు వీరోచిత పోరాటాలకు తలపడ్డారు. అయితే ఆధునిక ఆయుధాలతో తలపడలేక ఎందరో వీరులు నేలకొరిగారు. ఎన్నో చోట్ల నెత్తురు ఏరులై పారింది.

ఈ పోరాటంలో పెద్ద ఎత్తున హత్యాకాండకూ హింసకూ గురైన గ్రామాల్లో మాడ్‌లోని నేల్‌నార్ ఒకటి. గుర్రాలపై వచ్చిన ఇంగ్లిష్ వాళ్లు ఈ గ్రామాన్ని చుట్టు ముట్టి చాలామందిని కాల్చి చంపారు. గర్భవతులను పొట్టలు కోసి చంపారు. ఎలుకలను కొయ్యకు గుచ్చి కాల్చినట్టుగా, పసిపిల్లల్ని కొయ్యకు గుచ్చి కాల్చేవారనీ ప్రజలు ఇప్పటికీ ఆవేదనతో చెప్తుంటారు. ఈ గ్రామం పక్కన గుహలో దాగిన ప్రజలను సజీవంగా కాల్చి చంపారట. ఈ హత్యాకాండలో కాలువలు గట్టిన రక్తంలో ఇంగ్లిష్ వాళ్లు ఒక మర్రి మొక్కను నాటి ఈ చెట్టు బతకకుండా చచ్చిపోతే పోరాటం కూడా పూర్తిగా నాశనం అవుతుందని చెప్పారట. కానీ నాటి పోరాటవీరుల రక్తంలో నాటిన ఆ మొక్క వీరుల త్యాగాలకు సాక్షిగా పెరిగి, పెద్దదయి, మహావృక్షమై భవిష్యత్ విజయాలకు హామీగా నేటికీ నిలిచి ఉంది.

1910 మార్చి 29న సోను మాంజీ అనే ద్రోహి ఇచ్చిన సమాచారంతో బ్రిటిష్ ప్రభుత్వ సేన ఆల్‌నార్ గ్రామంలో విశ్రాంతి తీసుకుంటున్న భూంకాల్ వీరులపై దాడి చేసింది. ఈ దాడిలో అనేక మంది చనిపోయారు. మరెందరో గాయపడ్డారు. ఈ దాడి నుంచి గుండాదూర్ తప్పుకున్నాడు. మరెప్పుడూ ఆయన శత్రువు చేతికి చిక్కలేదు.

ప్రభుత్వ రికార్డులు చెప్తున్న లెక్కల ప్రకారం, భూంకాల్ సమయం లో మొత్తం 78 మందిని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్ట్ చేసి రాయ్‌పూర్ జైల్లో పెట్టింది. వీరిలో అయిదుగురికి జీవిత ఖైదును విధించింది. వీరిలో 27 మంది జైల్లోనే ప్రాణాలు కోల్పోయారు. లాల్ కాలేంద్రసింగ్, రాణీ సుబరన్ కుంవర్‌లు కూడా జైల్లోనే మృత్యువాత పడి అమరులుగా చరిత్రలో నిలిచిపోయారు.

మూడు నెలల పాటు బస్తర్ నలుమూలలా కార్చిచ్చులా ప్రజ్వలించిన భూంకాల్ తిరుగుబాటును పాశవిక నిర్బంధకాండతో అణచివేశారు. అయితే ఈ ప్రజల స్వేచ్ఛా కాంక్ష ఆరిపోలేదనడానికి నేడు బస్తర్ కేంద్రంగా జరుగుతున్న దండకారణ్య విప్లవ పోరాటాలే నిదర్శనం. తెలియని ప్రాంతంగా పాలకవర్గాలు మరుగుపర్చాలనుకున్న మాడ్ ప్రాంతం, నేడు దేశ సరిహద్దులను దాటుకొని ఎందరికో తెల్సిన ప్రాంతం అయిందంటే ఈ స్వేచ్ఛా కాంక్షనే కారణం. భూంకాల్ వారసత్వం కొనసాగుతున్నదనడానికి ఇంత కంటే నిదర్శనం లేదు.

ప్రజల ఆకాంక్షలకు శాస్త్రీయ సైద్ధాంతిక అవగాహనను అందించి పోరులో కదిలిస్తున్న మావోయిస్టు పార్టీ గతంలో జరిగిన ఆదివాసీ వీరోచిత పోరాటాలన్నింటికీ చరిత్రలో సముచిత స్థానాన్ని కల్పించడానికి కృషి చేస్తున్నది. అందులో భాగంగా ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 10న భూంకాల్ దినాన్ని సమరోత్సాహంతో జరుపుకోవాలని 2004లో తొలిసారి నిర్ణయించి ప్రజలకు పిలుపునిచ్చింది. అప్పటి నుండి ప్రతి సంవత్సరం దండకారణ్య వ్యాప్తంగా ప్రజలు 'భూంకాల్ దివస్'ను జరుపుకుంటున్నారు. భూంకాల్‌కు వందేళ్లు నిండిన సందర్భంగా భూంకాల్ వారాన్ని జరుపుకోవాలనే పార్టీ పిలుపు మేరకు 2010 ఫిబ్రవరి 10 నుండి 16 వరకూ ప్రజలంతా ఎంతో స్ఫూర్తిదాయకంగా జరుపుకున్నారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభమైన మొదటి సంవత్సరంలో దండకారణ్య విప్లవ ప్రజానీకం ఈ భూంకాల్ వారాన్ని జరుపుకోవడం విశేషం. ఈ సందర్భంగా ప్రజలు తమ ఉనికిని హరిస్తున్న సామ్రాజ్యవాద శక్తులనూ, వాళ్ల తొత్తులైన భారత పాలక వర్గాలను నిర్మూలించే లక్ష్యంతో మరో భూంకాల్‌కు సిద్ధం అవుతామనీ, గ్రీన్‌హంట్‌ను ఓడిస్తామని గ్రామగ్రామాన ప్రతిజ్ఞ చేశారు. 2011 ఫిబ్రవరిలో దండకారణ్య విప్లవోద్యమానికి ముప్పయ్యేళ్లు నిండిన సందర్భంగా భూంకాల్ నెల (ఫిబ్రవరి)లో భూముల సమతలీకరణ క్యాంపెయిన్‌ను చేపట్టారు. ఇందులో లక్షకు పైగా ప్రజలు పాల్గొని కుంటలు తవ్వి, పొలాలకు కట్టలు పోశారు. 2012 ఫిబ్రవరి భూంకాల్ వార్షికోత్సవం సందర్భంగా కూడా మరోసారి భూముల సమతలీకరణ కోసం ఒక క్యాంపెయిన్‌గా తీసుకోవాలనే నిర్ణయం జరిగింది. పరాయి పాలనను వ్యతిరేకిస్తూ, ప్రజలలో ప్రజా రాజ్యాధికార భావనను పాదుకొల్పిన భూంకాల్ వారసత్వాన్ని కొనసాగించే క్రమంలో ప్రజలు తమ పంట పొలాల ఉత్పాదకతను పెంచుతూ, స్వావలంబనపై, సహకారతత్వంపై ఆధారపడిన ప్రజా ఆర్థికవ్యవస్థను బలోపేతం చేసే కృషిలో పాలు పంచుకోవడం ఎంతో ప్రేరణాదాయకమైనది.

నాడు భూంకాల్ తిరుగుబాటు జరిగింది ఒక్క బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగానే. కానీ నేడు అనేక సామ్రాజ్యవాద దేశాలకు చెందిన బహుళజాతి కంపెనీలు దండకారణ్యాన్ని కొల్లగొట్టడానికి వేగిరపడ్తున్నాయి. ఈ దోపిడీకి ఇక్కడి ఆదివాసీ ప్రజలు ఆటంకంగా ఉన్నారు. కనుక ప్రస్తుతం గ్రీన్‌హంట్ పేరుతో ఇక్కడ ఆదివాసీ హననానికి పాల్పడుతున్నాయి. ఈ గ్రీన్‌హంట్ రెండో దశలో సైన్యాన్ని మోహరించే పథకం భాగంగా ఉన్నది. ప్రస్తుతం 'శిక్షణ' పేరుతో వచ్చిన భారత సైన్యాలు ఒక బ్రిగేడ్ స్థాయిలో దండకారణ్యంలోని మాడ్ పరిసరాల్లో తిష్ట వేసాయి. దేశవాసుల నుండి ఎదురయ్యే వ్యతిరేకతను దృష్టిలో ఉంచుకొని 'శిక్షణ'ను సాకుగా చెప్పినప్పటికీ ఇది మోహరింపు పథకంలో భాగమేనని, సైన్యం ఇక్కడికి వచ్చింది ప్రజలపై యుద్ధానికేనని అర్థం చేసుకోవడం కష్టమేమీ కాదు. మాడ్ ప్రాంతంలో 750 చదరపు కిలోమీటర్ల భూభాగాన్ని భారత సైన్యం ఆక్రమించుకోబోతున్నది. ఇది మాడ్ మొత్తం వైశాల్యంలో ఐదో వంతు. క్రమక్రమంగా మాడ్‌ను మొత్తం గానే సైన్యం ఆక్రమించేసుకొని ఇక్కడి ప్రాచీన ప్రజా సముదాయాలను నామరూపాలు లేకుండా చేసే ప్రమాదం పొంచి ఉన్నది. ఒకప్పుడు వలస పాలకులు తమ దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా తిరుగబడ్డ ఆదివాసులను అణచడానికి సైన్యాల్ని దించారు. ఈనాడు మన 'స్వతంత్ర' భారత పాలకులు తమ కార్పొరేట్ అనుకూల నయా ఉదార విధానాలను నిరాటంకంగా అమలు చేయడం కోసం దేశం నడిబొడ్డునున్న నిరుపేద ప్రజల మీదకు సైన్యాలను పంపుతున్నారు. ఆనాడు తెల్లవాళ్ల సైన్యాలు భూంకాల్‌ను అణచివెయ్యగలిగింది నిజమే కావచ్చు, కానీ చరిత్ర ప్రతిసారీ ఒకే విధంగా పునరావృతం కాదనేది కూడా చరిత్రలో రుజువైన సత్యం.

*(రచయితలు సామాజిక కార్యకర్తలు)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 13

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

*( గత సంచిక తరువాయి... )*

రిసెటిల్‌మెంట్ జరుగుతున్న క్రమంలోనే భూములపై ఒక అవగాహన వచ్చిన తరువాత అభివృద్ధి ఇతర అవసరాల కోసం ప్రభుత్వ భూములు లేని చోట్ల, వ్యక్తులు ప్రభుత్వేతర సంస్థలు హక్కుదారులుగా ఉన్న భూమిని ప్రజావసరాల నిమిత్తం సేకరించడానికి 1894లో భూసేకరణ చట్టం చేసింది. ఈ చట్టం ద్వారా ప్రభుత్వ కార్యాలయాలకు, ఉద్యోగుల గృహాలకు, ప్రభుత్వ అతిథిగృహాలకు, విద్యా సంస్థలకు, వైద్యశాలలకు, రోడ్డు, రైలు మార్గాలకు కావలసిన భూమిని సేకరించడానికి ఈ చట్టం ప్రభుత్వానికి అధికారాన్ని ఇచ్చింది. పేద ప్రజలకు రెవెన్యూ వ్యవస్థ ద్వారా ధాన్యం ఇతర తిండి గింజలను దినవెచ్చం (రేషన్) పద్ధతి ద్వారా పంపిణీ చేసేవారు. కరువు కాటకాలకు ధాన్యం పంపిణీ, అంబలి కేంద్రాలను నడిపేవారు. కరువు సమయంలో ప్రజలకు పనికల్పించడానికి రోడ్డు, రవాణా మార్గాలు నిర్మించడం, ఇతర మట్టి పనులు చేయించడం చేస్తుండేవారు. ఈ పనులను ప్రణాళికా బద్ధంగా మంజూరు చేసి ప్రజలు కోరుకొనే వరకూ చేయించేవారు.

రిసెటిల్‌మెంట్ ద్వారా తమ ఆధీనంలో ఉన్న మొత్తం భూములూ, దీంతోపాటు హక్కుల స్వభావం ఇలా మద్రాసు ప్రెసిడెన్సీలో ఉన్న భూమికి ఒక సంపూర్ణ రికార్డు తయారయింది. ప్రభుత్వ లేదా వ్యక్తుల, సంస్థల, ఇతర హక్కుల గురించి, విస్తీర్ణం గురించి మరలా రికార్డు తయారు చెయ్యాల్సిన అవసరం లేకుండా పోయింది. కేవలం భూమి హక్కులలో జరిగిన మార్పులు, ఆక్రమణ (శివాయి జమాదారులు)లు, కౌలు స్వభావం, ప్రభుత్వ కేటాయింపుల వల్ల జరిగిన మార్పులు, భూసేకరణ తరువాత చేసే హక్కుదార్ల మార్పులు మాత్రమే నమోదు చేయడం నిరంతరం జరుగుతుండేది. ప్రతి సంవత్సరం జరిగే జమాబందిలో ఆ సంవత్సరం నికర భూమికి విధించిన శిస్తు, అపరాధ రుసుం, రావలసిన లీజు మొత్తం వివరాల ఆమోదంతో పాటు జమాబంది జరిగే సమయాన్ని ప్రజలకు చాటింపు ద్వారా తెలియజేసి వారి దగ్గర నుంచి దరఖాస్తులను స్వీకరించే వారు. ఈ దరఖాస్తులను పరిశీలించి ప్రభుత్వ భూములు ఆక్రమించుకున్న వారికి హక్కులు కల్పించడం, అమ్మకం ఇతర లావాదేవీలను ఆమోదించడం, నీటి పారుదల జరిగిన విస్తీర్ణంలో మార్పులు చేర్పులు వాటిపై పెనాల్టీలు విధించడాన్ని ఆమోదించడం, భూమిశిస్తు మాఫీకి ప్రతిపాదనలు పంపడం, సర్వేకు వచ్చిన దరఖాస్తులను ఆమోదించడం, పాతిన రాళ్ల లెక్కలను సరిచూడడం, ఇలా భూముల హక్కులలో స్వభావాలలో మార్పునకు సంబంధించిన ప్రతి దరఖాస్తును పరిశీలించి నిర్ణయం తీసుకునేవారు. ఇదంతా కూడా భూమిపై హక్కులను నమోదు చేసే రెవెన్యూ పరిపాలన ఎలా జరుగుతుందో తెలిపే ఒక కోణం. అప్పటికీ (20వ శతాబ్దం ఆరంభానికి) ప్రజల జీవనం కేవలం వ్యవసాయం మీదే ఆధారపడి ఉంది. 15 శాతం ప్రజలు మాత్రమే పరిశ్రమలు, ఉద్యోగాలు, వ్యాపారాలు ఇతర జీవనోపాధులపై జీవిస్తున్నారు. ప్రజలకు జీవనభృతి కలిగించే సౌకర్యాలు వేరే ఏమీ లేకపోవడంవల్ల సామాన్య ప్రజలు చాలా దీనమైన, హీనమైన జీవితం గడుపుతుండే వారు. ఇందుకు గల కారణాలను స్థూలంగా ఇలా చెప్పొచ్చు.

భూమిపై హక్కు కచ్చితంగా ఇంత భూమే ఉండాలనే గరిష్ట పరిమితి లేకపోవడం వల్ల జమీందార్లు, జాగీర్దార్లు, సంస్థానాలు, మహారాజుల కింద వందల వేల ఎకరాలు ఉండేవి. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం మద్రాసు ప్రెసిడెన్సీ కింద ఉన్న భూభాగంలో జమీందారులు వారి ఎస్టేట్‌లో ఉన్న భూములపై కౌలుదారులు శిస్తు కట్టలేని పరిస్థితులు తరచుగా వస్తుండడం వల్ల, ఆ భూములు సాగుచేసే రైతులకు ఆక్యుపెన్సీ హక్కులు రావడం కోసం 1908లో ఎస్టేట్ భూమి చట్టం చేసింది. ఈ చట్టం ద్వారా ఎస్టేట్ భూములలో సాగుచేస్తున్న రైతులకు శాశ్వత ఆక్రమణదారుగా నమోదయ్యే హక్కు వచ్చింది. ముఖ్యంగా ఎస్టేట్ ఎవరిది, అందులో వ్యవసాయం ఎవరు చేస్తున్నారు, దానికి కౌలు ఎంత అనే విషయాలు నమోదు చేసేవారు.

వీరే కాకుండా బ్రాహ్మణులకు అగ్రహారాలు, గోత్రియాలు, దేవాలయాలకు, కులీన మహమ్మదీయులకు వందల ఎకరాలలో భూమి ఉండేది. వీరంతా కాకుండా కరణం, మునసబు (కోస్తా తీర ప్రాంతం), రెడ్డి (రాయలసీమ ప్రాంతం)లకు పెద్ద మొత్తాల విస్తీర్ణంలో భూమి ఉండేది. గోదావరి, కృష్ణా, తుంగభద్ర నదుల మీద పెద్ద ఆనకట్టలు నిర్మించి సాగునీటి ప్రాజెక్టుల కింద లక్షల ఎకరాలలో భూమి సాగవుతుండేది. ఇవికాక చెరువులు, కాలువలు, బావుల కింద వ్యవసాయం జరుగుతుండేది. ఈ నీటి పారుదల జరిగే భూములలో 80 శాతం భూములు, ఎస్టేట్లు కరణాలు, రెడ్డి, బ్రాహ్మణులకు చెందినవే. పేద రైతుకు వీరు నీరు పారించుకున్న తరువాత మిగిలితే మళ్లించేవారు. దానితో పేదరైతులు మెట్ట సేద్యానికే పరిమితమవ్వాల్సొచ్చేది. నీటిపారుదల భూములు ఉన్నా చాలా తక్కువ ఉండేవి. పైగా వాటికి శిస్తు అధికం. భూస్వాములు, గ్రామ రెవెన్యూ అధికారులు, ధనిక రైతులు, వ్యాపారులు నీరు పారించుకున్న తరువాత మిగిలిన నీరు సరిపోక చాలాసార్లు పంట దిగుబడి తక్కువ వచ్చేది. దానితో శిస్తు కట్టలేక, తినడానికి గింజలు మిగలక పేదరైతులు చాలా దీన స్థితిలో బతుకుతుండేవారు.

ఎస్టేట్ భూముల మీద దివానులు, ఏజెంట్ల పెత్తనం అధికంగా ఉండేది. ఈ భూములను కౌలుకు తీసుకొని సాగుచేసుకొనేవారు భూమి శిస్తు, కౌలు, భూస్వాముల జమీందార్ల ఇతర ఖర్చులు, దివాన్ల ఏజెంట్ల కమిషన్ కలిపి కౌలు రూపంలో ఇవ్వాల్సొచ్చేది. ఇది చాలా అధికంగా ఉండేది. జమీందార్లు చాలా కఠినంగా వసూలు చేసేవారు. దేవాలయాల ధర్మకర్తలుగా, మెంబర్లుగా ఎప్పుడూ ధనికరైతులు, వ్యాపారులు, బ్రాహ్మణులు ఉండేవారు. వీరు సేవా ఇనాంగా భూములను అనుభవిస్తున్న వారిని తమ స్వంత పనులకు చాకిరీ చేయించుకోవడం, కౌలురూపంలో

ఎక్కువ మొత్తాలలో వసూలు చేయడం చేసేవారు. అగ్రహారాలు శ్రోత్రియాలలో బ్రాహ్మణులు తమకు కేటాయించిన భూములను పేదవారికి సాగు చేసుకోవడానికి ఇచ్చి, వారి దగ్గర నుండి ఏజెంట్ల ద్వారా కౌలు రూపంలో శిస్తు ఇంకా ఇతర అవసరాలకు కావలసిన ధనాన్ని వసూలు చేస్తుండేవారు.

కరణం, మునసబు, రెడ్డిలు పెద్ద విస్తీర్ణాలలో భూమిని తమ ఆధీనంలో ఉంచుకొనేవారు. అందులో రైతులతో, తమ వద్ద పనికోసం వచ్చిన వాళ్లతో వ్యవసాయం చేయించేవారు. గ్రామసేవకులచే ప్రభుత్వ పనులే కాకుండా తమ స్వంత పనులన్నీ ఎలాంటి ప్రతిఫలం ఇవ్వకుండా చేయించేవారు. ఎస్టేట్ భూములు కాని, సేవా ఇనాములు కాని రెండు మూడు తరాల నుంచి చేస్తున్నా కూడా ఆక్రమణదారుగా పేరు నమోదు చెయ్యకుండా జమీందారులకు, ధనికరైతులకు, పలుకుపడి కలిగిన వారికి అనుకూలంగా ఉండేవారు. తమకు అనుకూలంగా లేని వారిని భూమి శిస్తు సకాలంలో చెల్లించలేదనో, కౌలుదారులైతే ఆక్రమణదారుగా నమోదు చెయ్యకుండా, తక్కావి రుణాలకు సిఫారసు చెయ్యకుండా, శిస్తు మాఫీకి సిఫారసు చెయ్యకుండా వేధించేవారు. ముఖ్యంగా తక్కావి రుణాలు, శిస్తు మాఫీ పొందాలంటే కింది స్థాయి నుంచి పై స్థాయి వరకూ పైరవీలు చేయించుకోవాల్సి రావడం వల్ల ఇవి పలుకుబడి, అధికారం ఉన్న జమీందార్లు, ధనికరైతులు, వ్యాపారులు గ్రామరెవెన్యూ అధికారులను, మిగతా వారిని సంతృప్తి పరచి సులభంగా పొందేవారు.

సెటిల్‌మెంట్, రిసెటిల్‌మెంట్‌లలో కచ్చితమైన విస్తీర్ణం తెలిసినా, భూమి శిస్తు నిర్ధారణలో ఎప్పుడూ శిస్తును పెంచుకుంటూ పోయారు. భూమి శిస్తు చాలా అధికంగా ఉండడం వలన చిన్న రైతులు తరచుగా సరిగా పంటలు పండకపోవడంతో దిగుబడి తక్కువ వచ్చి తినడానికి కూడా మిగుల్చుకోకుండా భూమి శిస్తు కట్టాల్సొచ్చేది. శిస్తు కట్టలేని వారి భూములను నిర్దాక్షిణ్యంగా ప్రభుత్వం స్వాధీనం చేసుకొని వేలం వేసి అమ్మేది. ఆ భూమి ప్రభుత్వమే కేటాయించిన భూమి అయితే పేద రైతు నుంచి ఆ భూమిని తిరిగి స్వాధీనం (రెస్యూమ్) చేసుకొని వేరే వారికి కేటాయించడం తరచూ జరుగుతుండేది. ఒకవైపు పేద రైతులకు తుపానులు, వరదలు, కరవుల వల్ల వేసిన పంట పూర్తిగా పాడయిపోయేది. ఇంకోవైపు పేద రైతు దగ్గర మంచి విత్తనాలు కొనడానికి, ఎరువులు వేయడానికి, సకాలంలో భూమి సేద్యానికి, అనుకూలంగా చేసుకోవడానికి కావలసిన పెట్టుబడి లేకపోవడంతో ధనిక రైతులతో పోల్చుకుంటే ఒకే రకమైన పొలానికి దిగుబడిలో చాలా ఎక్కువ తేడా ఉండి పేద రైతుకు చాలా తక్కువ పంట దిగుబడి ఉండేది.

పేద రైతుల దగ్గర వ్యవసాయం చెయ్యడానికి తగినంత పెట్టుబడి లేకపోవడంతో ధనిక రైతుల, వ్యాపారుల, వడ్డీ వ్యాపారస్తుల వద్ద అప్పు చెయ్యాల్సి వచ్చేది. పంట చాల తక్కువ పండడం వల్ల బకాయిలు తీర్చడం చాలా కష్టంగా ఉండి చాలామంది పేద రైతులు తమ భూములను అమ్ముకోవాల్సి వచ్చేది. కొన్నిసార్లు ధనికరైతులు, వ్యాపారులు భూమినే తాకట్టు పెట్టుకొని అప్పు ఇచ్చేవారు. ఇలా భూములు తాకట్టు విడిపించుకో లేక చాలామంది రైతులు భూములను వదులుకున్నారు.

మంగలి, చాకలి, కుమ్మరి, కమ్మరి, కంసాలి లాంటి వారికిచ్చిన సేవా ఇనాములు వీరి వృత్తిపరంగా పని ఒత్తిడి అధికంగా ఉండడంతో తమకిచ్చిన భూములను సరిగ్గా పండించుకోలేకపోయే వాళ్లు. దానితో భూములు పడావుగా ఉండిపోవడం, సరిగా దిగుబడి రాకపోవడం ఉండేది. ఇదే కాకుండా పేద రైతులు తమకు సేవ చేసినందుకు ప్రతిఫలంగా ఈ గ్రామ సేవకులకు 'మేర' రూపంలో ధాన్యం, ఇతర పంటను కొలిచి ఇవ్వాల్సి వచ్చేది. ఇది పేద రైతుకు చాలా భారంగానూ, ఇవ్వలేకపోయినప్పుడు వీరికి తమ జీవనానికి కావలసిన కనీస వసతులు లేక ఎప్పుడూ ఈతిబాధల తోనే ఉండేవారు.

విశాలమైన మైదానాలు, వాయుగుండాలు, రుతుపవనాల వల్ల వచ్చే వర్షాలతో కోస్తాతీర ప్రాంతంలోనూ, కొండలు, గుట్టలు, అటవీ భూములు అధికంగా ఉన్న ప్రాంతాలతో రాయలసీమలోనూ గడ్డి బాగా పెరిగేది. 1792 నుంచి పశువులను మేపుకున్నందుకు బ్రిటిష్‌వారు పుల్లరి సుంకం (పుల్ – వరి పదానికి అర్థం తమిళంలో గడ్డికి విధించే పన్ను) విధించేవారు. గడ్డి మొలిచే విస్తీర్ణంలో 30 శాతం భూమిని వదిలి మిగిలిన 70 శాతం భూమినే వేలం వేసేవారు. వీరు గ్రామానికి కొంత మొత్తం నిర్ధారించో, లేదా పశువుకు కొంతమొత్తంగా నిర్ధారించి పుల్లరి సుంకం వసూలు చేసేవారు. ఈ భూములను కంచ భూములు అనేవారు. తరువాత వచ్చిన అటవీ రక్షణ చట్టంతో మంచి పచ్చికబయళ్లు ఉన్న అటవీ భూములను రిజర్వ్ చేసి అక్కడి గడ్డిని మేయడానికి వెళ్లిన పశువులను పోలీసులు, మిలిటరీ బంధించి జరిమానా విధించేవారు. ఒకవైపు పంట దిగుబడి తగ్గి, ఇంకోవైపు పశువులను మేపుకోవాలంటే ప్రతి పశువుకూ పన్ను చెల్లించాల్సి రావడంతో గ్రామాలకు గ్రామాల ప్రజలు పన్ను కట్టకుండా తిరగబడినారు. 1924లో ఈ కంచెలను పంచాయితీ రిజర్వ్ ఫారెస్ట్‌గా మార్చి రెవెన్యూ, అటవీ శాఖ, రైతులు కలిసి వాటిని నిర్వహించే విధంగా ఉత్తర్వులు జారీచేసినా ధనిక రైతులు, గ్రామాధికారులు, పశువులకే ప్రాధాన్యం ఇచ్చి పేదరైతుల పశువులను సంపూర్ణంగా మేపుకోనిచ్చేవారు కారు.

1940–41లో భూముల ఆధీనాన్ని సర్వే చేయించగా సాగు చేసే భూములు సుమారు 24,49,16,000 ఎకరాలు రైతువారీ భూములుండగా, ఇనాం భూములు 2,58,24,000 ఎకరాలు జమీందారీ భూములు కర్నూలు, అనంతపూర్, కడప జిల్లాలు తప్ప మిగిలిన జిల్లాలలో 9,78,97,000ల ఎకరాలు కొలిచి ఉంది.

సాధారణ ప్రజల జీవనాలను చాలా హీనస్థితికి దిగజార్చిన ముఖ్యమైన కారణాలు మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలు. 1914 నుంచి మొదలయి 1918 వరకూ మొదటి ప్రపంచ యుద్ధం జరిగింది. 1939 నుంచి 1945 వరకూ రెండవ ప్రపంచ యుద్ధం చెయ్యడానికి కావాల్సిన ఖర్చును, ఇతర వనరులను, మిలిటరీ ఖర్చును బ్రిటిష్ ప్రభుత్వం తన ఆధీనంలో ఉన్న దేశదేశాల నుంచి దోచుకొని సంపాదించాలని నిర్ణయించుకొంది. బ్రిటిష్, ఇండియా ప్రభుత్వం ధాన్యం సేకరణ (లెవీ)ని తప్పనిసరి చేసి పేద, ధనిక రైతులనే తేడా లేకుండా చాలా కఠినంగా ధాన్యాన్ని రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు సేకరించి రైలు మార్గాలు, ఓడ రేవుల ద్వారా మిలిటరీకి అందించింది. పేద రైతుకు తినడానికే ధాన్యం సరిపోక పోతుంటే, ధాన్యం లెవీ చాల క్రుంగదీసింది. ధాన్యం లెవీ ఇవ్వకపోతే కొట్టడం, అపరాధ రుసుం చాలా ఎక్కువ ఉండడం వలన రైతులు ధనిక రైతుల గోదాములలో ఉన్న ధాన్యాన్ని చాలా ఎక్కువ ధరకు కొనుగోలు చేసి రెవెన్యూ ఇన్‌స్పెక్టరుకు అప్పగించేవారు. దానితోపాటు యుద్ధ నిధిని (వార్ ఫండ్) వసూలు చేసేవారు. ముఖ్యంగా పేదవారికిచ్చే రేషన్‌లో కోత విధించారు. దానితో రైతు కూలీలు, అనాథల పరిస్థితి దయనీయంగా మారింది. గ్రామాల వారీ, తాలూకావారీ జిల్లాలవారీగా లక్ష్యాలను నిర్దేశించి చాలా కఠినంగా కావలసిన ధనాన్ని వసూలు చేసేవారు. కుల వృత్తుల మీద బతికే నేసేవారికి దారం మీద, కమ్మరివారికి ఇనుమును అమ్మనివ్వక పోవడం వలన దర్జీలు, చిన్న చిన్న ఇనుప వస్తువులు తయారు చేసేవారు నల్లబజారులో అధిక ధరలకు కొనుక్కోవడం వలన వారికి గిట్టుబాటు

# చెర్నోబిల్ అణు విద్యుత్కేంద్రం

*చెర్నోబిల్‌లో నెలకొల్పిన రియాక్టర్ల గురించీ, అక్కడ జరిగిన ప్రమాద పూర్వాపరాల గురించీ వివరిస్తున్నారు*

**డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

**1940**లలో మొదలైన అణురియాక్టర్ల కార్యకలాపాల గురించిన భయాలూ, వాటిని సక్రమంగా నడుపుతూ, అక్కడ పనిచేసేవారి భద్రత గురించి ఎంతో గమనికగా ఉండాలనే అవగాహనా కూడా తొలి నుంచీ ఉన్నవే. అయితే ఈ అనుమానాలన్నీ భయంకరమైన రూపంలో వాస్తవాలుగా పరిణమించడం మాత్రం 1986లో సంభవించింది. ఇదెంత తీవ్రమైన ప్రమాదమంటే అప్పటివరకూ అణుప్రయోగాల మీదా, మొత్తం శాస్త్ర, సాంకేతికవేత్తల మీదా సామాన్య ప్రజలకు ఉండిన నమ్మకమూ, విశ్వాసమూ ఒక్క పెట్టున దెబ్బ తిన్నట్టయింది. ఒక అణురియాక్టర్‌లో పెనువిపత్తు కలగడంతో అప్పటి వరకూ అణుశక్తిని వ్యతిరేకిస్తూవస్తున్న పర్యావరణవేత్తలందరికీ గొప్ప ఊతం లభించినట్టయింది. దానితో వారు తమ ఆందోళనను ఉధృతం చేశారు. పాతికేళ్లనాటి ఈ ఉదంతం ఎందుకు, ఎలా జరిగిందో స్థూలంగా తెలుసుకుంటే ఇటువంటి ప్రమాదాలు అసలు ఎలా తలెత్తుతాయో, వాటిని భవిష్యత్తులో ఏ విధంగా తప్పించుకోవచ్చో అర్థం చేసుకోవచ్చు.

స్వీడన్ రాజధాని స్టాక్‌హోంకు 100 కి.మీ. ఉత్తరాన ఉన్న ఫోర్స్‌మార్క్ అణువిద్యుత్ కేంద్రంలోని వాతావరణంలోని రేడియోధార్మికతను నమోదు చేసే పరికరాలు 1986 ఏప్రిల్ 26న పెద్ద పెట్టున విడుదల అయిన గామావికిరణాన్ని గుర్తించాయి. అదేదో స్థానిక సంఘటనగా భావించిన అధికారులు తమ సిబ్బందిని హడావిడిగా బైటకు తరలించారు. అయితే స్వీడన్ లోని ఇతర అణుసంస్థలలోకూడా ఇలాగే జరగడంతో స్వీడన్ దృష్టి తమ సంస్థలనుంచి సోవియట్ రష్యావేపు మళ్లింది. ఎందుకంటే ఆ సమయానికి పవనాలన్నీ అటునుంచే స్వీడన్ దిశగా వీస్తూఉండేవి. సోవియట్ రష్యా ముందుగా ప్రపంచానికి తెలియనివ్వకుండా ఏదో కొత్త అణ్వస్త్రపరీక్ష నిర్వహించి ఉంటుందనీ, దానికి జవాబుదారీ వహించవలసినది ఆ దేశపు ప్రభుత్వమేననీ పాశ్చాత్యదేశాలు అనుకున్నాయి. అయితే అణ్వస్త్ర పరీక్షలో జరిగినట్టుగా భూకంపంవంటిదేదీ తలెత్తలేదు. జరిగినదేమిటో రష్యా స్వయంగా ప్రకటించేదాకా అందరూ రకరకాల ఊహాగానాలు చేశారు.

అయితే ఈ సంఘటన జరిగినది మాత్రం ఒక రియాక్టర్ కారణంగానే. అప్పటి సోవియట్ సమాఖ్యలో భాగంగా ఉండిన యూక్రేన్ ప్రాంతంలోని ఊరు చెర్నోబిల్. చెర్నోబిల్ అణువిద్యుత్కేంద్రంలో నాలుగు రియాక్టర్లుండేవి. ఒక్కొక్కటీ 3200 మెగావాట్ల ఉష్ణాన్నీ లేదా వెయ్యి మెగావాట్ల విద్యుత్తునూ ఉత్పత్తి చేసేవి. 1970లో నిర్మాణం మొదలైన తరవాత 1977లో మొదటి రియాక్టర్ పనిచెయ్యడం ప్రారంభించింది.

---

కాక పనులు మానుకోవాల్సి వచ్చేది. వారి జీవనోపాధిని కోల్పోయారు. కిరోసిన్, ఆహార ధాన్యాలు, బెల్లం, పంచదార, ఇనుము, దారం, లెదర్, పెట్రోల్ మీద కంట్రోల్ ఉండడం వలన దొరికేవి కావు. నల్లబజారులో కొనే స్తోమత లేదు. రబ్బరు, రబ్బరు టైర్లు మీద కంట్రోల్‌తో రవాణా సౌకర్యాలకు ఖర్చు, సమయం అధికం అయ్యి ప్రైవేట్ ఆహార ధాన్యాల రవాణా కాకుండా, కొద్దిపాటి ప్రభుత్వ ఆహార పంపిణీ కూడా చాలా సమయం తీసుకునేది. రైళ్ల ద్వారా మిలిటరీకి ధాన్యం పోతుంటే ప్రజలు రైలు ఆగిన చోటంతా ప్రాణాలకు తెగించి ధాన్యం లూటీ చేస్తుండేవారు.

కుల వ్యవస్థ పూర్వకాలం నుంచీ బలంగా ఉండడంతో చదువుకునే అవకాశం కేవలం బ్రాహ్మణులు, వైశ్యులలో కొంత మందికి, క్షత్రియులలో, శూద్రులలో కొంతమందికి మాత్రమే ఉండేది. ఆ విద్య కూడా ఎక్కువగా మత సంబంధం, యుద్ధ విద్య, వేదాంత చర్చలు, సాహిత్యం మీదే ఉండేది. బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధ్వర్యంలోనే క్రైస్తవ మిషనరీలు బడులు తెరచి ఇంగ్లిష్ విద్యనందించడం మొదలుపెట్టాయి. బ్రిటిష్ ప్రభుత్వ పాలనలోకి వచ్చిన తరువాత విస్తృతంగా బడులు తెరవడం, ఉన్నత విద్య కోసం కళాశాలలు స్థాపించడం, అన్ని కులాల వారికి ప్రాథమిక విద్య అందించడం – దీనితో ప్రపంచంలో జరిగే పరిణామాలు, కార్మిక పోరాటాలు విద్యావంతులకు తెలియడంతో పాటు. రష్యా బోల్షివిక్కుల పోరాటంతో ప్రభావితమైన విద్యావంతులు కమ్యూనిజం వైపు ఆకర్షితులయ్యారు. వీరు ప్రజలకు మూఢ నమ్మకాల వలన, కులవ్యవస్థ వలన జరిగే నష్టాలు, ధనిక భూస్వాములు, జమీందార్ల విలాసవంతమైన జీవితాలు, వారు ప్రజలను అణగదొక్కే రూపాలు, వారి ఆధీనంలో మంచి సారవంతమైన భూములు వందల ఎకరాలలో ఉండడం లాంటివన్నీ ప్రజలకు తెలియచెప్పి ప్రజల హక్కులను వారు గుర్తు చేశారు. ఇదే సమయంలో భారత జాతీయ కాంగ్రెస్ బాగా బలంగా తయారవడం, పాలనా సంబంధమైన వాటికి వ్యతిరేకంగా తన ముద్ర వేయడం జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం జరిగిన నష్టాలతో బ్రిటిష్ ప్రభుత్వం కోలుకోలేకపోయింది. భారత దేశమే కాకుండా తన పాలనలో ఉన్న అన్ని దేశాలలోను జరిగిన స్వాతంత్ర్య పోరాటాలకు తలొగ్గి అన్ని దేశాల సార్వభౌమత్వాన్ని అంగీకరిస్తూ పరిపాలన నుంచి దఫాలుగా వైదొలిగింది. భారత దేశానికి 1947 ఆగస్ట్ 15న స్వాతంత్ర్యం వచ్చింది. దానిలో మద్రాస్ ప్రెసిడెన్సీ కింద ఉన్న రాష్ట్ర భూ భాగమంతా భారత ప్రభుత్వ స్వపరిపాలనలో కొచ్చింది.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

వీ

తరవాతివి మూడూ 1978, 1981, 1983లలో పూర్తయాయి. వీటిలోని నాలుగోది ప్రమాదానికి గురయింది. 1986లో ప్రమాదం జరిగేనాటికి అయిదోది తయారయే దశలోనూ, ఆరోది నిర్మాణంలోనూ ఉన్నాయి. ఇవన్నీ ఆర్‌బీఎంకే రియాక్టర్లు. రష్యాలోతప్ప మరెక్కడా వీటిని ఉపయోగించరు. 1950లలో రూపకల్పన చేసిన ఈ రకం రియాక్టర్లకు కాలం చెల్లిపోయిందని భావించడంతో వీటిని ఇప్పుడెవరూ నిర్మించడం లేదు. వీటిని నిర్మించడంలోని ముఖ్య ఉద్దేశం అణ్వస్త్రాలకై ప్లూటోనియం తయారుచెయ్యడమే. విద్యుదుత్పత్తి అదనపు లాభం మాత్రమే. ఇవి నాలుగూ కలిసి యూక్రేన్‌కు అవసరమైన విద్యుత్తులో 10 శాతాన్ని అందిస్తూ ఉండేవి.

ఈ రియాక్టర్లలో న్యూట్రాన్ల వేగాన్ని తగ్గించేందుకు గ్రాఫైట్‌ను మోడరేటర్‌గా ఉపయోగిస్తారు. చల్లబరచడానికి నీరు ఉపయోగ పడుతుంది. మన దేశంలోనూ, పశ్చిమదేశాల్లోనూ ఉన్నట్టుగా ఈ రియాక్టర్లచుట్టూ గట్టి కాంక్రీట్ కట్టడమేదీ ఏర్పాటుచెయ్యలేదు. సామాన్యంగా రియాక్టర్ అనేది విపరీతమైన ఉష్ణాన్ని ఉత్పత్తిచేస్తుంది. అది విద్యుత్తును ఉత్పత్తి చెయ్యనప్పుడుకూడా దాని ఇంధనకడ్డీలు ఎంతో వేడిమితో ప్రజ్వరిల్లుతూ ఉంటాయికనక వాటిని చల్లబరిచే ప్రక్రియను కొనసాగిస్తారు. అణువిచ్ఛిత్తి గొలుసుకట్టు పద్ధతిలో కొనసాగనప్పటికీ, అప్పటిదాకా విచ్ఛిత్తి అవుతూవచ్చిన యురేనియం శకలాలు తమ తీవ్రమైన రేడియోధార్మికత కారణంగా వేడిమిని కలిగిస్తూనే ఉంటాయి. ఇది రావణకాష్టంలాగా శతాబ్దాల తరబడి కొనసాగే ప్రక్రియ కనక త్వరగా చల్లారే అవకాశం ఉండదు.

విచ్ఛిత్తి అయిన కొన్ని యురేనియం శకలాలు తమ సహజ పద్ధతిలో క్షీణించే క్రమంలో ఎన్నెన్నో మూలకాల రూపాలను సంతరించు కుంటాయి. వీటిలో కొన్నిటికి రియాక్టర్‌లోని న్యూట్రాన్లను ఎక్కువ మోతాదులో సంగ్రహించగలిగే లక్షణం ఉంటుంది. వీటిలో జెనాన్-135 అనే వాయువు ఒకటి. దీని అర్ధాయుష్షు 9 గంటల పైగా ఉంటుంది. అణువిచ్ఛిత్తి గొలుసుకట్టు పద్ధతిలో జరుగుతున్నప్పుడు ఇటువంటి పదార్థాలు న్యూట్రాన్ల సంఖ్యను అనుకున్న పద్ధతిలో పెరగనివ్వవు. అందుచేత కొంతకాలం పనిచేశాక నిలుపుదలకు లోనయిన రియాక్టర్‌ను మళ్లీ పనిచేయించాలంటే పెరుగుతున్న జెనాన్-135 మోతాదు అవరోధం కాగలదు. అది క్షీణించేదాకా వేచి ఉండవలసిందే. రియాక్టర్లను అనుకున్న పద్ధతిలో నడపడానికి ఇటువంటి సాంకేతిక ఇబ్బందులు అడ్డొస్తాయి.

అణుసంబంధిత కార్యకలాపాలేకాక కేంద్రం సవ్యంగా పనిచెయ్య డానికి తోడ్పడే అనుబంధ వ్యవస్థలన్నీకూడా ఎట్టి పరిస్థితి లోనయినా సక్రమంగా పనిచేసేట్టు చూస్తారు. బొగ్గూ, చమురూవంటి ఇంధనాలను ఎప్పటికప్పుడు బాయిలర్లలోకి చేరవేస్తారు కాని అణు రియాక్టర్లలో మాత్రం ఎన్నో ఏళ్లకు సరిపడే ఇంధనమంతా ఒకేసారిగా నిలవచేస్తారు కనక ప్రమాదాలకు ఎక్కువ ఆస్కారముంటుంది. అలాగే పనిచేస్తున్న అణురియాక్టర్‌తో ప్రయోగాలు చేస్తున్నప్పుడు ఎన్నో జాగ్రత్తలు అవసరమవుతాయి. రియాక్టర్ ఎంత తక్కువ శక్తితో పనిచేస్తే ప్రయోగాలు జరపడం అంత శ్రేయస్కరం. అంతేకాక ప్రయోగాలకు అనుభవజ్ఞులైన పై అధికారుల అనుమతులన్నీ తప్పకుండా పొందితీరాలి.



1. యూక్రేన్, 2. రష్యా, 3. స్వీడన్, 4. ఇటలీ, 5. ఇంగ్లండ్, 6. స్పెయిన్

రియాక్టర్ల భద్రతావ్యవస్థ నిర్దుష్టమైనది. ముఖ్యంగా ఏదైనా చిన్న పాటి విపత్కరపరిస్థితి ఎదురైనప్పటికీ అణురియాక్టర్లను వెంటనే మూసి, కట్టేసే పరికరాలు నిత్యమూ సిద్ధంగా ఉంటాయి. దీన్ని ఫెయిల్ సేఫ్ పద్ధతిగా అభివర్ణిస్తారు. బావి గట్టుమీద నడిచే పిల్లవాడు తడబడినట్టు కనబడగానే వాణ్ణి బావి బైటివేపుకు నెట్టేస్తాం. వాడు కిందపడి కాస్త దెబ్బ తగిలినప్పటికీ బావిలో పడకుండా ఉన్నట్టయితే ఫరవాలేదనే అనుకుంటాం. అలాగే, నడుస్తున్న రియాక్టర్‌ను అకస్మాత్తుగా కట్టెయ్యడం లో కొన్ని నష్టాలున్నప్పటికీ, అది పేలిపోయే ప్రమాదంతో పోలిస్తే అంతగా లెక్కచెయ్య నవసరంలేదు. అయితే స్క్రాం అనే ప్రక్రియ ద్వారా ఇలా అకస్మాత్తుగా నిలిచిపోయిన రియాక్టర్‌లోకూడా ఇంధనం చాలా వేడిగా ఉంటుందనేది గుర్తుంచుకోవాలి. ఆ వేడిమికి లోహపు ఇంధన కడ్డీలూ, ఇతర నిర్మాణ పరికరాలూ మెలికలు తిరిగి తమ ఆకారాన్నీ, నిర్మాణ పటిష్టతనూ కోల్పోయినట్టయితే చాలా ప్రమాదకరం అవుతుంది.

ఇంధనం చల్లబడేందుకు నీటిని సరఫరా చేసే పంపులుకూడా విద్యుత్తుతోనే నడుస్తాయి కనక కొన్ని జాగ్రత్తలు అవసరం. చెర్నోబిల్ రియాక్టర్ ఒక్కొక్కదానిలోనూ 1600 ఇంధన పుంజాలుంటాయి. వీటిని చల్లబరిచేందుకు గంటకు 28 వేల లీటర్ల నీరు ప్రవహించాలి. అణుకేంద్రం నుంచి విడుదల అయే విద్యుత్తు అకస్మాత్తుగా నిలిచిపోయినా ఈ పంపులను నడిపేందుకు డీసెల్ జెనరేటర్లను ఏర్పాటు చేశారు. అయితే ఇవి తమ పూర్తి వేగాన్ని అందుకోవడానికి ఒక నిమిషానికి పైగా పడుతుందని గుర్తించారు. ఆ వ్యవధి మరీ ఎక్కువ అనే అభిప్రాయం తలెత్తింది. అయితే వేగంగా తిరుగుతున్న టర్బైన్ అకస్మాత్తుగా ఆగిపోదు కనక అది నిలిచిపోయే లోపుగా దానిద్వారా ఆ ఒక్క నిమిషానికి సరిపడే విద్యుత్తును ఉత్పత్తి చెయ్యగలమేమో చూడాలని ఇంజనీర్లు భావించారు. అందుకని దాన్ని గురించిన ప్రయోగాలు కొన్ని చెయ్యాలని అనుకున్నారు. చివరికి ఇవే కొంప ముంచాయి.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## మైనింగ్ మాఫియా చేతిలో ఐపిఎస్ హత్య

మధ్యప్రదేశ్‌లోని మొరెనా జిల్లాలో నరేంద్ర కుమార్ సింగ్ అనే ఐ.పి.ఎస్. అధికారిని బన్‌మోర్ పట్టణంలో మార్చ్ 8న ట్రాక్టర్‌తో తొక్కించి హత్యచేశారని చంబల్ రేంజ్ డి.ఐ.జి. డి.పి. గుప్తా తెలిపారు. గ్రానైట్ రాళ్లను తీసుకెళుతున్న ట్రాక్టర్‌ను అడ్డుకోవాలని ప్రయత్నించగా ట్రాక్టర్ ఆపకుండా అతని పై నుంచి తీసుకెళ్లడంతో ట్రాక్టర్ కింద పడి చనిపోయారన్నారు. 2009 బ్యాచ్‌కు చెందిన నరేంద్ర బన్‌మోర్ ప్రాంతంలో నియమితులయిన నుండి అక్రమంగా తరలిస్తున్న గ్రానైట్ ట్రక్కులను సీజ్ చేశారన్నారు. ఈ హత్యకు మైనింగ్ మాఫియానే కారణమని ఆయన భార్య మధురాణి తివాతియా ఐ.పి.ఎస్ చెప్పారు.

## ఐ.పి.ఎస్. అధికారి ఆత్మహత్య

చత్తీస్‌గడ్‌లోని బిలాస్‌పూర్ ఎస్.పి. రాహుల్ శర్మ మార్చ్ 12న ఆత్మహత్య చేసుకున్నారు. 2002 బ్యాచ్‌కు చెందిన రాహుల్‌శర్మ 2008-09 లో దంతెవాడ జిల్లా ఎస్.పిగా పనిచేశారు. ప్రముఖ రచయిత్రి అరుంధతీ రాయ్ రాహుల్ శర్మను దంతెవాడలో కలిసి ఉద్యమం గురించి ఇంటర్వ్యూ చేశారు. ఆ సందర్భంలో ఉద్యమం లేకుండా చేయడానికి అక్కడి ప్రజలకు స్వార్థం నేర్పడం ఒక్కటే ఉద్యమాన్ని నిర్మూలించడానికి పరిష్కారంగా చెప్పాడు. మావొయిస్టులతో పాటు స్థానిక ప్రజలను విచక్షణా రహితంగా ఊచకోతలకు, చిత్రహింసలకు గురిచేశారని రాహుల్ శర్మపై ఆరోపణలు వచ్చాయి. ఎస్.పి మృతిపై చత్తీస్‌గడ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ విచారణకు ఆదేశించినట్లు తెలిపారు.

## ఆజాద్ ఎన్‌కౌంటర్‌పై సిబిఐ నివేదిక

మావోయిస్టు నాయకుడు ఆజాద్, జర్నలిస్టు హేమచంద్ర పాండేలు నిజమైన ఎన్‌కౌంటర్‌లోనే చనిపోయినట్లు సి.బి.ఐ అధికారులు సుప్రీంకోర్టుకు తెలిపారు. ఈ నివేదికలోని అంశాలను జస్టిస్ అఫ్తాబ్ అలమ్, జస్టిస్ రంజన్ ప్రకాశ్‌దేశాయ్‌లతో కూడిన బెంచ్ మార్చ్ 16న పరిశీలించింది. ఈ ఎన్‌కౌంటర్ జరిగిన తరువాత సుప్రీంకోర్టు స్పందిస్తూ 'భారత రిపబ్లిక్ తన సంతానాన్ని తానే చంపుకోవడాన్ని అనుమతించలేం' అని అన్నది. సి.బి.ఐ నివేదిక ఆధారంగా గతంలో ఆజాద్, హేమచంద్ర పాండేలు బూటకపు ఎన్‌కౌంటర్‌లో చనిపోలేదని, బూటకపు ఎన్‌కౌంటర్ జరిగిందనేందుకు ఎక్కడా ఆధారాలు లేవని జస్టిస్ అఫ్తాబ్ అలమ్ పేర్కొన్నారు. సి.బి.ఐ నివేదికపై పిటిషనర్లు తమ వాదనను వినిపించేందుకు విచారణను సుప్రీం కోర్టు ఏప్రిల్ 13వ తేదీకి వాయిదా వేసింది.

## ఒడిశాలో కిడ్నాప్‌లు

ఒడిశాలో మావోయిస్టులు ఇద్దరు ఇటాలియన్లను మార్చ్ 14న, బి.జె.డి.కి చెందిన ఎం.ఎల్.ఎ జిన్నా పిక్కాకను మార్చ్ 24న కిడ్నాప్ చేశారు. ప్రభుత్వం ముందు వారు 13 డిమాండ్లు ఉంచారు. చట్టపరిధిలో చర్చలకు సిద్ధమని ప్రభుత్వం ప్రకటించడంతో మావోయిస్టులు తమ తరఫున చర్చించేందుకు ఇద్దరు మధ్యవర్తుల పేర్లను ప్రకటించారు. దండపాని మహంతి (జన అధికార్ మంచ్ కన్వీనర్), బి.డి. శర్మ రిటైర్డ్ మధ్యవర్తులుగా ఉన్నారు. కిడ్నాప్ చేసిన వారిలో ఒక ఇటాలియన్‌ను మావోయిస్ట్‌లు విడుదల చేశారు. చర్చలు కొనసాగుతున్నాయి.

## ఆయుధ కొనుగోలులో భారత్‌దే ప్రథమస్థానం

ప్రపంచ వ్యాప్తంగా ఆయుధాలు దిగుమతి చేసుకుంటున్న దేశాల్లో భారతదేశం మొదటి స్థానంలో ఉంది. 2007-2011 మధ్యకాలంలో భారత్ దిగుమతి చేసుకుంటున్న ఆయుధాల్లో 38 శాతం పెరిగాయి. ఆసియాలో భారత్ మొదటి స్థానంలో ఉందని స్వీడన్‌కు చెందిన భద్రతా అధ్యయన సంస్థ స్టాక్‌హోమ్ ఇంటర్నేషనల్ పీస్ ఇన్‌స్టిట్యూట్ (సిపిఆర్‌ఐ) తెలిపింది. అంతర్జాతీయ ఆయుధ కొనుగోలులో భారత్ వాటా పదిశాతం.

## నదుల అనుసంధానం

ఎన్.డి.ఎ ప్రభుత్వం 2002లో నదుల అనుసంధానం గురించి టాస్క్‌ఫోర్స్‌ను ఏర్పాటుచేసింది. ఈ ప్రాజెక్ట్‌ను 2016 నాటికి పూర్తిచేయాలని సవివర ప్రాజెక్ట్ రిపోర్ట్ (డిపిఆర్) తయారైంది. కానీ, ప్రాజెక్ట్ పూర్తికాలేదు. ఈ ప్రాజెక్ట్‌ను నిర్దిష్ట కాలంలో అమలుచేయాలని కేంద్ర ప్రభుత్వాన్ని సుప్రీం కోర్టు ఆదేశించింది. ఈ ప్రాజెక్ట్ అమలుకు సంబంధించి సుప్రీం ఒక కమిటీని ఏర్పాటు చేసింది. ఈ ప్రాజెక్ట్ అమలులో తీవ్ర జాప్యం జరిగి వ్యయ భారం పెరిగిందని సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎస్.ఎచ్. కపాడియా, జస్టిస్ స్వతంత్రకుమార్, జస్టిస్ ఎ.కె. పట్నాయక్‌ల బెంచ్ అభిప్రాయపడింది. ఈ ప్రాజెక్ట్ వల్ల బ్రహ్మపుత్ర, మహానది, గంగ, గోదావరి మిగులు జలాలను కాల్వల ద్వారా దక్షిణాది రాష్ట్రాల్లో నీటి కొరత ఉన్న ప్రాంతాలకు తరలించవచ్చని టాస్క్‌ఫోర్స్ మాజీ చైర్మన్ సురేశ్ ప్రభు అన్నారు.

## గనుల కుంభకోణం

యు.పి.ఎ ప్రభుత్వం 155 బొగ్గు బ్లాకులను తవ్వుకోవడానికి వంద కార్పొరేట్ కంపెనీలకు అనుమతినిచ్చింది. ఇందుకోసం టెండర్లు పిలువలేదు. పోటీ బిడ్డింగ్ నిర్వహించలేదు. దరఖాస్తు చేసుకోన్న వెంటనే గనులను కట్టబెట్టేసింది. ఈ ప్రభుత్వ విధానం వల్ల 2004-09 మధ్య కాలంలో ప్రభుత్వానికి వచ్చిన నష్టం రు.10.7 కోట్లుగా కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) అంచనా వేసింది. దేశ చరిత్రలోనే ఇది అతి పెద్ద కుంభకోణం. ప్రధాని మన్మోహన్‌సింగే ఈ శాఖను నిర్వహిస్తున్నారు.

## పాము కాటుతో మావోయిస్టు నేత మృతి

మావోయిస్టు పార్టీ ఉత్తర తెలంగాణ స్పెషల్ జోనల్ కమిటీ కార్యదర్శి గుండేటి శంకర్ అలియాస్ శేషన్న దండకారణ్యంలో పాముకాటుతో చనిపోయారు. ఫిబ్రవరి 17న రాత్రి దండకారణ్యంలో నిద్రిస్తుండగా పాము కరిచి, రాత్రి 2 గంటల ప్రాంతంలో మృతి చెందినట్లు మావోయిస్టు పార్టీ ఉత్తర తెలంగాణ ప్రతినిధి జగన్ మార్చ్ 21 ప్రకటించారు. గోదావరిఖనికి చెందిన గని కార్మికుడి కొడుకు శంకర్. 1983లో రాడికల్ విద్యార్థి సంఘం ద్వారా పార్టీలో చేరి అంచెలంచెలుగా ఎదిగి నాయకత్వ స్థానంలోకి వచ్చినట్లు ఆయన తెలిపారు.

## భోపాల్ ఉద్యమంపై గూఢచర్యం

భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ విషవాయువు లీకేజీ వల్ల 1984లో వేలాది మంది ప్రజలు మరణించారు. బాధిత కుటుంబాలకు నష్టపరిహారం దక్కాలని పోరాడుతున్న ఉద్యమకారులపై అమెరికా నిఘా సంస్థ గూఢచర్యం నెరిపిందని వికీలీక్స్ వెబ్‌సైట్ బహిర్గతం చేసింది. అమెరికా గూఢచర్య సంస్థకు అనుబంధంగా ఉన్న 'స్ట్రేటజిక్ ఫోర్‌కాస్టింగ్ ఇంక్' అనే సంస్థ యూనియన్ కార్బైడ్ మాతృసంస్థ డౌ కెమికల్స్‌కోసం ఈ పనిచేసినట్లు వికీలీక్స్ పేర్కొంది. ఈ విషయాలను వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజ్ లండన్‌లో విలేకరులకు తెలిపారు. 2004 జూలై నుంచి 2011 డిసెంబర్ మధ్య కాలానికి సంబంధించిన లక్షలాది ఈ మెయిల్స్ తన చేతిలో ఉన్నట్లు వెల్లడించారు. వీ

## సార్వత్రిక సమ్మె

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల కార్మిక వ్యతిరేక విధానాలకు నిరసనగా పదకొండు ప్రధాన కార్మిక సంఘాలు దేశవ్యాప్తంగా ఫిబ్రవరి 28న సమ్మెలో పాల్గొన్నాయి. కార్మికుల ప్రధాన డిమాండ్‌లు – నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలను అపాలి. కాంట్రాక్టీకరణ, ఔట్‌సోర్సింగ్ విధానాలను రద్దుపరిచి శాశ్వత ప్రాతిపదికన ఉద్యోగ నియామకాలు చేపట్టాలి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లోని లక్షలాది ఖాళీలను భర్తీ చేయాలి. అసంఘటిత రంగంలో పనిచేస్తున్న కార్మికులందరికీ కనీస వేతనం నెలకు రు. 10,000 చెల్లించాలి. సమ్మె హక్కును చట్టబద్ధం చేయాలి. జి.ఒ. 177, ఎస్మా, నాసా లాంటి చట్టాలను రద్దుచేయాలి. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాల అమలు నిలిపి వేయాలని సమ్మెలో పాల్గొన్నాయి. ఈ సమ్మెలో భాగంగా ముంబై, ఢిల్లీ, పంజాబ్, హర్యానా, కేరళ, ఒడిశా, త్రిపుర, అస్సాంలలో రోడ్డు, రైలు రవాణ మార్గాలను నిరసనకారులు అడ్డుకున్నారు. ప్రభుత్వ బ్యాంకులు, బీమా సంస్థలు పనిచేయలేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్న విధానాల వల్ల దేశ వ్యాప్తంగా ఉన్న కార్మిక సంఘాలు అనివార్యమైన పరిస్థితిలో సార్వత్రిక సమ్మెకు పిలుపునిచ్చాయి. బతికి ఉండడంకోసం కార్మికులకు ఎంతో కొంత ఆదాయం అందుతోంది. కాని పనిచేయడానికి అన్నీ అర్హతలుండీ నిరుద్యోగులుగా ఉన్న కోట్లాది మంది ప్రజల జీవితాలు ఈ రోజు ఎంత దుర్భర స్థితిలో ఉన్నాయో అర్థమవుతోంది. పేదరికానికి సంబంధించి ఒక మనిషి రోజు ఆదాయం పట్టణాల్లో అయితే రు. 28.65, గ్రామాల్లో అయితే రు. 22.42 లోపు ఖర్చుపెట్టే వారు మాత్రమే పేదలంటూ ప్రణాళికా సంఘం తెలిపింది. దేశంలో దారిద్ర్యరేఖకు దిగువనున్న వారి సంఖ్య 2004–10 మధ్య ఏడు శాతం తగ్గిందని ప్రణాళికా సంఘం అంచనావేసింది. మరి ప్రతి రోజు జీవిక గడవక, వేసిన పంట చేతికి రాక, అప్పుల బాధతో కుటుంబాలకు కుటుంబాలే ఆత్మహత్యలు ఎందుకు చేసుకుంటున్నట్టు. జి.డి.పిలు అంకెల్లో చూపి మురిసిపోవడం కాదు. సామాన్య ప్రజలు తమకు తాము మనిషిగా బతకగలం అనే విశ్వాసాన్ని ఇవ్వగలగాలి. పాలకులు లక్షల కోట్ల రుపాయల కుంభకోణాలకు పాల్పడుతూ తినే కంచం నుంచి కూర్చునే కుర్చీ దాకా బంగారంతో చేసినవే వాడుతూ సకల ఐశ్వర్యాలు అనుభవిస్తున్నారు. ఇటువంటి అసమానతలను నిర్మూలించడానికి ప్రతి ఒక్కరూ గొంతెత్తాల్సిన సమయం ఆసన్నమైంది.

## ఎన్‌సిటిసికి ఆమోదం

జాతీయ ఉగ్రవాద వ్యతిరేక కేంద్రం (ఎన్‌సిటిసి) ఏర్పాటు ముఖ్య ఉద్దేశ్యం ఉగ్రవాదం పేరుతో ప్రత్యేకంగా అమెరికాకు వ్యతిరేకంగా జరుగుతున్న దాడులకు సంబంధించిన సమాచారాన్ని ఈ సంస్థ సేకరిస్తుంది. ఎన్.సి.టి.సి స్థాపించడానికి కేంద్ర క్యాబినెట్ నిర్ణయం తీసుకుని ఫిబ్రవరి 5న ప్రకటించింది. ఎన్.సి.టి.సి ఏర్పాటు సమాఖ్య వ్యవస్థకు తీవ్ర విఘాతం కలిగిస్తుందని దీన్ని అంగీకరించబోమని కాంగ్రెసేతర ఆరు రాష్ట్రాలు మొదట అభ్యంతరం వ్యక్తంచేశాయి. కాంగ్రెస్ అధికారంలో ఉన్న రాష్ట్రాలు తమ సమ్మతిని తెలియజేశాయి. ఎన్.సి.టి.సిపై రాష్ట్రపతి ప్రసంగానికి రాజ్యసభలో ప్రతిపక్షాలు ప్రవేశపెట్టిన సవరణల తీర్మానంతో యుపిఏ ప్రభుత్వం గట్టెక్కింది. లోక్‌సభలోనూ ఇదే విషయమై ప్రభుత్వానికి అనుకూలత లభించింది. కొన్ని ప్రతిపక్ష పార్టీలు ఓటింగ్‌కు గైర్హాజరవడం, కొన్ని ప్రభుత్వానికి అనుకూలంగా సమ్మతిని తెలియజేయడం అంతిమంగా తేలిందేమంటే ప్రాంతీయ, జాతీయ పార్టీలన్నింటికీ ఎన్.సి.టి.సి. సమ్మతి ఉందనేది. ఇక్కడి దేశ ప్రజలకు దక్కాల్సిన సహజ వనరులను దక్కకుండా విదేశీయులకు కట్టబెట్టె విధానాన్ని దేశద్రోహమనాల్నా? దేశభక్తి అనాల్నా? మన పాలకులు అమెరికా అండదండలతో, మానవరహిత విమానాలతో ఉద్యమించే ప్రజలను నిర్మూలించాలనే ప్రయత్నంలో భాగంగానే ఎన్‌సిటిసిని ఏర్పాటుచేస్తున్నారు. దేశం మొత్తాన్ని మిలిటరీ క్యాంపుగా మార్చే ప్రయత్నం ముమ్మరంగా కొనసాగుతోంది. ప్రజలను అణిచివేసే చట్టాలను చేస్తున్న పాలకులు ఒక్కతాటిపైకి వస్తున్న క్రమంలో పీడనకు, అణిచివేతకు గురవతున్న ప్రజలందరూ ఏకమవ్వాల్సి ఉంది. మనిషి తన కనీస హక్కులను కలిగి ఉండాలంటే ఈ 'స్వతంత్ర భారతదేశం'లో పోరాడి సాధించుకోవాల్సిందే కాని పాలకులు ఏ చిన్న హక్కునూ ఇవ్వరనేది చరిత్రపొడవునా రుజువయిన సత్యం.

## అక్రమ ఔషధ ప్రయోగాలు

దేశంలో అక్రమ ఔషధ ప్రయోగాల వల్ల సాధారణ ప్రజలు మరణిస్తున్నారని, కేంద్ర ప్రభుత్వం వెంటనే స్పందించి వీటిని ఆపాలని సుప్రీం కోర్టు మార్చ్ 26న కోరింది. నిరుపేద ఆదివాసీలు, దళితులు, పిల్లలపైన బహుళజాతి ఔషధ సంస్థలు తమ ఉత్పత్తులను అనైతిక, చట్టవిరుద్ధ పద్ధతిలో ప్రయోగిస్తున్నాయని డాక్టర్లు వేసిన ప్రజాహిత వ్యాజ్యంపై న్యాయస్థానం విచారణ నిర్వహించింది. మధ్యప్రదేశ్‌లో 3,300 మందిపై వివిధ సంస్థలు ప్రయోగాలు నిర్వహించినట్లు పిటిషనర్లు కోర్టుకు తెలిపారు. ఇందులో 15 మంది ప్రభుత్వ, 40 మంది ప్రైవేట్ డాక్టర్లు పాల్గొన్నట్లు వివరించారు. ఒక రోజు నుంచి 15 సంవత్సరాల మధ్య వయస్సుగల 1,833 మంది పిల్లలపై కూడా వీరు ప్రయోగాలు చేశారు. ఈ ప్రయోగాల వల్ల 2008, 2009, 2010 సంవత్సరాల్లో వరుసగా 28,86,37,597 మంది మరణించినట్లు తెలిపారు. ఇప్పటికైనా ఇటువంటి ప్రయోగాలను ఆపాలని జస్టిస్ ఆర్.ఎం. లోధా, జిస్టిస్ ఎచ్.ఎల్. గోఖలేలతో కూడిన ధర్మాసనం పేర్కొంది. దీనిపై వైద్య మండలితోపాటు కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశిస్తూ విచారణను జూలై 13కు వాయిదా వేసింది. బహుళజాతి సంస్థలు భారత దేశంలోని ప్రతిదాన్ని వ్యాపారంగా మార్చి లాభాలను ఆర్జించే పనిలో మునిగితేలుతున్నాయి. వాటికి అనుగుణంగా భారత చట్టాలు మారిపోతున్నాయి. ఇవీ మనకు ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణల అమలు వల్ల చేకూరుతున్న 'ప్రయోజనం'. ప్రజలను అన్ని విధాల ఆదుకుంటామని వాగ్దానం చేసి అధికారంలోకి వచ్చిన పార్టీలు బహుళజాతి సంస్థలకు సామాన్య ప్రజల జీవితాలను ఎరగా వేస్తున్నాయి. తమ శ్రమ ద్వారా ఈ సమాజానికి సకల సంపదలు సృష్టించిన ఆదివాసీ, దళిత అట్టడుగు వర్గాల ప్రజలకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రతి ఒక్కరు వారికి అండగా నిలిచి వారిని కాపాడుకోవాల్సిన బాధ్యత ఉంది.

**వార్త – వ్యాఖ్య : వై. రామచంద్రం** వీ

## రష్యా అధ్యక్షుడిగా పుతిన్

రష్యా అధ్యక్షునిగా వ్లాదిమిర్ పుతిన్ మూడోసారి ఎన్నికయ్యారు. మార్చ్ 4న జరిగిన ఎన్నికల్లో పుతిన్‌కు అనుకూలంగా 63.6 శాతం ఓట్లు వచ్చాయి. ఆయనకు వ్యతిరేకంగా నిలబడిన కమ్యూనిస్టు నేత జెన్నడీ జ్యుగనోవ్‌కు 17.18 శాతం ఓట్లు వచ్చాయి. ఎన్నికల్లో అక్రమాలు జరిగాయని రష్యాలో తీవ్ర నిరసనలు తెలుపుతూ ప్రజలు పుష్కిన్ స్క్వేర్ వద్దకు వచ్చి ప్రదర్శలు జరిపారు. ప్రదర్శనకారులపై పోలీసులు విరుచుకుపడి ఐదు వందల మందికి పైగా నిరసనకారులను అరెస్టు చేశారు. ఎన్నికల్లో తీవ్ర అవకతవకలు జరిగాయనీ, అక్రమాలు చోటు చేసుకున్నాయనీ వెంటనే మళ్లీ ఎన్నికలు జరిపించాలనీ ప్రజలు డిమాండ్ చేశారు.

## స్లొవేకియాలో కొత్త ప్రభుత్వం

స్లొవేకియాలో వామపక్షాలు విజయం సాధించాయి. పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో మాజీ ప్రధాని రాబర్ట్ ఫికోకు చెందిన స్మెర్–సోషల్ డెమోక్రసీ పార్టీ 150 సీట్లలో 84 స్థానాలను గెలుచుకుంది. తొలిసారిగా స్లొవేకియాలో ఒకే పార్టీ అధికారం చేపట్టనుంది. ఇంతకు ముందున్న నాలుగు పార్టీల కూటమికి 50 సీట్లు మాత్రమే వచ్చాయి. తీవ్ర అవినీతి కుంభకోణాలతో ప్రజాగ్రహానికి గురై ఓటమి పాలయ్యారు. ఈ సందర్భంగా ఫికో మాట్లాడుతూ దేశ ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టేందుకు చర్యలు తీసుకుంటామనీ, స్లొవేకియాను సంక్షేమ రాజ్యంగా తీర్చిదిద్దుతామనీ వాగ్దానం చేశారు.

## అఫ్ఘనిస్తాన్‌లో అమెరికా సైనికుడి దురాగతం

అఫ్ఘనిస్తాన్‌లోని దక్షిణ కాందహార్ ప్రావిన్స్‌లో అమెరికా సైనికుడు ఒకరు విచక్షణారహితంగా కాల్పులు జరపడంతో పది మందికి పైగా పౌరులు మరణించారు. మార్చ్ 11న ఉదయం సైనిక స్థావరం నుంచి బయటకు వచ్చి సమీపంలో ఉన్న ఇళ్లపై కాల్పులు జరపాడు. మరణించిన వారిలో ఎక్కువ మంది మహిళలూ, పిల్లలూ ఉన్నారు. కాల్పులు జరిపిన సైనికుడిని అంతర్జాతీయ భద్రతా బలగాలు అదుపులోకి తీసుకున్నాయి.

## విద్యారంగ నిధుల కోతలపై నిరసన

కాలిఫోర్నియాలో విద్యారంగానికి కేటాయించాల్సిన నిధుల్లో కోత విధిస్తూ స్కూల్ యాజమాన్యం, ప్రభుత్వం తీసుకున్న నిర్ణయానికి వ్యతిరేకంగా ముగ్గురు స్కూల్ విద్యార్థులు ఆమరణ నిరసన దీక్షకు దిగారు. వీరికి వేలాది మంది విద్యార్థులు, పౌరులు మద్దతుగా నిలిచారు. కాలిఫోర్నియాలోని బుశాన్ లెండ్రో హైస్కూల్ యాజమాన్యం ఉపాధ్యాయులు, ఇతర సిబ్బందికి లేఆఫ్ చెబుతూ వచ్చే ఏడాది తన బడ్జెట్‌లో 14 లక్షల డాలర్ల మేర కోత విధించాలన్న ప్రతిపాదనను ఆమోదించింది. దీంతోపాటు పన్ను సంస్కరణలకు ప్రజలు ఆమోదం తెలపకపోతే మరో 25 లక్షల డాలర్ల మేర కోత విధించేందుకు వీలుగా గవర్నర్ కంటింజెన్సీ బడ్జెట్‌ను కూడా ఆమోదించారు. తమ స్కూల్‌ను, ఉపాధ్యాయులను రక్షించేందుకు అవసరమైన నిధులను విడుదల చేసేందుకు యాజమాన్యం అంగీకరించినప్పుడే తాము ఈ దీక్షను విరమిస్తామని దీక్షలో పాల్గొంటున్నవారు తెలిపారు.

## స్పెయిన్‌లో నిరసనలు

ప్రభుత్వం అమలు చేస్తున్న కఠినమైన కొత్త కార్మిక సంస్కరణలకు, కోతలకు నిరసనగా స్పెయిన్‌లో మార్చ్ 13న దేశవ్యాప్తంగా అరవై నగరాలలో వేలాది మంది ప్రజలు నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ఇటీవల ప్రభుత్వం ఆమోదించిన సంస్కరణలు, పొదుపు చర్యలకు వ్యతిరేకంగా స్పెయిన్‌లోని కార్మిక సంఘాలన్నీ మార్చ్ 29న సార్వత్రిక సమ్మెకు పిలుపునిచ్చాయి. గతంలో ఎన్నడూ లేని విధంగా కార్మికులను తొలగించే నిబంధనలను సరళీకరించడం ఈ సంస్కరణల్లో భాగం. ఉద్యోగాలను సృష్టించలేని ఈ సంస్కరణలను ఆమోదించలేమని నిరసనకారులు తెలిపారు. తమ హక్కుల్లో కోత విధిస్తున్నారని విమర్శించారు. వెంటనే ఈ సంస్కరణలను నిలిపివేయాల్సిందిగా డిమాండ్ చేశారు. ఒకప్పుడు యూరోపియన్ యూనియన్ దేశాలోకెల్లా అత్యధికంగా ఉపాధి కల్పించే దేశంగా ఉన్న స్పెయిన్ 2008లో రియల్ ఎస్టేట్ రంగం కుప్పకూలడంతో తీవ్ర ఆర్థిక సంక్షోభాలకు గురైంది.

## అయిసేన్ ఉద్యమానికి మద్దతు

చిలీలోని శాంటియాగోకు దక్షిణంగా 1600 కిలోమీటర్ల దూరంలో ఉన్న అయిసేన్ ప్రాంత ప్రజలు తమ ప్రాంతం నిర్లక్ష్యానికి గురైందనీ, వారికి సరైన న్యాయం చేయాలనీ చేస్తున్న డిమాండ్లకు చిలీ ప్రతిపక్ష పార్టీ సంఘీభావం తెలిపింది. అక్కడి ప్రజలపై అణచివేతలను కొనసాగనివ్వమనీ, తాము వారికి అండగా ఉంటామని తెలిపారు. పార్లమెంట్ సమావేశాలు జరుగుతుండగానే ప్రతిపక్ష పార్టీ సభ్యులు పార్లమెంట్‌లో నిరసన ప్రదర్శనలు చేశారు. నిరసనలూ, ప్రదర్శనల సమయంలో అయిసేన్ ప్రజలపై స్పెషల్ పోలీసు దళాలు సాగించిన అణచివేత చర్యలలో రెండు వందల మందికి పైగా గాయపడ్డారు. తీవ్రమైన మానవ హక్కుల ఉల్లంఘనలు జరిగాయనీ, బాధితులకు తమ సంపూర్ణ మద్దతు ఉందనీ ప్రతిపక్ష పార్టీలు తెలిపాయి.

## పోర్చుగల్‌లో సమ్మె

పోర్చుగల్‌లో చేపట్టిన పొదుపు చర్యలూ, కార్మిక సంస్కరణలకూ వ్యతిరేకంగా మార్చ్ 22న కార్మికులు సమ్మె చేశారు. దీనిలో భాగంగా రాజధాని లిస్బన్‌లో రవాణా వ్యవస్థను స్తంభింపచేశారు. రైళ్లను నిలిపివేశారు. ఓడరేవులను మూసేశారు. 7800 కోట్ల యూరోల బెయిలవుట్ పొందేందుకు పోర్చుగల్ పొదుపు చర్యలు చేపట్టేందుకు, కార్మిక సంస్కరణలు తెచ్చేందుకు అంగీకరించింది. ఈ సంస్కరణలు ఉద్యోగుల హక్కులపై వేటు వేశాయనీ, నిరుద్యోగాన్ని పెంచేశాయనీ, జీవన ప్రమాణాలు దిగజార్చాయనీ కార్మికులు తెలిపారు. పోర్చుగల్‌లోని అతి పెద్ద యూనియన్ సిజిటిపి దేశం మొత్తాన్నీ దిగ్బంధించాలని పిలుపునిచ్చింది. కాగా దేశంలోని రెండవ పెద్ద యూనియన్ యుజిటి సంస్కరణలకు అనుకూలంగా సంతకం చేసింది.

## జాత్యహంకార హత్యపై ఆందోళన

అమెరికాలో ఫ్లోరిడా రాష్ట్రంలోని శాన్‌ఫోర్డ్‌లో ఫిబ్రవరి 26న పదిహేడేళ్ల ఆఫ్రికన్ – అమెరికన్ యువకుడు ట్రాయ్‌వోన్ మార్టిన్ హత్యకు గురయ్యాడు. మార్టిన్‌ను ఒక జాత్యాంహకార విజిలెన్స్ అధికారి జార్జ్ జిమ్మర్‌మెన్ కాల్చి చంపాడు. జిమ్మర్‌మెన్‌ను అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తూ న్యూయార్క్‌లోని యూనియన్ స్క్వేర్‌లో మార్చ్ 21న వేలాది మంది ప్రదర్శన జరిపారు. కాగా, ఆన్‌లైన్ పిటిషన్ ద్వారా దాదాపు పదిల లక్షల సంతకాలను సేకరించారు. మార్టిన్‌కు గౌరవ సూచకంగా పెద్ద సంఖ్యలో శ్వేత, శ్వేతేతర యువకులు హూడీలు ధరించి ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు.

## శ్రీలంకకు వ్యతిరేకంగా భారత్ ఓటు

2009లో ఎల్.టిటి.ఇ.పై శ్రీలంక సైన్యం సాగించిన దారుణ మానవ హక్కుల ఉల్లంఘనకు వ్యతిరేకంగా భారత్ ఐక్యరాజ్య సమితికి చెందిన మానవ హక్కుల మండలిలో శ్రీలంకకు వ్యతిరేకంగా ఓటు వేసింది. ఐరాస మానవ హక్కుల మండలి మార్చ్ 22న ప్రవేశపెట్టిన తీర్మానానికి అనుకూలంగా 24 ఓట్లు రాగా, వ్యతిరేకంగా 15 ఓట్లు వచ్చాయి. శ్రీలంకకు చైనా మద్దతుగా నిలిచింది. లంకలోని తమిళులకు తగిన సమానత, ఆత్మగౌరవ ప్రతిపత్తి దక్కలేదని భారత్ తెలిపింది.

## భారత ప్రజా పోరాటానికి మద్దతు

భారతదేశ ప్రభుత్వం ప్రజలపై జరుగుతున్న యుద్ధానికి వ్యతిరేకంగా పోరాడుతున్న విప్లవ ప్రజా పోరాటానికి మద్దతుగా అంతర్జాతీయ కమిటీ ఏప్రిల్ 21న ఇటలీలో సదస్సు నిర్వహించనుంది. ఈ సందర్భంగా మార్చ్ 25న ఒక ప్రకటన విడుదల చేస్తూ ఈ సదస్సుకు అందరూ తమ వంతు సహాయం అందజేయాల్సిందిగా కోరింది. వీ

## దొమితిలా బారియోస్ ది చుంగారా ఇక లేరు

బొలివియాలోని గని కార్మికుల నాయకురాలు దొమితిలా బారియోస్ ది చుంగారా (దొమితిలా) క్యాన్సర్‌తో బాధపడుతూ మార్చ్ 13న మరణించారు. ఆమె 1937లో ఒక గని క్యాంప్‌లో జన్మించారు. ఆమె జీవితాంతం గని కార్మికుల కోసం ముఖ్యంగా గని కార్మికుల భార్యలకు మద్దతుగా నిలబడి పోరాడారు. నియంత హ్యూగో బన్జెర్‌కు వ్యతిరేకంగా 1978లో గని కార్మికుల భార్యలతో కలిసి ఆమరణ నిరాహార దీక్షకు దిగారు. అక్రమంగా నిర్బంధించిన గని కార్మిక నాయకులను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ దీక్షకు దిగారు. వేలాది మంది ప్రజలు నిరసనలో పాల్గొన్నారు. ఈ నిరసన బన్జెర్ ప్రభుత్వాన్ని గద్దె దిగేందుకు తోడ్పడింది. 2005లో ఆమెను నోబెల్ శాంతి బహుమతికి నామినేట్ అయింది. ఆమె జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొంది. ఆమెకు ఏడుగురు పిల్లలు. మిలిటరీ పాలనలో ఆమె తీవ్ర అవమానాలకూ, నిర్బంధాలకూ గురైంది. ఎన్నో సంవత్సరాలు అజ్ఞాతవాసంలో గడిపింది. ఆమె చివర రోజుల్లో బొలివియన్ గని కార్మికులలో వారికి రాజకీయ అవగాహన కల్పించేందుకు తీవ్రంగా కృషి చేసింది. ఆమె మృతికి సూచకంగా బొలివియన్ ప్రభుత్వం మూడు రోజుల పాటు సంతాప రోజులుగా ప్రకటించింది. ఆమెకు బొలివియన్ అత్యుత్తమ పౌరులకు ఇచ్చే కాండోర్ ఆఫ్ ది అండెస్ పురస్కారంతో సత్కరించింది.

## ఉపాధ్యాయులపై కార్పొరేట్ మీడియా దాడి

అమెరికాలో కార్పొరేట్ మీడియా కొత్త ఆరోపణలకు దిగింది. ఈసారి అక్కడి ప్రభుత్వ టీచర్లపై దాడికి పూనుకుంది. విద్యార్థుల ప్రదర్శన దిగజారి పోతోందనీ, దీనికి ఉపాధ్యాయులదే బాధ్యత అనీ, వారు యూనియన్‌లు కట్టడం వల్లనే ఇలా జరుగుతోందనీ ఆరోపించారు. తమపై అసంతృప్తులు వ్యక్తం కావడంతో చాలా మంది ప్రభుత్వ ఉపాధ్యాయులు తమ ఉద్యోగాలకు రాజీనామా చేస్తున్నారు.  దీని వల్ల కార్పొరేట్ పాఠశాలలకూ, కాలేజీలకు లాభం చేకూరే అవకాశం ఉంది. చాలా మంది పిల్లలను ప్రభుత్వ పాఠశాలల నుంచి తీసేసి ప్రైవేట్ కార్పొరేట్ స్కూళ్లల్లో, కాలేజీలలో చేర్పించే అవకాశాలు పెరుగుతాయి. ముఖ్యంగా ప్రభుత్వ ఉపాధ్యాయులనూ, వారి యూనియన్లపై కార్పొరేట్ మీడియా దృష్టి పెట్టి వారిపై కసి తీర్చుకుంటోంది. ఉపాధ్యాయులలో 80 శాతం మంది మహిళలు ఉన్నారు. అమెరికాలో ఆర్థిక సంక్షోభ కాలంలో కూడా ఉపాధ్యాయులకు మంచి జీతాలూ, వారికి అన్ని సదుపాయాలూ అందుతున్నాయన్న అక్కసుతో వారిపై మీడియా ఇలా విరుచుకుపడింది. కాగా, షికాగో, న్యూయార్క్ లాంటి చోట్ల 'ఆక్యుపై' ఉద్యమకారులు టీచర్లతో, తల్లిదండ్రులతో ఏకమై ఈ దాడులకు వ్యతిరేకంగా నిలబడి పోరాడడం ప్రభుత్వ విద్యా విధానానికి కొంత ఊరట లభిస్తోంది.

## 'ఆక్యుపై'లో చొరబాటుదారులు

అమెరికాలో ఆర్థిక సంస్కరణలకు వ్యతిరేకంగా ప్రారంభమై ప్రపంచ వ్యాప్తంగా బహుళ ప్రజాదరణ పొందిన 'ఆక్యుపై వాల్‌స్ట్రీట్' ఉద్యమంలో ఇప్పుడు చొరబాటుదారులు ప్రవేశించారు. ఆక్యుపై ఉద్యమాన్ని బలహీనపరచడానికి పోలీసు బలగాలు పన్నిన ఈ వ్యూహం బయట పడుతోంది. కొందరు పోలీసులు మామూలు ప్రజలుగా వచ్చి జుక్కోటి పార్క్‌లో జరుగుతున్న ప్రదర్శనకారులతో కలిసిపోయి ప్రదర్శనలో పాల్గొంటున్నారు. శాంతియుతంగా జరుపుతున్న ప్రదర్శనలో వీరు పాల్గొంటూ అకస్మాత్తుగా పోలీసులపై దాడులు చేయడంతో పోలీసులు ప్రదర్శనకారులందరిపై విరుచుకుపడి దాడి చేయడంతో ఎంతో మంది తీవ్రంగా గాయపడ్డారు. ఇలా ఆక్యుపై ఉద్యమం జరుగుతున్న ప్రతి చోటా జరుగుతోంది. పోలీసులు ఆక్యుపై ఉద్యమకారులలాగా వారితో కలిసిపోయి, వారితో ఉంటూ వారి మధ్య విభేదాలు సృష్టిచడం, పోలీసులపై, ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్తులపై దాడులు చేయడం, ఇంటర్నెట్ ద్వారా, సోషల్ నెట్‌వర్కింగ్ సైట్ ఫేస్‌బుక్‌లో తప్పుడు ప్రచారంతో ఉద్యమకారులను తప్పుదోవ పట్టిస్తున్నారు. ఏడాది క్రితం ది గార్డియన్ పత్రిక ఒక వ్యాసంలో ప్రచురించినట్టు ప్రతి నలుగురు అమెరికా ఇంటర్నెట్ హ్యాకర్లలో ఒకరు ఎఫ్‌బిఐ ఇన్ఫార్మర్ ఉన్నాడని పేర్కొంది. ముఖ్యంగా ఆర్థికపరమైన తప్పుడు సమాచారం ఇస్తూ ఉద్యమకారులలో అపోహలు సృష్టించి ఉద్యమాన్ని బలహీనపర్చాలని ఎన్నో కుటిల ప్రయత్నాలకు పూనుకుంటున్నారు. దీనికి కార్పొరేట్ మీడియా పెద్ద ఎత్తున సహకరిస్తోంది. ఇలా ఉద్యమాలను బలహీనపర్చడానికి చొరబాటులకు పాల్పడడం అధికార సాయుధ బలగాలకు కొత్తేమీ కాదు. 1920లలో వచ్చిన ఆర్థిక సంక్షోభం సమయంలో కూడా ఉద్యమాలు చేస్తున్న ప్రజల్లో ఎఫ్‌బిఐ చొరబాటుదారులు ప్రవేశించి వారిలో విభేదాలు సృష్టించే ప్రయత్నాలు చేశారు. అప్పటి నుంచి ఇప్పటి వరకు జరిగిన, జరుగుతున్న ఉద్యమాలలో ప్రభుత్వ బలగాలు ఈ కుటిల నీతిని అవలంబిస్తూనే ఉన్నాయి.

## అమెరికాలో నిరుపేదల దుస్థితి

అమెరికాలో నిరుపేదల సంఖ్య నానాటికి పెరిగిపోతోంది. 1996 నుంచి 2011 మధ్య నిరుపేదల సంఖ్య రెట్టింపు అయింది. ప్రస్తుతం అమెరికాలో 14.6 లక్షల కుటుంబాలు రోజుకు రెండు డాలర్ల కంటే తక్కువ ఆదాయంతో జీవిస్తున్నారు. దేశంలో ప్రజలు ఆకలీ, పేదరికంతో గడుపుతున్నారు. ఒక్క శాతం మంది అత్యాశ మూలంగా 99 శాతం మంది బాధలు అనుభవిస్తున్నారు. ఒక పక్క అమెరికా దేశ పరిస్థితి ఇలా ఉంటే మరో పక్క ఆ దేశం ఇజ్రాయెల్‌కు చేసిన మిలిటరీ సాయం వివరాలు చూస్తే ఆశ్చర్యమవుతుంది. 2000-09 మధ్య అమెరికా 24.1 బిలియన్ డాలర్ల మిలిటరీ సహాయాన్ని అందజేసింది. దీంట్లో 670 మిలియన్ ఆయుధాలు, మందుగుండ్లు, వాటికి సంబంధించిన పరికరాలు ఉన్నాయి. ఈ కాలంలోనే ఇజ్రాయెల్ దాదాపు మూడు వేల మంది పాలస్తీనీయన్లను చంపింది. అందులో వెయ్యి మందికి పైగా పిల్లలున్నారు. 2009 నుంచి 2018 వరకు అమెరికా ఇజ్రాయెల్‌కు 30 బిలియన్ డాలర్ల సహాయానికి ప్రణాళిక తయారు చేసుకుంది. ఈ ఆర్థిక సహాయానికి వెచ్చించే సంపదతో ఉపయోగించి అమెరికా తమ దేశంలోని దాదాపు మూడున్నర లక్షల నిరుపేదలకు గృహవసతి కల్పించవచ్చు. ఐదు లక్షల మంది నిరుద్యోగులకు ట్రైనింగ్ ఇచ్చి ఉద్యోగం కల్పించవచ్చు. దాదాపు ఇరవై లక్షల మంది ఇన్సూరెన్స్ లేని ప్రజలకు ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ కల్పించవచ్చు. ఇదిలా ఉండగా, అమెరికా సైనికులు తీవ్ర నైరాశ్యాలకు లోనై ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. 2004-08 మధ్య 80 శాతం ఆత్మహత్యలు పెరిగాయని ఒక అధ్యయనంలో వెల్లడైంది. 2007, 2008లలో 255 మంది సైనికులు తమ ప్రాణాలు తీసుకున్నారు. ముఖ్యంగా ఇరాక్, అఫ్ఘనిస్తాన్ దేశాలలో పనిచేసిన, పనిచేస్తున్న సైనికులలో ఈ ఆత్మహత్యలకు పాల్పడేవాళ్లు ఎక్కువగా ఉన్నారు.

## గ్రీస్‌లో మెరుగుపడని స్థితి

గ్రీస్‌లో పరిస్థితి ఇంకా దిగజారుతోంది. అటు మధ్యతరగతి ప్రజల, ఉద్యోగుల పరిస్థితి దినదినం పతనం అవుతోంది. నిరుద్యోగుల సంఖ్య పది లక్షల కంటే ఎక్కువ అంటే 20 శాతానికి చేరుకుంది. ముఖ్యంగా ఇరవై ఐదేళ్ల వయసున్న వారిలో ఇది 50 శాతం వరకు ఉంది. లక్షలాది మంది పార్ట్ టైమ్ ఉద్యోగులుగా జీవితం వెళ్లదీస్తున్నారు. ఎంతో మందికి ఎన్నో నెలలుగా జీతాలు లేవు. ఈ ఆర్థిక సంస్కరణల స్థితి నుంచి గట్టెక్కడానికి ప్రజలు పెద్దఎత్తున ఉద్యమించడం, యూరోపియన్ యూనియన్‌నూ, అమెరికా సామ్రాజ్యవాదాన్నీ పారదోలడం ఒక్కటే మార్గమని ప్రజలు విశ్వసిస్తున్నారు.

**వార్త – వ్యాఖ్య : సి. రాజశేఖర్** వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 ఫిబ్రవరి నుండి 29 ఫిబ్రవరి 2012 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1651)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు: వ్యవసాయ రంగం | ఆత్మహత్యలు: చేనేత రంగం | ఆత్మహత్యలు: ఇతరాలు స్త్రీ | ఆత్మహత్యలు: ఇతరాలు పు. | చికిత్స అందక, అనారోగ్యం: స్త్రీ | చికిత్స అందక, అనారోగ్యం: పు. | చికిత్స అందక, అనారోగ్యం: పి. | గుర్తు తెలియని: స్త్రీ | గుర్తు తెలియని: పు. | హత్యలు: స్త్రీ | హత్యలు: పు. | ప్రమాదాలు: పనిచేసే స్థలంలో | ప్రమాదాలు: కరెంట్ | ప్రమాదాలు: రహదారి | ప్రమాదాలు: ఇతరాలు | పోలీసు కాల్పుల్లో: ఉద్యమ కారులు | పోలీసు కాల్పుల్లో: ఇతరులు | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 6 | – | 19 | 18 | 6 | 4 | 3 | 2 | 2 | 4 | 5 | 3 | 8 | 20 | 23 | – | – | – | 3 | 1 |
| హైదరాబాద్ | – | – | – | 6 | 11 | – | – | – | 4 | 3 | 8 | 5 | – | – | 42 | 20 | – | – | – | 10 | 1 |
| కరీంనగర్ | – | 4 | – | 17 | 25 | 3 | 12 | 1 | 2 | 11 | 2 | 5 | 2 | 2 | 29 | 22 | – | – | – | 7 | – |
| ఖమ్మం | – | 4 | – | 8 | 11 | 1 | 3 | 2 | – | 3 | 5 | 8 | 5 | 5 | 31 | 12 | – | – | – | 1 | – |
| మహబూబ్‌నగర్ | – | 11 | – | 19 | 21 | 7 | 2 | 2 | 3 | 3 | 12 | 17 | 16 | 12 | 38 | 16 | – | – | – | – | – |
| మెదక్ | – | 3 | 1 | 7 | 6 | 2 | 3 | – | – | 4 | 3 | 1 | – | 8 | 48 | 30 | – | – | – | 1 | – |
| నల్గొండ | – | 3 | 1 | 12 | 21 | 4 | 6 | 1 | – | 7 | 1 | 3 | 3 | 12 | 43 | 16 | – | – | – | 9 | 1 |
| నిజామాబాద్ | – | – | – | 8 | 19 | 1 | – | – | – | – | 2 | 6 | 2 | 4 | 25 | 27 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 8 | – | 17 | 16 | 5 | 12 | 3 | 2 | 5 | 11 | 5 | 5 | 4 | 62 | 4 | – | – | – | – | – |
| వరంగల్ | – | 2 | – | 6 | 7 | 9 | 9 | 6 | 2 | 2 | – | – | 1 | 8 | 25 | 8 | – | – | – | – | 3 |
| చిత్తూరు | – | – | – | – | – | 5 | 6 | – | – | 3 | 9 | 1 | – | – | 12 | 18 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 1 | 5 | – | 1 | – | 2 | – | 11 | 7 | – | 1 | 29 | 7 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | – | 8 | – | – | – | 1 | 2 | – | – | – | 3 | 31 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | 5 | – | 8 | 10 | 4 | 6 | 11 | 4 | 5 | 5 | 8 | 6 | 3 | 36 | 30 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 7 | 9 | 2 | – | – | 1 | 4 | 2 | 2 | 5 | 1 | 21 | 7 | – | – | – | 8 | – |
| విజయనగరం | – | – | – | 5 | 4 | 2 | – | 3 | 4 | 8 | – | – | – | 2 | 32 | 12 | – | – | – | – | – |
| **మొత్తం** | **–** | **47** | **2** | **140** | **191** | **51** | **64** | **32** | **27** | **62** | **75** | **73** | **48** | **73** | **524** | **260** | **–** | **–** | **–** | **39** | **6** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు




కొత్తచూపు
పేజీ 295, రు.120




అభివృద్ధిని ఇలా చూద్దాం
పేజీ 205, రు.80




మీరు-నేను- ఆర్థికం
పేజీ 215, రు.60




ఒక దళారీ పశ్చాత్తాపం
పేజీ 172, రు.50




కుట్రాజకీయం
పేజీ 114, రు.40




ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్
పేజీ 367, రు.200




ఇండివిడ్యుల్ సబ్-గ్రూప్స్ గ్రూప్స్ అండ్ ఫ్రీడం
పేజీ 59, రు.75




క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేంవర్క్
పేజీ 105, రు.80




ఆన్ ఎడ్యుకేషన్
పేజీ 142, రు.100




మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎంక్వైరీ
పేజీ 201, రు.150




ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్
**1956 – 2006**
పేజీ 568, రు.300




రాబందు వాలిన నేల
పేజీ 408, రు.180




వ్యవసాయం – ప్రపంచీకరణ
పేజీ 224, రు.100




కల్లముందరి చరిత్ర
పేజీ 309, రు.80




పరిచయాలు
పేజీ 194, రు.50




గంగానమ్మ
పేజీ 61, రు.15




జాత్యహంకారి హిట్లర్
పేజీ 171, రు.80




రాబందు నీడ
పేజీ 111, రు.25




విశ్వాంతరాళం
పేజీ 189, రు.90




మానవ పరిణామం
పేజీ 211, రు.90




జీవకణాలూ – నాడీకణాలూ
పేజీ 184, రు.80




ప్రకృతి – పర్యావరణం
పేజీ 230, రు.90




లేచినిలిచిన తెలంగాణ
పేజీ 303, రు.120

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 129 - April 2012 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 29/03/2012 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణంకు చేయూతనివ్వండి...

మీ ఆదరాభిమానాలతో పదో సంవత్సరంలో అడుగుపెట్టిన వీక్షణం మీరు మరింత సహాయం అందించకపోతే ఎక్కువకాలం నడవడం కష్టం...

ఔను, వీక్షణం నష్టాలతో నడుస్తున్నదని, ఉత్పత్తి వ్యయం కూడ తిరిగి రావడం లేదని, ఆర్థిక పరిస్థితి నానాటికీ క్షీణిస్తున్నదని గత కొంతకాలంగా చెపుతూనే ఉన్నాం. అది ఇంకా విషమించింది. వీక్షణం నాలుగు కాలాల పాటు సజావుగా నడవడానికి ఇప్పటికే వందలాది మంది అభిమానులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ సహాయం చాలడం లేదు. సహాయం ఇతోధికంగా పెరగకపోతే వీక్షణం ఎక్కువకాలం మనగలగడం కష్టం.

వీక్షణం మీ పత్రిక. ప్రజల పత్రిక. ప్రజలకు అవసరమైన పత్రిక. ఇది ఆగిపోకుండా కాపాడండి.

- ప్రతి పాఠకుడూ/పాఠకురాలూ కనీసం మరొకరికి వీక్షణాన్ని పరిచయం చేయండి.
- ప్రతి చందాదారూ కనీసం మరొకరిని చందాదారుగా చేర్పించండి.
- మీకు తెలిసిన కళాశాలలు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, ప్రజా సంస్థలు వీక్షణంను తెప్పించేలా చూడండి.
- మీ గ్రామంలో, పట్టణంలో న్యూస్ ఏజెంట్ దగ్గర వీక్షణం అమ్మేలా చూడండి

**ఇవన్నీ వీక్షణం ప్రచురిస్తున్న భావాలు ప్రచారం చేయడానికి. కాని వీక్షణం ఆర్థిక పరిపుష్టికి అవి మాత్రమే సరిపోవు. విరాళాలు, వ్యాపార, ప్రచార ప్రకటనలు వంటి ఆర్థిక సహాయం లేకుండా పత్రికలేవీ మనుగడ సాగించలేవు. వీక్షణంకు మీకు తెలిసిన వ్యక్తులనుంచీ, సంస్థల నుంచీ విరాళాలూ, ప్రకటనలూ సంపాదించండి. కళాశాలలు, వైద్యశాలలు, ఆస్పత్రులు, దుకాణాలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, గ్రామ స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి దాకా పాలక సంస్థలు, దాతలు... సంస్థల బాధ్యులు, వ్యక్తులు ఎవరి నుంచి ఐనా సరే...**

- జీవిత చందాలు, కానుకగా చందాలు, విరాళాలు సేకరించండి.
- ప్రకటనలు సేకరించండి.

**ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు ఉంటేనే వీక్షణం ఆర్థిక స్థితి ఏ నెలకానెల అన్నట్టు సాగుతుంది. తెలుగు సమాజం తనతో తాను జరుపుకుంటున్న సంభాషణ ఆగిపోకుండా మీ వంతు సాయం చేయండి.**

మీ సహకారం అందించాల్సిన చిరునామా :

## వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao